ఓం

శ్రీ గురుభ్యోనమః

# గురుస్తోత్రము

(రెండవ భాగము)


రచయిత

"పరిపూర్ణ దర్శనాచార్య సదానంద"

శ్రీ ఇలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు

నర్సాపురం, ప॥గో॥జిల్లా

ఓం

శ్రీ గురుభ్యోనమః

# గురుస్తోత్రము

(రెండవ భాగము)


రచయిత

"పరిపూర్ణ దర్శనాచార్య సదానంద"

శ్రీ ఉపకుర్తి వీర వెంకట రామచంద్రరావు

నర్సాపురం, ప॥గో॥జిల్లా



| | | |
|---|---|---|
| రిజిష్టర్డు | ద్వితీయ ముద్రణ | వెల |
| కాపీరైటు | 1999 ప్రతులు 1,000 | రూ. 25-00 |

# ముందుమాట

పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు గారు, శ్రీ అచల ఋషి దయానంద పొన్నాల రాజ యోగీంద్రుల వారి అనుగ్రహముచే వారి దివ్యాశీస్సులతో శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయమును తమ గ్రంథ రచనల ద్వారా బహుళ ప్రాచుర్యము చేసి పాఠక లోకమును ఉత్తేజితులుగా జాగృతమొనరించినారు. వారి శిష్య ప్రశిష్యులు పలయు ఆర్థిక సంపత్తిని సమకూర్చి వారి గురుభక్తిని వ్యక్తపరచుకొనుచునే ఉన్నారు.

అంతేకాక గురు ధర్మ నిర్వహణలో శ్రీరామచంద్రరావు గారు దంపతులు జరిపిన కృషిని, గడిపిన ఆదర్శవంతమగు జీవితమును లోకములో ప్రచారం చేయుటకై గురుదేవుల ఆశయ సంసిద్ధి కొరకు "శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థ" ను గుంటూరు జిల్లా, మంగళగిరి మండలం, యర్రబాలెం గ్రామంలో ఏర్పాటుచేసి శ్రీ గురుదేవుల ఆదర్శమును లోక కళ్యాణార్థము వివరించడంలో వారికి గల సహాయ సంపత్తిని అందించు చున్నారు. ఇది సహృదయులు సంతసించి ప్రోత్సహించవలసిన అంశము.

శ్రీ రామచంద్రరావు గారి రచనలన్నియు వారి గురుదేవులు శ్రీ శివరామ దీక్షితీయ పీఠాధిపతులైన దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి దివ్యశ్రీ చరణములకు పూజాపుష్పములుగా సమర్పింపబడియున్నవి. అట్లే యీ భాగం కూడా యొక పూజాపుష్పంగా వారి చరణ సన్నిధి చేరాలని భక్తమండలి వారి తరపున శ్రీ గురుపరమాత్మను ప్రార్థించు చున్నాము.

ఇట్లు

భక్తమండలి తరపున

**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

# పీఠిక

జన్మరాహిత్య విధానమందు ఆదర్శవంతమగు కృషి ద్వారా ధృడపరచు మార్గములలో శ్రీ శివరామదీక్షితీ సిద్ధాంతమును ప్రముఖముగా చెప్పవచ్చును. ఇందు "గురున్ముఖ్యేన జ్ఞాతవ్యం నాన్యదా గ్రంథ కోటిభి". గురూపదిష్ట మార్గేన మనశ్శుద్ధ్యంతు కారయేత్" అని చెప్పబడినట్లుగా గురువు, గురుదర్మము యొక్క అవసరాన్ని స్పష్టపరచుచు సర్వభ్రాంతి రాహిత్య స్థితి ఆరూఢత కాగలగటంలో గురుకృప యొక్క అవసరాన్ని ఈ సాంప్రదాయము నందు ప్రముఖముగా నిర్దేశింపబడి యున్నది. పరంపరా ప్రోక్తమై గురుశిష్య న్యాయముగా "శ్రీ బ్రహ్మ విద్యా గురువిష్ణు సూర్యం" దగ్గర నుండి నేటి వరకు అవిఛ్ఛిన్నంగా ప్రకాశింపబడు చున్నది. ఈ సిద్ధాంతము నందు గురుగీతా దర్మము చాలా ప్రాధాన్యత కల్గియున్నది. గీత అనగా వేదములలో నిర్దేశింపబడిన రహస్యార్థమును జిజ్ఞాసువులకు సులభముగా తెలియుట కొరకు మహర్షులు విశాల ధృక్పదములో అనుభూతములుగా అందించిన పరమ సత్యములు. ఈ గురుగీత ఒక ప్రముఖమైన ఆదర్శవంత అనుష్ఠాన రూపక తత్వోపదేశముగా సమాజమునకు అనుగ్రహింపబడినది. "సనత్‌కుమార సంహిత" అను పేర స్కాందపురాణ అంతర్గతమై ఉమామహేశ్వర సంవాద రూపముగా " సుజ్ఞాన దీపమను గురుగీతలు" సర్వవేదాంతసారమై ప్రకాశించుచున్నవి. ఈ గీతా దర్మమును దీక్షా పద్ధతిగా మాత్రమే గ్రహించవలసియున్నది. "ధీయతే విమలం జ్ఞానం క్షీయతే కర్మ వాసనః" అనగా ఏది సకల కర్మలను నశింపచేసి నిర్మలమైన, పరిశుద్ధ జ్ఞానము అనుగ్రహించుచున్నదో అట్టి దానినే దీక్ష అని చెప్పవచ్చును. ఈ గ్రంధమునకు శ్రీ బ్రహ్మవిద్యా గురువైన శ్రీ గురుమూర్తియే అధిష్టాన దేవత అయి యున్నాడు. ఇందు గురుస్వరూప నిర్ణయము గురుశ్శిష్యుల లక్షణములు వారి యందలి ఆదర్శములు విపులీకరింపబడినవి. ఈశ్వరానుగ్రహప్రాప్తి (దైవానుగ్రహ ప్రాప్తి) నే ఈ పరిబాషలో గురుకృపగా చెప్పబడుచున్నది. అట్టి గురుకృపను కల్గించు కొనుటకు వలయు సాధనా క్రమమంతయు ఉపదేశ రూపముగా అనుష్ఠాన పద్ధతిగా నిర్దేశించిన గ్రంధము ఈ సిద్ధాంతమున ప్రముఖులైన శ్రీ భాగవత కృష్ణదేశికేంద్రుల వారు ఈ గీతాదర్మము యొక్క అవసరాన్ని

నొక్కి చెబుతూ, "గురుశిష్యుల లక్షణములు గురుశిష్యుల భోదరీతి గురుగీ తార్థము ఎరిగిన నరులకే మెప్పగు" అని పేర్కొన్నారు. అందులకే శ్రీ శివరామ దీక్షితీ పీఠ దర్మము నందు ఒక ప్రామాణిక పీఠ గ్రంథముగా అనుష్ఠాన రూపమై ఉపదేశమార్గముగా శ్రీ కృష్ణ దేశికేంద్రుల వారి ప్రియ శిష్యులకు శ్రీ ఫిల్లానా శంకరరావు గారు 274 శ్లోకములతో 4 అధ్యాయములుగా అనుష్ఠాన రూప ప్రామాణిక పీఠ గ్రంథముగా పాఠక లోకమునకు అందించి యున్నారు. ఇందలి నిగూఢాంశములను బోధనా పద్ధతి యందలి నిర్దుష్ఠతను పాఠక లోకమునకు అందించుటకు పీఠాధ్యక్షులైన శ్రీ దయా నంద పొన్నాల రాజయోగీంద్రుల వారి ప్రియశిష్యులు. పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు రాజయోగి గారు 1965 జులై నుండి 1977 జూన్ వరకు తమ సంపాదకత్వములో నడుపబడిన రాజయోగి వేదాంత మాసపత్రిక యందు ప్రతినెల "గురు స్తోత్రమను" శీర్షికలో పాఠక లోకమునకు అందించియున్నారు. తద్వారా జనన మరణ రాహిత్యమునకై కృషిచేయు పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత పాఠకులకు ఎంతో విలువైన సహాయకారిగా ఉండి ఉత్తేజితులుగా చేసి సాంప్రదాయక పద్ధతి యందు జాగృతమొనర్చి నారు. వారి శిష్య ప్రశిష్యులు కోరికపై ఈ అంశములన్నీ క్రోడీకరించి 1988వ సం॥లో "గురుస్తోత్రము మొదటి భాగము" గాను 1990వ సం॥ మిగిలినవన్నీ క్రోడీకరించి "గురుస్తోత్రము రెండవ భాగము" గాను ప్రకటింపబడినవి. భక్తాదుల కోరికపై మరల ఈ రెండు భాగములు పునర్ ముద్రితము గావింపబడినవి. పాఠకులు గురుదర్మము యొక్క ఆధిక్యతను అవసరాన్ని గ్రహించి గురూపా సన విధానమును నిర్దుష్టముగా కృషి చేయుట ఏ వ్యక్తికి ఆ వ్యక్తి ప్రేరణ కల్గించు కొన్నచో ఈ గ్రంథ రచన సాఫల్యమైనట్లే, మిడి మిడి జ్ఞానపరులకు కను విప్ప కల్గించి సంస్కరించుకొనుటకు దోహదపడగలిగి నచో ఈ పునర్ ముద్రణ కార్యక్రమము ఫలప్రదమైనట్లే.

ఇట్లు

**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

ఓం
శ్రీ గురుభ్యోనమః

గ్రంధ పునర్ముద్రణ దాతలు



**శ్రీ ఆనెం అప్పారావు, శ్రీమతి దమయంతి**

బరంపురం, గంజాం జిల్లా, ఒరిస్సా

ఓం
శ్రీ గురుభ్యోనమః

ఈ గ్రంథ పునర్ ముద్రణకు ద్రవ్య సహాయము చేసిన శ్రీ అనెం అప్పారావు వీరి ధర్మ పత్ని దమయంతి గార్ల జీవితంలోని కొన్ని ముఖ్యాంశములు.

గంజాం జిల్లా బరంపురం పట్టణ వాస్తవ్యులు శ్రీ వరాహ నరసింహ స్వామి వారి పరమ భక్తులు అయిన శ్రీ నక్కల నందయ్య వీరి ధర్మపత్ని చిన్న లక్ష్మీ దేవిగార్ల సంతానము. నర్సమ్మ, అన్నపూర్ణమ్మ. వీరిలో అనెం నర్సమ్మ, శంకరయ్యగార్లకు నరశింహమూర్తి, అప్పారావు అని యిరువురు కుమారులు. వీరికి చేనేత పట్టువస్త్రముల వ్యాపారము. కలప వ్యాపారముతో జీవన యాత్ర సాగించుచుండిరి. శ్రీ అప్పారావు గారు ది. 15-1-1936వ సంవత్సరమున జన్మించిరి. వీరి ధర్మపత్ని దమయంతి ది. 15-4-1940 వసంవత్సరమున జన్మించిరి. ఈమె తూతిగ కేదారేశ్వరస్వామి గారి కుమార్తె. వీరి వివాహము 1954వ సంవత్సరము జరిగెను. వీరికి ఉమాదేవి, సుగుణ, అను కుమార్తెలు. నందరాజు, కృష్ణారావు అను యిరువురు కుమారులు కలిగిరి. వీరి పూర్వ జన్మ సుకృతము వల్ల వ్యాపారమందు అంచెలంచెలుగా పెరిగి వీరి తల్లిగారైన నర్సమ్మ గారి ప్రేరణ వల్ల ఆధ్యాత్మిక సాధన యందు కూడా వీరికి ప్రవేశ అవకాశము కల్పించిరి. వారి ముముక్షత్వమునకు సరితూగునటుల బీజములు ఏర్పడుటకు గాను, అదే గ్రామ నివాసియగు బత్తుల పార్వతమ్మ గారితో పరిచయము కలిగిఉండిరి. వీరి ద్వారా శివరామదీక్షితీయ సాంప్రదాయము జన్మ రాహిత్య విధానమందు సరియైన మార్గము కాగలదని అందుకు వలయు ఆచార్యులు అయిన పీఠాధిపతులైన శ్రీదయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారి శిష్యులు పరిపూర్ణ దర్శనాచార్యులు సదానంద శ్రీ యిలపకుర్తి వీర వెంకట రామచంద్రరావు గారి శిష్యమండలి బరంపురంనందు ఏర్పాటు చేసుకొని తామంతా కృషి

చేయుచున్నామని చిరంజీవి అప్పారావు దంపతులను ప్రోత్సహించి వారి శిష్యులైన శ్రీ మంచిరాజు శ్రీనివాసమూర్తి గారి ద్వారా ఉపదేశ దీక్ష గైకొని కృషి చేయవలసినదిగా ప్రోత్సహించుటచే 1991వ సంవత్సరములో యర్రపాలెం నందు శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశక సంస్థ ఏర్పాటు సందర్భములో ఉపదేశదీక్షగైకొని సాంప్రదాయపద్ధతి యందు నిర్దేశించిన అనుష్ఠాన, ఆచరణ, విచారణల యందు శిక్షణతో కృషి సల్పుచు జన్మ సార్థకత గావించుకొంటిమని పరమశాంతితో దివ్య జీవనము, గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠల ద్వారా జరుపుకొనుచున్నారు. వీరు గురువు గారిని బరంపురం పట్టణమునకు తరచు ఆహ్వానించుచూ జ్ఞాన యజ్ఞముల ద్వారా ఆ ప్రాంతముల యందు కూడా నిజ సాంప్రదాయబోధనా పద్ధతిని ప్రచారము చేయుటలో ప్రముఖపాత్ర వహించు చున్నారు. అంతేకాక ఎక్కువ జీవిత కాలము గురువుగారితో వెచ్చించుచూ తక్కువ కాలములోనే ఎక్కువ ఆరూఢత సాధించి వున్నారు. వీరి కుమారులు చి॥నందరాజుకు, అసిన్‌రాజు అను కుమారుడు నవీన అనే కుమార్తె చి॥కృష్ణారావుకు రుబీనా అనే కుమార్తె కలిగి ఉన్నారు. పట్టణమందు ప్రముఖ వ్యాపారస్తులుగా గుర్తింపు కలిగి సమాజ శ్రేయస్సుకై అనేక సేవా కార్యక్రమముల యందు ఇతోధికముగా బల,ధన, విద్యలను వెచ్చించి ఆదర్శప్రాయులై ఉన్నారు. గురు ఋణము తీర్చుకొనే పద్ధతిలో సేవా పద్ధతిగా ఈ గురుస్తోత్ర గ్రంథ పునః ముద్రణకు వలయు ఆర్థిక సంపత్తి సమకూర్చి ధన్యులైరి. శ్రీ గురుమూర్తి అనుగ్రహము వీరియెడల సర్వదా ప్రసరించి ఆశయసిద్ధిని గాంచగలరు గాక!

ఇట్లు

**దాసరి నేస్తాలు**

# గురుస్తోత్రము

శ్లో॥ అనన్యాశ్చింతయన్తో యే సులభం పరమం సుఖం
తస్మాత్సర్వ ప్రయత్నేన గురోరారాధనంకురు॥

తాత్పర్యము : ఎవరు యితర చింతనలు లేనివారై గురుదేవుని గొల్తురో వారికి బహుసులభముగా శ్రేష్టాతి శ్రేష్టమైన సుఖము లభించ గలదు. కనుక సర్వ ప్రకారములచేతను గురూపాసననే చేయుము.

విశేష వివరణము : 1) అనన్య చింతన 2) పరమం సుఖం 3) సర్వ ప్రయత్నేన 4) గురోరారాధనంకురు అను వానిని గూర్చి విచారింప నగును.

1) అనన్య చింతన : అనన్య మనగా అన్యము లేనిది. అనన్య చింతన యనగా ఒకే వస్తువును గూర్చి మాత్రమే చింతించుట. ఏకాగ్రమైన చిత్తమును ఒకే వస్తువుపై లగ్న పరచి యితర విషయములపైకి పోనీయకుండ చింతన చేయుటయే అనన్య చింతన. అంతఃకరణము చింతన చేయునపుడు దానికి చిత్తమని పేరు. ఈ అంతఃకరణము జ్ఞాన, మనో, బుద్ధి, చిత్త, అహంకారము లనే పేర్లతో యెరుగుట, సంకల్పించుట, నిశ్చయించుట, చింతించుట, అభిమానించుట అను క్రియలు జరుపుచున్నది. ఈ విధముగా ఒకే అంతఃకరణ వివిధ నామములు, వృత్తులు. స్థానములు, రూపములు పూని మార్పులు చెందుచుండునది యగుటచే స్వాభావికముగా దానికి చలనత్వమేగాని అచల స్థితి లేదు. అంతఃకరణ యొక్క చలన లక్షణము దాని పరిణామ రూపమగు చిత్తమునకున్ను వుండి తీరవలసినదే. అట్టి చలనాత్మకమగు చిత్తముచేత అనన్య చింతన ఎట్లు సాధ్యము? ఒక స్థానము నంచి వేరొక స్థానముపైకి, ఒక రూపమునుంచి మరొక రూపము పైకి యురుకుచుండు టయే దాని స్వభావ లక్షణము. చలన యనగా కదలిక. ఇది ప్రాణము యొక్క ధర్మము. ప్రాణచలన మున్నంతవరకు, 'కీ' యున్న గోడ గడియారములోని లోలకమువలె చిత్తము చలించుచునే వుండును. కనుక ప్రాణము నరికట్టుటయే చిత్తచాంచల్యనిరోధనమున కేకైక మార్గమనీ, "యోగ శ్చిత్తవృత్తి నిరోధః" అనే సూత్ర న్యాయంగా ప్రాణాయామాదులతో గూడిన యోగ మార్గమే శరణ్యమనీ కొందరంటారు. దృక్కు, ప్రాణము, మనస్సు అను మూడింటిలో ఏ నొక్కదాని చలన మాగినా మిగత రెంటి చలనము ఆగగలదని, కనుక ఖేచరి, భూచరి, మధ్యమ, షణ్ముఖి, శాంభవి అను పంచముద్ర లలో నొకదానిచే దృష్టిసాధన చేసి మనో చలనము (చిత్తచాంచల్యము) నరికట్టమని కొందరం టారు. ఈ పంచముద్రలలో నొకదాని వలనగాని, లేక త్రాటకమను దృక్సాధనచేత గాని దృష్టిని స్థిరపరుచుటచే చిత్తవిక్షేప మడంగునని చెప్పబడుచున్నది. మెస్మరిజం, హిప్నాటిజం, మొదలగు వాని నభ్యసించువారు ప్రథమములో దృక్సాధన చేసి విజయము సాధింతురు. యీ మార్గములచే సాధించిన నిశ్చలత్వము సాధనాకాలమున మాత్రమే నిలబడి పట్టువిడిచిన మరుక్షణముననే ఎప్పటి చంచలత్వమే చెందుచుండును. ఎల్లప్పుడును సాధన యందే యుండుట సాధ్యము కాదు గదా?

"యోగ దర్శనము" రచించిన పతంజలి మహర్షి చిత్త వృత్తి నిరోధమునకు యోగ మార్గమే ఏకైక మార్గమని చెప్పలేదు. యోగము బ్రహ్మచర్యాది కఠోర నియమములచే సాధించ వలసియున్నది. అసహజమగు బలాత్కార పద్ధతులబూని చిరకాల దృఢాభ్యాసముచేగాని సాధింపరానిది. దాని ఫలితమున్ను శాశ్వతముగా నిలబడేదికాదు. పతంజలి మహర్షి ఆ యోగ సూత్రములలోనే సాధనాంతరమును సూచించుయున్నారు. 'ఈశ్వర ప్రణిధానాద్వా" అని సూత్రీకరించి యున్నాడు. ఈశ్వరుని శరణాగతి చేయుట ద్వారా కూడా యీ ఫలితమును సాధింపవచ్చును అని యీ సూత్రాభిప్రాయము. "ఈశ్వరోగురు రాత్మేతి" అని చెప్పబడినది గదా! యోగఫలమైన చిత్త వృత్తి నిరోధము గురూపాసనద్వారా కూడా సిద్ధింపగలదనుటలో యెట్టి సందియము లేదు. గురువే పరమాత్మ స్వరూపము, అందు సర్వలోకములు, లోకస్థులు, లోకేశ్వరులు, సర్వమూ యిమిడియున్నది. గురూపాసన చేయు వారికి యితర దేవతా వుపాసనల యావశ్యకత యించుకైననూ లేదు. కనుకనే యీ శ్లోకము "గురోరారాధనంకురు" అని విధించు చున్నది.

అంతఃకరణము నిరంతర చలన శీలమైయున్నది. విశ్వమంతయు అందలి అన్ని వస్తువులతో సహా చలించునదియే యైయున్నది. విశ్వకారణమైన పరమాత్మ కూడా చలించుట చేతనే సృష్ట్యాది వ్యాపారము జరుగుచున్నది. సృష్ట్యాది వ్యాపారము లేనపుడు మాత్రమే దానికి అచల స్థితి కలదు. అయితే గడియారములో గంటలు చూపించు చిన్న ముల్లు కదలిక మనం వెంటనే గమనించజాలనట్లే పరమాత్మ యొక్క చలనమును గుర్తించలేకున్నాము. ధ్యానము, ధ్యేయము, ధ్యాత, సర్వమూ చలన రూపములే, అయితే నిశ్చల ధ్యానము కుదురు టెట్లు? అని సాధకుడు నిరాశా నిస్పృహలు చెంద నక్కరలేదు. ఖగోళ భూగోళములన్నియు తిరుగుచునే యున్నను వాని కదలిక గమనించకనే మనము సకల వ్యాపారములూ జరుపుకొనుటలేదా? వాని చలనము మన వ్యాపారములకేమైన ఆటంకము కల్గించుచున్నదా? కేవలాచల స్థితి దుర్లభమే కాని చలనములోనే అచల స్థితిని గుర్తించి దానికై కృషి చేయుటయే సాధకుని లక్ష్యము. కదిలే పనిముట్టుతో కదలిక లేకుండా పనిచేయుటెట్లు? అని ఆలోచించ నవసరంలేదు. అక్షరములు వ్రాయుట నేర్చుకొనే ప్రథమావస్థలో బాలుని చేతిలోని బలపము కదలిపోతూ వుండుటచే అక్షరములు సొష్టముగారావు. ఆ బలపమును కదలకుండా పట్టుకొను నేర్పు క్రమశః అభ్యాసము కాగలదు. ప్రయత్నముచే చిత్తమును గూడ నట్లే స్వాధీనము చేసుకొనవచ్చును. చిత్తచాంచల్యమును నిలుపుట బలపమును కదలకుండా పట్టుకొనగల్గునంత తేలికగాదు కాని గురుకృపచే ఆ సత్తాయున్ను లభ్యము కాగలదు. అనన్య చింతనచే గురుకృప కల్గును. గురుకృపచే అనన్య చింతన సాధ్యమగును. యిందేది మార్గము? ఏది గమ్యము? అంటే అనన్య చింతనకై కృషి చేస్తూచేస్తూ రాగా గురుకృపాబలము తోడై వచ్చుచుండును. గురు మంత్రానుష్ఠానము మానక చేస్తూనే ఉండవలెను. అనుష్ఠాన బలము చేకూరిన పిదపనే ధ్యానయోగమునందు కృషిచేయుదునని వాయిదాలు వేయకుండా ప్రతి నిత్యమూ రెండు క్రియలందూ సాధకుడు ప్రయత్నము చేస్తూవుంటే ఒకదాని కొకటి తోడై చివరకు విజయం సాధించగల్గును.

అనన్య చింతన అనగా చింతన చేయబడే వస్తువు యెల్లప్పుడు ఏకమాత్రముగా నుండవలెనే గాని ఒకప్పుడొక వస్తువును మరొకప్పుడు మరొక వస్తువును చింతించరాదు. అన్నీ ఒకటే! ఏదైతే నేమి? నామరూప భేదమేగాని వస్తు బేధ మేమియు లేదుగదా అని సంతుష్టిపడి ప్రయోజనం లేదు. ధ్యేయ వస్తువు ఎల్లప్పుడు ఒకటిగా నుండునెడల ఆ వస్తువే అభ్యాస వశముచేత చిత్తమునందు అచ్చు గుద్దినట్లు చిత్రింపబడిపోవును. ధ్యానము, లేక చింతన ప్రారంభించిన వెనువెంటనే ఆ వస్తువే స్మృతి పథమునకు వచ్చును. శ్రీకృష్ణదేశి కేంద్రులవారు "జలము నెడబాయనొల్లని జలచరముల రీవి బూని సచ్ఛిష్యుడు హృజ్జలజంబను పీఠముపై నిలిపి యితరము మాని గురువునే గొల్చుసుమ్మీ! తదూక్తులనే తలచునమ్మీ" అని శెలవిచ్చినారు. చిత్తమంతయు ధ్యేయవస్తువుతో నింపుకొనవలెనన్న చిత్తము తన్మయమై పోవలెనన్న యితర నామరూపములకు భక్తుని హృదయమున ఈషణ్మాత్రమును చోటీయరాదు. ఒక దినమొక మూర్తిని, మరుసటి రోజున మరియొక దానిని ధ్యానించు నెడల హృదయమున రెంటికినీ స్థానమిచ్చిన వాడగుచున్నాడు. అప్పుడాతని హృదయం తన్మయ మెన్నడున్ను కాజాలదు, తన్మయ మనగా చిత్తము తన స్వరూపమును పూర్తిగా గోల్పోయి ధ్యేయ వస్తు స్వరూపమునే చెందిపోవుట, అట్టి చిత్తముతో జ్ఞానేంద్రియముల ద్వారా అతడు సర్వే సర్వత్ర ధ్యేయవస్తు సాక్షాత్కారమునే అనుభవించును. అతని కంతటా గురు స్వరూపమే గోచరించును. అనేది వినేది కనేది తినేది సర్వమూ ఆ ధ్యేయ వస్తువే. "బ్రహ్మణోన్యం నకించన" "ఆత్మనోన్యంనకించన" అనే శ్రుతులు అతని యెడలనే సార్ధకమగును.

బాహ్య భక్తియందు తన యిష్ట దేవత యొక్క నామ రూపములు వేరుగానూ అన్య దేవతామూర్తులు తత్తద్భిన్నములుగానూ గోచరించును. అనన్య భక్తియందట్లుకాదు. "నీవే తప్ప నితఃపరంబెరుగ" నన్నదే అనన్యభక్తి. అనన్యభక్తితో రామోపాసన చేయువాడు ఏదేవాలయమున ఏ విగ్రహమును చూచినా ఆయా అన్ని విగ్రహములందు "రామ" మూర్తినే దర్శించును. తాను తప్ప సర్వమూ రామమయముగనే అతనికి దోచును. ఇట్టి అనన్య భక్తితో (చింతనతో) గురూపాసన చేయువానికి సమస్త విశ్వమును గురుస్వరూపముగానే దోచును. "బ్రహ్మైవేదం విశ్వమిదం పరిష్టం" అను శ్రుత్యర్థము అతని యెడలనే సార్ధకమగును.

2) "పరమం సుఖం" అనగా అత్యంత శ్రేష్ఠమగు సుఖము, ఏ సుఖమును విమర్శించినా అది అశాశ్వతము, క్షణికముగనే యున్నదని తెలియవచ్చును. మరియు నది చివరకు దుఃఖాంతం కల్గినదే. కాని పరమం సుఖం అన్నపుడు అందు దుఃఖలేశమునకైనే తావులేదు. అది దుఃఖపర్యవసానముగాదు. పరమాత్మ యెంత శాశ్వతమో యీ పరమ సుఖమున్ను అంత శాశ్వతమే. దీనినే ఆనందమని అందురు. యిది స్వరూప జ్ఞానముతోగాని గలుగదు. గనుక దానిని బ్రహ్మానందమనిన్నీ అందురు.

3) సర్వ ప్రయత్నేన : అనగా సర్వవిధముల చేతను, సర్వ మార్గముల చేతను యెన్ని ఉపాయములున్నవో అన్ని యుపాయముల చేతను అని అర్థము. అనన్య భక్తునికి యితర కోరికలు లేవు. యితరాశయము లుండవు. అందుకొరకు ప్రయత్నములున్ను యుండవు. అతనిదే

నిజముగా నిష్కామభక్తి. కోరికయున్ననూ ఆ ప్రయోజన సిద్ధికి అపసరమగు ప్రయత్నము న్నూ యుండును. అతనిది ఏకైక లక్ష్యము. ఆ లక్ష్యమును సాధించుటకే అతని అన్ని ప్రయత్నములు మంత్రసాధన, భక్తిసాధన, యోగసాధన, కర్మసాధన, జ్ఞానసాధన యిన్ని సాధనలున్ను అతడు తన ఏకైక లక్ష్యమునకే వినియోగించునన్నమాట. గురుమంత్రమునేగాని అన్యమంత్రముల జపింపనొల్లడు. గురుభక్తియే గాని యితర దేవతలయందు భక్తి నుంచడు. గురువు సూచించిన మార్గము తప్ప యితర యోగముల చెంతకు పోడు. గురువాజ్ఞాను సారము గురునకు ధారపోసిన త్రికరణములతో ఆయన విధించిన కర్మలనే యొనర్చును. గురుబోధ యందె జాగరూకుడై యుండును. యితర సిద్ధాంతములపై మనసుంచడు. సర్వప్రకారముల చేతను గురువునే సేవించును. అందుకే గురుగీత.

శ్లో॥ గురుమూర్తింస్మరేన్నిత్యం గురుర్నామ సదాజపేత్।
గురోరాజ్ఞాం ప్రకుర్వీత, గురోరన్యం నభావయేత్॥

అని విధించినది.

4) గురోరారాధనంకురు : ఆరాధన యను శబ్దములో సేవ, పూజ, నిష్ఠ, మొదలగు వుపాసనా విధులన్నియు నిమిడియున్నవి. సేవా శబ్దమునకు భౌతికమగు సాకార గురునికి పరిచర్య లొనర్చుట యనియే సామాన్యార్థము. ఇట్టి సేవకూడా త్రికరణ శుద్ధిగా భక్తి ప్రపత్తులతో నొనరించునపుడేగాని భక్తునికి సేవాఫలము సిద్ధించదు. ఇట్టి సేవా శుశ్రూషలు గురువు వాంఛింపడు. శిష్యుని ఆత్మోపలబ్ధి కొరకే శిష్యుడు గావించుకొనును. కనుకనే "నాలుగు శుశ్రూషణములు లోలతగావించు కొనుచు" అని కందార్థములలో చెప్పబడినది. చతుర్విధ శుశ్రూషల లక్ష్యార్థము నెరిగి శిష్యుడు తన యాత్మోపలబ్ధికే ఆ శుశ్రూషలు గావించుకొను చుండవలెను. పూజ యేల చేయవలెను? పూజ్యుడైన గురుమూర్తి యొక్క సద్గుణసంపత్తిని స్వరూప స్వభావములను తాను పొందుటకే గాని, పూజాదికములతో గురుని మెప్పించి వరములందుటకు గాదు. గురు వట్టి లంచగొండికాడు. నిష్ఠ యనగా దేశ కాలాది నియమము లను పాటించి దీక్ష వహించి యుపాసనాదికము గావించుట. "నియమమునను నుండనిల్పును చిత్తంబు" అన్నారు. కనుక నియమమును పాటించుటయే యెక్కువ ప్రయోజనకరము. ఆరాధన యనుటలో నవవిధభక్తులున్ను చేరియున్నవి.

"శ్రవణం కీర్తనం, స్మరణం విష్ణోఃపాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనం"

ఇందు ఆత్మనివేదనమే భక్తికి పరాకాష్ఠ తను మన ధనములు గురునకు వినయంబున ధారపోయుటయే ఆత్మ నివేదనము. నిత్యమూ పంచపూజలచే హృదయ పూర్వకముగ తన్ను తాను గురుదేవుని కర్పించుటే శిష్య ధర్మము. అట్లు ఆత్మార్పణ గావించుకొన్నప్పుడు గురుమూర్తియే కాని తానిక లేనేలేడు ఆపైన గురుమూర్తి యెరువిచ్చిన యెరుకతో మాత్రమే సకల క్రియలు చేయుచు శిష్యుడు శేష జీవితం వెళ్ళబుచ్చుకొనును.

గురు స్వరూప మొక్కటియే వుపాసింపదగినది. కనుకనే నిరాలంబోపనిషత్తు "వుపాస్యఇతిచ : సర్వశరీరస్థ చైతన్య బ్రహ్మప్రాపకోగురురుపాస్యః" అనగా ప్రజ్ఞాన రూపముగా సర్వ శరీరముల యందునున్న బ్రహ్మమును ప్రాప్తింపచేసే గురుమూర్తియే వుపాస్యము. వుపాసింపదగినవాడు. కనుకనే సర్వమార్గములచేతనూ అట్టి గురుదేవుని ఆరాధించుమని యీ గురుగీతా శ్లోకము హెచ్చరించు చున్నది. సగుణ నిర్గుణ రూపములలో సాక్షాత్కరించుచూ భక్తుల పాలించు సద్గురు దేవుల నహరహము ఆరాధించుచుందుము గాక.

శ్లో॥ శక్తోన చాపి శక్తోవా దైశికాం ఘ్రిం సమాశ్రయేత్
తస్య జన్మాస్తి సఫలం భోగమోక్ష ఫలప్రదమ్॥

తాత్పర్యము : శక్తి సామర్థ్యము లున్నవాడైనను, శక్తిహీనుడైనను, శ్రీ గురుపాదపద్మము లాశ్రయించినచో వాని భోగ మోక్షములు రెండునూ సిద్ధించి కృతార్థుడు కాగలడు. వానికి జన్మ సఫలమై తీరును.

విశేష వివరణము : 1) శక్తోన చాపి శక్తోవా 2) దైశికాంఘ్రిం 3) సమాశ్రయేత్ 4) తస్య జన్మాస్తి సఫలం 5) భోగ మోక్ష ఫలప్రదం అనువాని వివరణ తెలియవలసియున్నది.

1) శక్తో నచాపి శక్తోవా సామర్థ్యము గలవాడైనను, అశక్తుడైనను అని అర్థము. మానవుని శక్తి యెన్ని విధములు? ముఖ్యమగు త్రికరణముల శక్తియుంటే వాడు శక్తివంతుడనదగును. శరీరము, మనస్సు, వాక్కులలో ఒక్క శరీరశక్తి వున్నంత మాత్రమున శక్తివంతుడుగాడు. శరీర శక్తి భౌతికమగు క్రియలకు మాత్రమే సహాయము చేయగలదు. మానసిక శక్తి లేకుంటే గురుబోధను గ్రాహ్య మొనర్చుకొనలేడు. మనన నిధి ధ్యాసలు చేయలేడు. బోధ ఆరూఢపరుచు కొనలేడు. ఏకాగ్రత కుదరదు. మనోదారుఢ్యములేనిచో సచ్ఛీలము నలవర్చు కొనలేడు. అంతఃకరణశుద్ధి గావించు కొనలేడు. ఆత్మసాక్షాత్కారము పొందలేడు. ఉన్నదున్నట్లుగాను లేనిది లేనట్లు గాను ఆరూఢ జ్ఞానము సాధించలేడు. చక్కగా శ్రవణము చేయలేడు. మనసిచ్చి వినలేడు. వినే నేర్పే సిద్ధింపదు.

వాక్కు యొక్క శక్తి చెప్పే నేర్పును కలిగించును. "విననేర్చిచెప్ప నేర్చిన మనుజులకే దీనిలోని మర్మము తెలియున్" అన్నారు. కృష్ణదేశికేంద్రులు "స్వయం తీర్ణః పరాన్ తారయతి" అను విధముగా యితరులను తరింపచేసినగాని గురు ఋణము దీర్చుకొనలేడు. కాని యీ త్రివిధ శక్తులు లేనివాడు యీ బోధను గ్రహించుటకు అనధికారులా అంటే వారున్ను అధికారులే యని యీ శ్లోకముద్ఘాటించుచున్నది.

"మూకం కరోతి వాచాలం, పంగుం లంఘయతేగిరిం" అనగా గురుభక్తి మూగవానిని వుపన్యాసకునిగా చేయును. కుంటివానిచే కొండలు దాటించును. గురుపాద సమాశ్రయణమున్న, త్రికరణ శుద్ధితో తను మన ధనములు గురుపాధముల కర్పించి ఆత్మ నివేదన మొనరించుకొన్న భక్తునికి గురుకృపా సంసిద్ధి కలిగితీరును. గురుకృపయే సిద్ధిస్తే పరిపూర్ణము. ఏరుకలను గుర్తించి యెరుక విడుచుట మిక్కిలి సులభ సాధ్యము. అతనికి దయవస్తే అరనిముసముననే బోధ స్థితి నీకు కుదిరించునన్నారు. యిందుకు శరణాగతియే ముఖ్యసాధనము. నేను అసమర్థుడను

అని మొదటిలోనే యెవరును అధైర్యపడవలసిన పనిలేదు. పట్టుదలతో గురుకృపకై పాటుపడ వలెను.

2) దైశికాంఘ్రిం : గురుదేవుని పాదము, అంఘ్రిం అనగా ఏకవచన ప్రయోగముచే ఒకే పాదము సూచింపబడినది. దేశికునికి రెండు పాదములున్నవిగదా! ఏకపాదమే యెందుకు చెప్పబడినది? అంటే, శివ శక్త్యాత్మకముగా గురుపాద ద్వంద్వమును గురుగీత అన్యత్రా అభివర్ణించియున్నది. శివశక్తులు లేక పురుష ప్రకృతులు భిన్నమా? అభిన్నమా? భిన్నమంటే అద్వైతహాని. శ్రుతి విరుద్ధము కనుక ఆ రెండూ కలసి ఒకే పాదము అనే అర్థములోనే యీ శ్లోకము కూడా ఏకవచన ప్రయోగమే చేసినది లేక విశిష్టాద్వైత పద్ధతిగా ఒకటియందే రెండునూ అంతర్భూతములై యున్నవని గ్రహించవచ్చును. అనగా "Two in one, one in Two" ఏకరూప ద్వంద్వము లేక ద్వంద్వరూప ఏకము అని భావించవచ్చును.

గురువును ఆశ్రయించమని చెప్పుటతో తృప్తిపడక గురుపాదము నాశ్రయించమని చెప్పనేల? పాదములు శరీరము యొక్క కొన భాగములు, శరీరమంతటిని నిలబెట్టుటకు పాదములే ఆధారభూతములు. శరీరమందలి శక్తి భూమ్యాకర్షణ వల్ల పాదములవైపే ప్రవహించుచుండును. గురుమూర్తి యందలి తేజస్సును తాను పొంది కృతార్థుడు కావలెననే సంకల్పముతో శిష్యుడు పాదముల స్పృశిస్తూ నమస్కరించును. "స్పర్శనం పాపనాశనం" అని చెప్పబడినది.

3) సమాశ్రయేత్ : చక్కగా నాశ్రయించవలెను. ఆశ్రయించుట అనే మాటలో, తనకు ఆ గురుమూర్తి కృపలేనిదే ఆశయసిద్ధిచేకూరదు. అతని సహాయము లేనిదే తను తరించ లేడనే అర్థము యిమిడియున్నది. ఏలననగా "ఎరుక తనకు తావీడిపోదు. ఎరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్ గురుడొకడుతప్ప" కనుక గురునికి పరిచర్య యొనర్చి బోధ పద్ధతి తెలుసుకో మన్నారు కృష్ణదేశికేంద్రులవారు.

4) తస్య జన్మాస్తి సఫలం : గురుపాదము పట్టిన వానికే జన్మ సఫలమగును. అయితే మానవ జన్మ యెత్తి నందుకు ఫలమేమి? శాశ్వతముగ జనన మరణరూప సంసార చక్ర భ్రమణము నుండి తప్పించుకొనుటయే మానవుడై పుట్టినందుకు ఫలము. ఏలననగా, యీ నర జన్మయందే కృషి చేయుట కవసరమగు పరికరములన్నియు పరమాత్మ సృష్టియందు సమకూర్చబడియున్నవి. ఈ సంపత్తిని వృధా చేసుకొంటే మానవ జన్మ వ్యర్థము అయిపోయినట్లే గదా! "ఇహచేదవేదీ బహుసత్యమస్తి యిహచేన్నవేదీ మహతీ వినష్టిః అన్నారు.

5) భోక్షగమోక్షఫలప్రదం : భుక్తి, ముక్తి అను రెండు మానవునికి కావలసినవి గదా! చతుర్విధపురుషార్థములు అని చెప్పబడే ధర్మ, అర్థ, కామ, మోక్షములలో అర్థ కామములు రెండును యీ లోకమునందు మానవునికి భోగ్యములు. యీ రెండున్నూ ధర్మయుతముగా నుండవలెనని ఆదిలో ధర్మ మొక పురుషార్థముగా చెప్పబడినది. అర్థ సంపాదన ధర్మయుతముగా నుండవలెను. ధర్మపద్ధతిగానే కామోపభోగము అనుభవించవలెను. యీ విధముగా ధర్మయుత మగు ఆచరణ కల్గియున్నవాడే అతని అంతఃకరణ శుద్ధమై ఆత్మ యొక్క సాక్షాత్కారము

చెందుటకు యోగ్యమగును. అట్టి ధర్మయుతమగు సత్కర్మాచరణము చేయు శక్తి యుక్తులు గురుపరమాత్మయొక్క అనుగ్రహ విశేషమున గాని లభింపనేరవు. యిహలోక సుఖములు. (భోగములు) గలుగుటకున్ను, మోక్షమనదగు ఆత్మోపలబ్ధి గలుగుటకున్ను, గురుపాదముల నాశ్రయించక తప్పదు. మానవోపాధి యెట్టి విశిష్టత గల్గియున్ననూ మానవుని శరీరేంద్రియ మానసిక శక్తులన్నియు ఒక పరిమితిలోనే యున్నవి గదా. యిట్టి పరిమిత శక్తులతో అపరిమితము అగోచరమునగు పరిపూర్ణతను సాధించుట మహాదుస్తరము. కాని గురూపాసనచే గురుకృప సాధించినవానికి మాత్రం అంతయును సాధ్యమే.

అట్టి గురుకృపాసంసిద్ధి పొందుటకై గురుమూర్తి దివ్య పాదారవిందములను అహరహము భజించుచుందుముగాక!

శ్లో॥ శరీర మింద్రియ ప్రాణ మర్థ స్వజన బాంధవాన్
ఆత్మదారాదికం సర్వం సద్గురుభ్యోనివేదయేత్॥

తాత్పర్యము : తన శరీరేంద్రియ ప్రాణములను, ధనమును పరిజనమును బంధు వర్గమును, భార్యా మొదలగువారిని సర్వమును సద్గురువునకు నివేదించవలెను.

విశ్లేష వివరణము : ఈ శ్లోకము యొక్క వాచ్యార్థమును మాత్రమే స్వీకరించినచో చాలా విపరీతార్థము స్ఫురించగలదు. కనుక ఈ శ్లోకము యొక్క నిజాభిప్రాయమును లోతుగా విమర్శించవలసియున్నది.

విపరీతార్థ మెట్లు సిద్ధించుననగా : తన శరీరమును, లేక తన భార్యాపుత్రాదులను నివేదించుట యనగా మున్ను హరిశ్చంద్రుడు తన భార్యయగు చంద్రమతిని దాసీగా విక్రయించి, తాను వీరబాహునికి అమ్ముడై పోయినట్లుగానూ లేక ధర్మరాజు జూదములో తన రాజ్య సర్వస్వమును అన్నదమ్ములను ద్రౌపదిని ఓడిపోయినట్లుగానూ అని యర్థమా? లేక వీర శైవములో దైవ సమానులుగా నెన్నబడిన జంగమ దేవరకు విలాసార్థము భోగవస్తువులుగా స్వ స్త్రీలను సహితం అర్పణ చేసెడి విధముగానూ, లేక ఆచార్య కటాక్షమే శ్రీపాదరక్షయని భావించి కైంకర్యముచే గోపికలు కడతేరినారని. కైంకర్యము యొక్క నిజాభిప్రాయమును సరిగా గుర్తించని కొన్ని దుష్ట వైష్ణవ సాంప్రదాయకముల విధముగానూ గుర్తించుటేమోననే అపోహలకు దారితీయ వచ్చును. గురుగీతలోని యీ శ్లోకమునకట్టి అపార్థమునకెట్టితావున్ను లేదు. ఈ శ్లోకములో నుపయోగింపబడిన 'నివేదయేత్' అను మాట యొక్క అర్థమును బుద్ధి పూర్వకముగా విసర్జించి నీచులైన గురువులు స్వార్థపరులై. తను మన ధనములు సమర్పించితినని శిష్యుని నోట అక్షరాలా పలికించి ఆ శిష్యునిపై పెత్తనము చలాయించి వ్యభిచారాదులకు వెరువక తాము చెడినవారే గాక తమ్ము దైవస్వరూపులుగా భావించి ఆశ్రయించినవారిని వంచించెడి దుర్మార్గు లుండిన యెటనైన కొందరుండవచ్చును. శ్లోకములో "నివేదయేత్" అను మాటకు అర్థము నివేదించవలెను. అనగా భావరూపముగా అర్పించవలెను అని మాత్రమే అర్థము. ఇష్టదైవము లకు పండ్లు ఫలహారములు నివేదించవలయును. అంటే, ఆయా పదార్థములను ఆయా యిష్టదైవముల్ల నోట కుక్కుచున్నామా? "నైవేద్యం సమర్పయామి" అని చెయ్యి మాత్రము

చూపించి, నివేదించిన పదార్థములను దుర్వినియోగము సేయక మహాప్రసాదముగా మనమే స్వీకరించి అనుభవిస్తూన్నాము.

ఇంతకూ, గురుడు నరుడని భావించితేనే యీ అనర్థకములన్ని సిద్ధించుచున్నవి. గురుడు నరుడుగాదు, పరుడేయని భావించవలసియున్నది గదా! అపుడేమి అర్థము చెప్పవలెను? "ఓ సద్గురుదేవా! నేను నీ స్వరూపుడనేగాని అన్యుడను గాను కదా! నీ స్వరూపము తో నీకంటే వేరుగా నున్నదా? లేదే? నేనే నీవైయున్నపుడు ఇక ప్రత్యేకముగా నాది యని యేమి యుండగలదు? నాది అని యితరులనుకొనేది అంతా గూడ నిజంగా నీదే. ఇక, నీదే అంతా ఐతే, నీది నీకిచ్చుట అనగా నేమి? ఈ పరిస్థితులలో యిచ్చుట, పుచ్చుకొనుట, అనునది పొసగనే పొసగదు. సమస్తమును నీదే? నాదనేది అసలు లేనే లేదని భావించుటే నీకిచ్చుట యగును. నీది, నీదంటేచాలు, వేరే యిచ్చుటకు మడిమాన్యము లెక్కడనున్నవి? అందుకే కాబోలు మాది మాకిచ్చుట మడిమాన్యము లిచ్చుటే అను మాట పుట్టింది. పోనీ ద్వైత బుద్ధితో, నేను వేరే, నీవు వేరే, అందామా? అంటే నిర్గుణ నిరాకార స్వరూపుడవగు నీకు, సగుణ సాకార రూపములు గల, నేను నామ రూపాత్మకమగు భౌతిక వస్తువుల నెట్లందీయగలను? అసంభవము గదా?

పోనీ అట్లనూకాకుండా- "ఉపాసకానాం, హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా" అను రీతిగా "నాకొరకుగాదె నీవు జన్మంబు దాల్చితివి" అని నేననుకొన్నా, వస్తు సంపదను నీ అనుభవమునకై నేను క్రియారూపముగా యీయబూనుట నిన్ను నారాయణుని స్థానము నుండి నరుని స్థానమునకు లేక మాధవుని స్థానము నుండి మానవుని స్థానమునకు దిగలాగుటయే యగుచున్నది. యెంత అవివేకము? గురుతత్వమునే విస్మరించి, గురుడు నరుడని దలచిన ఘోర అపచారము చేసినవాడనే అగుచున్నాను అని యీ విధముగా విచారించి ఆ పిదప శ్లోకాభిప్రాయమును అవగతం చేసుకొనవలసియున్నది.

కనుక "నివేదించుట" లేక "అర్పించుట" అనే మాటలకు "తనది" అనే భావమును వీడుట (అనగా మమకార, అభిమానములను వదలుట) మాత్రమేకాని, వస్తువునే యిచ్చి వేయుట కాదు. అట్లని, యెప్పుడో ఏ వస్తువులను గాని, అర్థము (అనగా ద్రవ్యమును) గాని, గురువులకు శిష్యులివ్వరాదని అర్థముగాదు. గురువు యొక్కయు గురుపత్ని యొక్కయు అవసరములకొరకు శిష్యులు ద్రవ్యమిచ్చుటకు ఎంతమాత్రము లోభించరాదు. శ్లోకములో చెప్పిన (1) శరీరము (2) యింద్రియములు (3) ప్రాణము (4) స్వజనము (పరిచారకబృందం) (5) బంధువర్గము (6) ఆత్మదారాధికము (అనగా భార్యాపుత్రాదికములు) యివన్నియు యివ్వరానివేగదా! యిచ్చుటకు సాధ్యమున్ను గానివేగదా! స్వజనము, బంధువులు, భార్యాపుత్రాదులు వీరిని యిచ్చుట ఎందుకు సాధ్యము కాదు? అంటే అసాధ్యం కాకపోవచ్చును. వారు చెప్పిన మాట వినువారైతే, గురుసేవాకార్యముల యందు వారిని వినియోగించుటయు తప్పుకాదు. కాని శరీరము, భార్యాదికములు యీయవలెనని అపార్థము చేయుట మాత్రము అచింత్యము. ఈ శ్లోకమునందు చెప్పబడిన వానియందలి మమకారమును వదలుటయే

వానిని గురుమూర్తికి నివేదించుట అని అర్థము. ఎందుకిలా చెప్పవలెనంటే, నా శరీరము, నా యింద్రియములు, నా ప్రాణము, నా పరిచారకులు, నా బంధువులు, నా ఆస్తిపాస్తులు, నా ధనము అని మమకారము పెంచుకొని వాని కెట్టి హాని తటస్థించినా తాను మహా దుఃఖము అనుభవించును. యీ మమకారము లేనిచో ఎవరైనను యెందుకు దుఃఖించవలెను? కనుక దుఃఖ నివృత్తికి యీ శ్లోకమొక సాధనా మార్గమును నిర్దేశించి చెప్పుచున్నదని తెలియవలెను.

దుఃఖకారణమగు యీ మమకారనాశనము ఎట్లు కాగలదు? యిందుకు, ఆ బ్రహ్మస్తంభపర్యంతము గురుపరమాత్మయొక్క స్వరూపమే అని బుద్ధి నిశ్చయరూపముగా గురుతత్వమును తెలియవలెను. తను ధన కనక వస్తు వాహనాదులు, భార్యాపుత్రాదులు బంధుజనములు, పరిచారికులు, తన కన్యంగానున్న తన సమస్తముకూడా నిజముగా ఆ గురుస్వరూపంలోనివేకదా? తనకు బాహ్యముగాన్ను పైన వుదహరించినది మాత్రమే గాక తన శరీరం తన యింద్రియములు, ప్రాణము, తన దేహ, మనో, ఆత్మలు సహా సర్వము ఆ అఖండ బ్రహ్మములోనివే కదా! "సర్వం ఖల్విదం బ్రహ్మ" అను శ్రుతి కెక్కడా ఏ మినహాయింపు చెప్పబడలేదుగదా! తన వ్యష్టిగుర్తుతో సహా సర్వము గురుస్వరూపమే అని గుర్తెరిగి మమకారము ను వీడుటకే యీ శ్లోకము ప్రవర్తిల్లినది. ఈ విధముగా గురుస్వరూపమును గుర్తెరిగి అహంకార మమకారములను వీడుటయే అనుభవరూపమగు ఆత్మ నిశ్చయజ్ఞానము. ఇట్టి నిశ్చయజ్ఞానము గల లేనెరుక స్వరూపుడగు తాను

"పరిపూర్ణమనగ నెట్టిదో ఎరిగెదనని బైటకేగిన,
ఎరుకే కెరుకకు శూన్యంబయ్యెను ఎరుకను జన్మించినట్టి
ఈ విశ్వమంతా యెరుకవలెనే ఏమీ లేదంతా"
అను అనుభవమును పొందుటే పరిపూర్ణబోధకు చరమ లక్ష్యము.

ఈ చరమ లక్ష్యమును సాధించుటకై ప్రాతిపదికగా తన తెలివికి ఆవరణరూపముగా నుండి తన్ను బంధించే తనదనే సమస్తమును గురునికి నివేదించవలెను. 'నాది' అనే మమకారమును వదలుకొనినవాడై యిదంతయు గురునిసొత్తే. (గురునికి నివేదింపబడినది) ధర్మపద్ధతిగా యీ యెరుపుసొత్తును గురువాజ్ఞానుసారంగా నేననుభవించవలెనే గాని ఏ మాత్రమును దుర్వినియోగము చేయకూడదు అను దృక్పథముతో బహు జాగరూకుడై అప్రమత్తుడై సంచరించవలెను. యజమాని సొత్తును నియమిత విధముగా ఖర్చుచేసి సరిఅయిన జమా ఖర్చుచెప్పెడి గుమాస్తావలె గురువాజ్ఞప్రకారం జీవయాత్రసాగించి గురుకృపకు పాత్రుడైనపుడే గురుశిష్య న్యాయము సార్థకమగును. సర్వాత్మకుడై సర్వస్వరూపుడై యున్న శ్రీగురుమూర్తి కివే మా నమస్కృతులు.

శ్లో॥ తస్మై దిశే సతత మంజలి రేష నిత్యం
ప్రక్షిప్యతాం ముఖరితై ర్మధురైః ప్రసూనైః॥
జాగర్తి యత్ర భగవాన్ గురుచక్రవర్తీ
విశ్వస్థితి ప్రళయ నాటక నిత్యసాక్షీ॥

తాత్పర్యము : సత్యుడును, షడ్గుణైశ్వర్యయుక్తుడును, సృష్టి స్థితి లయములకు సాక్షిభూతుడును, మేల్కయందే యుండువాడును నగు గురు సార్వభౌముడున్న దిశ కభిముఖుడవై, అపుడే వికసించి పరిమళములు గుబాళించు నవియును, మధురముగా ఝుమ్మని రొదచేయుచు తుమ్మెదలు ముసురుకొనుచుండునవియునుఅగు సరభిశ కుసమములతో ప్రతిదినము నంజలి ఘటించి నమస్కరించి ఆ పుష్పములను చల్లవలయును.

1) తస్మైదిశే 2) జాగర్తి 3) భగవాన్ 4) గురుచక్రవర్తి 5) సాక్షి అను మాటలను వివరించి తెలుసుకొనవలసియున్నది.

ఈ శ్లోక భావము సగుణ రూపుడగు గురువునకు మాత్రమే వర్తించునట్లు కనుపించుచున్నది. ఐనను నిర్గుణ రూపమగు గురు స్వరూపములనకు కూడ నన్వయించుటయే శ్లోకాభిప్రాయము. ఏలననగా "విశ్వస్థితి ప్రళయ నాటక నిత్యసాక్షి" అను మాటలు మరొక విధంగా సమన్వయింపవలనుపడదు.

1) తస్మైదిశే : ఆ దిశ అని అర్థము, ఏదిశ? 4 దిక్కులు, నాలుగు మూలలు, పైన క్రింద అనునవి రెండు, మొత్తం దశదిశలు నిర్ణయించపబడినవి. ఇందేదో ఒక దిశలో గురుమూర్తి వున్నాడని అంటే, ఆయన నామరూప పరిమాణములు గల ఒక మానవ వ్యక్తిగా వున్నటుల మాత్రమే మనమూహించినట్లగును. సర్వవ్యాపకమగు, గురుపరమాత్మకు ఏకదేశీయత నాపాదించిన వారమగుదుము. అసలు దిశలు ఎట్లేర్పడినవి? సూర్యుని వుదయాస్తమయముల ననుసరించి 4 దిక్కులు 4 మూలలు నిర్ణయించపబడినవి. సూర్యుడే సృష్టికానపుడు యీ అష్ట దిక్కులులేవు. తానూ లేడు. తాను లేడు గనుక పైన క్రింద అను నిర్ణయమున్ను వుండజాలదు. సృష్టికి పూర్వమందు కూడా సర్వ వ్యాపకుడై గురుపరమాత్మ యున్నాడు గదా! అప్పుడు గురుపరమాత్మ ఏ దిశయందున్నాడని చెప్పనగును, ఐతే, యిక 'తస్మైదిశే' అను మాటలు ఆ గురుపరమాత్మ కెట్లన్వయించనగును?

'తస్మైదిశే' అనగా ఆ దిశ అని అర్థము. ఏదిశ? అంటే, భక్తుడేదిశకభిముఖుడై యున్నాడో, ఆదిశయే "తస్మైదిశే" ఏ వైపు (దిశకు) చూచినా గురుపరమాత్మయే, చూచిన ప్రతి దిశయందూ అనే అర్థమును గ్రహించవలెను. మరియును యీ అర్థమునే గురుగీత మరొక శ్లోకములో "పురస్తాత్ పార్శ్వయోః పృష్ఠే నమస్కుర్యాదుపర్యధః" అంటూ నీ ముందర పార్శ్వముల యందు వెనుకనూ వున్న గురుపరమాత్మకు నమస్కరింపుమంటూంది. ఆత్మ ప్రదక్షిణ నమస్కారములో తనచుట్టూ తాను తిరుగుతూ నమస్కారము చేయుటలో, తన శరీరమునకు అష్టదిక్కులయందునున్న గురుపరమాత్మకే నమస్కరించుచున్నాడని భావము.

2) జాగర్తి : అనగా జాగ్రదవస్థయందుండుట, అనగా సంపూర్ణ జ్ఞానముచే నుండుట. జాగ్రదవస్థయందు 25 యింద్రియములచే వ్యవహరించుచు తెలివి గలిగియుండును. సుషుప్తి అవస్థయందు తెలివి యొక్క వ్యవహారమేలేదు. కేవలం అజ్ఞాన రూపమే. జాగర్తి అనగా సంపూర్ణముగా జ్ఞానము కల్గియుండుట. సృష్టి స్థితి లయ నిగ్రహానుగ్రహములను పంచకృత్యములుచేయు పరమాత్మకు నిద్రించుటకు సావకాశములేదు. మహాప్రళయ స్థితియే ఆయన నిద్రగా అభివర్ణింపబడినది.

"ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్నిబోధత" అని అజ్ఞాన నిద్రలో స్వస్వరూప విస్మృతిలో నుండు మానవుని "అజ్ఞాన నిద్రనుండి గురుబోధచే మేల్కొని స్వస్వరూప సాక్షాత్కారము పొందుమని శ్రుతి హెచ్చరించుచున్నది. గురుపరమాత్మకు యెల్లపుడు స్వస్వరూపస్థితియే దానిని మరచిన గదా, క్రొత్తగా మేల్కనుట, ఆయన అఖండ జ్ఞాన స్వరూపుడు, చిద్ఘనుడు, ప్రజ్ఞానఘనుడు, జ్ఞానమే ఆయన స్వరూప లక్షణము. సూర్య బింబములో చీకట్లు చేరలేనట్లు ఆయనకు స్వస్వరూప విస్మృతి అనే అజ్ఞాన నిద్ర కలుగజాలదు. ఆ గురుస్వరూపము యెల్లప్పుడు అఖండ జాగృతిలోనే యున్నదన్నమాట.

3) భగవాన్ = భగవంతుడు

శ్లో॥ ఐశ్వర్యస్య, సమగ్రస్య వీర్యస్య యశసశ్రియః
జ్ఞాన వైరాగ్యయోశ్చైవషణ్ణాం భగవయితీరిత॥

ఐశ్వర్యం, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞాన, వైరాగ్యములు అను షడ్గుణైశ్వర్య సంపత్తియే భగశబ్దమునకు అర్థము. "షడ్గుణైశ్వర్యయుక్తశ్చ భగవాన్ శ్రీ గురుఃప్రియే" అని గురుగీత చెప్పుచున్నది. 1) ఐశ్వర్యము = ఈశ్వరత్వము, సర్వప్రాణులను శాసించి రక్షించు ప్రభుత్వధర్మమే ఐశ్వర్యము. 2) వీర్యము = బలము, రసబలములు రెండునూ కలవాడే గురుమూర్తి. రసమనగా జ్ఞానము, బలమనగా శక్తి. సర్వశక్తివంతుడైనవాడు. 3) యశస్సు = సత్కీర్తి. అతడు సమస్త కళ్యాణ గుణాకరుడు, అతడు నిర్మలుడు. ఏవిధమైన మలినములేనివాడు 4) శ్రీ = సర్వమంగళములు ఏప్రకాశముచే గుర్తింపబడుచున్నవో, ఆయాత్మ ప్రకాశమే శ్రీ. సమృద్ధములగు సర్వసంపదలకు అతడే స్థానభూతుడు 5) జ్ఞానము = పారమార్థిక జ్ఞానము లేక ఆధ్యాత్మిక జ్ఞానము. 6) వైరాగ్యము = దేనియందునూ విపరీతమగు ప్రేమ లేకుండుట, సర్వమూ తానేయై ఉండగా దేనియందు రాగద్వేషము లుండును?

మరొక రీతిగా, శ్లో॥ ఉత్పత్తిం ప్రళయంచైవ భూతానా మాగతిం గతిం
వేత్తి విద్యా మవిద్యాంచ షణ్ణాం భగ ఇతీర్యతే॥

అనగా వుత్పత్తి ప్రళయములు ప్రాణుల రాకపోకలు, జ్ఞానా, జ్ఞానములు తెలుసు కొన్నవాడే భగవంతుడు. ఇందు గురుపరమాత్మ యొక్క సర్వజ్ఞత్వ లక్షణములకే ప్రాధాన్య మీయబడినది.

4) గురుచక్రవర్తి : రాజులకు గూడ రాజైనవాడు చక్రవర్తి యనీ సార్వభౌముడనీ పిలువబడును. అట్లే అనేకమంది వుపగురువులకు గూడ గురువైన పీఠాధిపతియే గురుచక్రవర్తి యని యనదగియున్నాడు.

ఇంకొక విధముగా చూచిన గురువులలోకెల్ల యుత్తముడు శ్రేష్టుడు అయినవాడే గురుచక్రవర్తియని చెప్పదగును. శాస్త్రమునందు అష్టవిధ గురువులు చెప్పబడినారు.

1) సూచక గురువు : అక్షరాభ్యాసము చేయించిన ఉపాధ్యాయుడు (పంతులు) మొదలు శాస్త్రవిద్యలు నేర్పిన వారందరును సూచక గురువులే.

2) వాచక గురువు : కులవిద్యలు. వృత్తి విద్యలు వర్ణాశ్రమ ధర్మముల ననుసరించిన విద్యలు నేర్పువారు వాచక గురువులు.

3) బోధక గురువు : మహా మంత్రముల నుపదేశించిన గురువు.

4) నిషిద్ధ గురువు : స్తంభన, మోహన, మారణాది శక్తులను గల్గించు క్షుద్రమంత్రములను నేర్పుగురువు.

5) విహిత గురువు : అనిత్య రూపమగు యిహము ఫలబోగములయందు వైరాగ్యము కల్గించు గురువు.

6) కారణ గురువు : తత్త్వమసి మహావాక్యము నుపదేశించి స్వరూప జ్ఞానము కల్గించు గురువు.

7) పరమ గురువు : సర్వ సంశయముల పోగొట్టు గురువు.

8) సదమల గురువు : లేక పూర్ణ గురువు

కం॥ సదమల గురువెవరిని నను
యిదిగో బయ లిదిగో లేని యీ
గుర్తెరిగేటిదగు శరీరము, దీనిని
వదలుమనుచు నీకు చెప్పవచ్చినవారే!"

ఈ సదమల గురువే గురు చక్రవర్తి యనదగినవాడు. ఏలననగా పరిపూర్ణమెరుకల నెరిగి యెరుకను రహితము చేసినపుడే జనన మరణ భ్రాంతి రహితమగును.

కం॥ ఎరుక దనకు దావీడిపోదు
యెరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్
గురుడొకడుదప్ప.......

ఎరుకను విడిపించు పరిపూర్ణ గురువు మాత్రమే గురుచక్రవర్తి

5) సాక్షి అనగా చూచువాడు చేయువాడు కాదు. సృష్టికి పూర్వమున్న పరమాత్మ కేవలం సాక్షిమాత్రుడేనా? లేక కర్తయా? విచారించింపవలెను. ఒక్కటైన ఆ పరమాత్మయే "ఏకం అనేకం భవతి" అని శ్రుతి చెప్పిన విధంగా, అన్ని రూపములు తానే వహించినది.

కృష్ణదేశికులు :

1) ఆకాశాదిక భూతానీకాత్మకమగుచు
ఎరుక యీ జగమయ్యేన్......అనీ

2) అన్నియు తానై తనకవి
పన్నుగ వెరనుచు నోట బల్కుచు.......అనీ

3) ఎరుకొక్కటుండె నేనియు
ఎరుక యీ విశ్వరూప మేర్పడదాల్చున్......అనీ

" ఎరుక యనియెడి ఆటాడించేటివాడు

అతడేరకర్త.........యనీ. యుంటూ చివరకు

5) విను మితరులు ఎరుకను సాక్ష్యని బల్కిరి

నేను సాక్షి నహమని నీతో వినజెప్పితి నింతియె

వేరనకూడదు. రెండి నొక్కటని తెల్సుకోరా'' అని నిర్ధారణ చేసినారు.

సాక్షి అనగా చూచువాడేగాని చేయువాడు గాదు అని అందామన్ననూ అది సరిగాదు. చూచుట అనే వ్యాపారము చేయుచున్నాడు గదా! అపుడాతనిని నిష్క్రియుడన జెల్లునా? కండ్లతో చూచుచు చెవులతో వినుచునుండునేగాని ఆ దృశ్య శ్రవిక విషయముల వలన వికారము చెందడు. ఒక్క పక్షమూనడు. అవి తన స్మృతి యందు చేర్చుకొని జ్ఞాపకముంచుకొనును. వానిచే యెట్టి యుద్రేకముగాని సుఖదుఃఖములుగాని చెందడు. ఉదాహరణకు, యిర్వురు జగడమాడుచుండగా నొకడు వూరక చూచుచుండును. జగడమాడు వారుద్రేకముచెంది సుఖ దుఃఖములు అంతఃకరణ మున చేర్చి సంస్కారమేర్పరచుకొన్న విధంగా వూరక చూచుసాక్షి యెట్టి వికారములు చెందడు. కనుక సాక్షికి యెట్టి పాపపుణ్యములునూ అంటవు.

సృష్టి స్థితి లయములు చెందుచుండు యీ జగన్నాటకమునకు పరమాత్మ కర్తయు సాక్షియుగూడనై యున్నాడు. బ్రహ్మమే జగత్కారణమని శ్రుతి స్మృతులు సమస్త శాస్త్రములు యెట్లు ఘోషించుచున్నవో పరిపూర్ణ దర్శనమున విపులపర్చబడినది. పరమాత్మ కర్తయే అయినను, కర్తృత్వమువహించుట వలనవచ్చు పుణ్య పాపములు అతనినంటవు. ఏలననగా జీవుల కర్మాను సారము వారివారి గుణకర్మల ననుసరించియే సృష్టి గావించును. "తస్యకర్తారమపి విధ్యకర్తర మవ్యయం" అంటున్నాడు భగవానుడు. అతనికి కర్తృత్వాహంకారంగాని, ఆయా కర్మచేయుటలో సాధించదగు ప్రయోజనముగాని లేదు. అందుకే భగవద్గీత

శ్లో॥ నమే పార్థా స్తికర్తవ్యం త్రిషులోకేషు కించన।

నానవాప్త మవాప్తవ్యం వర్తఏవచ కర్మణిః

అనగా నాకు విధాయకమగు కర్మగాని నేను పొందవలసిన ఫలితముగాని లేదంటున్నాడు.

నాటకాత్పూర్వమునందును నాటక కాలమందునూ నాటకానంతరమందును నాటక శాలయందలి దీపము వూరక వెలుగుచునేయున్నట్లు పరమాత్మ జగన్నాటకమునకు కేవలం సాక్షిగానున్నాడని చెప్పుచున్నారే గాని అది సరిగాదు. నాటక దీపము జడము. తెలివిలేనిది. పరమాత్మయో ప్రజ్ఞానఘనుడు. నాటక దీపము నాటకమాడుటకు కేవలం సహాయ కారణము మాత్రమే. పరమాత్మయో ప్రదాన కారణము. సహాయ కారణము. సర్వ కారణము తానే అయివున్నాడు. పరమాత్మకర్త గాడనుట న్యాయం కాదు. కర్తయయ్యును. కర్తృతాహంకారా భిమానములులేక నిష్కామముగ యెట్టి ప్రయోజనమున్ను ఆసింపకనే వున్నాడు. గనుక ఆయనను సాక్షియనిన్ని అనదగును.

కర్తృత్వత్యాగ పూర్వకమగు కర్మకౌశలము నెరిగి, నిష్కామ కర్మజేయు నా గురు పరమాత్మనే, యొరవడిగాబెట్టుకొని నిత్యజీవితమును సాగించుడని మనకుద్బోదించు గురు సార్వభౌమును కివే మా నమస్సులు.

శ్లో ॥ అభ్యస్తైః కిము దీర్ఘ కాలవిమలై ర్వ్యాధిప్రదైర్దుష్కరైః
ప్రాణాయామ శతైరనేక కరణై ర్దుఃఖాత్మకైర్దుర్జయైః
యస్మిన్నభ్యుదితే వినశ్యతిబలీ వాయుః స్వయంతత్క్షణాత్
ప్రాప్తుం తత్సహజ స్వభావమనిశం సేవేతచైకం గురుమ్

తాత్పర్యము : దీర్ఘకాలమభ్యసించినగాని ఫలప్రదముకానివి, వ్యాధిప్రదములు, కఠినములుదుస్సాధ్యములునగు ప్రాణాయామాది యోగ సాధనముల చేతను, దేహేంద్రియాదులను శుష్కింపజేయు నితరసాధనలచేతను ఏమి ప్రయోజనము? చిత్త విక్షేపమునకు కారణమైన బలీయమగు ప్రాణము గూడ స్వరూప జ్ఞానముచే నణగుచున్నది గదా! అట్టి స్వరూప జ్ఞానము కల్గించు సహజ సామర్థ్యముగల సద్గురువు నొక్కనినే సేవించి కృతార్థుడవుకమ్ము.

విశేష వివరణములు : 1) అభ్యస్తైః కిం? 2) సేవేత చైకంగురుం 3) తత్సహజస్వభావం 4) యస్మిన్నభ్యుదితో

1) అభ్యస్తైః కిం? : పరమ పురుషార్థమగు మోక్ష ము ఉత్తమ సాధకుని లక్ష్యము.

శ్లో॥ "మనయేవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః
బంధాయ విషయాసక్తం, మోక్షం నిర్విషయం మనః"

మనస్సు విషయాసక్తమైనచో, బంధమునకు నిర్విషయమైనచో మోక్షమునకును కారణమగుచున్నది. సాధకుడు పూజాజపస్తోత్రాదులు చేసుకొనునపుడు గూడ మనస్సు లక్ష్యమందు నిలవక చంచలమై తికమకలు పెట్టుచుండుటయు, నిలచునుపాయము దెలుపుడని సాధకులు పెద్దలను ప్రశ్నించుచుండుటయు సాధారణముగా జరుగుచున్నదే. ఉత్తమాధికారియగు అర్జునుడు సహితం :

శ్లో॥ చంచలం హి మనః కృష్ణ । ప్రమాధి బలవ ద్దృఢం
తస్యాహం నిగ్రహంమన్యే వాయోరివసుదుష్కరం॥

అంటూ మొరబెట్టుకొన్నాడు. అందుకు భగవానిడానతిచ్చినదేమి? "అభ్యాసేనతు కౌంతేయ వైరాగ్యేణచ గృహ్యతే" అనగా అభ్యాసముచేతను వైరాగ్యమువలనను మనస్సు స్వాధీనమగునన్నాడు. ఇందు "చ" కార ప్రయోగముచే అభ్యాస వైరాగ్యములు రెండూ కూడా వుండవలెనని సూచింపబడినది. ఆ అభ్యాసమనగా నేమో వైరాగ్య మనగా నేమో భగవానుడు విపులపరచలేదు. వాని యర్థమును చర్చించి తెలుసుకొనుటకు ముందు మనస్సేల చలించ వలెనని యించుక విచారించుట యవసరము.

ఆకాశమందలి అష్టమాంశము వాయువులో చేరి మనస్సాయెనవి సాంఖ్యము చెప్పుచున్నది. మనస్సునందు అచల రూపముగావుండు ఆకాశాంశము కంటె చలన రూపముగావుండే వాయులక్షణము యెన్నో రెట్లున్నదన్నమాట. చంచలత్వము సహజము. మనస్సును నిగ్రహించుట దుస్తరమే. ఐనను ప్రాణ సంయోగముంటేనే గాని మనస్సు పనిచేయలేదు. గాఢసుషుప్తియందు మనస్సునకు ప్రాణముతో చేరిక లేకపోవుటయే మనస్సున కేకాగ్రత యెందుకుండరాదు? అంటే, మనస్సు సంస్కారముల మూట అయివున్నది. నానాకర్మజ

వాసనాన్వితమైయున్నది. ఆయా కర్మవాసనల ప్రేరేపణచే మనస్సు శబ్దస్పర్శాది విషయములపైకి పరుగులిడుచున్నది. విషయముల యందు వైరాగ్యము, వున్నచో, మనస్సు వానిపైకి పరుగులిడజాలదు. కాని అనుభవములో చూచినచో సుఖప్రాప్తికిగాని దుఃఖనివృత్తికిగాని ఎంతమాత్రము ప్రయోజనకారిగాదు. క్షుద్ర విషయములపైకి గూడ మనస్సు ప్రసరించుచున్నదే. ఉదాహరణకు, పెరటిదొడ్డిలో ఏమూలనో పడియున్న పెంటచేట. చీపురుకట్ట పగైరాలు తలపులోనికి రావలసిన పనియేమి? ప్రయోజనముతో నిమిత్తము లేకనే పరుగులిడు చుండుట మనస్సునకు నైజగుణము, సహజ స్వభావమూను, నైజగుణమునకూ గ్రుడ్డి కంటకి, మందులేదనీ, పుట్టుకతో పుట్టిన బుద్ధి పుడకలతోగాని పోదనీ అంటారు. అట్లే విక్షేపమూ, చాంచల్యమూ సహజ స్వభావములుగా గల్గిన మనస్సు యొక్క వ్యాధికి మందేలేదు. ఐనను "తారకంబు మనశ్శుద్ధి కారకంబు" అని కొందరంటే, అందువల్ల మనోదోషము శాశ్వతముగా నివృత్తి యగుట లేదని యోచించి దాని నంగీకరించక, మనోనాశమే (అమనస్కం) కావాలని కొందరన్నారు. పోనీ, మనస్సంటే నేమి? దానియందలి వాసనలు లేకుండా చేస్తే, కోరలు తీసిన త్రాచువలె, అది నిర్వీర్యమై నిరపాయముగునేమో అనుకుంటే, కోరలు లేకున్నా బుస్సుమని మీద కురికే త్రాచువలె మనస్సు. పైన దెల్పిన వుదాహరణములో వలె నిరర్థక విషయములపై నురుకుచుండును. సుగంధ దుర్గంధములులేని వాయువువలె శుభాశుభవాసనలులేని మనస్సుండుటకు సావకాశముండునని అనుకొన్నా ఆత్మవస్తు సాక్షాత్కారము కలుగనిచో సంచిత కర్మవాసనలు క్షయించవు. ఈ విధంగా యోచించి కొందరు అమనస్కం తప్ప గత్యంతరము లేదన్నారు. అందుకు యోగము సాధనగా చెప్పినారు. ఆయోగము రెండు విధములు.

1) అభ్యాస యోగము 2) జ్ఞానయోగము. మంత్ర, లయ, హఠ, రాజయోగములలో మొదటి మూటియందు ప్రాణాయామ మొక ముఖ్యాంగము. అభ్యాసయోగమనగా ప్రాణాయామమేనని రూఢ్యర్థమేర్పడినది. రాజయోగమే జ్ఞానయోగము.

ఈ అభ్యాసయోగము ఎట్లు బాధాకరమైయున్నదో యీ శ్లోకముద్ఘాటించుచున్నది.

1) దీర్ఘకాల విమలైః అనగా చిరకాలాభ్యాసమునగాని నిర్దుష్టమగు యోగ మార్గమే చేకూరదు. అట్టి యోగము చిరకాల మభ్యసించిననే తప్ప చిత్త వృత్తి నిరోధము చేకూరదు.

2) యోగ పద్ధతులు ఒక్కొక్కప్పుడు వ్యాధి ప్రదములగును. గురుని సమక్షంలో నిర్దుష్టముగా నభ్యసింపనిచో రోగమును తెచ్చిపెట్టును. రోగములు స్థూలదేహమునకే పరిమితములు కావు. యింద్రియ సంబంధమగు అంధత్వ మూకత్వ బధిరత్వములు. మనోరుగ్మతలు, సూక్ష్మ దేహ సంబంధములు. అంతఃకరణమున అహంకారభిమానములు పెనగొనుట. అష్ట సిద్ధులయందు యితర మహత్తులయందు కోరికలుదయించి నూతన సంస్కారములు ఏర్పడుట మొదలగునవి కారణ శరీర సంబంధములు.

3) దుష్కరైః = మిగుల కష్టముతో గూడినవి.

4) దుఃఖాత్మకైః = శరీర మనస్సులకు బాధాకరములు

5) దుర్జయైః = జయింపరానివి నయి యున్నవి. ఈ యోగ సాధనలు లేక జ్ఞాన

సాధనలు కాకుండా మరికొందరు కృఛ్ర చాంద్రాయణాది వ్రతములతో గూడిన కర్మసాధనలు గావింతురు. దానివలననే మనోనిశ్చలత చేకూరునని వారియుద్దేశము. దేహము, యింద్రియములు బలముగానున్నపుడు ఆవరణ విక్షేప శక్తులున్ను బలీయముగా నుండును. అన్నముయొక్క సూక్ష్మాంశము మనస్సు, శరీరమునకు బలవర్ధకములగు ఆహారపానీయము లొసంగిన మనస్సునకున్ను బలముకలుగును. లంఖణములు చేసిన వాని మనస్సుకూడా దుర్భలత్వముగా నుండును గదా! కృఛ్ర చాంద్రాయణాది వ్రత, ఉపవాస తపో క్లేశములచే శరీరమున, దానితోబాటు మనస్సున్ను దుర్భలమై చిత్తవిక్షేపము కూడ క్షీణించునవి. వీరియాశయమై వుండవచ్చును. స్థూల శరీరమునకు వృద్ధాప్యము వున్నది. గాని సూక్ష్మశరీరమునకు వృద్ధాప్యము లేదు కామనా వాసనలు ఎట్లు క్షీణింపవో అట్లే శరీరబలముతోపాటు మనోబలము క్షీణించుటతో సుఖ దుఃఖాది సహిష్టుత, స్మృతి జ్ఞానము, తర్కపాటవము మొదలగునవి తగ్గునేకాని మనస్సునందలి శుభాశుభవాసనలుగాని చిత్త విక్షేపముగాని క్షీణించవు.

అభ్యాసమని శ్రీకృష్ణుడు చెప్పిన యుపాయమునకు ప్రాణాయామాది సాధనలతో గూడిన అభ్యాసయోగమేనని అర్థముచెప్పరాదు. ఏలననగా మనస్సును నిగ్రహించుట వాయువు నరికట్టవలె సుదుష్కరం అని అర్జునుడే అంటూంటే, ప్రాణాయామముతో గూడిన అభ్యాసయోగమునే శ్రీకృష్ణుడు పాయముగా చెప్పునా? యిసుకరేణువులను లెక్కించుటెంతకష్టమో, నక్షత్రములను లెక్కించుటయు నంత కష్టమని ఒకడంటే, ఈ గుప్పెడిసుక రేణువులను లెక్కించు నక్షత్రాల సంఖ్య నీకే తెలుస్తుంది అన్నంత హస్యాస్పదముగా వుంటుంది.

పోనీ ఎంత కష్టసాధ్యమైనా ప్రాణాయామాది క్రియలచే సమాధిని సాధించి మనో విక్షేపమును నిరోధించగల్గినా యోగమునందున్నంత వరకే మనస్సు నిలుచుచున్నది. అనంతరము పూర్వపు చలనత్వమునే చెందుచున్నది. ఇది మనోనాశమా? యిదే అమనస్కమా? ఇదే అ మనస్కమయితే సమాధి నుంచి లేచినపుడు మనస్సు తిరిగి ఎట్లు వచ్చును? సమాధి కాలమున మనస్సు లేకపోలేదు. కాని నిష్క్రియమై యుండును. ఇట్టి మనస్సుతో సాధకుని కేమి ప్రయోజనము? ఇష్ట వస్తువుపై మనస్సు లగ్నమై ఏకాగ్రత వహించవలెననికదా సాధకుని ప్రయత్నము. మనస్సును జడము గావించినచో సాధకుని కాశయ సంసిద్ధి ఎట్లు చేకూరగలదు? కనుక అభ్యాసయోగములో జడసమాధిని సాధించుటవలన ఏమి ప్రయోజనము లేదు.

ఇక రాజయోగము (జ్ఞానయోగము) చే అనగా పంచదశజ్ఞానాంగములచే అఖండ బ్రహ్మాకారవృత్తిని సాధించి మనస్సు సంకల్ప వికల్పాత్మకమైన తన స్వరూపమును గోల్పోవుటయే జ్ఞానామనస్కమని చెప్పబడుచున్నది. ఈ పద్ధతి యందుగూడ రెండు దోషములున్నవి.

1) తన స్వరూపము బ్రహ్మముకంటె భిన్నముగాదు అట్టి బ్రహ్మము తెలియవలెనన్న వస్తునిశ్చయరూపంగా తనకాత్మసాక్షాత్కారము గలిగిన గానీ అఖండ బ్రహ్మాకారవృత్తి గలుగదు. వస్తునిశ్చయము లేనిచో మనస్సు ఆ వస్తువునందు లగ్నమై తదాకారతము ఎట్లు కాగలదు? వస్తు నిశ్చయములేని యీ జ్ఞాన సాధన చీకటిలో చిందులాటయే కాగలదు. 2) ఎట్లో ఎప్పటికో వస్తు నిశ్చయ జ్ఞానం కల్గినను ప్రాణధర్మమైన ఆకలి దప్పుల బాధించుటవలన అఖండ

బ్రహ్మాకారవృత్తి నిలువదు. కనుక మనస్సు తాత్కాలికముగా బ్రహ్మాకారము చెందినా యధాస్థితి వెనువెంటనే తిరిగివచ్చి విషయాక్రాంతమగుచున్నది. నిర్విషయత్వముగాని మనోనాశముగాని యీ పద్ధతి రాజయోగము వలన కూడ సిద్ధించుటలేదు. కనుక కర్మ, యోగ, జ్ఞాన సాధనలన్నియు నిరసించి గురుని సేవించి కృతార్థుడవుకమ్మని సిద్ధాంత మార్గముపదేశించుచున్నది.

2) సేవేతచ్చైకం గురుం : గురుమూర్తి నొక్కనినే సేవించమని యర్థము. గురువు నొక్కనినే అని నొక్కివక్కాణింపనేల అంటే గురుస్వరూపమే సర్వమునై యున్నది. గురువు కంటే నన్యంలేదు అని తెలిసినపుడు గురుస్వరూపమునే వుపాసించవలె. మరియు వుపాస్యశబ్దమునకు నిరాలంబోపనిషత్తు "ఉపాస్యయితిచ సర్వశరీరస్థ చైతన్య బ్రహ్మాప్రాపకో గురురుపాస్యః" అనగా సర్వ శరీరములయందూ నున్న చైతన్య బ్రహ్మమును ప్రాప్తింపచేయు గురువేవుపాసింపదగినవాడు. అట్టి గురూపాసన వలననే అట్ట చైతన్య బ్రహ్మ సాక్షాత్కారము కాగలదు. కనుకనే గురువు నొక్కనినే అనిశ (యెల్లప్పుడును) వుపాసించవలెను. అని యీ శ్లోక ముద్ఘాటించుచున్నది.

అనిశం అనుటలో జాగ్రదావస్థలోనున్న కాలమంతయు "పానీయంబులు ద్రావుచున్, గుడుచుచున్, భాషించుచున్, హాసలీలా నిద్రాదులు సేయుచున్" ప్రహ్లాదుడెట్లు నారాయణుని సేవించెనో అట్లు సేవించవలెనని భావము. అట్లే విధమైన కర్మ చేసినా "యద్యత్కర్మ కరోమితత్త దఖిలం శంభోతవారాధనం" అన్నట్లు చేసిన పనులన్నియు భగవదారాధనలో భాగమే అగుచుండును. **"Work is Worship"** అనగా యిట్టి కర్మయే వుపాసన కాగలదు.

3) తత్సహజస్వభావం = స్వరూప జ్ఞానము శిష్యులకు కల్గించుటయే గురుని స్వభావము. గురువు సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడు. ఆత్మ ప్రకాశముతో అతని మనోవాక్శ రీరములు తొణికిసలాడుచుండును. స్పర్శమణి సన్నిధానమున యినుము బంగారము కాగల్గి నట్లు గురుసన్నిధాన మాత్రమున శిష్యునికి స్వరూప జ్ఞాన ముదయించ గలదు. "యస్య సన్నిధి మాత్రేణ చిదానందాయతేనమః" అని గురుగీత అన్యత్రా వుద్ఘాటించుచున్నది. సూర్య చంద్ర నక్షత్రాదులకు సహితం ప్రకాశమునను గ్రహించునది ఆ పరమాత్మ ప్రకాశమే. తాను ప్రకాశించి యితరమును ప్రకాశింపచేయుటయే దాని సహజ స్వభావము కనుకనే అది చిద్ఘనమని ప్రజ్ఞానఘనమని కీర్తింపబడుచున్నవి.

4) యస్మిన్నభ్యుదితే = మనస్సును చలింపచేయు ప్రాణము ఎంత బలీయమై యున్ననూ స్వస్వరూప జ్ఞాన ముదయించినచో తాను చలింపక యితరమును చలింపచేయనేరక నిర్వీర్యమైపోవును. మనోచలనమును దానికి కారణమైన ప్రాణచలనమును గూడ నణగించు ఆస్వరూప జ్ఞాన మెట్లు కల్గుచున్నది? గ్రంథములవలనగాని, సాధనల వల్లగాని చిక్కదు. గురుముఖతః అనగా గురు ప్రబోధ మాత్రము చేతనే తప్ప అన్యథా జ్ఞాతవ్యము కాజాలదు. "గురూపదిష్ట మార్గేణ మనశ్శుద్ధింతు కారయేత్" అని గురుగీతయే వేరొకచో చెప్పుచున్నది. గురూపదేశమనగా కేవలం మంత్రోపదేశముకాదు. "సదమల గురువెవరనినను, యిదిగో బయలిదిగో లేని యీ గుర్తెరిగేటిదగు శరీరము దీనిని వదలుమనుచు నీకు చెప్పవచ్చినవారే"

అని నిర్ణయము. వస్తువును ప్రత్యక్షముగా చూపి ప్రబోధచే దానిని శిష్యుని కారూఢత గావించుటయే వుపదేశము గురువుచూపిన వస్తువే ఆత్మ లేక బ్రహ్మము అని ఆరూఢ జ్ఞాన ముదయించినపుడే ప్రాణచలనము నశించుచున్నది. "ఆశ్చర్యవ పశ్యతి కశ్చి దేనం" దానిని అత్యాశ్చర్యముగా జ్ఞాన చక్షువు గ్రహించుటలో దృఙ్మనోప్రాణములు మూటి వ్యవహారము స్తంభించి నిశ్చలములైపోవుచున్నవి. సమాధిలోవలెనే ప్రాణచలనము నిలచునేమో గాని మరల చలింపకుండునా? వినశ్యతి అని పదప్రయోగ మేల చేసినారు? అని ముఖ్యమైన సందేహ మొకటి కలుగుచున్నది.

మనఃప్రాణముల చలనమునకు మూలకారణము జ్ఞానస్వరూపమైన పరమాత్మయే. అది చలాచల ద్వంద్వలక్షణములు కల్గియున్నది. మనఃప్రాణము లున్నప్పటికీ యవి నిర్వీర్యమై నిరపాయమై బంధ కారణములుగా నుండును. ఇదే సహజామనస్క రాజయోగము. ఈ యోగం కేవలం గురుకృపాసంసిద్ధి వలన గాక కలుగదు. కనుక "సేవేత చైకం గురుం" అంటోంది యీ శ్లోకం.

ఇపుడీదృష్టితో, శ్రీకృష్ణభగవానుడు ప్రతిపాదించిన అభ్యాస వైరాగ్యము లేవియో విచారించవలెను. గురుభక్తి, గురుసేవ, గురుమంత్ర, గురునిష్ట లహర్నిశము అభ్యసించుటయే అభ్యాసము. అపుడు శిష్యుడొనర్చు సకల కర్మలు గురుసేవాకార్యములో భాగములే యగును. సకల సుఖదుఃఖములు వస్తునిష్ఠములని అజ్ఞానముచే భ్రాంతిచెంది వస్తువుల యందిష్టానిష్టము లను (రాగద్వేషములు) పెంపుచేసుకొని, ఆయా వస్తుప్రాప్తి యందు సుఖమునూ, అప్రాప్తి యందు దుఃఖమునూ పొందుచున్నట్లు మానవులపోహ చెందుచున్నారు. వస్తు త్యాగమే వైరాగ్యమని భావించబడుచున్నది. యిట్టి త్యాగము బలాత్కారముగా అవలంభింపవలసినదే తప్ప సహజ సిద్ధముగాదు. నిజమగు వైరాగ్యమేది? అంటే వస్తువులయందు రాగద్వేషము లెందుకు కలుగుచున్నవో విచారించిచూస్తే తనయందు తనకున్న అనురాగముచేతనే కలుగుచున్నట్లు స్పష్టము. మనఃప్రాణముల చలనమునకు మూలకారణము జ్ఞానస్వరూపమైన పరమాత్మయే. అది చలాచల ద్వంద్వలక్షణములు కల్గియున్నది. దాని అచలత్వమును కనుగొన్నపుడే దాని కార్యరూపమగు మనఃప్రాణచలనములు లేకపోవుచున్నవి. మనస్సపుడు తన నామరూపాలు గోల్పోయి తానున్ను ఆ అఖండాత్మ యగుచున్నది. అది ఆ అచల లక్షణములు వీడి చలించినపుడు తానున్ను చలించుచున్నది. ఈ అచలస్థితి కూడా తాత్కాలికమే. చలనమనేది. యెన్నడూ యెరుగని కేవలం అచలస్థితి కలిగిన దొక్క అచల పరిపూర్ణ పరబ్రహ్మమే. అందు చలాచల ద్వంద్వ లక్షణములు గల వస్తువు (యెరుక) లేనేలేదు. అను పూర్ణబోధచే తప్ప ప్రాణచలనమున కునికి లేకుండాపోదు. యెండమావులయందు జలము తోచుచున్ననూ, అది జలము కానేకాదు. జలము లేనేలేదు అను నిశ్చయజ్ఞానముచే, ఆ జలము వల్ల దాహోపశ మనము కాగలదను భ్రాంతి నశించిన రీతిగా, చలాచల ద్వంద్వలక్షణములుగల పరమాత్మయు, దానికార్యములగు మనఃప్రాణములును, సర్వజగత్తున్ను తోచుచున్నా లేనేలేవు అనే దృఢ నిశ్చయజ్ఞానము పరిపూర్ణ బోధచే గురువు కల్గించుట రీత్యా శిష్యునికీ సర్వభ్రాంతి రహితము

చేకూరుచున్నది. అప్పుడుగాని కోర్కెలు పూర్తిగా నశింపవు అని తేటతెల్లమగుచున్నది. ఈ విషయమే బృహదారణ్యకమునందుకూడా వివరింపబడియున్నది. "ఆత్మవస్తుకామాయ సర్వం ప్రియం భవతి" అనుశ్రుతి సిద్ధాంతము చేసినది. సర్వ రాగద్వేషములకు మూలకారణమైన నేను అను ఆత్మయందు అనురాగాభిమానములు వదలుకొనుటయే వైరాగ్యముగాని వస్తువులను ద్వేషించి వానిని వదలుట వైరాగ్యం కాదు. ఆత్మయందలి ప్రేమ నశించుటే నిజమగు స్వార్థ త్యాగము. ఇదియే సహజా మనస్క రాజయోగము. యిట్టి రాజయోగము పరిపూర్ణ బోధ వలన మాత్రమే చేకూరగలదు. శ్రీ కృష్ణభగవానుడుపదేశించిన అభ్యాస వైరాగ్యము లివియేయని తెలియనగును.

ఇట్టి అభ్యాస వైరాగ్యములు మాయందు నెలకొనునట్లు అనుగ్రహాశీర్వాదములు ప్రసాదించమని శ్రీ గురుపరమాత్మను అహరహము ప్రార్థింతుము గాక!

శ్లో॥ నవాయ నవరూపాయ, పరమార్థైక రూపిణే
సర్వజ్ఞాన తమోభేద భానవే చిద్ఘనాయతేనమః॥

తాత్పర్యము : తొమ్మిది విధములైనవాడును నూతనమైన (అపూర్వమైన) స్వరూపము గలిగి ఎప్పటికప్పుడు, వినూత్నములగు రూపములు ధరించువాడును, సర్వాతీతమగు శ్రేష్టమగు రూపమే నిజరూపముగా గలవాడును, చిమ్మచీకట్లతో పోల్చదగిన అజ్ఞాన సర్వస్వమును భేధించుటకు సూర్యునివంటి వాడును, కరడుకట్టిన జ్ఞానమే నిజస్వరూపముగా గలవాడును అగు ఆ గురుమూర్తికి నమస్కరించుచున్నాను.

విశేష వివరణము : ఈ శ్లోకములో గురుస్వరూప మభివర్ణింపబడినది.

1) నవాయ : నవ అనగా తొమ్మిది అను సంఖ్యారూపమగు అర్థమున్ను గలదు. సృష్టికి పూర్వం "సదేవ సోమ్యేఇద మగ్ర ఆసీత్" అనీ "ఏకమేవాఽద్వితీయం బ్రహ్మ" అని చెప్పబడిన ఏకైక సద్రూపమగు పరమాత్మ తొమ్మిది విధములైనది. నవవిధ ప్రకృతులు, నవద్రవ్యములు, నవగ్రహములు, నవచక్రములు, నవశక్తులు, నవరత్నములు, నవ ఖండములు మొదలైన తొమ్మిదేసి రూపములు వహించినది.

సంఖ్యానీకములో, అనగా అంకెలలో, 1నుంచి 9 వరకు సంఖ్య లున్నవి. అనగా 0,1,2,3 వగైరా తొమ్మిది వరకు యున్నవి. 1 లగాయితు 9 వరకు సృష్టికి సంబంధించి ఆ సున్న నుండియే వచ్చినవి. ఒకటి అనే అంకెకు పూర్వమున్న సున్నను కొందరు అసత్తు శూన్యము అన్నారు. కొందరు అది శూన్యముగాదు పూర్ణము, సత్తు అన్నారు. సున్న అనే మాటకు శూన్యమనేది సంస్కృత శబ్దము. ఆ వస్తువు సత్తూ అయివున్నది. అసత్తూ అయివున్నది. ఈ ద్వంద్వ స్వరూపముగా వున్న సృష్టి కారణమగు బ్రహ్మము సత్యమైనదీ మనోవాక్కుల కగోచరమైనదీయగు పరిపూర్ణ పరబ్రహ్మము కానేరదు. "నసత్తన్ నాస దుచ్యతే" అనగా అది సత్తూకాదు. అసత్తూకాదు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మము సదసద్రహితమైనదని అచల ఋషులు నిర్ణయించిన్నారు. ఇంతకూ తొమ్మిది రూపములుగా పరిణమించేది, ఆ పరమాత్మయే నని

తెలియవలెను. "నవో నవోభవతి" అంటూ శ్రుతియున్నూ పలుకుచున్నది.

2) నవరూపాయ : సృష్టి కారణమగు ఆ పరమాత్మ స్వరూపము అపూర్వము, అపురూపము, అట్టిరూప మెక్కడను లేదన్న మాట. ఈ మహా విశ్వములో ఒక వస్తువునకును, మరొక వస్తువునకును యెక్కడో యేదేని యొకానొక భేద ముండియే తీరును. భేదమే లేనిచో ప్రపంచమేలేదు. భేదమే విశ్వమన జెల్లును. విశ్వమంతటను భేదమే గానవచ్చును. సత్వ, రజ,తమస్సులను మూడు గుణములు సామ్యావస్థలో నున్నపుడు సృష్టియేలేదు. ఆ గుణవైషమ్యము కల్గినపుడే సృష్టి అగుచున్నది. సత్వగుణాధిక్యతచే దేవతా సృష్టి, రజోగుణాధిక్యతచే జీవసృష్టి, తమోగుణాధిక్యతచే భూతసృష్టి జరిగినదని చెప్పబడుచున్నది. విషమత్వమునందే సృష్టి. మరియు ప్రతి వస్తువునందునూ త్రిగుణము లుండును. త్రిగుణములపాళ్ళు భిన్నభిన్నముగా నుండుట వల్ల ఏ రెండు వస్తువులు తీసుకొన్నా ఏదో వ్యత్యాస ముంటూనే వుండును. గుణభేధముచేతనే రూపభేద మేర్పడుచున్నది. మూల ప్రకృతి త్రిగుణ సామ్యావస్థయనీ, మాయాపరిణామమే యీ జగత్తనీ కొందరందురు. కాని అది సరికాదు. త్రిగుణములు బీజరూపములో మహా సూక్ష్మాతి సూక్ష్మమై అది కేవలం నిర్గుణ వస్తువు అని భ్రాంతి కల్గింప చేయు అధిష్టాన చేతన పరబ్రహ్మమునందు త్రిగుణములు అత్యంత సామ్యావస్థలో నున్నవనీ, ప్రకృతి స్థానమందు అవి వికాసము చెందునవనీ చెప్పనగును. "యతోవా యిమాని భూతాని జాయంతే........" అంటూ తైత్తిరీయ శ్రుతియున్నూ, "భూతయోని" అని చెప్పదగినది ఆ బ్రహ్మమేనని వ్యాస సూత్రములు ఘోషించు చున్నవి. ఆ పరమాత్మ స్వరూపమే ఏకము, అద్వితీయము, అపూర్వమైన స్వరూపము గల్గినదియునై యున్నది. మరియు నిరవయవస్థితి యందు భేదము గానరాదు. ఎంతసూక్ష్మమో అంత నిరవయవము, పరమాత్మ కంటే సూక్ష్మాతి సూక్ష్మమేమికలదు? కనుకనే అది "అణోరణీయాన్" అని అభివర్ణింప బడినది.

అట్టి పరమాత్మ ఎప్పటికప్పడు కొంగ్రొత్త స్వరూపములను దాల్చుచునేయున్నాడు. ఒక వేషమునకును మరొక వేషమునకును ఏదో తారతమ్యం వుంటూనే వున్నది. ప్రధమ సృష్టి అనేదాన్ని యూహించగలిగితే, ఆనాటినుండి నేటి వరకూ సృష్టియయిన వానిలో నొకదానివంటిది మరొకటిలేదు. అట్లే భావికాలమునందుద్భుతమయ్యే వానిలోకూడా తారతమ్యము లుండక తప్పదు. సరిక్రొత్త రూపములు ఎప్పటి కప్పడే ధరిస్తున్నాడు. కనుక "నవరూపాయ" అని అభివర్ణింపబడినాడు.

3) పరమార్థైక రూపిణే : పై విధంగా అనంతములూ, అసంఖ్యాకములూ అయిన ఎన్ని వినూత్న రూపములెత్తుచుండినా ఆ పరమాత్మ తొలి స్వరూప లక్షణంలో మాత్రం బేధం లేదు. మార్పులేదు. అది యేకైక రూపమే. "తత్సృష్ట్వాః తదేవాను ప్రావిశత్" అని చెప్పబడినరీతిగా యెన్ని సృష్టించినా, ఆ యన్నిటియందూ తానే సూక్ష్మరూపంగా ప్రవేశించి యున్నాడు. అంతేకాదు, ఆదిశంకరులు చెప్పినట్లు "యధా మృణ్మయో కుంభం, తద్వత్ దేహోపి చిన్మయః" అనగా కుండయందంతటా మట్టియే యెట్లున్నదో అట్లే దేహమంతా చిన్మయస్వరూపమే అయివున్నది

అని భావము. ఎంత మార్పుపున్నా అది ఔపాధికమే గాని మూల పదార్థము అనగా ఆ పరమాత్మ స్వరూపం మాత్రం మారక ఏకరూపంగా యుంటూనే యున్నది. అది ఏ మాత్రమూ వికృతి పొందుటలేదు. ఈ వాదమే అవికృత పరిణామ వాదమని శాస్త్రములలో పేరొందినది.

4) సర్వజ్ఞాన తమోభేద భానవే : అజ్ఞాన సర్వస్వమును తన జ్ఞానదీధీతులచే పటాపంచలు చేసెడివాడు అని అర్థము. అజ్ఞానము గాఢతమస్సు (చీకటి) తోను, జ్ఞానము ప్రకాశముతోను పోల్చబడుతూ వున్నది. అజ్ఞానము కోటగోడవలె దుర్భేద్యముగా నున్నది. అట్టి కోట గోడను భేదించుట కొక్కటే ఆయుధ మున్నది. అదే జ్ఞానము, గాఢమగు చీకటి తెరలు తనచేయి తనకే గానరానంతటి దట్టముగా వ్యాపించి నప్పటికి ఎంత చిన్నదీపమైనా అంతంత మాత్రముగా తొలగించుటకు సమర్థవంతమై యుండగా అత్యుత్కృష్ట ప్రకాశముగల సూర్యునికి ఆ చీకట్లను భేదించుట కేమైన అడ్డుఉండునా? అట్లే "అజ్ఞానేనా వృతం జ్ఞానం తేనముహ్యంతి జంతవః" అనగా అజ్ఞానముచే ప్రజ్ఞాన ఘనుడగు పరమాత్మ కప్పబడి తెలియరాకున్నాడు. గురుకృపా ప్రసాదముచే ఆ యజ్ఞానావరణ తొలగిపోగా ఆవరించిన మబ్బు తొలగుట తోనే సూర్యుడు దుర్నిరీక్ష్యుండై ప్రకాశించునట్లు అఖండజ్ఞాన స్వరూపుడగు పరమాత్మ ప్రకాశించుచున్నాడు. ఆ అజ్ఞానపు మబ్బు చీకట్లను బేధించుటకు గురువే సమర్థుడని భావము.

5) చిద్ఘనాయ = పరమాత్మ సత్, చిత్, ఆనంద స్వరూపములను స్వలక్షణముగా గలవాడు, స్వలక్షణ మనగా అవి ఆ వస్తువుయొక్క సహజ లక్షణములనిన్నీ ఆ లక్షణము లా వస్తువును యెన్నడు యెడబాసి యుండవనిన్నీ అర్థము. చిత్ + ఘనము = చిద్ఘనము. చిత్ అనగా జ్ఞానము ఘనీభవించి యుండుట అనగా గడ్డకట్టియుండుట, ఐతే యిక్కడొక సందేహము కలుగవచ్చును. ఆ విధంగా అది చిద్ఘనమే, జ్ఞానంతో పూర్తిగా నిండివుండే ఆ పరమాత్మనే సద్ఘనమనీ, ఆనంద ఘనమనీ కూడ ఎందుకంటారు? ఒకదానితోనే అది నిండి యుంటే మిగతారెంటికి తావేది అని సంశయం కలుగవచ్చును. కాని యీ సత్‌చిత్ ఆనంద ములు. భాతిసిద్ధములు మాత్రమే అయివున్నవిగాని భౌతిక పదార్థములు గావు అని తెలుసు కొంటే సరిపోతుంది. ఏదో ఒక లక్షణమును పురస్కరించుకొని ఆ లక్షణము దృష్ట్యా పలుకుట మాత్రమే నన్నమాట. వేడి వెలుగు అనునవి యెండయొక్క లక్షణములు, యెండలు మండిపోవు చున్నవి అనేమాట యెండ దుర్నిరీక్ష్యమై ప్రకాశించుచున్నది అను మాటకు విరుద్ధమేమీ లేదుకదా!

గురుస్వరూపము, పరమాత్మ స్వరూపమే గాని భిన్నముగాదు. ఆ గురుస్వరూపము ఎంతో అపూర్వము. విభిన్నములు, అనంతములును, చిత్రాతి చిత్రములును అగు రూపములెత్తు చున్నది. ఐనను అది మహోపరిశుద్ధముగా సర్వమునందు వ్యాపించియున్నది. అదే సగుణ రూపమై అజ్ఞానతిమిరాంధులై పూర్వపుణ్య విశేషమున తన్నాశ్రయించిన సచ్ఛిష్యులకు జ్ఞానప్రభాప్రదానము చేసి తనస్వరూపమును అపరోక్షం గావించుచున్నది. అట్టి సద్గురు స్వరూపమును నిరంతరం ధ్యానించుచుందుము గాక!

శ్లో॥ నవాయ, నవరూపాయ, పరమార్థైక రూపిణే
సర్వాజ్ఞాన తమోభేద భానవే చిద్ఘనాయతే॥

తాత్పర్యము : ఎప్పటికప్పుడు నూతన శోభా విలాసములచే నొప్పువాడవును, నవవిధ రూపములుగా నైనవాడవును, వస్తువులలో కెల్ల నుత్తమమైన వస్తురూపమెుక్కటియే స్వస్వరూపముగా గలవాడవును సమస్తమైన అజ్ఞానపు చీకట్లను బేధించుటకు సూర్యునివంటి వాడవును. రాశీభూతమైన జ్ఞానతేజస్సు గల్గినవాడవును అగు నీకు (నమస్కరించుచున్నాను)

విశేష వివరణములు : 1) నవాయ 2) నవరూపాయ 3) సర్వాజ్ఞాన తమోభేదభానవే 4) పరమార్థిక రూపిణే 5) చిద్ఘనాయ అను శబ్దములను వివరించి తెలిసికొనవలసియున్నది.

1) నవాయ : నిత్య నూతనమైనవాడు. విశ్వమునందేదియూ స్థిరముగా లేదు. ప్రతీక్షణమూ, ప్రతివస్తువూ మార్పు చెందుచునే వున్నది. స్థిరముగా నున్నట్లు చెప్పబడే సూర్యుడు, ఆ సూర్యుని చుట్టూ పరిభ్రమించు గ్రహములూ, వానివాని నుండి వెలువడు కాంతి పుంజములు అన్నియు నిజముగా చలనశీలములై యున్నవి. సెకనుకు కొన్ని వేల మైళ్ళ చొప్పున కాంతి కిరణములు ప్రయాణము సాగించుచున్నవని విజ్ఞాన శాస్త్రము మనకు తెలియచేయు చున్నది. కాంతితో పాటు ఆ కాంతికిరణములయందలి వేడిమియున్ను ప్రయాణము చేయునుగదా! ఇట్లు పయనించి బైటికి పోవుచున్న వేడి వెలుగుల స్థానే మూలస్థానమున కొంగ్రొత్త వేడిమి వెలుగులు కలిగి పూరించుచున్నవి. నదీ ప్రవాహములయందలి జలములు ప్రతిక్షణము ముందుకు సాగిపోవుచు సముద్రమును చేరుచున్నవి. వాని స్థానే క్రొత్త నీరు వచ్చి చేరుచున్నది. ప్రతి వస్తువున్ను పరమాణువుల సంయోగంచే యేర్పడినట్లు ప్రత్యక్షముగా గానవచ్చుచున్నది. ఆ పరమాణువులు నిరంతర చలన శీలములై ప్రతిక్షణమూ అందు కొన్ని వస్తువులను విడచిపోవుచుండగా దాని స్థానే నూతన పరమాణువులు వచ్చి వస్తువునందు చేరుచున్నవి.

సూక్ష్మాతి సూక్ష్మముగా సర్వ వస్తువులయందు నిరంతరమున్ను జరుగుచుండు నీ మార్పును గమనించలేకున్నాము. నదీ ప్రవాహోదకము సముద్రము వైపు పరుగిడుచున్నట్లు చూచుచున్ననూ ఈక్షణమున చూచినది మరుక్షణము లేదు అనే సత్యము సాధారణముగా మనకు స్ఫురించుటలేదు. అట్లే యీ క్షణమున చూచిన స్థూలదేహము మరుక్షణమున లేదు. పాత జీవాణువులు శరీరమునుండి పోవుట తత్స్థానే క్రొత్తవివచ్చి చేరుట మనము గమనించక ఆ శరీరమును పూర్వనామముచేతనే వ్యవహరించుచున్నాము. కాని పూర్వదేహము పోయినది. వర్తమాన శరీరము నూతనమైనదేగాని పాతదిగాదు. మరో క్షణములో వర్తమాన శరీరముపోయి మరొకటిగా మార్పు చెందుచున్నది. కాలముతో సమానవేగముగల యీ మార్పులను స్థూల పదార్థములయందు గుర్తించుటయే యింత కష్టముగా నుండగా సూక్ష్మరూపముగ యింద్రియ, ప్రాణ, మనో, ఆత్మలయందుగూడ జరుగు మార్పులను గమనించుట ఎంతకష్టము? ఐనను అట్టి మార్పు లేనే లేదని మాత్రం యనజాలముగదా! ఇంద్రియ మనంబుల కేకాగ్రత లేకుండు టకు వానియందుకూడా నున్న యీ నిరంతర చలనమే కారణమని రూఢిగా చెప్పనగును. ఐతే ఆత్మకు, ఆత్మ ప్రకాశమునకు గూడ యీ చలనమున్నదా? విజ్ఞాన దృష్టిచే విలోకించినచో తప్పక నున్నదనియే చెప్పనగును. అవస్థాంతరములయందు జ్ఞాన మెన్నిమార్పులు

చెందుచున్నదో మనము తేలికగా గమనించగలుగుచున్నాము. తురీయావస్థయందున్న నిర్విషయజ్ఞానము గూడా మార్పుచెందుటచేతనే గదా వికల్పము చెందుచున్నది? సంకల్ప వికల్పములు సవికల్ప నిర్వికల్పములు మొదలగునవెన్నియో అంతరాంతర పరిచ్ఛేద విభజనలకు తావిచ్చుంచుడగా జ్ఞానమునందు మార్పులేదనుట ఎట్లు? ఈ జ్ఞానమే, అజ్ఞానము. సుజ్ఞానము, శుద్ధజ్ఞానము, విజ్ఞానము, పరోక్షజ్ఞానము, ప్రత్యక్ష జ్ఞానము, అనుభవజ్ఞానము లేక అపరోక్ష జ్ఞానము మొదలగు నానా నామపూర్వకములగు మార్పులను చెందుచున్నది. ఇవన్నీ పర్యాయపదములు గావుగదా! జ్ఞానమందలి యేదేని యొక విశిష్ఠ లక్షణమును పురస్కరించుకొనియే యీ నానా నామములు గల్గినవి. స్వరూప స్వభావములయందు మార్పుకలిగినపుడు ఒక నూతననామ మవసరమగు చుండును. ఈ జ్ఞానమే నేనను వస్తువు.

కం॥ జ్ఞానము నేనన నొక్కటే
జ్ఞానమునే వేరటంచు గనబోకుసుమీ
జ్ఞానము వచ్చును బోవును,
జ్ఞానాతీతమును దాను గాంచిన దాకన్॥ అని సెలవిచ్చినారు. ఈ జ్ఞానమే సచ్చిదానంద రూపమగు ఆత్మ. ఆత్మయే సృష్టికి పూర్వము బ్రహ్మమని చెప్పబడి "ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ" యని పేరొందినది.

కనుక సృష్టికి కారణకార్యములుగానున్న ఆ బ్రహ్మ వస్తువే "ఏకం అనేకం భవతి" అని చెప్పబడినరీతిగా అధోరూపపరిణామము చెందుచూ, తిరిగి "అనేకం యేకం భవతి" అనునట్లు పూర్ధ్వ రూప పరిణామము చెందుచూ నిరంతర సంచలనముతో ఏప్పటికప్పుడు నవ్యమై భవ్యమై నిత్యనూతనమై యలరారుచున్నది. ఈ మార్పులు అవ్యక్తములు, అనిర్వచనీయములు, అనంతములునై యున్నవి. కనుకనే "నవోనవోభవతి జాయమానాః", ఆజాయమానో బహుధా విజాయతే అని శ్రుతులు వ్రాకొనుచున్నవి. ఆ పరమాత్మ నిత్యనూతనడు కనుకనే నవాయ అని వర్ణింపబడినాడు. అట్టి నిత్యనూతనుడుగా నిరంతరం మార్పులకు లోనగుచున్నను ఆ వస్తు తత్వము సనాతనమైయున్నదని కూడా వర్ణింపబడుచున్నది. ఆవస్తువు నూతనమూ సనాతనమును గూడనైయున్నది. యిట్టి ద్వంద్వ లక్షణములుగల వస్తువు. వస్తుమద్రహితమైన కేవల సనాతనమగు పరిపూర్ణ బ్రహ్మము మాత్రముగాదని గుర్తింపవలయును.

2) నవరూపాయ : నవ అనగా తొమ్మిది అనే అర్థములో తొమ్మిదిగా విభజింపబడి చెప్పబడే సమస్త నామరూపములు ఆ పరమాత్మయే చెందినది. అపరాప్రకృతియని చెప్పబడిన అష్టవిధ ప్రకృతులు పరాప్రకృతితో కలసి నవవిధ ప్రకృతులు. నవశక్తులు, నవ చక్రములు, నవరంధ్రములు, నవరాత్రులు, నవరత్నములు, నవఖండములు లేక నవ ద్వీపములు యిత్యాదిగా య్యా పరమాత్మయే మార్పు చెందినది. ఆపరమాత్మయే సర్వము గా మారినది. సృష్టికి కారణ కార్యములు తానే అయియున్నది. కనుక జగజ్జీవేశ్వరులు సమస్తమూ ఆ బ్రహ్మమే. "సర్వం ఖల్విదం బ్రహ్మ" "బ్రహ్మణోన్యం నకించన" అని శ్రుతులున్ను వాకొనుచున్నవి.

3) పరమార్థైక రూపిణే - ఆ పరమాత్మ నవ నవోన్మేషమై ఎన్నెన్ని మార్పులు చెందు చున్నను తన స్వరూపము గోల్పోకనే "సూత్రే మణిగనాయివ" అన్నట్లు అన్నింటి యందు అనుస్యూతమై ఏ మాత్రము తరుగకుండుటవలన అవ్యయమై తెలియక పోవుటచేత అవ్యక్తమై విశ్వగతమును, విశ్వాతీతమును గూడనై అలరారుచున్నది. అన్ని రూపములు దానివే అయివున్నను, దాని ప్రథమ రూపము చెడిపోవుట లేదు. కనుక ఆ తొలిరూపమే ఏకైక రూపముగా గల్గివున్నట్లు అభివర్ణింబడినది. యిదియే అవికృత పరిణామవాదము. కండ్లకు గానవచ్చు మిగితా రూపములన్నియు పారమార్థికముగా లేనివే, మిథ్యారోపితముగా నుడువబడుచున్నవి. నానా నామరూపాత్మకమగు యీ విశ్వమందు ఆ పరమాత్మ యొక్క నిజ స్వరూపమును నిశితమైన జ్ఞాన చక్షువుచే యొకానొక మహాజ్ఞాని మాత్రమే తెలుసుకొనుచున్నాడు. సర్వభూతముల యందు రహస్యముగానున్న ఆ పరమాత్మ తేలికగా తెలియబడుటలేదు సుమా అని యీ క్రింది శ్లోకము తెలియచేయబడు చున్నది.

శ్లో॥ ఏషు సర్వేషు భూతేషు గూఢాత్మాన ప్రకాశతే
దృశ్యతేత్వ్యగ్ర్యయాబుధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః॥

అట్టి ఆ గురు పరమాత్మ యొక్క రూపమును తాను స్వయంగా తెలుసుకొని అర్హులగు సచ్ఛిష్యులకు గురుమూర్తి యొక్కడే చూపగల్గుచున్నాడు.

4) సర్వాజ్ఞానతమోభేదభానవే : సర్వ + అజ్ఞానము = సర్వాజ్ఞానము. జీవుల అంతఃకరణమును దట్టమగు చీకటివలె అజ్ఞానమావరించియున్నది. "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" అని భగవద్గీత బోధించుచున్నది. ఆ గాఢాంధకారమును భేదించుటకు గురువు సూర్యుని వంటి వాడని ఈ గురుగీతాశ్లోక ముద్ఘాటించుచున్నది. గురువెట్లు ఆ చీకటి గోడను బేధించుచున్నాడు అంటే గురువు శిష్యునికి స్వరూపజ్ఞానమును కల్గించును గదా! ఈ స్వస్వరూపజ్ఞానమంతఃకరణమున దృఢముగా నాటుకొన్నచో అజ్ఞానమను చీకటి తెరలు తొలగిపోవును. ఆ చీకటి ఎక్కడికైనను పోవుచున్నదా? లేదు. ఎక్కడతోచినదో అటనే లేకపోవుచున్నది. వెలుగు చీకట్లు రెండునూ ఒక స్థానముననే తోచుచున్నవి. రెండునూ ఒకే వస్తువు యొక్క మారు రూపములు. ఒకటి గానవచ్చినపుడు మరొకటి గానరాకపోవుట మాత్రమే. ఒకే అంతఃకరణము జ్ఞానా జ్ఞానములను రెండు రూపములుగా నున్నది. పరిశుద్ధమైనపుడు జ్ఞానము ప్రకాశించును. మలినమైయుండిన అజ్ఞాన రూపముగానే గానవచ్చును. సత్కర్మా నుష్ఠానముచే శిష్యుని యంతఃకరణము పవిత్రీభూతమైనచో పరిశుద్ధమైయది జ్ఞాన తేజస్సుచే ప్రకాశించగలదు. ఇందుకు పలయు సాధన మార్గములను గురువు ఉపదేశించి శిష్యునిచే ఆచరింపచేసి అంతఃకరణమందలి అజ్ఞానపు చీకటి తెరలను బేధింప సమర్థుడగుచున్నాడు. వ్యష్టి అంతఃకరణమందలి అజ్ఞానమునకు తూలాజ్ఞానమని పేరు. బ్రహ్మమును ఆవరించిన ప్రకృత్యావరణమునకు మూలాజ్ఞానమని పేరు. మూలాజ్ఞానము నశించనంత వరకు తూలా జ్ఞానము మరల మరల క్రమ్ముకొనుచుండును. తూలాజ్ఞానమంతఃకరణము నావరించినట్లు

మూలా జ్ఞానము దేని నావరించినది? యీశావాస్యోపనిషత్.

శ్రుతి ॥ హిరణ్మయేన ప్రాతేణ సత్త్యస్యాపి హితం ముఖం

తత్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే॥

అని ఆవరణమును తొలగించి సత్యవస్తువును దర్శింపచేయుమని భక్తుడు ప్రార్థించుచున్నాడు. ఈ విధముగా ప్రకృత్యావరణము పరమాత్మ స్థానమును మరుగుపరచి తానే ముందరికి వచ్చుచున్నది. తాత్కాలికముగా దాని నధిగమించినను మరల మరల చెర్వులోని నాచువలె అది క్రమ్ముకొనుచునే వుండును.

5) చిద్ఘనాయతే : పరమాత్మ చిన్మయ స్వరూపుడు. చిత్ అనగా అఖండజ్ఞానమును దర్శించిన శిష్యుని మూలాజ్ఞానము తొలగిపోవును. అపుడాతడు గుణాతీతుడై ప్రజ్ఞాన ఘనుడై విలసిల్లును అని చెప్పబడినది. ఐతే అట్టి స్థితి యందునూ చలనము లేకపోలేదని తొలుతనే చెప్పుకొంటిమి. ఆ పరమాత్మయందు అణగిమణగియున్న సృష్టి బీజములు పొటమరించి మరల మరల సృష్టి కామన గల్గించి జగజ్జీవేశ్వర సృష్టికి హేతుర్భూతములగుచున్నవి. కనుక జన్మరాహిత్య మాసించిన సచ్ఛిష్యులకు కార్యకారణ రూపములుగా పరిణమించు నీ కారణ బ్రహ్మమునకు అతీతమై సర్వలక్షణ విలక్షణమై సర్వ పరిపూర్ణమైయున్న కేవలాచల పరిపూర్ణ పరబ్రహ్మ విషయకమగు పరిపూర్ణ బోధచే సద్గురువు సర్వభ్రాంతి రహితము గావించుచున్నాడు. అట్టి సద్గురు మూర్తికివే మా ప్రణతులు.

శ్లో॥ స్వతంత్రాయ దయాక్లుప్త విగ్రహాయ శివాత్మనే।

పరతంత్రాయ భక్తానాం భవ్యానాం భవ్యరూపిణే॥

తాత్పర్యము : స్వతంత్రుడును. దయయే కారణముగా రూపము ధరించినవాడును, మంగళ ప్రదమగు శరీరము గలవాడును భక్తపరతంత్రుడును. శుభమగు రూపముగలవారికి అనగా శుద్ధ మనస్కులకు శుభము నొసంగువాడును, అగు శ్రీ గురువునకు (నమస్కారము).

విశేష వివరణము : యీ శ్లోకమునందు ముఖ్యముగా యీ దిగువ విషయములు వివరించి తెలిసికొనవలసియున్నది. 1) స్వతంత్రాయ 2) దయాకుప్తవిగ్రహాయ 3) పరతంత్రాయ భక్తానాం 4) భవ్యానాం.

1) స్వతంత్రాయ : తంత్రమనగా చేయదగిన విధానము స్వతంత్రమనగా స్వ + తంత్రము స్వతంత్రము = స్వధర్మము అనగా తన ఆత్మధర్మము అని అర్థము అంతేగాని స్వతంత్రము అనగా ఏవిధమగు నియయమునకును న్యాయసూత్రములకును శాసనము నకును కట్టుబడియుండక యిచ్చవచ్చిన రీతి స్వైర విహారముసల్పుట స్వతంత్రము గాదు. పరప్రభుత్వము పోయినది. మాకు స్వతంత్రత చేకూరినది. కనుక నా యిచ్చవచ్చినట్లు చరింతుననుట స్వతంత్రము కాదు. తన స్వధర్మమును అన్య ప్రతిబంధములేక నిర్వర్తించు కొనగల్గుటే స్వతంత్రము. ఈ శ్లోకమునందు గురుపరమాత్మ, స్వతంత్రుడు అని వర్ణింపబడినాడు. అతడు నిరంకుశుడు యిచ్చవచ్చిన రీతిని జీవులకు సుఖదుఃఖములను కలిగించును.

లోకములను సృజించి పెంచి నాశనము చేయగలడు" అని అనుకొంటే అది చాలా పొరపాటు. ఎవరి కర్మానుసారము వారికి సుఖదుఃఖములు ప్రాప్తించునే గాని, ఈశ్వరుని యిష్టానుసారము అవి ప్రాప్తించవు. ఈశ్వరుడు కర్మఫల ప్రదాత మాత్రమే అనగా చేసిన పనికి తగిన ప్రతిఫలము మాత్రమే. అతడందచేయగలడు. అతడు ధర్మమూర్తి, త్రాసులోతూచినటుల కర్మకు తగిన ఫలమును మాత్రమే యిచ్చును. పాపకర్మచేసిన వానికి పాపఫలమును పుణ్యకర్మ చేసిన వారికి పుణ్యఫలమును మాత్రమే ప్రసాదించును మరియు తక్కువ నోములు నోచిన వారి కెక్కువ ఫలమును యెక్కువ నోములు నోచిన వారికి తక్కువ ఫలములను ఈయడు. కనుకనే భారతములో

కం॥ కర్మమున బుట్టు జంతువు
కర్మముననను వృద్ధిపొందు, కర్మమున చెడున్
కర్మము జనులకు దైవము
కర్మము సుఖదుఃఖములకు కారణమధిపా॥

అని చెప్పబడినది. కర్మమే జనులకు దైవము అంటే దైవము కర్మకు అధీనుడై యున్నాడని చెప్పవలెను. అంటే కర్మమే అతనిని శాసించునది యైతే యిక అతని స్వాతంత్ర్య మేపాటిది? అని శంకింపరాదు. స్వధర్మమును పాలించుటలో అతడు సర్వస్వతంత్రుడు. అతని నడ్డుకొనగలిగినది ఏదిన్నీలేదు అని మాత్రమే అర్థము.

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి, బ్రహ్మాక్షరసముద్భవమ్
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞేప్రతిష్ఠితం

పరమాత్మ (బ్రహ్మము) కు ప్రతిష్ఠ యజ్ఞమే. అనగా యజ్ఞము నందే పరమాత్మ ప్రతిష్ఠింపబడి యున్నాడు. యజ్ఞమనగా నిస్వార్థకర్మ.

శ్లో॥ నమే పార్థా ఽ స్తికర్తవ్యం త్రిషులోకేషుకించన।
నాఽ నవాప్తమనాప్తవ్యం వర్త ఏవచ కర్మణి॥

విద్యుక్తమగు కర్మ ఏమియు లేకపోయినప్పటికి, పొందదగిన ఫలము లేనప్పటికి నేను కర్మను చేయుచున్నానని భగవంతుడు చెప్పుచున్నాడు. అంటే ఆ విధముగా కర్మ లాచరించుటయే ఆయన స్వధర్మము అదియే ఆయన స్వతంత్రము లేక స్వంతపని. ఆ స్వంతపని "భూతభావోద్భవకరో విసర్గః కర్మ సంజ్ఞితః" అని గీత చెప్పుచున్నది. సర్వభూతములకు వాని స్వభావ స్వరూపములను కలిగించుటయేబ్రహ్మము. లేక పరమాత్మ యొక్క స్వధర్మము. అదియే ఆయన స్వ = తనయొక్క తంత్రము = పని, కనుక స్వతంత్రాయ అనగా జీవుల కర్మానుసారము, సృష్టి గావించి వారికి రూపాదులనిచ్చి వారి వారి కర్మఫలోప భోగమునకై భూతములను సృష్టించుటయే పనిగాగలవాడు అని మాత్రమే అర్థము గ్రహించవలెను.

2) దయాక్లప్త విగ్రహాయ : విగ్రహాయ = రూపమును దయా = దయచేతనే. లోకుప్త సంగ్రహించిన వాడని అర్థం. అతడు నిరాకారుడయ్యును దయచేత రూపమును సంగ్రహించెనని

అర్థము. ఎవరి యందలి దయచేత? అంటే "ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా" అనగా భక్తుల క్షేమము కోరి ఆ పరమాత్మ రూపములను వహించెను. "యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం" అనగా ఎవరు ఏ విధంగా ఏ రూపంలో నన్నుపాసింతురో వారి నా రూపంలోనే అనుగ్రహింతును. అని భగవానుడు ప్రతిజ్ఞ చేయుచున్నాడు. భక్తుల యందలి ప్రేమచేతనే వారివారి యిష్ట దైవరూపములను అతడు స్వీకరించునని అర్థము.

3) పరతంత్రాయ భక్తానాం : అనగా భక్తులకు లోబడి పోయినవాడు అని స్థూలంగా అర్థము చెప్పుకొనవచ్చును. అట్లు చెప్పితే అతని స్వతంత్ర మేమగును? కొంచెము లోతుగా విమర్శించవలసి యున్నది. భక్తులు చేయు కర్మాధికము ననుసరించి అతడు ఫలప్రాప్తి నొసంగును. గాని భక్తులు కోరినంత మాత్రమున వారి కోరికలు నెరవేర్చునని యర్థము చెప్పుకొనరాదు. రావణాసురుడెంత భగవద్భక్తుడైనా అతడు పుత్ర మిత్ర కళత్రాదులతో నాశనము చేయబడుటకు కారణమేమి? అతడొనర్చుచుండిన దుష్కర్మ ఫలితమేయని చెప్పి తీరవలెను గదా! భక్తునికిట్టి లక్షణములుండినచో అతడు భగవానుని కిష్టుడని గీత ద్వాదశాధ్యాయమున వివరించియున్నది. సత్కర్మానుష్టానము లేనిచో ఎంత భక్తి యున్నా నిష్ప్రయోజనమే కాగలదని రూఢిగా తెలియవలెను.

4) భవ్యానాం భవ్యరూపిణే : ఆ గురుపరమాత్మ యొక్క రూపము చాలా శుభప్రదమైనది. మంగళప్రదమైనది. "సత్యం, శివం, సుందరం" అని కీర్తింపబడుచున్నది. కాని దివ్యమగు అట్టి శుభాకారము సద్భక్తులకే గాని దుష్టులకు గానరాదు. ఎవరి అంతఃకరణ పరిశుద్ధమై యుండునో వారే సద్భక్తులు. వారిదే భవ్యమగు అంతఃకరణము, అట్టి పరిశుద్ధమగు పవిత్రాంతఃకరణముల యందే ఆ పరమాత్మ యొక్క భవ్యరూపము లేక దివ్యమంగళ స్వరూపము సాక్షాత్కరించును. మలినాంతఃకరణము నందు ఆత్మావతరణమే జరుగదు లేదా భయంకరమై గోచరించును. తన దుష్కర్మయే అట్టి రూపము వహించును. అందుకే శ్రీ మహావిష్ణువు హిరణ్యకశిపునికి అట్టి భయంకర రూపముననే సాక్షాత్కరించి సంహరించెను. భగవంతుని యెంత గొప్పగా ఆరాధించిననూ, అతడు నిజమగు భక్తుడు కాజాలడు. తన ప్రవర్తనయందు జాగరూకుడై మనోవాక్ఛరీరములను శుద్ధ ప్రవర్తన యందు గీలుకొల్పిన వాడే నిజమగు భక్తుడుగా గలడని దేశికేంద్రులవారు మనసున, వాక్కున, తనువున పనియొక్కటి జరుపునట్టివాడే భక్తుడని శెలవిచ్చినారు.

"శుద్ధచిత్తోభవ" అని ఆశీర్వదించి అట్టి నిజభక్తిని ప్రసాదించమని కోరి సగుణ నిర్గుణరూపమగు నా గురు పరమాత్మను అహరహముసేవింతుము గాక!

శ్లో॥ పురస్తాత్ పార్శ్వయోః పృష్టే నమస్కుర్యాదుపర్యధః
సదా మచ్చిత్త రూపేణ విధేహి భవదాసనం॥

తాత్పర్యము : ముందును, ప్రక్కలను, వెనుకను, మీదను, క్రిందనూ నమస్కరించవలయును. ఎల్లప్పుడూ నా చిత్తముతో నీ ఆసనము తయారుచేసికొని అట్టి ఆసనము నాకు

అనుగ్రహింపుడు. అనగా నా చిత్త మెల్లప్పుడూ తమయందే విడువక లగ్నమై యుండునట్లను గ్రహింపుడని తాత్పర్యము.

విశేష వివరణము : నాలుగు దిక్కులు మీద క్రింద అను నారు దిశలే యిందు చెప్పబడినవి. గాని నాలుగు మూలలు చెప్పబడలేదు. అవి కూడా చెప్పబడినట్లే ఎంచవలసి యున్నది. ఏలననగా తూర్పునకు నమస్కరించుచూ దక్షిణమునకు తిరిగినచో తూర్పు దక్షిణముల మధ్యనున్న ఆగ్నేయమూలకును నమస్కారము చేసినట్లే అగుచున్నది. అట్లే పైకి నమస్కరించుచూ క్రిందికి నమస్కారము చేయుటకై క్రిందికి వంగినపుడు మధ్యభాగమునకున్ను నమస్కారము చేసినట్లే యగుచున్నది. కనుక దశదిశలయందే గాక సర్వత్ర కూడ నమస్కరించు నట్లే అగుచున్నది.

ఇక్కడ ముఖ్యముగా తెలుసుకొనవలసినది ఏమనగా నమస్కరించవలసినది దేని యొక్క దశదిశలయందూ? దేనికి సర్వత్రా (ఎ) నమస్కారము చేయు నాకు దశదిశలయందు సర్వత్రానా

(బి) లేక నమస్కారము చేయబడు గురుమూర్తి యొక్క దశ దిశలయందు సర్వత్రానా? నమస్కారము చేయవలసినదాని వస్తు స్వరూపమేది? గురుస్వరూపమా? లేక పరిపూర్ణమా? అను విషయముల గూర్చి చర్చించి తెలుసుకొనవలసియున్నది. నా దశదిశల యందూ నా యందు సర్వత్ర అని జవాబు చెప్పే పక్షంలో - మరల నా స్థూల సూక్ష్మ కారణ, మహాకారణ శరీరములో దేనియొక్క సర్వత్ర, నమస్కరింపవలెను? ఏ శరీర దాత్మ్యముతో నేను నాకన్యమగు సర్వత్రా నమస్కరించవలెను. స్థూలదేహ దృష్టితో చూస్తే నాకు సర్వే సర్వత్రో అన్ని దశల యందునన్ను పరివేష్టించి చుట్టుముట్టియున్నది. భూతాకాశావరణమే కనుక దానికి నమస్కరింప వలెనని ఏర్పడుచున్నది. దీనినే మరొక విధంగా చెప్పితే పిండాండమునకు బ్రహ్మాండ మావరణ ముగా నున్నది. గనుక బ్రహ్మాండ పురుషుడైన విరాట్స్వరూపునికి నమస్కరించవలెనని తెలుపుచున్నది.

ఐతే, నమస్కారముచేసే నేను స్థూలదేహమునేనా? ఇక్కడ నేనెవడను? అని ప్రశ్న యెదురవుతూంది. నేనంటే, స్థూల, సూక్ష్మ, కారణ, శరీరములుకాదు మహాకారణ శరీరమైన ప్రత్యగాత్మ శివోహం అని శ్రుతి యుక్తి అనుభవములచే సిద్ధించుచున్నది. వ్యష్టి భావనలో ప్రత్యగాత్మయనే పేరుతోనున్న నేను, నా సమష్టి స్వరూపమైన పరమాత్మకు అనగా గురు స్వరూపమునకు నమస్కరించుట యగును. మహావాక్య విచారణచే ప్రత్యగాత్మ పరమాత్మలు రెండూ ఒకటేనని సిద్ధించుచున్నదిగదా! నమస్కరించునది. నమస్కరింపబడునది ఒకటే అయినపుడు నమస్కారమెట్లు సంభవము? అను శంక కలుగుచున్నది. తన సమిష్టి స్వరూప మైనది. పరమాత్మ లేక గురు స్వరూపం, అని గుర్తించి దానితో ఏకభావన చెందుటే దానికి నమస్కరించుటయగును. స్వరూప నిశ్చయము గలవారి నమస్కార మిట్టిదిగానే యుండును.

తానుగాని దానికి నమస్కారముకాని తనకు తానే నమస్కారము చేయుటేమి? అంటే,

స్వరూప జ్ఞానమారుఢము కానివారు అఖండాత్మ దృష్టి కలుగువరకు, ఏక భావనా రూపమగునట్టి సాధన (నమస్కారము) చేయవలసినదే. తరువాతనో? " ఆ తరువాత ఏమున్నది? అట్టి అఖండాత్మ దృష్టి అలవడిననాడు కృతకృత్యుడే. ఇక నాతనికి కర్తవ్య మంటూ ఒకటున్నదా? అంటూ యితరుల ప్రశ్నింతురు? కాని అచల ఋషుల నిర్ణయం భిన్నమైయున్నది. "స్వరూప జ్ఞానం కలుగుటతో నీవెవరో నీకు తెలిసినది". "సోన్వేష్టవ్యస్సజిజ్ఞాసితవ్యః" అనగా వెదుక తగ్గినది. జిజ్ఞా చేయతగినది ఏదో దానిని నీవు తెలిసికొంటివి. శ్రవణ మనన నిధి ధ్యాసలచే తెలియదగినది. నీకు ద్రష్టవ్యమైనది. కాని "నైవవాచా, నమనసా, ప్రాప్తుంశక్యోషాచక్షుసా.........అని కఠోపనిషత్తున్ను" సవిష నేతినేత్యాత్మ గృహ్యోనహి గృహ్యతే............అంటూ బృహదారణ్య కోపనిషత్తున్ను ఎరుకచే (మనోబుధ్యాదులచే) తెలియబడదని చెప్పే పరిపూర్ణ పరబ్రహ్మము, నీ స్వరూపమునకు కూడా నన్యముగానున్నది గదా! దానియందు నీ నిజస్వరూపమగు పరమాత్మకు మూలంగాని, స్థానంగాని లేదు. అది ఎరుకమీరినది ఎరుక లేనిదీ కనుక దానిని ఏరుక లేకనే నీవు సేవింపవలెను. "స్వయం బ్రహ్మమయోభూత్వా, తత్పరంచావ లోకయేత్..........." అనగా నీవు దానినతిక్రమించి (విడచి) నీ నిజస్వరూపమగు పరమాత్మ స్వరూపుడవై, నీకు పరంగానున్న పరిపూర్ణ పరబ్రహ్మమును జూడుమంటూంది గురుగీత, అది నీవు కాదు. నీవది కాదు. "నేను లేనిదేయది" అని నీయందలి బ్రహ్మ భ్రాంతిని వదలినపుడు గాని, నీకు సర్వభ్రాంతి రహితం చేకూరదు అని అచల ఋషుల మహోత్కృష్ట సిద్ధాంతం.

అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమునకు "మ్రొక్కెరితర జేజేలు" అని శ్రీకృష్ణ దేశికేంద్రుల కందార్థము. ఆత్మస్వరూప నిశ్చయజ్ఞాన పరులే యితర జేజేలు. అట్టివారి కన్యమై వారిచే సేవించదగినదీ పరిపూర్ణ పరబ్రహ్మమే. సేవ లేక వుపాసన, అనుటతోనే, సేవ్యవస్తువు, సేవ, సేవకుడు, లేక ఉపాస్య వస్తువు, ఉపాసన, ఉపాసకుడు అనే త్రిపుటి సిద్ధమగుచున్నది. పరిపూర్ణ పరబ్రహ్మ ముపాస్యముకాదు. ఉపాసింపదగినది బ్రహ్మమేకాదు. "నేదం యదిద ముపాదితే" అని కేనోపనిషత్ప్రవచనం. కనుకనే కృష్ణదేశికేంద్రులు "ఎరుకలేక సేవింపదగు" నన్నారు. ఎరుకలేక సేవించుటెట్లో నిజగురు భక్తులు వారి గురువుల నుండి తెలుసుకొనగలరు. దశదిశల యందున్న దానికి నమస్కరింపవలయును అని యీ శ్లోకమునకు భావమని గుర్తించితిమి. ప్రత్యగ్బ్రహ్మైక రూపమగు తనకు దశదిశల యందున్న దా పరిపూర్ణ పరబ్రహ్మమే, ఈ విషయ మీ క్రింది శ్లోకములు, కందార్థములు వలననూ తేటతెల్లమగుచున్నది.

శ్లో॥ పూర్వమేవ నిరాలంబం, ఆగ్నేయో నిర్గుణం తథా
దక్షిణే నిత్యశుద్ధంచ, నైరుత్యో నిరుపద్రవం
పశ్చిమే నిష్కళంచైవ, వాయవ్యేచ నిరంజనం
వుత్తరేచ నిరాకార మీశాన్యో నిర్మలోభవేత్
వూర్ధ్వమేవ నిరాకారం అధశ్చ నిర్వికారకః
అంతర్బహిశ్చ సర్వత్ర అచలోయం సనాతనః

ఇందు దశదిశలే గాక అంతర్బహిశ్చ అని చెప్పబడుటచే దేని ప్రాతిపదికగా యీ దశదిశలు అంతర్బాహ్యములు చెప్పబడినవో అది ఆ పరిపూర్ణ పరబ్రహ్మమునందు వుండుట కెంతమాత్రము సావకాశము లేనేలేదని తేటతెల్లమగుచున్నది. కనుకనే దానికి లేనెరుకయనీ, లేనికలయనీ శ్రీకృష్ణ దేశికేంద్రులవారు పేరిడి "లేనికల కలిగినప్పుడు దానికి దశదిశలయందు తగమొదటకొనన్, తానంటకున్న మేల్కను లేనికలే జూచెనేని లేకపోవుగదా!" అంటూ దృష్టాంతమిచ్చినారు. ఎరుకను అధిగమించి దాని ద్వాదశ స్థానములయందూ నున్న పరిపూర్ణ పరబ్రహ్మమునకు నమస్కారముంటే అర్థమేమి? ఎరుకను విడచుటే నమస్కారమని గ్రహించవలెను. యీ గురుగీత శ్లోకమునకు అధికార తారతమ్యము ననుసరించి అన్వయము చేయవలసి యున్నది. సాధకుడు స్థూల దేహాభిమాని యగుచో, వైశ్వానరో పాసన, సూక్ష్మ శరీరాభిమానియగుచో, హిరణ్య గర్భోపాసన, కారణ శరీరాభిమాని యగుచో, అహంగ్రహోపాసనచే ఏకత్వమును సాధించవలసియున్నది. ఏకత్వమును సాధించిన పూర్ణాధికారికే అచల పరిపూర్ణ రాజయోగము అవలంబనీయమై యున్నది.

ఐనను యీ గురుగీతశ్లోకములో గురు స్వరూపమునకే నమస్కారం అని చెప్పబడినది. కాని పరిపూర్ణ బ్రహ్మమునకు కాదని ఈ శ్లోకము యొక్క రెండవ పాదములో స్పష్టమగుచున్నది. ఎట్లనగా భవదాసనం, నీ ఆసనమును, విదేహినాకిమ్ము. అది ఎట్టి ఆసనము మచ్చిత్తరూపేణ, నా చిత్తమే రూపముగా గలది. అనగా నీవెల్లప్పుడు కూర్చుండుటకు తగినట్లు నా చిత్తమును సరిదిద్ది దానిని నాకిమ్ము అని భావము. పరిపూర్ణ పరబ్రహ్మమునకు ఒక ఆసన ముండవలెనంటే ఆ ఆసనము ఎంత పెద్దదిగా నుండవలెను? పరిమితమగు నా చిత్త మట్టి ఆసనము ఎన్నడైన కాగలదా? నా చిత్త పరిధిలోనికి రాగలదు అని అంటే, ఎరుక పరిపూర్ణమును గుర్తెరుగ గలదు. అని చెప్పవలసివస్తుంది. ఎరుకచేత అఖండాత్మ స్వరూపమగు (ప్రత్యగ్బ్రహ్మైక్య రూపమగు) గురుపరమాత్మకు నమస్కరించవలెనని యీ శ్లోకము శాసించుచున్నదని గ్రహించి సదా మా చిత్తమాతనికి ఆసనముగా నాయత్తపరచి యుండుటకు వలయు శక్తిసామర్థ్యమలను మనకు ప్రసాదించుమని ఆ గురు పరమాత్మకు నమస్కరించుచుందుము గాక!

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య విషయాక్రాంత చేతసః
జ్ఞానప్రభాప్రదానేన ప్రసాదం కురు మే ప్రభో॥

తాత్పర్యము : అజ్ఞానమను కటిక చీకటిచే కన్ను కానక గ్రుడ్డివాడనై, శబ్దస్పర్శాది విషయ వాంఛలచే ఆక్రమించబడియున్న దుర్బలచిత్తము గలవాడనై యున్నాను. ఓ ప్రభూ! జ్ఞానమను వెలుగును ప్రసాదించి నన్నను గ్రహింపుము.

వివరణము : జ్ఞానాజ్ఞానములు, తేజోంధకారములుగా యీ శ్లోకమున వర్ణింపబడినవి. తేజస్సు అనునది యొకటి, అంధకారమనునది మరొకటి అని రెండు వస్తువులున్నవా? లేక యివి రెండునూ ఒకే వస్తువుయొక్క వేరువేరు రూపములా? ముందుగా విచారించి తెలిసికొన వలసియున్నది. తేజస్సు భావ రూపము అనగా వునికి కలిగియున్నది. అంధకారము అభావ

రూపము. అనగా తేజస్సు లేకుండుటే అంధకారముగాని అంధకారమునకు స్వతంత్రసత్తా అనగా యునికిలేదు అని అనవలెనా? లేక, తేజోంధకారములు రెండునూ స్వతంత్ర సత్తా గల్గిన వేరు వేరు పదార్థములు అనవలెనా? యీ రెండవ వాదమునకున్ను ఆధారము లేకపోలేదు.

1) మొదట్లో అంతా అంధకారమే. ప్రకాశము దానియందు పరివ్యాప్తమగుచున్నది. అప్పుడు అంధకారము మరుగై ప్రకాశము తోచుచున్నది. ప్రకాశ ముపసంహరింపబడినపుడు తిరిగి యెప్పటి అంధకారమే. ఒక బ్యాటరీలైటు చీకట్లో వుపయోగింపబడినపుడు ఆ వెలుగు ఎంతవరకు వ్యాపించినదో ఆ స్థలములో నున్న అంధకారమే పోయినట్లుగా తోచబడుచున్నది. కాని దాని చుట్టునున్న ప్రదేశములో అంధకార మట్లే నిలచియున్నది. ప్రకాశమున్నచోట నుండిన అంధకారము లైటు వేసినపుడు ఎక్కడికైనా పోయినదా? ఆర్పినపుడు తిరిగి వచ్చినదా? లేదు. ఎక్కడి అంధకార మక్కడనేయున్నది. కాని పైన రంగు వేసినట్లుగా ప్రకాశము అలముకొన్నది. అంధకారమునకు ప్రత్యేకవునికి, లేక స్వతంత్ర సత్తా యున్నట్లు సిద్ధించుచున్నది. అనగా దార్ష్టాంతికము నందు జ్ఞానజ్ఞానములుగూడ స్వతంత్ర పదార్థములే గాని ఒకే వస్తువు యొక్క భావాభావ రూపములు కావు అని అనవలసివస్తూవున్నది.

2) మరిన్ని భగవద్గీత 3వ అధ్యాయం 38 శ్లోకము.

శ్లో॥ ధూమేనావ్రియతే వహ్ని ర్యథాఽ దర్శోమలేనచ
యథోల్బేనావృతే గర్భస్తథా తేనేద మావృతం॥

తాత్పర్యము : పొగచేత నిప్పు, మాలిన్యము చేత నద్దము, మావిచే గర్భశిశువు నావరింపబడియున్నట్లే రజోగుణాత్మకమగు అవిద్య లేక అజ్ఞానము జ్ఞానమును ఆవరించి యున్నది. అనిన్ని, 5వ అధ్యాయం 15వ శ్లోకంలో "అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" (అనగా జీవులను మోహింపచేయు అజ్ఞానముచే జ్ఞానము ఆవరింపబడియున్నది అనియును చెప్పబడియున్నది.

3) జ్ఞానాజ్ఞానములు రెండూ ఒకే వస్తువు యొక్క భావాభావస్థితులే అయినచో ఒకదానినొకటి, ఆవరించుట, ఒకదాని నొకటి నాశన మొనర్చుట యెట్లు పొసగును? కనుక తేజోంధకారములవలె జ్ఞానాజ్ఞానములు భిన్నవస్తువులే అని సిద్ధించుచున్నది. ఇక తేజోంధ కారములు, జ్ఞానజ్ఞానములు మొదలగు సాపేక్షిక వస్తువులు. ఒకే వస్తువు యొక్క భావాభావం రూపములేగాని భిన్నములుగావు అనువాదన యెట్లు సిద్ధాంతమగునో కొంచెం విచారింతము.

"సదేవ సోమ్యేద మగ్రసీత్" ఏక మేవాఽ ద్వితీయం" అనగా సృష్టికి పూర్వము సత్పదార్థ ముండెను. అది ఏకమును. రెండవది లేనిదియునై యుండెను. కనుక రెండు సత్పదార్థము లుండుటకు వీలులేదు. జ్ఞానఘనమగు బ్రహ్మ పదార్థమొకటి మూలాజ్ఞాన రూపమైన మాయ ఒకటి అని రెండు వుండరాదు. వున్నట్లుగా తోచుట మాత్రమే. జ్ఞానము (ఎరుక), అజ్ఞానము (మరుపు) యీ రెండును స్వతంత్ర పదార్థములు కావు. ఎరుక యొక్క రూపాంతరమే, లేక, అవస్థాంతరమే మరుపు, శ్రీ భాగవత కృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థ కందములలో" ఎరుకనగా ఎరిగేటిది. మరువపగా ఎరుక తనను మరచటము "అనిన్ని"

"మరుపుకు తాన్మత్రలుగల వెరుకకు తన్మాత్రలు స్రష్టి రెండొకటే" అనిన్ని జ్ఞానాజ్ఞానంబులు యీ జ్ఞానానివెగాని వేరుగా వెన్నటికీ" అనిన్ని శెలవిచ్చినారు యీ విషయమే మన అనుభవములో విచారించినచో నేను జమీందారును అని జాగ్రత్తలో గల తెలివి స్వప్నములో తన్నుతాను సగం మరచి నేను బిక్షుకుడనని అనుకొంటూంది. అదే తెలివి తన్ను పూర్తిగా మరచి సుషుప్తిలో నేను, తాను, అనే గుర్తు లేక వుంటూంది. ఈఅవస్తా త్రయములయందూ వున్న జ్ఞానము లేక ఎరుక ఒక్కటేకదా! జ్ఞానాజ్ఞానములు లేక ఎరుక మరుపులు భిన్నములు కావు. జ్ఞానము యొక్క భావాభావస్థితులే, అని సిద్ధిస్తూన్నది. మరిన్నీ అవి రెండునూ భిన్నములు అనేవారి వాదనలు శ్రుతి యుక్తి అనుభవ రూపంగా నున్నట్లు తోచినా అవి సమంజసముగా లేవు. ఏలననగా,

1) అంధకారము ఎప్పటికీ యుంటూనే యున్నది. దానియందు బ్యేటరీ లైటు ప్రకాశము (లేక తేజస్సు) రాకపోకలు సాగిస్తూ వున్నది. ప్రకాశము వచ్చినపుడు, పోయినపుడూ అంధకార మక్కడనే వుంటూ వున్నది అను ఈ దృష్టాంత మిచ్చుటలో బ్యేటరీ లైటు ప్రకాశము రానపుడు అక్కడున్న అంధకారము, సూర్యుని తేజస్సు అప్పట్లో మరుగైన కారణముచే మాత్రమే అక్కడ నున్నది అను ముఖ్య విషయము విస్మరింపబడినది. సూర్యప్రకాశము యొక్క అభావరూపమే బ్యేటరీ లైటు వేయుచున్నపుడున్న అంధకారముగాని అంధకారమునకు స్వతంత్రసత్తా (యునికి) లేదు. దీపముంటే క్రీనీడ, వున్నది. దీపము లేకుంటే ఏక్రీనీడాలేదు. కనుక రెండూ కలసి వస్తూన్నాయి. కలిసే పోతున్నాయి. అట్లే జ్ఞానాజ్ఞానములున్నూ.

2) భ॥గీ॥ శ్లోకములుకూడ బాధించనేరవు ఎట్లన పొగచేత నిప్పు ఆవరింపబడినదంటే పొగవేరు, నిప్పువేరు అన జెల్లునా! నిప్పు లేకుంటే పొగ ఎట్లువచ్చును? అట్లే అద్దమును మాలిన్య మావరించినట్లు అనుటలో ఒకప్పుడు శుద్ధముగా నున్నదీ మరొకప్పుడు మలినముగ నున్నదీ ఆ అద్దమే గదా! అట్లే గర్భస్త శిశువును మావి కప్పినట్లుగా అన్నప్పుడుగూడ ఆవరింపబడిన శిశువున్ను, ఆవరించిన మావియూ రెండూ సప్తధాతు పరిణామములే. అట్లే జ్ఞానాజ్ఞానములు రెండూ ఒకటే పదార్థముయొక్క భిన్నరూపములు మాత్రమే.

3) అవి రెండూ అయితే ఒకదాని నొకటి యెట్లావరించును? పైన చెప్పబడిన విధముగానే అనగా (ఎ) పొగ నిప్పును ఆవరించునట్లు (బి) ఇనుమును త్రుప్పు ఆవరించినట్లు (సి) రక్తమాంసాదులను చర్మమావరించినట్లు అని సమాధానము చెప్పవచ్చును.

4) రెండు ఒకటి అయితే ఒకదానికొకటి యెట్లు నాశనమొనర్చును? అంటే, కాష్ఠమందున్న సామాన్యాగ్ని విశేషరూపమై కట్టెనే దహించినట్లున్ను సారూప్య వైద్యశాస్త్ర సిద్ధాంతరీత్యా ఏ మూలికా ప్రయోగముచే ఏ రోగ లక్షణములు ఆరోగ్యవంతుని శరీరమందారోపిత మగునో, ఆ మూలిక యొక్క సూక్ష్మాంశప్రయోగముచే ఆ రోగలక్షణములు గల వ్యాధి నాశన మొనర్చబడినట్లున్ను జ్ఞానజ్ఞానములు పరస్పరము ఒకదానిచే నొకటి బాధింపబడుచున్నవి. జ్ఞానాజ్ఞానములు ఎన్ని కోణములనుంచి పరిశీలింపబడినా రెండూ యేక వస్తువునకు సంబంధించిన భావాబావ రూపములే అని సిద్ధాంతము.

ఈ నిర్ణయమును మనసునందుంచుకొని ఈ శ్లోకమును అన్వయించవలసియున్నది. అందుకు జ్ఞానాజ్ఞానములను వస్తునిర్ణయ పూర్వకముగా ముందు నిర్వచించుకొని యీ భక్తుని కోరిక ఏదో గమనించవలసియున్నది.

జ్ఞానమనగా స్వస్వరూపజ్ఞానమే గాని అన్యముగాదని గమనించితిమి. కనుక జ్ఞాని "సర్వంఖల్విదం బ్రహ్మ" "నేహనానాస్తి కించన" యిత్యాదిశ్రుతులు చెప్పిన విధంగా

శ్లో॥ "యద్యత్పశ్యతి చక్షుర్భ్యాంతత్త దాత్మేతి నిశ్చయా

యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి నిశ్చయా॥

అను ఆత్మ దృష్టిని బూని, కనేదీ, వినేదీ మాత్రమే గాక కనబడేదీ వినబడెదీ మొదలుగా గల శబ్ద స్పర్శ రూప రస గంధాత్మకమగు ప్రపంచవస్తుసముదాయ మంతయు ఆత్మగా గుర్తించి, అట్టి ఆత్మదృష్టితో "కిమిచ్ఛన్, కస్యకామాయ" అనురీతిగా దేనిచేతను ఆకర్షింపబడడు. ఈ ఆత్మజ్ఞానము లేనిచో కేవలం వస్తుదృష్టి చేతను గుణదృష్టిచేతను మానవుడు విషయాదులయందు ప్రవర్తించుచు పదార్ధములయందలి యదార్ధమును గుర్తించక వస్తువులకై ప్రాకులాడుచున్నాడు. వస్తువులు తన్ను మోహపెట్టి తమ వైపు లాగుకొనుచున్నవని వాపోవు చున్నాడు. చేతనుడై యున్న తన్నుజడములని (ఒక దృష్టితో) చెప్పబడే వస్తువుల ఆకర్షించగలవా? అజ్ఞానముచే వస్తుయదార్ధ తత్వమును గుర్తించక తానే, ఆ వస్తు సముదాయమునకై ఎగపడుచున్నాడు. తనయందున్న అజ్ఞానదోషమును గుర్తించక వస్తువులయందు దోషారోపణ చేయుచున్నాడు. పూర్వజాన్మ పుణ్య విశేషముచే గురుదర్శనమై తన అంతఃకరణ విషయాక్రాంతమై యుండుటకు కారణము వస్తునిశ్చయజ్ఞానము లేకుండుటేయని గుర్తించి, ఆత్మ సాక్షాత్కారము గల్గించుమని శిష్యుడు మొరపెట్టుకొనుచున్నాడు.

ఐతే, జ్ఞానాజ్ఞానములు రెండూ ఒకే వస్తువు యొక్క రెండు రూపములే అయితే, శిష్యునికి గురువు ఏమి ప్రదానము చేయవలెను? నిజమే. క్రొత్తగా ఏమియు నెచ్చట నుండియు తెచ్చియుండుట లేనేలేదు. జ్ఞానాజ్ఞానములలో, అజ్ఞాన లక్షణముచే ప్రపంచమునందలి వస్తువుల యెడ గల ఆపేకను అప + ఈక్ష = తప్పు చూపునుమాత్రము శిష్యునికి వస్తు సాక్షాత్కారము గావించుట రీత్యా గురువు తొలగించును. ఇదియే ప్రసాదముగా ననుగ్రహించు మని శిష్యుడు ప్రార్థించుచున్నాడు.

అజ్ఞానాంధకారముచే గ్రుడ్డివాడైన శిష్యుని గుడ్డితనము మాత్రము పోయినదేగాని అజ్ఞానము పోలేదు. అది నశించనేలేదు. అది యిప్పుడు జ్ఞానరూపముతో నున్నది. వెనుకనున్న తప్పు చూపు పోయినది. అంతేగాని, జ్ఞానాజ్ఞాన రూపమగు నజ్ఞానము (లేక,ఏరుక) మాత్రము పోలేదు. మరల అజ్ఞానరూపము వహించనూ గలదు. భ్రాంతి కారకమునూ కాగలదు.

జ్ఞానాజ్ఞాన రూపమగు (ఎరుక మరుపుల రూపమగు) ఎరుక యొక్క రహితము నందు తప్ప శాశ్వతముగా మూలాజ్ఞానరహితం గాదు. అది పరిపూర్ణ రాజయోగమునందుగాని సాధ్యముగాధు అని తెలియవలెను.

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య విషయాక్రాంతచేతసః
జ్ఞాన ప్రభాప్రదానేన ప్రసాదం కురు మే ప్రభో॥

తాత్పర్యము : సద్గురు ప్రభూ! అజ్ఞానమను చీకటిలో గ్రుడ్డి వాడనై విషయవాసనలచే నిండిన అంతఃకరణముగల నాకు జ్ఞాన తేజస్సును అనుగ్రహించుమని ప్రార్థించుచున్నాను.
విశేష వివరణములు : 1) అజ్ఞాన తిమిరము 2) అంధస్య 3) విషయాక్రాంత చేతనః 4) జ్ఞానప్రభాప్రదానము.

1) అజ్ఞాన తిమిరము : అజ్ఞానమను అంధకారము, అజ్ఞానము చీకటికాదు. జ్ఞానము, తేజస్సూ (వెలుగు) కాదు. ఎందుకట్లు పోల్చినారు? కారుచీకట్లో, దారీ తెన్నూ గానరాక బాటసారి ఏ గోతిలోనో, నూతిలోనో ముండ్లకంపలలోనో పడే ప్రమాదమున్నది. అజ్ఞానమువలన యెట్టి ప్రమాద మున్నది? అది దుఃఖ కారణము, బంధ కారణము యెట్లు అగుచున్నది? యించుక విచారించ నగును. చీకటిలో కండ్లు సరిగా కనుకపించకపోవుటవలన యెదుటనున్న వస్తువును గుర్తించక ప్రమాదమునకు లోనగుచున్నాడు. జ్ఞానికి అజ్ఞానికి చక్షురింద్రియము, దాని లోపాలోపములు సమానమే నేత్రగోచరమగు దృశ్యములు సర్వమూ ఉభయులకు సమానముగానే భాసించును. ఒక్క రూపవిషయములోనే గాక మిగతా శబ్ద స్పర్శ రస గంధ గ్రహణములలో కూడా శ్రోత్ర, త్వక్, జిహ్వాఘ్రాణములు పండిత పామరులకు సమానమే. ఉదాహరణకు పండితుని నాలుకమీద వేసినా పామరుని నాలుకపై వేసినా చక్కెర తియ్యగానే యుండును గదా. అజ్ఞానమనే చీకటివల్ల నేత్ర దృష్టి కేమీ అవరోధము లేదు. అజ్ఞానము దేనికి యెట్లు అవరోధముగా నున్నది?

దేనిని గుర్తించినా, గ్రహించినా ఒక్క అంతఃకరణమే. అంతఃకరణ వృత్తి ఆయా ఇంద్రియముల ద్వారా బహిర్గతమై ఆయా విషయములను గ్రహించును. మరిన్ని ఆ గ్రహించిన విషయముల యందలి గుణదోషములను సత్యాసత్యములను నిత్యా నిత్యములును నిర్ణయించునదికూడా ఆ అంతఃకరణమే. యీ నిర్ణయము గావించునపుడు ఆ అంతఃకరణమే బుద్ధి యని పిలవబడుచున్నది. ఆ అంతఃకరణము స్వతః జడము. కనుక అజ్ఞానరూపమే. కాని ఆత్మప్రకాశమందుచేరి అంతఃకరణమును చైతన్యవంతముచేసి గుర్తెరిగే సత్తా నిచ్చుచున్నది. అంతఃకరణ మందలి అజ్ఞానము వ్యక్తులనుబట్టి వారివారి పూర్వకర్మ వాసననుబట్టి తరతమ భేదములు కల్గియుండును. అజ్ఞాన మెంత గాఢముగ దట్టముగ అంతఃకరణయందు పేరుకొని యుండునో అంతకంతా ఆత్మప్రకాశమును ఆవరించి ఆత్మప్రకాశమును మరుగుపరచును. "అజ్ఞానే నావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః" అని భగవద్గీత యందుకూడా చెప్పబడినది. చీకటివలె అజ్ఞానము జ్ఞానమును ఆవరించి గుర్తింపబడే వస్తువుయొక్క యదార్థజ్ఞానము కలుగకుండా చేయును. అట్టి అదృశ్య వస్తువుయొక్క స్థూలరూపము గుర్తింపబడును గాని వస్తుతత్వము అనగా దాని నిజ స్వరూపము గుర్తింపబడజాలదు.

అజ్ఞానము జ్ఞానమును ఆవరించునన్నాము. అసలు జ్ఞానమనగా నేమి? స్వస్వరూప

సాక్షాత్కారము కలుగుటవలన ఏర్పడిన అనుభవ జ్ఞానము దీనికే విజ్ఞానమని పేరు. విజ్ఞాన మనగా విశేషజ్ఞానము. సామాన్య జ్ఞానము సకల ప్రాణులయందు మాత్రమేగాక జడవస్తువు లనబడే వస్తువుల యందు కూడా కట్టెలో నిప్పువలె (పరావా గ్రూపముగా) నున్నది. తనయందు అనగా తన నిజస్వరూపమగు పరమాత్మ స్వరూపమునందు సర్వచరాచరములు, ఆ చరా చరములయందు తాను నిండియున్నట్లు వాచా చెప్పుట మాత్రముగాక ప్రహ్లాదుడు "తన యందు నిఖిల భూతములందు నొక భంగి సమహితత్వమున" నడువగల్గిన ఆరూఢ జ్ఞానమేనని తెలియవలెను. భగవద్గీతలో జ్ఞాన మిట్లు నిర్వచించబడినది.

శ్లో॥ "ఆధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్వజ్ఞానార్థ దర్శనం
ఏతజ్ఞాన మిదం ప్రోక్తం అజ్ఞానం యదతోన్యథా"

"అనగా ఆత్మ నిత్యమైనదని తత్వ విచారణచే ఆ యాత్మను దర్శించుము. యిదియే జ్ఞానం. మిగిలిన దంతయు అజ్ఞానమే. యీ శ్లోకమునందు "తత్వజ్ఞానార్థదర్శనం" అని చెప్పబడినది అంటే తత్వ జ్ఞానమునకు లక్ష్యభూతమైన వస్తువును దర్శించుటయే అనగా అనుభవమునకు తెచ్చుకొనుటయే జ్ఞానము. "వాసుదేవస్సర్వమితి స మహాత్మా సుదుర్లభః "జ్ఞానేంద్రియ గోచరమగు సమస్తము పరమాత్మ స్వరూపమే అను ఆరూఢజ్ఞానమే గాని శాస్త్రజ్ఞానము మాత్రం కాదు.అట్టి ఆరూఢ జ్ఞానము కలిగిన వానికిన్ని శాస్త్రపండితునకును ఎంత తారతమ్యము? వారి జీవిత విధానములో ప్రవర్తనలో వాక్కులో చింతనలో యెంత వ్యత్యాసమో! అట్టి అరూఢ జ్ఞానము కలవాని ప్రవర్తన చూచి యితడు మానవుడేనా? లేక మాధవుడా? నరుడా? లేక కేవలం నారాయణుడా? అని అచ్చెరువందక తప్పదు. అట్టి బ్రహ్మవేత్త బ్రహ్మమే గాని అన్యుడు కాడు "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అని శ్రుతి చెప్పినది.

"బ్రహ్మణోన్యం నకించన" " ఆత్మనోన్యం నకించన" అని శ్రుతులు చెప్పినట్లు అన్నియు బ్రహ్మమే, అందరు బ్రహ్మస్వరూపలే అయివున్నారు. కాని స్వరూప విస్మృతి చెందియున్నారు. అట్టి విస్మృతి (లేక మరుపు) కలుగుటకు కారణము వారి అంతఃకరణము అజ్ఞానముచే ఆవరింప బడుటయే. చిమ్నీకి దట్టముగా పొగపట్టినచో లోనున్న దీప ప్రకాశమెట్లు కాంతిహీన మగునో అట్లే స్వస్వరూపజ్ఞానము మరుగుపడి తానొక కించిజ్ఞుడగు క్షుద్రజీవిగానే మానవుడు తలంచును. నేను అను దాని నిజరూపం మరుగుపడి స్థూల సూక్ష్మ కారణ శరీరము లతో తాదాత్మ్యము చెంది వాని సుఖదుఃఖములు తనవిగానే తలంచి మానవుడు బద్ధుడగు చున్నాడు. తాను నిత్యముక్తుడనను విషయము పూర్తిగా విస్మరించుచున్నాడు. అథవా తా నా నాత్మ స్వరూపుడే అనుమాట చెవినిపడినా ఆ భావమును జీర్ణించుకొని ఆరూఢత సాధించలే కున్నాడు. గురుమూర్తి ఆత్మవస్తు పరిజ్ఞానము కలిగించవలెను. గురూపదిష్టమార్గందు శిష్యుడు పయనించవలెను. గురుకృపచే అట్టి అనుభవజ్ఞానము సాధించవలెను. అపుడుగాని ఆ యజ్ఞానము నాశము కాదు. ఆ అజ్ఞానము అంతఃకరణకు వుపరి భాగమున కప్పియుండుట మాత్రమే గాక లోపల పైన అను భేదము లేక అంతఃకరణము అజ్ఞానమయమై వుండును.

అట్టి అంతఃకరణము జ్ఞానమయమైపోవలెను.

2) అంధస్య = గ్రుడ్డితనము : యీ గ్రుడ్డితనము కంటికి గాదనియు కంటిద్వారా చూచు మనస్సునకే ఆ గ్రుడ్డితనమనియు గుర్తించితిమి. మనస్సుపై యీ అంధత్వం యొక్క ప్రభావ మేమన వస్తుతత్వమును వున్నదున్నట్లుగా గుర్తింపనీయదు. వస్తువు యొక్క నామ రూపములను గుణములను అనగా వస్తు దృష్టి గుణ దృష్టి మాత్రమే యుండి వానికి లోలత్వము చెందించి భ్రాంతితో ముంచివేయును. సర్వమూ ఆత్మయేగాని అన్య మేమీ లేదు అని యిక కోరదగినదీ విడువదగినదీ యేదీ లేదనియు తోచనీయదు. సమదర్శనమూ సమిష్టి దృక్పధమూ కలుగనీయదు. నానాకర్మజ వాసనాన్వితమైన ఆ మనస్సునకు పూర్వవాసనా ఫలితముగ శుభాశుభ సంకల్పములు గల్గి యింద్రియ విషయములకే లోలుడైపోవును. అతని బుద్ధి యుక్తాయుక్తముల గూర్చి విచారించదు. క్రమశః బుద్ధినాశము సర్వనాశనమూ సంభవించును.

3) విషయక్రాంతచేతసః : అనగా చిత్తము శబ్ద స్పర్శాదుల సుఖానుభవమును మాత్రమే కోరుచూ ఆయా కోరికలచే చిత్తము సంపూర్ణముగ నిండిపోయి వుండుట, అట్టి మనస్సు ఆయా సుఖానుభవమునకే నిరీక్షించుచూ అందుకు చేయరాని దుష్కార్యము లొనర్చుచూ తత్ఫలితముగ సంభవించు కష్టనష్టములకు గురియగుచు కించిద్భోగమునకు ఆశించి దుఃఖపరంపరలకే చిక్కిపోవుచున్నాడు.

4) జ్ఞాన ప్రభాప్రధానము : జ్ఞానమనే వెలుగును అనుగ్రహించుట ప్రధానము అనుటలో శిష్యుని వుద్ధరించుట తప్ప అన్య ప్రతిఫల మాసించడని భావము. అంతఃకరణయందు యీ జ్ఞానజ్యోతి వెలిగింపబడనంతవరకు అజ్ఞానాంధకారము అట్లే నిలబడియుండును. జ్ఞానజ్యోతి వెలిగింపబడిన మరుక్షణముననే దాని ప్రకాశము అంతఃకరణము లోపలా బైటా అనే నిర్ణయము లేకుండా విజ్ఞానమయమగును. అది వరకది అజ్ఞానఘనము ఇపుడు ప్రజ్ఞానఘనము.

ప్రధానము అనగా ప్రకృష్టమైన అనగా శ్రేష్టమైన దానము దానములు దశదానములని షోడశదానములని పేర్కొనబడినవి. అవి అన్నియు చేతితో నివ్వబడి చేతితో గ్రహించబడు వస్తు దానములు విద్యాదాన మట్లుగాదు. గురువాక్యముద్వారా శిష్యుని అంతఃకరణ గ్రహించ వలెను. బ్రహ్మవిద్యాదానము విద్యాదానము కన్న యెన్నో రెట్లు గొప్పది. ఏలనన విద్యాదానము వలన ప్రతి గ్రహీత ఐహిక సుఖములను మాత్రమే సాధించగలుగును. లౌకిక జ్ఞానము మాత్రమే గలుగును. ఆత్మ జ్ఞానము పారలౌకిక శ్రేయస్సును కల్గించును. అట్టి పారమార్థిక జ్ఞానమును నిస్వార్థముగ అనుగ్రహించు గురుమూర్తి అత్యంత స్తవనీయుడు. శిష్యుల అంతఃకరణములందు జ్ఞానజ్యోతిని వెలిగించి అంతఃకరణమందలి అజ్ఞానాంధ కారమున పటాపంచలుగావించి ఆత్మ వస్తు సాక్షాత్కారము గలిగించి పిదప పరిపూర్ణ బోధచే జ్ఞానాజ్ఞానరూపమగు యెరుకకుకూడ వేరు పెకలించి సంసార మహా వృక్షమును నాశనము గావించి జన్మ రాహిత్యము గలిగించు సద్గురుదేవుల నహరహమును సేవించుచుందుము గాక!

శ్లో॥ సంసార సాగర సముద్ధరణైక మంత్రం
బ్రహ్మాది దేవ మునిపూజిత సిద్ధమంత్రం
దారిద్ర్య, దుఃఖ, భవరోగ వినాశమంత్రం
వందే మహా భయహరం, గురురాజ మంత్రం

తాత్పర్యము : సంసార మహా సముద్రము నుండి ఉద్ధరించునదియు, బ్రహ్మాది దేవతలచేతను, మునిపుంగవుల చేతను అనుష్టానము చేయబడి సర్వసిద్ధులు నొసంగినది యును, దారిద్రమును, దుఃఖమును భవరోగమును నాశనము చేయునదియును, మహా భయమును, పోగొట్టు నదియును అగు శ్రేష్ఠమైన గురు మంత్రమునకు నమస్కారము చేయుచున్నాను.

విశేష వివరణము : ఈ శ్లోకము నందు 1) సముద్ధరణము, 2)దారిద్ర్యము 3) దుఃఖము 4) భవరోగము 5) మహా భయము 6) గురురాజమంత్రం అనుపదములను విచారించి తెలుసుకొనవలసియున్నది.

1) సముద్ధరణం = సం + ఉత్ + ధరణము అనగా చక్కగా పైకి ఎత్తుట అని అర్థము. సంసారమనే మహా సముద్రములో మునిగి పోకుండా పైకెత్తి రక్షించుట అని ప్రకృతా ర్థము. పూర్వ పూర్వ శుభా శుభ కర్మ పరంపరలు, ఉత్తరోత్తర జన్మ కర్మలకు కారణంగానుంటూ వుండుటవల్ల జీవుడు జన్మపరంపర లెత్తుచుండుటయే సంసారము. సముద్రమువలె దీనికిన్ని పారము లేకపోవుటచే సముద్రముతో పోల్చినారు. నడిసముద్రములో నున్నవాడు దానికి ఒడ్డు లేకపోయినచో ఎట్లు రక్షింపబడగలడు? యే హెలికాప్టరు విమానమో వచ్చి వానిని పైకెత్తి ఏ దిశలోనో కొన్ని వేల మైళ్ళు ప్రయాణం చేసి వానిని రక్షించవలసినదే. అట్లే సారములేని సంసారాబ్ధి నుండి రక్షించవలెనంటే గురుమూర్తి అనే హెలికాప్టరు వచ్చి పైకెత్తి రక్షించవలసినదే. ఏలననగా ఆ మహా సముద్రము అష్టదిక్కులయందునూ అధోదిశయందునూ వ్యాపించియే యున్నది. ఒక్క పూర్వ దిశయందు మాత్రము రక్షణ మార్గం కలదు. అట్లే "ఊర్ధ్వామ్నాయ గురోఃపదం" అని కొనియాడ బడిన ఆస్థానమును (సంసార సముద్రమున, మునకలిడు సచ్ఛిష్యునికి) చూపించి ఆ స్వరూపమును అనుగ్రహించువాడు గురుమూర్తియే. హెలికాప్టరువంటి సాధనమే గురుమంత్రం. ఆ గురుమంత్రము ద్వారా గురుమూర్తి శిష్యులను సంసార మహా సముద్రము నుండి సముద్ధరించగలడు. దేనినుండి పుట్టినదో దానియందే లయము కావలె. ప్రభవస్థానమేదో అదే ప్రళయస్థానము. అదే సంసార మూల కారణము. అట్టి మూల కారనమగు తన స్వరూపమును శిష్యునికి ప్రసాదించుటయే గాక దాని నతిక్రమించిపోవు మార్గమును (పరిపూర్ణ భావము) కూడా తెలియపరచి శాశ్వత జన్మ రాహిత్యమును శిష్యులకు చేకూర్చుట ద్వారా శిష్య సముద్ధరణ గావించుచున్నాడు.

2) దారిద్ర్యము : అనగా లేమిరికము. ఏది లేకపోయినా అది దారిద్ర్యమే. కాని గొప్ప దారిద్ర్యమేది? ఏది గొప్ప వస్తువో, ఏది అత్యంత ప్రాముఖ్యముగల వస్తువో,అది

లేకపోవుటయే గొప్ప దారిద్ర్యము. జ్ఞాన సంపత్తికన్న గొప్ప సంపదలేదు. అట్టి జ్ఞాన సంపత్తి లేకపోవుటయే గొప్ప దారిద్ర్యము. ఇట్టి జ్ఞాన దారిద్ర్యమునకే అజ్ఞానమనిపేరు. ఆది శంకరులు అసంతృప్తియే మహా దరిద్రమన్నారు. అంతేకాకుండా "కౌపీనవంతఃఖలు భాగ్యవంతః" అనగా నాది అనే మమకారము లేనివాడే భాగ్యవంతుడు. వానికెట్టి యసంతుష్టి గాని, ఆశగాని, లేదు. అజ్ఞానము (లేక జ్ఞాన దారిద్ర్యము) గురుమూర్తియొక్క దివ్య ప్రబోధముచే గాని తొలగదు. తత్వదర్శి అగు గురుమూర్తి ఒక్కడే అజ్ఞాన నాశనముచేయు జ్ఞానోపదేశము చేయగలడు. "ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్వదర్శినః" అని గీతావాక్యము గదా!

3) దుఃఖము : ఇది సుఖ దుఃఖములను ద్వంద్వములోనిది. 'ఖం' అనగా ఆకాశము. 'సు' అనగా మంచిది. 'దు' అనగా చెడ్డది. సుఖం అనగా మంచి ఆకాశము. సుఖ దుఃఖములను గుర్తించి అనుభవించునది ఆకాశము యొక్క సమిష్టి భాగమగు అంతఃకరణము. శబ్దాది విషయరూపమగు సుఖదుఃఖానుభవముచే రాగద్వేషములు, సంస్కారములు ఏర్పడుచున్నవి. వీనికన్నిటికి మూలకారణమగు వ్యష్టి సమిష్టి రూపమగు అంతఃకరణముయొక్క సత్యాసత్యము లను మన కెరిగించి దుఃఖనాశనము గావించువాడు సద్గురువు అయివున్నాడు.

4) భవరోగము : భవము అనగా పుట్టుట. పుట్టినది గిట్టక తప్పదు. పుట్టుట గిట్టుట లనేవి రెండునూ యీ భవరోగలక్షణములే. ఈ వ్యాధికి మూల కారణమేదియో దానిని నన్వేషించి దాని రహితము చేయగలగు గురుమూర్తి. "భవమూల వినాశాయ" అని కీర్తింపబడుచున్నాడు.

5) మహా భయం : సాధారణంగా మరణము కంటె మహాభయంకరమైనది మరొకటి లేదందురు. ఏలయనగా వేయి వృశ్చికములు ఒక పర్యాయము ఒకేస్థానమందు కుట్టినచో నెంతభాదయో అంతటి బాధ మరణబాధయని అంటారు. కాని మరణమెంతటి బాధాకర విషయమైనా దానిని యేరికోరి ఎంతమంది ఆహ్వానము చేసి గొనుచున్నారు? అంతటితో వారి కష్టములన్నిటికి విముక్తి కలుగునని వారి యాస. "పుట్టినవారు చచ్చుట తప్పదు. అట్లే చచ్చిన వారు తిరిగి పుట్టుక తప్పదు. సద్గురు బోధవలన జన్మరాహిత్యము సాధించినవారు మాత్రమే తిరిగి పుట్టరు" అన్న విషయం వారికి తెలియదు. ఆ విషయం తెలిసిన వారు మాత్రమే మరణమన్నచో భయపడెదరు. వారి భయము చావును గురించికాదు. పుట్టి యనేక బాధలు పడవలసి వచ్చునేమో అని మాత్రమే వారి భయము. గర్భ నరకమును భరించి బహు కష్టముపై భూమి మీద పడుట గూడా మహాక్లేశముతో గూడినదే. కనుక మహాభయంకరమైన మీ జనన మరణములేనని చెప్పనగును.

6) గురురాజమంత్రం : గురువు లనేక విధములుగా నున్నారు. అష్టవిధములగు గురువులు చెప్పబడినారు. వారందరిలో జనన మరణ రూప సంసారబ్ధి నుండి సముద్ధరించగల పరిపూర్ణ గురువే గొప్పవాడు. అతడు కేవలం గురుస్సాక్షాత్, పరబ్రహ్మమని కీర్తింప దగినవాడు. అతడే గురుచక్రవర్తి. మరిన్ని "సప్తకోటి మహామంత్రాశ్చిత్త విభ్రమ కారకాః యేక మేవ పరో మంత్రో గురు రిత్య క్షరద్వయం" అని "గురు" అను రెండక్షరములే మహా పటిష్టములుగా అనగా శక్తివంతములుగ చెప్పబడినవి అట్టి సద్గురూత్తముడు ఏ మంత్రమును సంసార

మూలచ్ఛేదమునకై సచ్ఛిష్యుని కుపదేశించునో అదియే గురురాజ మంత్రము "మననాత్ త్రాయతీతి మంత్రః" అనగా దేనిని జపించుటవలన సంసార మహా భయమునుండి రక్షింపబడు చున్నాడో అదియే మంత్ర రాజము, అదియే గురురాజ మంత్రం, ఈ శ్లోకములో ఆ మంత్ర మహిమను వర్ణించియున్నారు. ఆ మంత్రానుష్టానము గావించి "సామర్థ్యభజన స్సర్వే బ్రహ్మ విష్ణు మహేశ్వరా" అనగా త్రిమూర్తులు ఆ మంత్రానుష్టానము చేతనే మహా మహిమన్వితులైనారు అని గురుగీత అన్యత్ర కీర్తించుచున్నది. అట్టి దివ్య మంత్రము "గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యధా గ్రంథ కోటిభిః" ఆ మంత్ర మంత్రార్థ మంత్ర రహస్యములు గురుముఖతః మాత్రమే తెలియ దగినవి. గ్రంథస్తము చేయబడినను వానివలన శిష్యుడు తరించలేడు. "గురుమంత్రం ముఖే యస్య తస్య సిద్ధ్యంతి నాన్యధా" అట్టి మంత్రము దెలిసిన శిష్యునికే సర్వ సిద్ధులు ప్రాప్తించును. అట్టి గురుదేవుల దివ్యపాదారవిందములు మమ్మెల్లపుడు రక్షించుగాక!

శ్లో॥ దుస్సంగంచ పరిత్యజ్య పాపకర్మ పరిత్యజేత్
చిత్రచిహ్నా మిదం యస్య తస్య దీక్షావిధీయతే॥

తాత్పర్యము : దుష్ట సాంగత్యమును విడచిన వానికి పాపకర్మలను చేయనివానికి మాత్రమే గురుదీక్ష యివ్వవలెను.

శ్లో॥ చిత్త త్యాగ నియుక్తశ్చ క్రోధ, గర్వ వివర్జితః
ద్వైత భావ పరిత్యాగీ తస్య దీక్షా విధీయతే॥

తాత్పర్యము :విషయ చింతన చేయనివానికిని, క్రోధ, గర్వాదులను వదలిన వానికిని, ద్వైత భావము లేనివానికిని మాత్రమే గురుదీక్ష ఈయదగును.

శ్లో॥ ఏతల్ల క్షణయుక్తత్వం సర్వభూతహితే రతం
నిర్మలం జీవితం యస్య తస్య దీక్షావిధీయతే॥

తాత్పర్యం : పై రెండు శ్లోకములలోను చెప్పబడిన లక్షణములు కలవానికిన్నీ సర్వప్రాణులకు మేలుచేయ కోరువానికిని పరిశుద్ధ జీవనము కలవానికిని మాత్రమే గురుదీక్ష ఈయతగును. అని ఈ మూడు శ్లోకములలోను గురుమంత్రమును ఉపదేశము పొందుటకు ఉత్తమాధికార ఎవరో నిర్ణయింపబడినది. అయితే నేడు గురుమంత్రమును పొందెడివారందరు పైన పేర్కొన బడిన ఉత్తమ లక్షణములు కలవారేనా? అని శంక కలుగుట సహజము. నిజమే ఉపదేశము పొందునాటికి ఇట్టి సద్గుణ సంపత్తి కలవారలు నూరింట ఒకరు, వేయింట నొకరు కూడ వుండరేమో! అంతమాత్రముచే వారు పొందిన ఉపదేశము కేవలము నిష్ప్రయోజనము కాదు. ఏలననగా మంత్రోపదేశము అయిన పిమ్మటనైన నిజమైన గురుపుత్రునికీ ఇట్టి సద్గుణ సంపత్తి ఉండవలె కదా అని క్రమశః తెలుసుకొని అట్టి సుగుణ సంపద అలవరుచుకొనుట ప్రారంభించి నచో కొంత కాలమునకైన అట్టి గురుపుత్రుడు కృతార్థుడు కాగలడు.

గురుమంత్ర దీక్ష నొసంగు గురువులు అధికార తారతమ్యము గుర్తించి అందరికీ ఉపదేశ మిచ్చుట,మానివేయుట సమంజసమేమో అని కొందరనవచ్చును. కాని జన్మ రహితము

గావించుకొనవలెనని శుభ సంకల్పముతో వచ్చి ఉపదేశ మిమ్మని యాచించిన వ్యక్తికి నీ వెట్టివాడవో నే పరీక్షించిన గాని నీకు ఉపదేశ మీయను అని చెప్పి పంపివేయుట సమంజసమా? లేక ఈతని పూర్వపుణ్య విశేషమున ఈతని కిట్టి శుభేచ్ఛ కలిగినది కనుక ఉపదేశ మిచ్చి ఇతనిని సక్రమమైన మార్గమునందు నడిపించి ఉత్తీర్ణుని గావింతము అని చేరదీసి మరుమార్గము నందు కృషి చేయించుట సమంజసమా? నేటి దేశ కాల పరిస్థితులలో పారమార్థిక చింత కలిగి జన్మరాహిత్యము ఆశించెడివారే "మనుష్యాణాం సహస్రేషు" అనే విధముగా వేయింట నొక్కరు గూడ వుండరు. గనుక అట్టి శుభ సంకల్పముతో వచ్చిన జిజ్ఞాసిని "శుభస్య శీఘ్రం" అని వెంటనే ఉపదేశ మిచ్చి అతనిని క్రమశిక్షణలో నుంచి కడతేర్చుటయే గురువుల కర్తవ్యమని చెప్పక తప్పదు.

విశేష వివరణము : 1) శ్లోకము 1) దుస్సంగము 2) పాపకర్మ

1) దుస్సంగము : సంగ మనగా కూడిక లేక చేరిక. దుస్సంగము అనగా చెడ్డవారితో చేరుట లేక చెడ్డ అలవాట్లు చేసుకొనుట. సహజముగా తానెంత మంచివాడైననూ దుష్టుల సాంగత్యము చేత ఆ మంచితనము అడుగంటుటయేకాక వారి చెడ్డగుణములే తనకు సంక్రమించును. తెల్లటి దుస్తులు ధరించినవాడు. ఒక బొగ్గుల బస్తా చెంత కూర్చున్న యెడల తనకు తెలియకుండగనే తన దుస్తులన్నియు నల్లబడిపోవుట ప్రత్యక్షమేకదా! అట్లే దుష్టుని చెంతకు పోయినంత మాత్రముననే క్రమశః వారి దుష్ట గుణములు తనకు సంక్రమించును. అట్లే సజ్జన సాంగత్యముచే సజ్జన లక్షణములను సంక్రమింపగలవు. మంచిగంధపు చెట్ల నడుమనున్న వేపచెట్టుయొక్క కలప కూడ మంచి గంధమునే వెదజల్లు చుండును. Tell me your friends and I will tell you. Who you are? అనగా నీ స్నేహితులెవరో చెప్పుము. నీవెరో చెప్పెదను అని ఆంగ్లములో ఒక వాక్యమున్నది. అట్లే తెలుగులో "ఆరునెల్లు సహవాసము చేస్తే వారు వీరౌతారు" అని అంటారు. గురుభక్తుడు కాబోయే వాడు లేక గురుమంత్ర దీక్ష ఇదివరలోనే గైకొన్న వాడు దుష్టుల సాంగత్యమునకు దూరముగా నుండవలె. కనుకనే శ్రీకృష్ణ దేశికేంద్రులవారు "కలలోననైన దుష్టుల చెంత చేరకు" అని శెలవిచ్చినారు.

2) కర్మ మనగా పని. పాపకర్మ అనగా చెడ్డపని. సాంఘికముగా యోచించనచో దేశకాలముల బట్టి ధర్మాధర్మములు లేక పుణ్యపాపములు మారుచుండును. దేశాచారమునుబట్టి ఒక దేశములో ఒక స్త్రీ ఒక భర్త కంటె ఎక్కువ మందిని పెండ్లాడుట పాపము గావచ్చు. మరొక దేశములో ఒక స్త్రీ ఎక్కువమంది పురుషులను పెండ్లాడవచ్చును. అట్లే భిన్నభిన్న మతముల యందు భిన్న భిన్న ఆచారములు మంచివిగానో చెడ్డవిగానో నిర్ణయింపబడుచున్నవి. దేశము, కాలము, మతము, కులము మొదలగు వాని భేదముల వలన ఏర్పడిన ఆచారముల బట్టి పాపపుణ్యములు యిదమిద్ధమని నిర్ణయింపరాదు. అట్లు గాక సకల దేశముల వారికి, సర్వులకు నిర్ణయింపబడిన ధర్మములే మనము లెక్కలోనికి గైకొనవలెను. ఆ విధముగా యోచిస్తే పాపమునకు నిర్వచనము ఏమి? అంటే "పరోపకార పుణ్యాయ పాపాయ పరపీడనం" అని చెప్పబడిన రీతిగా ఇతరులకు ఉపకారములు చేసేవి

పుణ్యము, అపకారము చేయునవి పాపము అని తేలుచున్నది. ఇప్పుడు పాపకర్మ అనగా నేమి? అంటే మనము చేసిన పనివల్ల ఏ ఇతర ప్రాణికి ఎట్టి కష్టము కలిగినను అట్టి పని పాపకర్మ అని చెప్పక తప్పదు.

2) వశ్లోకము : విశేష వివరణము : 1) చిత్త త్యాగ నియుక్తశ్చ 2) ద్వైతభావ పరిత్యాగీ.

1) చిత్త త్యాగ నియుక్తశ్చ : చిత్త త్యాగమనగా చింతన చేయుట అనేది వదలుటయే కాని చిత్తమునే వదలుటకాదు. ఏలననగా ఒక్క అంతఃకరణమే చింతన చేయునపుడు చిత్తమనబడును. చిత్తము వదలుట యనగా అంతఃకరణము వదలుటయే. అంతఃకరణమునే వదలిన వానికి గురుమంత్రముకాని, దీక్షతో గాని ఏ ప్రయోజనమున్నూ లేదు. అంతఃకరణము వదలుట అనేది ఆరూఢుని లక్షణము. ఈ శ్లోకము అభ్యాసకుడు ఎట్లుండవలెనో విధించు చున్నది. ఎట్టి చింతన వదలవలయును? దైవచింతన, మంత్రచింతన మొదలగు వన్నియు చింతనలే కదా! మంచి చింతన వదలి పెట్టుట అని అర్థము కాదు. పాపచింతనలను మాత్రమే వదలవలెను.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేపజాయతే
సంగాత్ సంజాయతే కామః కామత్క్రోధోభిజాయతే॥

అంటూ భగవద్గీత మానవుడు ఎట్లు నాశనము చెందుచున్నదీ పరంపరగా వర్ణించినది అందు "ధ్యాయతో విషయాన్ పుంసః" అనగా విషయములను గురించి ధ్యానించినచో అని అర్థము. ఇది మానవుని పతనమునకు ప్రథమ సోపానము. శబ్దాది పంచ విషయములచే ఆకర్షింపబడి ఆ విషయములను గురించి చింతన చేయుట వలన క్రమశః మానవుడు పతితుడగును. విషయచింతన దూష్యము. శబ్దాది విషయములను గురించి చింతన చేయకుండుటయే చిత్తత్యాగము. "నియుక్తశ్చ" అనగా దీక్ష వహించుట. చిత్త త్యాగ నియుక్తశ్చ అంటే పంచతన్మాత్ర విషయములను గూర్చి ఎన్నడును చింతన చేయకుండ నుండవలెనన్నమాట.

2) ద్వైతభావ పరిత్యాగీ : రెండు అను బుద్ధియే ద్వైత భావము. ఆ రెండూ ఏవనగా 1) బ్రహ్మము 2) విశ్వము. మరల ఆ విశ్వమందు అనేకత్వము ప్రత్యక్షమే. అయినను విశ్వసృష్టికి పూర్వాపరములయందు ఉన్నది ఒక్కటే కాని రెండు లేవు. ఆద్యంతములయందు లేని అనేకత్వము మధ్యలో కానవచ్చుచున్నది. ఇది పారమార్థికముగా మిథ్య అని తెలుసుకొనుటయే ద్వైత భావ పరిత్యాగము. అప్పుడు విశ్వము కూడా బ్రహ్మమే "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్టం" అని శ్రుతి. ద్వైత భావమే లేనిచో స్వార్థబుద్ధి క్రమశః లుప్తమైపోవును. పారమార్థిక జీవితమునకు ద్వైత భావము సాధ్యమైనంతవరకు తొలగించుకొనుట ముఖ్య కర్తవ్యము. అప్పుడుగాని "ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ" "సర్వం ఖల్విదం బ్రహ్మ" "నేహ నానాస్తి కించన" మొదలగు శ్రుతుల అభిప్రాయము ఆరూఢత చెందబోదు.

3) వ శ్లోకము : విశేష వివరణములు : 1) సర్వభూత హితే రతం 2) నిర్మలం జీవితం 1) సర్వభూత హితేరతం : సర్వభూత అనగా సర్వప్రాణుల శ్రేయస్సునకై పట్టుదల వహించుట. ఇట్టి పట్టుదల ద్వైత భావ పరిత్యాగమువలన వృద్ధి యగును. తనతో సహా

విశ్వమంతయు ఒకే పరమాత్మ స్వరూపమను దివ్యజ్ఞానము కలుగుటకు ఇది యెంతయో తోడ్పడును. అహంకార మమకారములు తొలగి మానవుడు మాధవుడే కాగలడు.

2) నిర్మలం జీవితం : పరిశుద్ధమగు జీవిత విధానమే నిర్మల జీవితము. ఏ ప్రాణికి ఎట్టి హింస జరుగని పద్ధతిలో స్వకష్టార్జితమగు ద్రవ్యముచే పొట్ట పోసుకొనువాని అంతఃకరణము ఎట్టి మలినము లేక స్వచ్ఛమగు స్ఫటిక మణితో సమానముగా ప్రకాశించుచుండునో, అట్టి శుద్ధ అంతఃకరణము నందు ఆత్మ చక్కగా ప్రతిఫలించును. అంతేకాదు, ఆ అంతఃకరణమే ఆత్మ అయివుండును.

ఇట్టి సద్గుణ సంపత్తి కలవానికి గురుమంత్ర దీక్ష ఉండినచో ఇంక కొదువ ఏమి?

శ్లో॥ గురుమంత్రో ముఖే యస్య, తస్య సిద్ధ్యంతి నాన్యథా
దీక్షయా సర్వ కార్యాణి సిద్ధ్యంతి గురుపుత్రకే॥

అను శ్లోకమును గతంలో వ్యాఖ్యానించినాము. గురుమంత్రము జిహ్వాగ్రమున ఎల్లప్పుడును నడుపుచున్నవాడైనను పై లక్షణములు లేనివానికి గురుమంత్ర సిద్ధి కలుగుట దుర్లభము అని గుర్తించి గురుపుత్రులు పై సద్గుణము లన్నియు ప్రయత్న పూర్వకముగా పట్టుదలతో సాధించ వలయును. ఇట్టి దివ్యప్రబోధమును అనుగ్రహించు గురుదేవుల పాదపద్మములకు అహరహము అనేక సాష్టాంగ నమస్కారములు.

శ్లో॥ గురుప్రసాదతః స్వాత్మన్ స్వాత్మారామ నిరీక్షణాత్
సమతా ముక్తి మార్గేణ స్వాత్మజ్ఞానం ప్రవర్తతే॥

తాత్పర్యము : గురుకృపా ప్రసాద సిద్ధిచే తనయందు పరమాత్మను చూచుట, సమభావము, ముక్తిమార్గము, పరమాత్మ జ్ఞానమును గల్గుచున్నవి

విశేష వివరణము : 1) గురుప్రసాదతః 2) స్వాత్మని 3) ఆత్మారామ 4)సమత 5) ముక్తి మార్గము 6) స్వాత్మ జ్ఞానం ప్రవర్తతే

1) గురుప్రసాదము : సాధము అనగా అన్న స్వరూపమైనది. అనగా తినబడేది. పక్వాపక్వ ఆహారము లన్నియు అన్నమే ప్ర+సాదము = శ్రేష్ఠమైన ఆహారము. శ్రేష్ఠమనగా శరీర మనః ప్రాణ ఆత్మలకన్నిటికి మేలుచేయునది ఏదియో అదే ప్రసాదము.

శ్లో॥ ఆయుస్సత్వ బలారోగ్య సుఖసంతోష వివర్ధనాః
రస్యాస్నిగ్ధాః స్థిరాహృద్యా................

అనగా ఆయువును, సత్వగుణమును, బలమును, ఆరోగ్యమును, సుఖసంతోషముల పెంపొందించు నవియును, రసవంతములై, చమురు గల్గి, చిరకాలముండునవియును, చూచుట కింపైనవియగు నాహారము శ్రేష్ఠమగు నాహారము. మరియును శరీర మనఃప్రాణ ఆత్మలలో అన్నిటికి తేజోబలములు గలిగించునదే శ్రేష్ఠమగు నాహారము, అదియే ప్రసాదమని చెప్పదగియున్నది.

మనము తిను ఆహారము ముఖ్యముగా పృధ్వీసంబంధమగు కఠిన పదార్థములు, జలసంబంధమగు ద్రవ్యపదార్థములున్నుగాక, అగ్ని సంబంధమగు చమురుపదార్థములున్ను వీనివలన సూక్ష్మాంశములగు మనఃప్రాణ వాక్కులకు మన శరీరము నందు బలమేర్పడుచున్నది. అన్న సూక్ష్మములగు శుక్ల శోణిత సంయోగం చేత బుట్టి, అన్నముచే పెరిగి తుదకు మరణించి పృధ్వీరూపమగు అన్నమే అగుచున్నందున స్థూల శరీరం అన్నమే. వాగ్రూపమగు ధర్మ సూత్రములచే ధర్మము రక్షింపబడుచున్నది. వాక్కుకూడా అన్న స్వరూపమని, ప్రాణము పంచప్రాణరూపంగా శరీరమును ధరించి భరిస్తున్నది. ప్రాణముకూడా అన్నమేనని, ప్రాణ ధర్మమగు ఆకలిదప్పుల నివారణ మనస్సు యొక్క సంకల్పముపై నాధారపడియున్నందున మనస్సు అన్న స్వరూపమని, సూర్య మండలమందున్న ఆదిత్యుడను అధిష్టాన దేవత యొక్క సమిష్టి సంకల్పము, అనగా సమిష్టి అంతఃకరణము యెనుబది నాలుగు లక్షల జీవోపాదుల సృష్టి స్థితి లయములకు నాధారముగా నున్నందున ఆదిత్యుడుకూడా అన్న స్వరూపుడని, సూర్యచంద్రాదులు కూడ దేనిని ప్రకాశింపచేయ జాలవో కాని దేనియొక్క స్వప్రకాశముచే ప్రభావితులై ప్రకాశించుచున్నవో అట్టి ఆత్మ ప్రకాశమే ఆదిత్యునికి తద్వారా సమస్త బ్రహ్మాండభాండములకు అన్న స్వరూపముగా నున్నది. "అన్నం బ్రహ్మేతి వ్యజానాత్" అని చెప్పబడిన రీతిగా అధిష్టాన చేతన బ్రహ్మము కూడా అన్న స్వరూపమైయున్నది. శ్రేష్టమగు అన్నమంటే పరమాత్మయే. ఆ పరమాత్మ స్వరూపమును సాక్షాత్కారింపచేయుటే గురువిచ్చు శ్రేష్టమైన ప్రసాదము. అనగా గురుకృపా విశేషముండినగాని ఎంతటి ప్రతిభావంతునికైన ఆత్మజ్ఞానమే కలుగదు. అధవా కలిగినను బుద్ధినిశ్చయమే అనగా పరమాత్మజ్ఞానమగును. గాని ఆత్మ నిశ్చయము అనగా అపరోక్ష జ్ఞానము సిద్ధింపదు. అద్వైత సిద్ధి అనగా స్వరూప సాక్షాత్కారము కాజాలదు. గురుకృపలేకున్నచో ఆ వస్తు సాక్షాత్కార మెన్నడును కలుగజాలదు. కనుక గురుకృపయే గురుప్రసాదమని గురుగీత విపులపరిచింది. అట్టి గురుకృప యెట్లు సిద్ధించును? గురునికి శరణాగతుడై గురుభక్తి గురుసేవ గురునిష్ట పూని యితరాపేక్షలేమియు లేక గురుకృపాసంసిద్ధికొరకే అనుష్టానాదికములు చేయు గురుభక్తినికి మాత్రమే అది సాధ్యము.

2) స్వాత్మని : అనగా తనయొక్క ఆత్మలో అని అర్థము. ఆత్మ శబ్దము జీవాత్మ ప్రత్యగాత్మ పరమాత్మల కన్నిటికీ వర్తించును. అంతఃకరణయే జీవుని కుపాధి ఆత్మని అనగా అంతఃకరణమందు (మనస్సు లేక చిత్తములో) అని అర్థము. చక్షురింద్రియము వర్ణాత్మకములగు (అనగా రంగులుగల) సాకార వస్తువులను మాత్రమే గుర్తింప గలుగును. అంతఃకరణ మట్లుగాక నిరవయవము. నిరాకారము, నిర్గుణము అని చెప్పబడినవానిని గూడ తనయందు ప్రతిబింబింపచేసుకొని లేక వానితో సంయోగపడి తద్రూపమును వహించు చుండును. అద్దము మొదటి దానికిన్నీ స్ఫటికం రెండవదానికిన్నీ ఉదాహరణము అంతఃకరణకీ శక్తి యెక్కడిది? అది జడరూపమైన యింద్రియము వంటిదే. దాని పేరే అంతః=లోపలి+కరణము= పని ముట్లు=లోపలి పనిముట్టు) సూచించుచున్నది. పనిముట్టుకు చైతన్య మెక్కడిది? పనివాని చేతపడినపుడే అద్ధి వాని చేతనముచే ప్రభావితమై తాను పనిచేయగలుగుచున్నది. ఉదాహరణకు

భూత అద్దము జడమైనను సూర్యప్రకాశము దానినుండి ప్రసారమైనప్పుడు అట్టి సూర్య కిరణమునకు దాహక శక్తికల్గి కాల్చగలుగుచున్నది. అట్టి అంతఃకరణ స్వతఃజడమే అయినను అధిష్టాన చైతన్య రూపములతో కూడినప్పుడు సమస్త వృత్తులు పొడముచున్నవి. బహిర్ముఖమై ప్రపంచములో చేరి శబ్ద స్పర్శాదులను గుర్తించుచున్నది. అంతర్ముఖమై ఆత్మ సాక్షాత్కారమే పొందుచున్నది. స్వాత్మని యనగా జీవునియొక్క యిట్టి అంతఃకరణ విశిష్ఠచేతనమునందు అని అర్థము.

3) స్వాత్మారాముడు : అనగా స్వ=తనయొక్క ఆత్మ=అంతఃకరణమును + రామ= ఆనందమును కల్గించువాడు = జడమగు తన అంతఃకరణకు ఆనందము యెట్లు కలుగును? అధిష్ఠాన చేతనము వలననే అని గుర్తించితిమి కదా! ఐతే యీ అధిష్ఠాన చేతనము సర్వకాల సర్వావస్థలయందు నున్నది గదా? సర్వకాల సర్వావస్థలయందు ఆనందముతోనే యుండవలెను గాని ఒకప్పుడానందము, మరొకప్పుడు దుఃఖము కలుగుచుండనేల? అను ప్రశ్న తప్పక విచారించదగినదే. బాహ్యస్పర్శలు అనగా శబ్ద స్పర్శ రూప రస గంధములు, సుఖ దుఃఖములు, రెంటిని చేకూర్చు ద్వంద్వ స్వరూపములుగా నున్నవి. ఉదాహరణకు స్తోత్ర పాఠముచే భూషించిన సుఖము, దుర్భాషలచే దూషించిన దుఃఖము కలుగుచున్నవి. అట్లే జ్ఞానేంద్రియములచే తెలియు విషయ పంచకమునం దిట్టి ద్వంద్వ లక్షణము లిమిడియున్నవి. అంతఃకరణ వృత్తి బహిర్గతమైనపుడు యీ తిప్పలు తప్పవు. పంచతన్మాత్రలు వ్యష్టిగా నున్నపుడు విషయురూపకములై నుఖదుఃఖాత్మక మగుచున్నవి. కాని బ్రహ్మమునందవి బీజరూపముననున్నపుడు ఏకరసమై కేవలం ఆనంద కారణములై యున్నవి. కనుక అంతఃకరణ వృత్తి అంతర్ముఖమై ఆత్మాకారము (బ్రహ్మాకారము) చెందునపుడు ఆత్మయొక్క స్వరూపానందము మాత్రమే ప్రకాశించి అంతఃకరణకు అఖండానందము కల్గించును. విషయపంచకమనునది విషయానందము యిది అత్యల్పము. నశ్వరము, దుఃఖాత్మక క్రమమునై యుండును. విషయముల వలన కల్గిన సుఖదుఃఖములు క్షణికములు. "సంతోషాసంతోషము లంతలో గానవచ్చి పిదప నరుగు నెచటికో వింతైయున్నది. చూచితే " అన్నారు కృష్ణదేశికులు తమ కందార్థములలో, విషయానంద, బ్రహ్మానందముల తారతమ్యమును ఆనందవల్లి (తైత్తిరీయోపనిషత్) లో చూడనగును. విషయానందమే మనుష్యానందము. దీనిపైన 1) మనుష్యగంధర్వానందం 2) దేవగంధర్వానందం 3) పితృ దేవతల ఆనందము 4) అజానజానదేవానందం 5) కర్మదేవానంద 6) దేవానంద 7)ఇంద్రానందం 8) బృహస్పత్యానందం 9) ప్రజాపత్యానందం 10) బ్రహ్మానందం. ఇందుదహరించిన పూర్వపూర్వానం దములకంటె వుత్త రోత్తరానందములు నూరురెట్లు హెచ్చు అని చెప్పబడినది. అనగా మనుష్యానందంకంటె నూరురెట్లు మనుష్య గంధర్వానందం, దానికంటె నూరురెట్లు దేవగంధర్వానందం, యిట్లా చూస్తూ పోతే మనుష్యుల విషయానందంకంటే బ్రహ్మానంద మెన్నిరెట్లో తెలియనగును. 100 x 10 100 x 100 x 100 x 100 x 100 x 100 x 100 x 100 x 100 x 100 = 100000000000000000000 రెట్లు విషయానందము కంటె

బ్రహ్మానందం హెచ్చన్నమాట. అనగా ఒకట వేసి యిరమై సున్నలు చుట్టితే ఏ సంఖ్యవచ్చునో అన్నిరెట్లు బ్రహ్మానందము విషయానందము కంటె హెచ్చన్నమాట. ఆత్మారాముడు అనగా అంతఃకరణమున రమించి ఆనందపరచువాడు. అనగా అంతఃకరణా ధిష్ఠాన చేతనము. యిదియే ప్రత్యగాత్మ.ప్రత్యగ్బ్రముల కభేదము కదా! అంతర్ముఖుడై ఆత్మావలోకనము చేసిన బ్రహ్మానందానుభవము కలుగును. ఈ ఆత్మావలోకనము చేయుటకు ఆత్మవస్తువేదో గురుప్రసాదం వల్లనే తెలియవలెను. అట్టి ఆత్మావలోకనము వలన తత్కాలమున గలుగు బ్రహ్మానందమే గాక సమతయు, ముక్తి మార్గమును సిద్ధించి ఆత్మజ్ఞానము కలుగును అని శ్లోకముద్ఘాటించుచున్నది.

4) సమత = అనగా సమత్వము "సమత్వం యోగముచ్యతే" అనగా సమత్వమే యోగమని చెపుతోంది గీత. దేనియందు సమత్వము. శత్రుమిత్రులు, శీతోష్ణములు, సుఖదుఃఖములు, లాభాలాభములు, జయాపజయములు యీమొదలగు సర్వద్వంద్వ లక్షణముల యందు సమదృష్టి కల్గియుండుట, అంతఃకరణయందీ మార్పు కలిగినపుడు అతడు ద్వంద్వాతీతుడు అని చెప్పబడును. సర్వము నందు ఆత్మను చూడగల్గిన ఆత్మదృష్టి అలవడినపుడే యిది సాధ్యముగదా!

5) ముక్తిమార్గేణ = యిట్టి ఆత్మదృష్టి కల్గినపుడే ముక్తి మార్గము తెలియనగును. దేనినుంచి ముక్తి? కర్మబంధము నుండియే కర్మబంధమునుండి ముక్తి అనగా కర్మయే మానుటగాదు కర్మఫలితము అంటకుండునట్లు కర్మచేయు కర్మ కౌశలము, "యోగః కర్మసు కౌశలం" అనికూడా గీత అంటున్నది. కర్తృత్వ త్యాగ పూర్వకముగ కర్మచేయమంటూంది. ఆ కర్తృత్వ రహిత విధానం ఒక్క పరిపూర్ణ బోధచేతనే చిక్కగలదు. ముక్తిమార్గం చిక్కుననగా పరిపూర్ణ బోధయున్ను గురుప్రసాదముచేతనే చిక్కగలదన్నమాట"అపరోక్షమౌనె మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృపలేకన్" అనీ. "ఎరుక తనకు తవీడిపోదు ఎరుకను విడిపించలేరు ఎవ్వరుధాత్రిన్ గురుడొకడు దప్ప" యనీ కృష్ణదేశికులు కందార్థములలో శెలవిచ్చియున్నారు.

7)స్వాత్మజ్ఞానం ప్రవర్తతే = ఆత్మజ్ఞానము అనగా తన యందు సర్వము, సర్వము నందూ తనను అనే అఖండ జ్ఞానం కలుగుట. యిట్టిది కేవలం భావరూపంగా మాత్రమే గాక తనయొక్క సర్వకర్మలయందు అట్లు ప్రవర్తించు శక్తిసామర్థ్యములు కలుగుటే స్వాత్మజ్ఞాన రూపమగు ప్రవర్తన. ఇట్టి ఆచరణ కల్గుట కూడా గురుప్రసాదమువల్లనే అని తెలియనగును. యిట్టి ఆత్మసాక్షాత్కార జనిత బ్రహ్మానందము. ద్వంద్వాతీత లక్షణము. కర్తృత్వ త్యాగ పూర్వక కర్మకౌశలము, క్రియా చరణ సామర్థ్యము. ఏ గురుకృపా ప్రసాదము వలన సిద్ధించుచున్నవో అట్టి గురుమూర్తి కివే మా ప్రణతులు.

శ్లో॥ అభక్తే వంచకే, ధూర్తే. పాషండే. నాస్తి కాదిషు
మనసాపి న వక్తవ్యం గురుగీతా కదాచన॥

తాత్పర్యం : భక్తిలేని. వానికి, మోసగానికి. తుంటరికి. పాషండులు. నాస్తికులు మొదలైన

వారికి. ఎన్నడును గురుగీతా ధర్మము చెప్పుటకు మనస్సునందైన తలంచరాదు.

విశేష వివరణ : 1) భక్తి 2) వంచకుడు 3) ధూర్తుడు 4) పాషండులు 5) నాస్తికులు మొదలైనవారు.

1) భక్తి : అనగా పెద్దలయందు, తల్లిదండ్రులయందు గురుదైవముల యందుగల భయముతో గూడిన ప్రేమ భావమును భక్తి యందురు. భయ మెందుకనగా వారి సలహాలను ఆజ్ఞలను పాటించనిచో వారివల్ల తాను పొందదగు సత్ఫలితములను తానుపొందలేమేమోనని, భయము, ఈ భయమే లేనిచో వారియందు ప్రేమ కలిగి యున్నను వారి ఆజ్ఞలను పాటించుట పట్ల అలసత చూపించును. వారి శాసనముల ధిక్కరించినచో తాను శిక్షాపాత్రుడగుట తథ్యము అనే భయమున్నపుడు వారి ఆజ్ఞలను తలదాల్చి సత్ప్రవర్తన కలిగి యుండజాలును. ముఖ్యముగా గురుదైవములను వుపాసించువారు వారి ఆజ్ఞలను పాటించినచో వారి కరుణకు పాత్రులు కాజాలరు. వారి ఆజ్ఞలన్నియు తన మేలుకొరకే గాని వారి కెట్టి స్వార్థములేదు అను అంశమును గుర్తించినచో గురునాజ్ఞాపాలనమున మరింత శ్రద్ధగలవాడు కాగలడు. అంతఃకరణ శుద్ధి ఐనపుడే మరియును అంతఃకరణము సద్గుణములకు ఆలవాలమైనపుడే అంతఃకరణ పవిత్రమై గురూపదేశము నాటుకొనుటకు తగిన క్షేత్రము కాగలదు. అట్టి శుద్ధాంతఃకరణచే గురుమంత్రానుష్ఠానము నందు, ధ్యానాది సాధనములందు, మనస్సు ఏకాగ్రమై ఆశించిన సత్ఫలితములు గలుగ గలవు. సాధకునకు అంతఃకరణ శుద్ధి ప్రధానముగా కావలసియున్నది. త్రికరణ శుద్ధిగా సత్ప్రవర్తన కలిగి కృషి చేసినవాడుగాని విజయము సాధించలేడు. భక్తి లేనివానికి అనగా అభక్తునకు ప్రవర్తనయందు భయముండజాలదు. గురువునందు ప్రేమ భావముతోపాటు సత్ప్రవర్తన యందు యేమి కొరత గలుగునో అనే భయమున్నపుడే గురూపదేశము అతని పవిత్రాంతఃకరణమునందు చక్కగా నాటుకొని సకాలములో ఫలోత్పత్తి కాగలదు. "భక్తి లేని పూజ పత్రిచేటు" అని లోకోక్తి. "భయభక్తి గురుసార్వ భౌముని సేవ నిశ్చయముగ చేసితే జయమందెదవు" అని శ్రీకృష్ణదేశికులుద్ఘాటించు చున్నారు.

మరియు "అభక్తునికి" అనగా పైన వుదహరించిన భక్తి లక్షణములు లేనివానికి ఏకాగ్ర లక్షణము ఎన్నటికి కలుగదు. మనస్సు యొక్క విక్షేప లక్షణము హరించదు. గురుడు నరుడనే భావనపోయి గురుడు కేవలం పరాత్పరుడే అనేభావం యెన్నటికీ దృఢంకాజాలదు. "మదిలో నామాటనమ్మి మరి వింటివేని, చంచలబుద్ధి మానుంటివేని పరిపూర్ణ యెరుకల దెలిపె యెరుకను విడిపింతు" నని కృష్ణదేశికేంద్రులు ప్రతిజ్ఞ చేస్తున్నారు. గురుని యందు దైవ దృష్టి కలిగిన గాని గురియుండి "గురువాక్యం యధా తధా" అనే దృఢ నమ్మిక కలుగజాలదు. చంచల బుద్ధి అసలేపోదు.

కం॥ మనసున వాక్కున తనువున,
పని యొక్కటి జరుపునట్టి భక్తునకు దయన్
వినిపించుము వినుమని యా

ఘనబోధను వాని కతుగలదుడుగకుమి॥

అని శ్రీకృష్ణదేశికేంద్రుల సూక్తి. భక్తుడు కానివానికి త్రికరణములగు శరీర వాఙ్మనస్సులు శుద్ధముగా నుండ జాలవు. త్రికరణ శుద్ధియు కలుగ జాలదు. యీ మనఃప్రాణ వాక్కులే వ్యష్టి సమష్టుల యందు అంతఃకరణ రూపంగాను ఆత్మకు స్థూల రూపంగాను యున్నవి. అభక్తుడు అనగా భక్తిలేని వాడు గురుమంత్రోపదేశమునకు అనర్హుడు. గురుగీతా ధర్మమును పాలించజాలడు కనుక గురుగీతా రహస్యములను పొందుటకు పూర్తిగా అనధికారి యగు చున్నాడు.

శివరామ దీక్షితీయంలో, గురుని నోట ద్వాదశీ షోడశీ వాక్యములను శ్రవణం చేసిన శిష్యుడు "యింకేమి భయము?" అన్నాడు. దానికి జవాబుగా గురుమూర్తి "నీకేమోకాని నాకు మహాభయముగానున్నది." అన్నాడు. యెరుకేమీ లేనేలేదు అసలు పుట్టనేలేదు అని అంటే, యింకేమి భయము అన్నాడు. శిష్యునికే లేని భయము గురుమూర్తి కెందుకంటే, త్రికరణముల ప్రవర్తనలో యికముందు యెట్టిలోపము గలుగునోయని గురుమూర్తి భయము. యీ భయమున్నవాడే బోధ కధికారి. బోధ పొందిన వాని కింకనూ ముఖ్యావసరము. ఏలననగా కొండనెక్కువాడు ఎంత భయముతో జాగ్రత్త వహించి యెక్కునో అంతకంటె కొండ శిఖరమున నున్నవాడు యేప్రమాదముననైన జారిపడుదునేమో అని యెక్కువ భయపడుచు యెక్కువ జాగ్రత్త వహించు టవసరముగదా? మొదటివాడు పడితే శరీరమునకు కొద్ది దెబ్బలు మాత్రమే. శిఖరమునుండి పడితే మరణము తథ్యము గదా?

2) వంచకుడు : అనగా మోసకారి, టక్కరి, జిత్తుల మారి యగువాడు. వానికి త్రికరణ శుద్ధి పాపభీతి యిపుడులేదు సరిగదా, బోధ యనంతరము కూడా వాని అంతఃకరణ బాగుపడుటకల్ల, వాడు గురువునే మోసగించి స్వార్థదృష్టితో యైహిక ఫలప్రాప్తికే తన బ్రహ్మవిద్యను వినియోగించగలడు. గురువు కడ చేసిన ప్రమాణములను పాటించడు. అట్టివానికి గురుగోప్యము లెరిగించుట త్రాచుపామునకు పాలుబోసినట్లే కాగలదు. ధూర్త శబ్దముకూడా యితనికి వర్తించును. కాని ధూర్తుడు తుంటరి లక్షణముల గల్గియుండును. జూదము, వ్యభిచారము, త్రాగుడు మొదలగువాని కలవాటుపడి పరస్త్రీ పర ధనములను పొంద ప్రయత్నించుచుండును.

3) పాషండుడు : వేదబాహ్యములగు కాపాలిక, బౌద్ధ క్షపణకాది దుర్మతములవారికి పాషండులని పేరు. వీరు వైరాగ్య పరులవలె వేషంబులతో లోకులను మోసగించుచుండును.

4) నాస్తికులు : వేదనింద చేయువారు, నిరీశ్వరవాదులు, వీరు పరలోకములను కూడా విశ్వసించరు వీరికి యీ లోకము, యీ జన్మ మాత్రమే తప్ప యితర మేమీ లేదు. సత్ప్రవర్తన యెందుకు? సత్ప్రవర్తన లేకుంటే బాధఏమి? అని వీరందురు. ఏవిధంగానైనా, యీ ప్రాపంచిక సుఖముల సంపాదించుటయే వీరి లక్ష్యము. యెట్టి అకార్యములకైనా వీరు వెనుదీయరు వేదములయందు సమస్త ధర్మములుచెప్పబడి యున్నవి. వీరు వేదములను నమ్మరు గనుక ధర్మాధర్మములను పాటింపరు.

యీ శ్లోకమునందు అనధికారులందరూ పేర్కొనబడిరి. వీరికి గురుగీతా ధర్మమును

ప్రబోధించ రాదని, అధికారులకు మాత్రమే బోధించవలెనని, అనధికారులకు బోధించుట పందుల ముందు రత్నముల విరజిమ్ముటే కాగలదని తెలియవలెను. యిట్టి గురుగీతా ధర్మమును సజ్జనులకు మాత్రమే బోధించుచూ లోకసేవ చేయుచున్న గురుదేవుల కివే మా అనంతకోటి పాదాభివందనములు.

శ్లో॥ నిత్యం బ్రహ్మ నిరాకారం నిర్గుణం బోధయేత్పరం
భాసయన్ బ్రహ్మభావంచ దీపో దీపాంతరం యథా॥

తాత్పర్యము : ఒక దీపము తాను ప్రకాశించుచు, తన సన్నిధానమందుండు వస్తువులను ప్రకాశింప చేయుటయే గాక, అనేక దీపములను వెలిగించుటకు యెట్లు కారణముగా నుంటున్నదో, అట్లే తాను బ్రహ్మమును గుర్తెరిగి బ్రహ్మ స్వరూపుడై సద్గురువు నిత్య, నిరాకార, నిర్గుణ పరబ్రహ్మమును గూర్చి యితరులకు బోధించి వారిని కూడా బ్రహ్మస్వరూపుల నొనర్చవలెను.

విశేష వివరణము : 1) నిత్యము 2) నిరాకారము 3) నిర్గుణము 4) పరం 5) భాసయన్ 6) బ్రహ్మభావము 7) దీపో దీపాంతరం యథా.

1,2,3,4 విషయముల వివరణ : నిత్యానిత్యములు, సాకార నిరాకారములు, సగుణ నిర్గుణములు పరాపరములు మొదలైన వన్నియు సాపేక్షిక ద్వంద్వములై యున్నవి. ఈ శ్లోకములో నిత్యం, నిరాకార నిర్గుణములు పరమ అను శబ్దములు ఆ విధంగా సాపేక్షికములే గాని నిరపేక్షక కేవలత్వములు గలవిగావు. సృష్టికి పూర్వమున్ను సృష్టి యనంతరమున్ను సృష్టికాలము నందునూ కూడ నున్నది. కనుక సృష్టి కారణమైన బ్రహ్మమే త్రికాలాబాధ్యమైన సత్ పదార్థమని నిత్యమని చెప్పబడుచున్నది. "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "నిత్యం విజ్ఞానం మానందం బ్రహ్మ" అని శ్రుతులు దానినే కీర్తించు చున్నవి. అనిత్యమగు జగత్తు దానినుండియే ఆవిర్భవించుచున్నది. ఆవిర్భావ మనగా క్రొత్తగా పుట్టుటకాదు. ప్రకటమగుట మాత్రమే. కారణ స్వరూపములో నున్నపుడు దేనిని నిత్యమైనదానిగా భావించితిమో కార్య రూపంలో నున్నపుడు దానినే అనిత్యమనుచున్నాము. "బ్రహ్మణోన్యం నకించన" "సర్వం ఖల్విదం బ్రహ్మ" అని శ్రుతులు పలుకుచుండగా అనిత్య మనబడే జగత్తు నిత్యమనబడే బ్రహ్మము కంటె భిన్నమన చెల్లునా? రూపాంతరము కలుగుటచే నామాంతరము చెందినది. యీ శ్లోకమునందు పేర్కొనబడిన బ్రహ్మము ద్వంద్వ లక్షణములగల బ్రహ్మమే కాని కేవల బ్రహ్మము కాదు.

అట్లే ఆ బ్రహ్మము. తొలుత ఏ ఆకారమును దాల్చనపుడు నిరాకార మనబడినది. ఐతే సర్వాకారములు దాని నుండియే బహిర్గతములైనవి. ఆ బ్రహ్మమే సాకార నిరాకారములుగా నున్నది. అట్లే త్రిగుణములు విత్తనములోని అంకురమువలె బీజరూపముగానుండి ప్రకటము కానపుడు నిర్గుణముగా తోచినది. ఆ సత్వ రజస్తమో గుణములే ఈశ్వర జీవ జగత్తులుగా కార్యరూపములో గానవచ్చినవి గదా! ఈశ్వరుడు మూర్తి భేదముచే త్రిమూర్తులుగా ఆరాధింప బడుచూ సగుణ బ్రహ్మమని కీర్తింపబడుచున్నాడు. యీబ్రహ్మము దృశ్యమగు ప్రపంచమునకు

పరంగా కూడా నున్నది. కనుక దానికి పరము అనుపేరున్ను వచ్చినది.

5) భాసయన్ = అనగా ప్రకాశింపచేయుట, అనగా ఆయా వస్తువులను తెలియ బడునట్లు చేయుట, ప్రకాశించుట అనగా తన్ను తాను తెలియపర్చుకొనుట. ప్రకాశమనగా వెలుగు అని అర్థం చేసుకొనరాదు. తెలియుట, తెలియజేయుట అనే మాటలు తెలివి లేక జ్ఞానమునకు సంబంధించిన వగుటచే ప్రకాశమను శబ్దమునకు జ్ఞానమను అర్థమును గ్రహించవలెను.

బ్రహ్మభావము : అన్ని భావములు, అనగా వూహలు మనస్సునకే కలుగుచున్నవి. మనశ్శక్తి విశేషముగానున్న మానవునకు నేను అను భావమే గాఢ సుషుప్తి నుండి మేల్కానిన వెంటనే కలిగే భావము. ఐతే యీ "నేను" అను వస్తువేది? అని జిజ్ఞాసి తెలియగోరుచున్నాడు. మూడు సమాధానము లాతనికి తట్టుచున్నవి.

1) దేహభావము 2) జీవభావము 3) ఆత్మభావము లేక బ్రహ్మభావము

1) దేహభావము : దేహమే నేను. దేహముకంటె భిన్నంగా ఎంత శోధించినా యీ దేహమునందు ఏమీ కానవచ్చుటలేదు. దేహము ప్రత్యక్షంగా పుట్టి చచ్చుచున్నది. మరణించిన దేహము మరలిరాదు. జన్మాంతరములు లేవు. పాపపుణ్యములులేవు. ఏ నేరము చేసినా యిక్కడ కలిగే దృష్టఫలము, తట్టుకొంటే చాలు. స్వర్గ, నరకములు లేవు. రాబట్టి కల్గినంత సుఖమును, ఏ విధంచేతనైనా నా యీ జీవితములో అనుభవించి సుఖించుటే కర్తవ్యము. సర్వము మరణముతో సమాప్తి. ఈ భావము వలన వ్యక్తికి గాని, సంఘమునకుగాని ఎట్టి శాంతి లేదు. తృప్తి లేదు. సుఖాన్వేషణ, అధికాధిక సుఖసాధనోత్పత్తి, వ్యక్తులకు, జాతులకు మంచి పోటీలు. ఘోర సంగ్రామములు మొదలగు వాని కిది దారితీయునని, నేటి ప్రపంచ ధోరణులు ఋజువు చేయు చున్నవి. ఏదైనా దుఃఖమునకు నివారణోపాయము దొరకక పోయినచో ఆత్మహత్య చేసుకొన్నచో చాలు. అన్ని దుఃఖములు దానితో నంతమొంద గలవు. యిట్టి భావనతో ఎందరో నేడు ఆత్మహత్యలు గూడ గావించుకొనుచున్నారు. ఏ దేహమున కాదేహమే యితర దేహములకు భిన్నమై యున్నది. ఏకత్వమనునది లేనేలేదు. అంతయు భిన్నమే. ఎవరి స్వార్థమును వారు చూచుకోవలసినదే. యిట్టి నికృష్టమగు దేహభావము సర్వానర్థదాయకమై యున్నది. దేహాత్మవాదిని చూస్తే సచేల స్నానము చెయ్యాలన్నారు.

2) జీవభావము = నేను జీవుడనుగాని, దేహమునుకాను. బ్రతికియున్న దేహము నకును, మరణ దేహమునకున్ను తారతమ్యము ప్రత్యక్షము. బ్రతికియున్న దేహము నందుండినది. మరణ దేహమునందు లేనిది ఏదో అదే, జీవత్వము, మరణ దేహమునందెట్టి కదలికలేదు. గాఢసుషుప్తి యందునూలేదు. కాని గాఢ సుషుప్తి యందు ప్రాణము ఉచ్ఛ్వాస రూపముగా చలించుచున్నది. ప్రాణమే జీవత్వము. ఐతే ప్రాణమున్నా నిద్రయుందేమియు కనుపింపబడుటలేదు. ప్రాణము మాత్రమే గాక, గుర్తెరిగేటి జీవముండవలె. అదే మనస్సు ఐనను మనస్సునిద్ర మూర్ఛ, మరణము యీ మొదలగు అవస్థలయందేమీ గుర్తెరుగుట లేదు. కారణమేమి? ఈ అవస్థలలో ప్రాణముతో అది వియోగము చెందియున్నది. కనుక ఈ మనః

ప్రాణముల చేరికయే జీవత్వము అనవచ్చును. జడమగు జీవము తెలివి హీనమైనను మనస్సును చేతనవంత మొనర్చు చున్నది. మనస్సున్ను జడమే. జడములైన యీ మనఃప్రాణముల రెంటికి తెలివి లేకుంటే, తెలివి గల మరియొక వస్తువు ఆవశ్యకముగా నుండి తీరవలె. ప్రాణమును చలింపచేసేది ఏదో అదియే మనస్సునకు తెలుసుకొనే తెలివిని ప్రసాదించుచున్నది. దానినే ప్రత్యగాత్మ అన్నారు.

ప్రత్యగాత్మ తెలివి (ప్రకాశము) ప్రాణము, మనస్సు యీ మూటి చేరికకే జీవత్వము అనవలసియున్నది. ఐతే వ్యష్టియందు ప్రత్యగాత్మగాను సమిష్టియందు పరమాత్మగాను యున్న తెలివి సర్వవస్తువుల బాహ్యాభ్యంతరములయందునూ నిండుకొనే యున్నది. అది క్రొత్తగా ఎక్కడి నుంచి వచ్చి చేరవలసిన పనిలేదు. మనఃప్రాణముల చేరికయే జీవత్వమన్నారు. ఎనుబది నాల్గు లక్షల రకముల జీవరాసులు చెప్పబడినవి. ఏ జీవియొక్క సంస్కారములు ఆ జీవివే. ప్రాణము ఒకటే అయినా సంస్కారముల మూటయని చెప్పబడిన మనస్సు మాత్రము ప్రతి జీవిలోనూ విభిన్నముగా నున్నది. యిదియే అనేక జీవవాదమునకు ఆధారము. ఈ వ్యష్టి మనస్సులన్నిటి కూడికయే సమిష్టి మనస్సు. అది ఈశ్వరుని మనస్సు లేకసమిష్టి అంతఃకరణము. ఒక వ్యష్టి మనస్సును గ్రహిస్తే అనగా ఒక జీవిని తీసుకొంటే అతడా సమిష్టిలో ఒక అంశస్వరూపుడే. అణు స్వరూపుడే. విభుస్వరూపుడగు ఈశ్వరునిలో జీవుడొక అంశమాత్రమే. ఈశ్వరునికి జీవజగత్తులు శరీరముగా నున్నవని విశిష్టాద్వైత వాదన. దేహభావముకంటే జీవభావము శ్రేష్టమైనది.

ఆత్మభావము లేక బ్రహ్మభావము : నేననే వృత్తి. జడములైన మనఃప్రాణములకు ప్రత్యగాత్మ యొక్క ప్రకాశము లేనిచో కలుగ జాలదని గుర్తించితిమి. ఈ అహం వృత్తి సహితంగా సర్వ వృత్తులు అంతఃకరణము (దాని సంకల్పరూప వృత్తి మనస్సు) నకే గలుగుచున్నవి. ఆ వృత్తులు కలుగుటకు సత్తాయిచ్చునది ప్రత్యగాత్మ ప్రకాశము. ప్రత్యగాత్మ తాను స్వయముగా గుర్తింపకున్ననూ అంతఃకరణకు గుర్తించు శక్తినిచ్చు చున్నది. నేనను అహం వృత్తికి అత్యంత మూలకారణమగు ప్రత్యగాత్మయే నేను కాని దేహేంద్రియ మనఃప్రాణములు కాను. "ప్రత్యగాత్మా శివోహం" ఇదియే ఆత్మ భావము. దేహేంద్రియ విశిష్టమైనపుడు ప్రత్యగాత్మ నిరుపాదికమైన పుడదియే పరమాత్మ లేక బ్రహ్మము. బ్రహ్మమనగా బహుపెద్దది. అంతకంటే పెద్దది లేదన్నమాట. అది విశ్వగతము విశ్వాతీతము. పృధివ్యాపస్తేజో వాయురాకాశము లన్నియు వుత్తరోత్తరా అధికాధికములై యున్నవి. పరమాత్మ సర్వవ్యాపకమైయున్న ఆకాశమునుగూడ నతిక్రమించి యున్నది. కనుకనే " మహతో మహీయాన్" అని కీర్తింపబడుచున్నది. గురుస్వరూపము అని సార్ధకనామముచే నొప్పుచున్నది. లఘుస్వరూపుడు (అంశ స్వరూపుడు అణుస్వరూపుడు) అగు తానే వుపాధిరహితము నందు గురుస్వరూపుడు (పూర్ణస్వరూపుడు లేక విభుస్వరూపుడు) అయివున్నాడు. జగద్రూపముగా కనుబడునది తాత్వికముగ బ్రహ్మమే. దాని నామ రూపములు మిధ్య. ఉన్నదంతా యీ బ్రహ్మస్వరూపమే. నేనూ నాకు తోచబడే యీ దృశ్య రూప జగత్తు మొత్తమంతయు కృతకము, పూర్ణమునగు బ్రహ్మమే. ఇదే బ్రహ్మ

భావము. "ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ, నేహనానాస్తి కించన, సర్వం ఖల్విదం బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మ, బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్టం" యిత్యాది శ్రుతి వాక్యములు నాతోగూడా సర్వమూ బ్రహ్మమే నని ఘోషించుచున్నవి. ఇదే అద్వైత భావము.

శ్లో ॥ దేహబుద్ధ్యాతు దాసోహం జీవబుద్ధ్యాత్వదంశకః
ఆత్మబుద్ధ్యాత్వమే వాహం, యితిమే నిశ్చితా మతిః

దేహభావముతో గూడిన ద్వైత భావం అనగా భక్తుడు దాసుడు భగవంతుడు ప్రభువు. జీవభావమునందు భక్తుడు భగవంతుని శరీరంలో ఒక అణురూపమైన అంశస్వరూపుడు మరియు "అణోరణీయాన్ మహతోమహీయాన్" బ్రహ్మ వస్తువు అణువుకంటె కూడా చిన్నదిగా నున్నది గనుక, అణుస్వరూపులైన జీవులయందా బ్రహ్మము అంతర్యామిగా కూడా నున్నది తెలివి శరీరమందలి ప్రతి అణువునందు గూడా వ్యాపించి యున్నట్లు తెలియవలెను. ఆత్మభావమే అద్వైత భావము. పరబ్రహ్మమే నేను అనుభావము.

ఐతే, బ్రహ్మభావమనగా నిరపేక్షక కేవల పరిపూర్ణ బ్రహ్మము కాదు. అది నేను కానిది. నేను లేనిది. నాకు దానికి యేలాటి సంబంధము లేదు.

శ్లో॥ "పూర్ణ మదః పూర్ణ మిదం పూర్ణా త్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవాఽ వశిష్యతే"

అని చెప్పబడినది. వ్యష్టి యందు అపూర్ణముగాను,సమిష్టియందు పూర్ణముగాను యున్న పూర్ణ వస్తువు జగజ్జీవేశ్వర బ్రహ్మ స్వరూపములుగా సర్వము తానై యున్నది. ఏదీగాని ఏదీలేని కేవల పరిపూర్ణ బ్రహ్మము సర్వలక్షణ విలక్షణమూ వాగాతీతమూ మనోతీతమూనై యున్నది. ఐననూ సర్వముగా తానే భాసించు పూర్ణ వస్తువును వస్తు నిశ్చయముగా గురుముఖతః తెలుసుకొంటేగాని పరిపూర్ణ పరబ్రహ్మ విషయమగోచరముగానే యుండును.

7) దీపాదీప్రాంతరం యథా : దీప లక్షణములు మూడు 1) తాను తన వెలుగులో ప్రత్యక్షముగా తెలియబడుట 2) తన యావరణములో నున్న సమస్తమును తెలియచేయుట 3) తనవంటి దీపములనేకములను వెలిగించుటకు కారణ స్వరూపముగా నుండుట. ఈ మూడు లక్షణములూ గురువునందు కూడ నున్నవి. ఎట్లనగా : 1) గురుపరంపరాప్రాప్తమగు బ్రహ్మవిద్యను తన గురుకృపకుపాత్రుడై గుర్తెరిగి తన స్వరూప నిశ్చయము కల్గి బ్రాహ్మీస్థితిలో నుండుట 2) నామ రూపాత్మకములైన సర్వోపాధులు సమస్త వస్తువులు తన మారురూపములే యని తెలిసి "స్వయంతీర్ణః పరాన్ తారయతి" యని తాను తరించి తన్నాశ్రయించినవారి కావస్తు నిశ్చయము గావించి నిత్యనిరాకార నిర్గుణ పరబ్రహ్మ విషయక జ్ఞానమును తన శిష్యులకు ప్రబోధ గావించుట 3) తనకు కల్గిన ఆరూఢస్థితిని శిష్యులకు కూడ గల్గించి తనయంతటి వారిని గావించి గురుపరం పరను అవిచ్ఛిన్నముగా ఆచంద్రార్కముగా వర్ధిల్లజేయు టకు వారికి బోధాధికారమును ప్రసాదింప చేయుట.

ఈ శ్లోకములో ముఖ్యముగా మూడు విషయములుద్ఘాటింపబడినవి. 1) "ఏకం

స్వాదు నభుంజీత'' (నిస్వార్థముగా తనకు కల్గిన బ్రహ్మజ్ఞానమును పలువురుతో పంచుకొనుట) 2) గురుని కర్తవ్యం. 3) అవిచ్ఛిన్నమగు పరంపరాభివృద్ధి. నేను తరించితినిగదా లోక మెట్లా పోతే నాకేమి? అను స్వార్థ లక్షణములేక.

శ్లో॥ ''శాంతా మహన్తోనివసన్తి సన్తో
వసన్తవత్ లోకహితం చరంతః
తీర్ణాస్స్వయం భీమభవార్ణవంజనా
సహేతునాన్యానపితారయన్తః

అని వివేక చూడామణిలో చెప్పబడినట్లు వసంత ఋతువు సర్వులకు ఆనంద మెట్లు కల్గించునో అట్లే విశ్వమానవ కళ్యాణము గావించుటకై గురువు ప్రయత్నించవలెను. తన గురుఋణం దీర్చుకొనుటకై "హృదయ గ్రంధి విడుటకై సదయత యీబోధ దెల్ప జనదా గురుడై?" అని శ్రీకృష్ణదేశికేంద్రులు శెలవిచ్చినట్లు శిష్యులకు తరింపచేయుటే ఏకైక లక్ష్యముగా యావజ్జీవమూ కృషి చేయవలెను. 3) సమర్థులై బోధ గ్రహించిన యోగ్యులైనవారికి బోధాధికారము నిప్పించి గురుబోధను బహుళ వ్యాప్తిలోనికి దేవలెను. ఈ విధముగా సమస్త కళ్యాణగుణ శోభితుడై పరిపాలించు గురుమూర్తి కివే మా ప్రణతులు.

శ్లో ॥ వందే గురుపదద్వంద్వం వాఙ్మనోతీతగోచరం
శ్వేతరక్తప్రభాభిన్నం, శివశక్త్యాత్మకం పరం॥

తాత్పర్యము : యింద్రియరూపమగు మనోవాక్కుల కందరానిదై శివశక్త్యాత్మకమై, అన్నిటికి పరమై, శ్రేష్ఠమైయున్న గురుపాదద్వంద్వమునకు నమస్కరించుచున్నాను.

విశేషార్థము : "వాఙ్మనోతీతగోచరం" అనగా, యింద్రియ రూపముగా వ్యవహరించు వాక్కునకుగాని, మనస్సునకుగాని, గోచరించక యీ రెంటికి నతీతమై వాని కధిష్ఠానమగు జ్ఞానముచే తెలియదగినదై అని అర్థము. ఈ జ్ఞానమే మనో బుద్ధి చిత్తాహంకార రూపములు దాల్చి సంకల్ప, నిశ్చయ, చింతన, అభిమానములు, ఆది భౌతికములుగా గల్గి వ్యవహరించు చున్నది. జ్ఞానమునకు యెరుగుటయే ఆది భౌతికము. శబ్ద స్పర్శాది విషయముల గుర్తెరుగుటకును, నిర్విషయమైయున్న ఆత్మస్వరూపమును అవలోకనము జేయుటకును యీ జ్ఞానమే సమర్థమై యున్నది. శబ్ద స్పర్శాది పంచవిషయముల నతిక్రమించి కేవల మాత్మావలోకనము చేయునపుడు దీనికే జ్ఞానచక్షువు అనీ, జ్ఞాననేత్రమనీ పేరు. ఈజ్ఞాన నేత్రమునకు గోచరించును కనుకనే ఆత్మజ్ఞేయ బ్రహ్మమనిపేరు. "ఆత్మవారే ద్రష్టవ్య" మనీ, "మనసైవానుద్రష్టవ్యం" అనీ, "బుద్ధిగ్రాహ్య మతీంద్రియమ్" అని చెప్పబడినదీ ఈజ్ఞేయ బ్రహ్మమేగాని పరిపూర్ణపరబ్రహ్మము కాదని, పరిపూర్ణ పరబ్రహ్మము, యీ జ్ఞానమునకు గూడా గోచరించదని తెలియవలెను. "శ్వేతరక్తప్రభాభిన్నం" = తెలుపు యెరుపు వర్ణములకు భిన్నమైనదై అని అర్థము. "అజామేకాం లోహిత శుక్ల కృష్ణాం..." అనగా మూల ప్రకృతి యెరుపు తెలుపు నలుపు అను త్రివర్ణాత్మకమై యున్నదని వర్ణింపబడినది. సత్వగుణము తెలుపు, రజోగుణము

ఎరుపు తమోగుణము నలుపు. కనుక ప్రకృతి త్రిగుణాత్మకమూ త్రివర్ణ రంచితమూ నై యున్నది. కాని పురుషుడో, త్రిగుణాతీతుడని చెప్పబడుచున్నాడు. అతని యందు త్రిగుణములతోపాటు వాని వర్ణములున్నూ కానరావు. కాని ఆ త్రిగుణములు అతనియందు అసలు లేనేలేవా? అంటే, బీజరూపముగానున్నవి అనియే చెప్పవలసియుండును. ఏలననగా త్రిగుణాత్మక ప్రకృతికి పురుషుడే ఆశ్రయస్థానమై యున్నాడు. పురుషునికంటె అన్యదేశమున లేదు. అన్యదేశమున నున్నదంటే, బ్రహ్మమునకు ఏకదేశీయతయు, అద్వైతహానియు సంభవించును. పురుషుని వినాప్రకృతి కునికియే లేదు. పురుషుడే ప్రకృతికీ, దాని నుండి కల్గిన సమస్తమునకూ ఆధారమూ అధిష్టానమూ అయివున్నాడు. పురుషుని యందు ప్రకృతి ఒక భాగమునందున్నది అని "పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతందివి" అని కొందరందురు. యిదియును సరిగాదు. పురుష ప్రకృతులు రెండునూ నేను మేనులవలె ఓతప్రోతములై అవినాభావసంబంధము కలిగి యున్నవని సిద్ధాంతము. యీవిషయం అర్థమగుటకే మందాధికారులకొరకై శివుడు అర్ధనారీ శ్వరుడుగా చిత్రింపబడినాడు.

శ్వేత మనగా తెలుపు. రక్తమనగా యెరుపు. సత్వ రజస్తమో గుణములున్నూ వానియొక్క, శ్వేత (శుక్ల) రక్త (లోహిత) నీల(కృష్ణ) వర్ణములున్నూ దోచబడని లేక అవిర్భావము చెందని స్థితియే బ్రహ్మము అని పిలువబడును. అది శ్వేత రక్తాది వర్ణములకు భిన్నమైనది. అనగా వేరుగానున్నదని యీ శ్లోకములో అభివర్ణింపబడియున్నది. ఐతే లోహిత శుక్ల కృష్ణాది వర్ణములన్నియు తనయందు బీజరూపముగా నుంచుకొన్న ఆ వస్తువున కేదో వర్ణముండవలదా? కనుకనే దానిని పాటల వర్ణమన్నారు. మరియు "శుద్ధ స్ఫటిక సన్నిభం" అన్నారు. స్ఫటికమునకు ఏవర్ణమూ లేకున్ననూ అది అన్ని వర్ణములు పులుముకొను సమర్థత కలిగియున్నది. అట్లే రక్త శుభ్రాసిత ధూమ్ర సనీలములను పంచవర్ణములు దానియందు ప్రకటమగుచున్నవి.

శివాశక్త్యాత్మకం : పురుషుడే సర్వమంగళ స్వరూపుడగు శివుడు, ప్రకృతియే ఆపురుషుని యొక్క శక్తి, అగ్నిని విడచి దాని దాహశక్తి వేరుగా నుండనట్లే పురుషుని విడచి పురుషశక్తి నేరుగా నుండజాలదు. ఈ పురుష ప్రకృతులుగా, లేక శివశక్తులుగా గురుపాద యుగళము వర్ణింపబడినది. గురుపాదములలో దక్షిణ పాదము శివ స్వరూపము. శ్వేత వర్ణము. వామపాదము శక్తి స్వరూపము. రక్త వర్ణము. శివశక్తులే రెండు పాదములు. కాని రెండునూ కలసియేక రూపమగు బ్రహ్మపదము. కనుకనే గురుపాదములు రెండింటినీ దగ్గరగా చేర్చి ఏకముగా జేసియే భక్తుడు నమస్కార పూజాదులు చేయును. అట్లేకము చేయునపుడు శివశక్త్యాది భేదములేని "ఏకమేవాఽద్వితీయం"అగు బ్రహ్మమే అయివున్నది. విడమర్చి చూచినచో శివశక్తులుగా నున్నది.

పరం : శబ్దాది విషయపంచకమునకు పరమై, పంచేంద్రియజ్ఞానమున కగోచరమై, అన్నిటికంటె వేరైయున్నదని అర్థము. వేరైయున్నదంటే, దృగాదిగోచరమయ్యే సమస్తమునకు వేరై యెక్కడో అన్యదేశమున నున్నదనరాదు. విశ్వాతీతము మాత్రమేగాక, ఆత్మ దృష్టి గలవారికి ప్రతి వస్తువునందునూ సూక్ష్మాతి సూక్ష్మముగా నున్నది. అనగా ఆత్మ విశ్వగతముకూడనైయున్నది.

స్వరూప లక్షణములను బోధించుటకు మాత్రమే శ్రుతి, "నేతి నేతి" అని సర్వమును అనాత్మగా నిషేధిస్తూ వచ్చినది. అట్లే, "పరం" అను శబ్దమున్నూ బ్రహ్మ స్వరూపము యొక్క విలక్షణత్వ మును సూచించుటకు మాత్రమే ప్రయోగింపబడినది.

"వందే గురుపదద్వంద్వం" గురుపాద యుగళమునకు నమస్కరించుచున్నానని అర్థము. గురుపదముల జంట ఏకరూపమగు ద్వంద్వము లేక ద్వంద్వరూపమగు ఏకముగా నున్నదని గ్రహించితిమి, పైన చెప్పబడిన వివరణలో గురుపాదములనగా పురుష ప్రకృతులని, లేక శివశక్తులని తేటతెల్లమైనది. గురుభక్తుడు తనకు ధర్మోపదేశము చేసిన గురువునకు యీపరబ్రహ్మ భావముతోనే నమస్కారపూజాదులు గావించుచున్నాడని తెలియవలెను. ఏలననగా, నిర్గుణ స్వరూపమై శబ్దాది విషయములు లేని బ్రహ్మస్వరూపమునకు నమస్కారాదులుగాని షోడశోపచారాది పూజాదికములు గాని ఎట్లు చేయగలడు? కనుక "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" అనగా ఆత్మస్వరూపము ను తాను గుర్తెరిగి శిష్యుల కాయాత్మ స్వరూపములనుసాక్షాత్కారింప జేసినగురువే రూపుదాల్చిన పరమాత్మ యని భక్తుడు నమస్కరించుచున్నాడని తెలియవలెను.

శ్లో॥ సాష్టాంగ ప్రణిపాతేన, స్తువన్నిత్యం గురుంభజేత్
భజనాస్థైర్యమాప్నోతి, స్వస్వరూపమయో భవేత్॥

**తాత్పర్యము :** సాష్టాంగ దండ ప్రణామముచేసి గురుస్తోత్రము గావించుచూ, నిత్యమూ గురువును భజించుము. ఆ విధముగా భజించిన యెడలగొప్ప స్థైర్యము కలుగును. అంతేగాదు. గురు స్వరూపుడే తానై తన్మయుడై పోవును.

**విశేష వివరణము :** ఈ శ్లోకమునందలి 1) సాష్టాంగ ప్రణిపాతము 2) స్తోత్ర భజనలు 3) స్థైర్యము 4) స్వస్వరూపమయము, అను శబ్ద, శబ్దార్థములను చక్కగా వివరించి తెలిసికొనవలసి యున్నది.

**1) సాష్టాంగప్రణిపాతము :** రెండు అరచేతులను ఒకటిగా చేర్చి సవినయ వినమ్ర భావములు ప్రదర్శించుట నమస్కారము. పాతము అనగా పడుట. ప్రణిపాతమనగా వంగి పాదముల ముట్టి నమస్కారము చేయుట. లేక పాదములపై బడి నమస్కారము చేయుట. పాదములపై బడి ఏనిమిది అంగములతో గూడి చేయు నమస్కారము సాష్టాంగ ప్రణిపాతము.

శ్లో॥ దోర్భ్యాం పద్భ్యాంచ, జానుభ్యాం ఉరసా శిరసా దృశా
మనసా వచసా చేతి ప్రణా మోష్టాంగ వుచ్యతే॥

అనగా భుజములు, పాదములు, మోకాళ్ళు, వక్షస్థలము, శిరస్సు, దృక్కు, మనస్సు, వాక్కు అను యెనిమిదిన్ని అష్టాంగములు.

ఇందు మొదటి నాలుగున్ను నేలకు అంటునట్లుగా బోరగిలపరుండి, శిరస్సు చేతను, కన్నులచేతను, గురుపాదముల స్పృశించుచూ, మనస్సును యితరత్రా కదలనీయక గురుపాదముల యందే లగ్న మొనర్చి వాక్కుచే గురునామముపల్కుచూ చేయు నమస్కార

ముకు సాష్టాంగ నమస్కారమందురు. యిందు శరీరము దండము (కర్ర) వలె నేలపైపడి యుండును. కనుక దీనికి సాష్టాంగ దండ ప్రణామమనియు పేరు కల్గినది. ఈ నమస్కారము స్త్రీలయందు, అందునూ ముఖ్యముగా గర్భిణీ స్త్రీలయందు కష్టసాధ్యము కనుక వారు మోకాళ్ళపై మోకరించి కూర్చొని నిజ కర కమలములయందు గురుపాద కమలముల నుంచు కొని నమస్కారము చేయవలెనని సాంప్రదాయ నిర్ణయము. జరా వ్యాధి పీడుతులగు పురుషు లున్ను యిట్లే చేయనగును. గాని యితరులు సాష్టాంగ పడవలసినదే. తమ ధౌత వస్త్రములు అందుచే మలినమగునేమోయని యెంతురేని వారికి దుస్తుల మీదనున్న భక్తికూడా గురునియెడల లేదని యనదగును.

సర్వావయములలో శిరస్సున్ను సర్వేంద్రియములలో నేత్రములున్ను ప్రధానమగుటచే వానిచే గురుపాదస్పర్శ గావించి మహా పవిత్రమైన గురుశరీరమునందలి శక్తిని, గురుపాదాంగుష్టముల ద్వారా తనలోనికి ఆకర్షించుకొని తన స్థూల శరీరమును పవిత్రీభూతమొనర్చుకొనవలెను. మనఃప్రాణ వాక్కులు సూక్ష్మ శరీర సంబంధములు, వానిచేకూడ నమస్కారము చేయుటవలన సూక్ష్మ శరీర రూపమగు అంతఃకరణము కూడ పవిత్రమగును. అట్టి శుద్ధాంతఃకరణమే ఆధ్యాత్మిక మహాసాధనమునకు బలమైన పునాది యగుచున్నది.

నమః అనగా అహంకారమును వదలుట, నమస్కృతి, నమస్కారము అనుటలో, చేయుట అను క్రియా రూపవ్యవహార మున్నది. కేవలం మానసికముగాని వాగ్రూపము కాని కాదు. నమస్తే చెప్పు అని నేటి నాగరీకులు బిడ్డలచే నమస్తే అని చెప్పించుట మంచిదేకాని నమస్తే చెప్పించిన చాలదు. చేయించవలెను.

అహంకార నాశనమే నమస్కారము చేయుటలో గల ముఖ్యోద్ధేశము. అట్టి ఉద్దేశ పూర్వకముగా త్రికరణములతో చేసినపుడే అహంకార నాశనము కాగలదు. మనస్సుయందు భావనతో చేసిన నమస్కారము ఫలకారి కాదు.

నవవిధ భక్తులలో చివరిదగు ఆత్మనివేదనములో భక్తి పరాకాష్ఠనందుకొన్నది. యీ ఆత్మార్పణ బుద్ధితోనే సాష్టాంగ నమస్కారము చేయవలెను. యిదియే నిజమగు శరణాగతి. భక్తి మార్గమునందు విభీషణ శరణాగతి యొక్క లక్షణము అత్యంత ప్రధానమైనది. శిరస్సును పాదములకడ పడవేయుట, శిరస్సును త్రుంచివేసినారే లేదా రక్షించినాసరే అనే భావము విభీషణ శరణాగతియందు ద్యోతకమగు చున్నది.

ఈ శరణాగతి లక్షణము లేనిదే ధర్మము తెలియ బడదు. కనుకనే భగవద్గీత

శ్లో॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం, జ్ఞానినతత్వదర్శినః

అని వాక్రుచ్చినది. అంతేకాదు. యీ సందర్భంలో గీత చరమోపదేశము గమనించదగును.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ

అంటున్నాడు భగవానుడు. యిట్టి శరణాగతితో కూడిన సాష్టాంగ నమస్కారమును శిష్యుడు ప్రతినిత్యము గురువున కొనర్పవలెనని విధింపబడినది.

"గురువులొక పూరిలో, శిష్యు లొక పూరిలో నుంటే అపుడు శిష్యుని కర్తవ్యమేమి, ఇందుకు గురుగీతయే, సమాధాన మిచ్చినది.

శ్లో॥ శ్రీనాధచరణద్వంద్వం యస్యాందిశి విరాజితే
తస్యాందిశి నమస్కుర్యాద్భక్త్యా ప్రతిదినం ప్రియే

అనిన్ని "తస్యైదిశే సతత మాంజలిరేష నిత్యం" అనిన్ని చెప్పినది కనుక గురుమూర్తి స్థానమే భద్రాచల, కాశీక్షేత్రములుగా దలంచి యాస్థానము వైపు మొగమై సాష్టాంగ మొనర్చవలెను.

2) స్తువన్నిత్యం గురూంభజేత్=నిత్యమూ స్తోత్ర భజనలు గావింపవలెను. ఉన్నది వున్నట్లుగా వర్ణించుట స్తోత్రముగాదు. లేని సుగుణ సంపత్తిని ఆపాదించుటయే స్తోత్రమగును. ఎదురుగా మట్టి విఘ్నేశ్వరు నుంచుకొన్ననూ అతడే సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వ, సర్వాంతర్యామీత్యాది సమస్త కళ్యాణ గుణాకరుడుగా స్తుతి చేసినట్లే, తనకు వాక్యోపదేశముచేసిన గురుడు, నరుడుకాదు. హరుడు, అంతేగాదు. కేవలం పరాత్పరుడు అని భావించి స్తుతించుచూ రాగా భక్తిభావము హృదయమునందు పెంపొంది, చిత్తము ద్రవీభూతమై గురుమూర్తి నామరూపములు చిత్తమున హత్తుకొని క్రమంగా

కం॥ జలము నెడబాయ నొల్లని
జలచరముల రీవిబూని సచ్ఛిష్యుడు
హృజ్జలజంబను పీఠముపై
నిలిపి యితరముమాని గురువునే కొల్చుసుమ్మీ
తదూక్తులనే తలచునమ్మీ"

అను అనన్యభక్తి చేకూరును.

భజన అనగా సేవ, సేవ్య, సేవక భావముచే, అతడు భగవంతుడు, నేను భక్తుడను, అతడు ప్రభువు, నేనే కింకరుడ నను భావము పెంపు చేసుకొని సర్వాహంకార అభిమానములను వదలి గురుని యాజ్ఞలనే తలదాల్చి (శిరసావహించి) నెరవేర్చుటయే భజన అని బాహ్యార్థము. ప్రహ్లాదకుమారుడు "పెద్దల బొడగన్న భృత్యునికై వడి, చేరి నమస్కృతుల్ సేయువాడు" అని పేరొందెను. "భృత్యానుభృత్య పరిచారక భృత్య భృత్య భృత్యస్య భృత్య యితి మాం స్మరలోకనాధ" అని ముకుందమాల భృత్య భావము యొక్క వినమ్రతా లక్షణము వివరించి శరీర వాఙ్మనస్సుల యందు యీ వినయ సంపత్తి రాశీభూతమైనపుడే తను మన ధనములు గురునకు వినయంబున ధారిపోయగలడు. అపుడాతను మన ధనములు లేక ప్రాణ మనో వాక్కులు గురునివే యగును. తాను అపుడు నేను నాది అనునవి లేక యుండును. గురువుచెప్పిన స్మరణ జప ధ్యానాదుల యందు మనస్సును నియమించుటయే గురునికి తాను చేయు మానసికసేవ. సర్వము గురుస్వరూపమే గనుక ప్రాణికోటి శ్రేయస్సునకై తన శారీరక శక్తులను వినియోగించుటయే శరీరముచే చేయుసేవ, సత్యము. ప్రియము, లోకహితమునగు వాక్యములను పల్కుటయే వాగ్రూపమగు సేవ. ఇట్టి సేవాధర్మమే నిజమగు

సేవ లేక భజన వీణా తాళ మృదంగాది వాద్యమసమ్మేళనములో గాన తాళ నృత్యాదులతో ఆవేశము చూపుట భజనగాదు. అట్లని, అట్టి కీర్తన భక్తిని కించపరచి నిరసించుచున్నామని భావించరాదు.

"భజనాత్ స్థైర్య మాప్నోతి స్వరూపమయోభవేత్" పైన చెప్పిన నమస్కార స్తోత్ర భజనలకు ఫలమేమి? తొలుదొల్త స్థైర్యము గల్గును. స్థైర్యమనగా, ఏకాగ్రత అచంచలత్వము దృఢత్వము, దేనియందు? గురువు చెప్పిన బోధయందు దృఢత్వము కలుగును. బోధయనగా మేల్కస్వరూప విస్మృతిజెంది, అజ్ఞాన నిద్రలోనున్న నీకు స్వరూప సాక్షాత్కారము కలిగించగా ఆ స్వరూపమే నేనను బోధ ధృడ కారణము కాగలదు ఆ పిమ్మట "స్వస్వరూప మయోభవేత్" అనగా తన దేహమనో ప్రాణములన్నియు ఆ స్వరూపమేగాని అన్యముగావు యధా మృణ్మయో కుంభం తద్వత్ దేహోపి చిన్మయం" అని ఆది శంకరులు శెలవిచ్చిన రీతిగా "ఆత్మ నోన్యం నకించన" ఆత్మ తప్ప ఏమీ లేదనే భావ మారూఢమగును. యిదే స్వస్వరూపమయుడగుట, యిదియే గురుకృప. యీ గురుకృపాసంసిద్ధి లేక పూర్ణబోధ అతుకజాలదు. స్వరూప జ్ఞానమే లేనివారు గూడ గురువులగుట హాస్యాస్పద మని గుర్తించి వేమనార్యులు "తన్ను తానెరుగడు, తానెవ్వరికి జెప్పు పాలుమాలిన యిట్టి పశువు కొడుకు?" అని తీవ్రంగా నిరసించియున్నాడు.

ఇట్టి ఆత్మ దర్శనము గల్గించి, ఆ పిమ్మట కేవలాత్మ భావమును సూచించు మా సద్గురుమూర్తి యొక్క సగుణ నిర్గుణ రూపములకివే మా నమస్కారములు.

శ్లో॥ యస్య ప్రసాదా దహ మేవ సర్వం
మయ్యేవ సర్వం పరికల్పితంచ
యిత్థం విజానామి, సదాత్మ రూపం
తస్యాంఘ్రిపద్మం ప్రణతోస్మి నిత్యం

తాత్పర్యము : "నాచేతనే దృశ్యాదృశ్య ప్రపంచమంతయు కల్పింపబడినది. నేనే సర్వమునై వున్నాను." అని ఆత్మ యొక్క సద్రూపమును యే గురుకృపచేత నేను తెలుసుకొనుచున్నానో అట్టి పరమాత్మ యొక్క పాదపద్మమునకు నిత్యము నమస్కారింతును.

విశేష వివరణము : 1) యస్యప్రసాదాత్ 2) అహమేవ సర్వం 3) పరికల్పితము 4) సదాత్మరూపం 5) అంఘ్రిపద్మము అను వానిని గూర్చి వివరణ చేయదగియున్నది.

1) యస్యప్రసాదాత్=ఎవనికృప (అనుగ్రహము) వలన అని అర్థము. గురుకృప వలన గాని బోధ ఆరూఢము కాజాలదని వేరే చెప్పనక్కరలేదు. గురుకృప లేకుంటే గురువు వుపదేశమేచేయడు. బోధించనే బోధించడు కనుక వుపదేశము పొంది, గురుబోధ కొద్దిగానో గొప్పగానో విన్న ప్రతివ్యక్తియు తనకు గురుకృపా సంసిద్ధి కలిగినదని తృప్తి పడి వూరుకొనరాదు. గురుకృప యనగా నేమి? అది యెట్లు సిద్ధించును? అను విషయము చర్విత చర్వణము(గ) తెలియబరచుచునే వున్నాము. ఐనను వేదాంత ప్రబోధయందు పునరుక్తి దోషముకాదు. విశేషించి గుణమే యగును. నిగూఢార్థమును గ్రహించుటకు అవసరమున్ను కాగలదు. స్వార్థపరుడైన

గురుడు, శిష్యుడిచ్చు ధనకనకవస్తువాహనాదులచే సంతృప్తి చెంది బోధ యొక్క మర్మమును శిష్యునికి తెలియ చేసినను, ఆ బోధయందు శిష్యుని కారూఢత చేకూరజాలదు. ఏలననగా అందువల్ల శిష్యుడికి బోధయొక్క మర్మమే తెలియగలదు. గాని ధర్మము తెలియబడదు. తన్ను రక్షించునది ధర్మమేగాని మర్మము గాదు. 1) అనుష్ఠానము 2) ఆచరణ 3) విచారణలలో విచారణ వినుట వలన మర్మము తెలియగలదు. కాని ధర్మము శిష్యుని యొక్క అనుష్ఠాన ఆచరణల వలన మాత్రమే సిద్ధించును. "చెప్పదగు గురుడు బోధను చెప్పినపని చేసెనేని శిష్యాగ్రణికిన్" అన్న విధముగా సద్గురువు, చెప్పినపని చేసిన సచ్ఛిష్యునికి మాత్రమే ధర్మము చెప్పి ఆరూఢుని గావించును. చెప్పినపని అనగా పారమార్థిక సాధనలే గాని తనలౌకిక ప్రయోజనములకై శిష్యునిచే గురువు చేయించుకొను పనులుకావని తెలియవలెను. శిష్యుని సత్కర్మాచరణముచే అంతఃకరణపు శుద్ధియు, అనుష్ఠాన బలముచే సర్వసిద్ధులున్ను సాధకునికి చేకూరగలవు. గురుప్రబోధ అర్థమగుట, జ్ఞాపకముండుట, ఏకాగ్రత సిద్ధించుట, వస్తు సాక్షాత్కారమగుట, "యోగఃకర్మసుకౌశలం" "సమత్వం యోగముచ్యతే" అను యోగసంసిద్ధి కలుగుట, యివన్నియు గురుకృప వలనగాని కలుగజాలవు. యివన్నియు సర్వసత్తాంశ రూపమగు గురుపరమాత్మ యొక్క అనుగ్రహ విశేషమునగాని లభించవు. అట్టి గురుకృపా విశేషమున సచ్ఛిష్యునికి సర్వార్థములు సిద్ధించినను, స్వస్వరూపా సాక్షాత్కారమే ముఖ్య ప్రయోజనమున్ను ఆశయమున్ను అయివున్నది. ఇదియే సద్గురువు అనుగ్రహించగల వుత్తమోత్తమ ఫలము. ఇదియే గురుకృపా సంసిద్ధికి నిదర్శనము.

2) "అహమేవ సర్వం" అనగా నేనే సర్వమునై యున్నాను. అహం+ఏవ=అహమేవ యిందు అహమనగా "అహం బ్రహ్మాస్మి" అను మహావాక్యములో అహం శబ్దమున కిచ్చిన లక్ష్యార్థమును మాత్రమే గ్రహించవలెను. అహం అనగా "నేను" అను అర్థము సరియేగాని ఆ "నేను" స్థూల సూక్ష్మ కారణ శరీరములతో తాదాత్మ్యము చెందిన "నేనుగాదు" అంతరేంద్రియములలోని అహంకారముగాదు. ఏ యింద్రియమున్నుకాదు. యింద్రియములతో జతపడి వ్యవహారముచేయుకర్త. భోక్తగాదు. చైతన్యాంశ స్వరూపమగు జీవాత్మకాదు. పింద బ్రహ్మాండములలో ప్రకాశమాత్ర వ్యవహారముగల ప్రత్యగాత్మ పరమాత్మలుగాదు. సృష్టికి పూర్వము తాను తానై ఏ వ్యవహారము లేని అత్యంత మూలకారణమగు అధిష్ఠాన చేతన బ్రహ్మమే యిక్కడ అహం అను శబ్దమున కర్థముగా గ్రహించవలెను. "ఏవ" అనగా మాత్రమే అనియర్థము. అహమేవ యనగా అట్టి అధిష్ఠాన చేతన బ్రహ్మమైన నేను ఒక్కడను మాత్రమే యీ సర్వమునై వున్నాను. లేక సర్వనామ రూపాత్మకమగు దృశ్యాదృశ్య వస్తువులన్నిటి క్రింద మారినాను అని అర్థము.

3) పరికల్పితంచ=చక్కగా కల్పింపబడినది అని అర్థము. పై పేరాలో "అహమే" సర్వమునై వున్నదన్నారుగదా! కల్పన అంటే లేని వస్తువు వున్న వస్తువుగా తోపింపచేయుటగదా! దీని కెట్లు సమన్వయము కుదురును? అంటే బ్రహ్మము, జగజ్జీవేశ్వరుల సృష్టికి మూలకారణ

మని అంగీకరిస్తూనే 1) ఆరంభ వాదము 2) పరిణామ వాదము 3) కార్యకారణవాదము 4) వివర్త వాదము 5) మాయా వాదము అను అయిదు వాదములు చెప్పబడినవి. వీని గురించి వివరంగా తెలుసుకొనగోరువారు "పరిపూర్ణ దర్శనము" చూడవచ్చును. యీ వాదము లలో మొదటి మూటిలో కారణ వస్తువు అగు బ్రహ్మము, కార్యరూప మగు జీవేశ్వర జగత్తులు రెండూ కూడా సత్యమే కావలసివచ్చును. కనుక కల్పన అనుమాటకు తావేలేదు. వివర్త కారణము (లేక) అధ్యారోపము యెట్లు అవంగతమైయున్నచో "పరిపూర్ణ దర్శనము" నందు చూడవచ్చును. మాయా బ్రహ్మలు రెండూ ఒకటే, బ్రహ్మము వినామాయకు వునికిలేదు. కనుక మాయా వాదమున్ను అంగీకారము కాదు. అయితే "మయ్యేవ సర్వం పరికల్పితంచ" అను మాటలకు ఏమి చెప్పవలసియుండును? అంటే పరిపూర్ణములో దోచిన యెరుకయే కల. లేని కల్పన. ఆ యెరుక యొక్క స్థూల రూపమే జగజ్జీవేశ్వరులు. సూక్ష్మమునుంచి స్థూలము, స్థూలము నుంచి సూక్ష్మము బీజాంకుర న్యాయముగా సృష్టి జరుగుచున్నది. అఖండ యెరుక అని చెప్పబడే బ్రహ్మము సహా సమస్తము పరిపూర్ణ పరబ్రహ్మము నందు కల్పనయే. ఖండాఖండము లుగ గానవచ్చునది నా స్వరూపమే, నేనే కనుక యీ శ్లోకమునందు నేనే సర్వము సర్వము నాయందే కల్పించుచున్నాను అని ఎరుక యొక్క వాస్తవ స్వరూపము దెల్పిన గురునకు నమస్కారము అని చెప్పబడినది.

తాను కల్పితుడే, కలరూపుడే. అనే మాటలు విడ్డూరముగా యితరులకు తోచవచ్చును. కాని యిది సనాతనమైన భావమేగాని నూతనమేమీ గాదు. "మయ్యే వసకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితం, మయి సర్వంలయయంయాతి తద్బ్రహ్మ ద్వయమస్మ్యహం॥ అని కైవల్యోపనిషత్ వాక్యము. "బీజంమాం సర్వ భూతానాం విద్ధి పార్థసనాతనం" అని భగవద్గీత. కనుక నేనే సర్వకారణము. అంతేగాదు. నేనే సర్వమూ నేనే, సర్వమూ కల్పనయే అయివున్నది అని చెప్పబడినది. ఆ కల్పింప బడిన సర్వమూ నేనే అయితే నేనున్ను కల్పనయే అని విధిగా చెప్పవలసియుండును. "నేనే" బ్రహ్మము అని మహావాక్యములు చెప్పుచున్నవి కనుక ఆ నేనై యున్న బ్రహ్మమున్నూ కల్పితమే కల్పించినవాడూ. కల్పింపబడినవీ. కల్పనా క్రియా అని మూడున్ను కల్పనయే. దేనియందు యీ కల్పన అంతా! అని ప్రశ్నించుకొంటే ఒక సత్య వస్తువునందు అని సమాధానం రాక తప్పదు. నాతో సహా సర్వమూ దేనియందు కల్పింపబడెనో ఆ సత్యవస్తువేది? అదియే పరిపూర్ణ పరబ్రహ్మము అని పరిపూర్ణ భావజ్ఞుల సిద్ధాంతము. కల్పింపబడిన దానికి ఆధారమూ అధిష్ఠానమూ ఉండవలసిన అవసరమే లేదు నైనైన బ్రహ్మమునకు ఆధారము అధిష్ఠానము కానిదే పరిపూర్ణ పరబ్రహ్మము అనిగూడ గుర్తింపచదగును. పరిపూర్ణ పరబ్రహ్మము తప్ప మిగితా మొత్తమంతా కల్పన అన్నపుడు ఆ కల్పన లోని ఒక భాగము, ఆ కల్పనలోని మరొక భాగము అసత్యమనీ తాను మాత్రము సత్యమనీ అనరాదు. నేను సత్యమని నాలోని మిగితా భాగములు అసత్యములనీ యనరాదు.

4) సదాత్మరూపం : అనగా సత్పదార్థమైన ఆత్మ స్వరూపము అని అర్థము. సత్ అనగా త్రికాలమ్ములయందునూండి త్రికాలములచే బాధింపబడినిది. నేనే కాలస్వరూపు

డను.నేను, కాలము, సృష్టి, యివన్నియు అనాదులే. నాతోపాటే కాలమున్ను కల్పితమే. కాలమునకు పూర్వాపరములేమి? ఏలననగా అంతాకాలమే. కనుక కాలమునకు కూడా పూర్వ కాలమేనేది వుండజాలదు. కాలము కూడా కల్పనలోనిదే. దేశకాల వస్తువుల కతీతమైన దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. త్రికాలములయందూ, కల్పితమైన ఆత్మవున్నది అని చెప్పుటలో అభ్యంతరమూన్ను లేదు. ఏలననగా ఆకాలమున్ను ఆత్మయగు నేనే అయివున్నది. కనుక అది సదాత్మ అని చెప్పబడినది.

5)తస్యాంఘ్రిపద్మం = అతని యొక్క పాదపద్మము. పైన వుదహరించిన బోధ సాకల్యముగా నెరిగించు గురుమూర్తి యొక్క పాదపద్మము అని అర్థము. నేనే సర్వమూ సర్వ స్వరూపములు నా యందే కల్పితము. నేనే సదాత్మను. నేనున్నూ కల్పితుడనే. నా కన్యమైన దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. అది దేని రీతిగానూ మార్పు చెందలేదు. అది ఏమీకాదు. అది సదాత్మగాని, సర్వస్వరూపములకు ఆధారముగాని, అధిష్టానముగాని కానేరదు అని వివరించి తెల్పిన ఘనుడే సద్గురువు. ఆ సద్గురువు మానవ రూపంలో రెండు పాదములు గలవాడు గదా! ఏక పాదము చెప్పబడినదేమి? "ఏ పురుషుడు గురువర్యుని శ్రీపాదము పట్టలేదో" అని కందార్థములలోనూ చెప్పబడినది. కనుక వస్తు నిశ్చయంగా తెలియనగును. అట్టి వస్తు నిశ్చయ రూపమగు బోధ దెల్పి ఆ సదాత్మ యొక్క స్వరూప స్వభావములను దెల్పు గురుమూర్తి యొక్క దివ్యమగునట్టి శ్రీపాదమును అహరహము భజించుచు జనన మరణ భ్రాంతి రహితుల మగుదుము గాక!

శ్లో॥ యస్యప్రసాదా దహమేవ సర్వం
మయ్యేవ సర్వం పరికల్పితంచ
ఇత్థం విజానామి సదాత్మరూపం
తస్యాం ఘ్రిపద్మం ప్రణతోస్మి నిత్యం

తాత్పర్యము : నేనే సర్వమూనై యున్నాను. సర్వమూ నాయందే కల్పించబడినవి అని యీ విధముగా తానే ఆ పరమాత్మ స్వరూపమని యెవని అనుగ్రహముచే ఆరూఢజ్ఞానము కలుగగలదో అట్టి గురుదేవుని పాదకలమలములకు నిత్యము నమస్కరించుచున్నాను.

విశేష వివరణములు : 1) ప్రసాదం 2) అహమేవ 3) పరికల్పితము 1) ప్రసాదము = అనుగ్రహము (దయాకృప) గురువు శిష్యుని అంతఃకరణపరిశుద్ధి శీల సంపద. నడవడిచూచి తృప్తిపడినపుడే గురునికి శిష్యుని యందు అనుగ్రహము కల్గును. ఆ శిష్యుడు బాగుపడవలెనని గురుని అంతః కరణమునందు ఒకానొక స్పందనము కల్గును. ఇది తాబేటి తలపువలె శిష్యునికి శ్రేయోభివృద్ధి గలిగించును. వినిన గురుబోధయందు ఆరూఢజ్ఞానము గలుగును.

2) అహమేవ = అహం + ఏవ = నేనే, అహం అనగా శబ్దార్థముచే నేను అని అర్థము. నేను అనగా వస్తువేది? స్థూల సూక్ష్మ కారణ మహాకారణ శరీరములను నాలుగు శరీరములలో ఏ యొక్క శరీరమైనా కావచ్చును. ఎట్లనగా పొట్టిగానున్నాను. నల్లగానున్నాను.

అని అన్నపుడు పక్త తన స్థూల శరీరముతో తాదాత్మ్యముచెంది మాట్లాడుచున్నాడు. కనుక యిక్కడ నేనగా స్థూల శరీరము అని అర్థము. నేను కులాసాగానున్నాను. నేను దుఃఖములో నున్నాను. అని అన్నపుడు సుఖదుఃఖములనుభవించునది మనస్సు మనస్సు సూక్ష్మ శరీర సంబంధము. కనుక ఈ వాక్యములో నేను అనుమాటకు లక్ష్యవస్తువుగా సూక్ష్మ శరీరమును గ్రహించవలెను. నేనే బ్రహ్మమును అన్నపుడు యీ నేనుకు అర్థము ప్రత్యగాత్మయని లక్ష్యార్థమును గ్రహించవలెను. "అహమేవ" అనునపుడు అహంశబ్దలక్ష్యార్థమగు ప్రత్యగాత్మను మాత్రమే గ్రహించవలసియున్నది. ప్రత్యగాత్మ యే పరమాత్మ (లేక పరబ్రహము) అని మహావాక్య విచారణయందు తెలుసుకొన్న జ్ఞానము వాచాజ్ఞానమే గాని ఆరూఢ జ్ఞానము గాదు. గురుకృపచేత మాత్రమే యీ జ్ఞానమారూఢం కావలెను.

3) పరికల్పితంచ = చక్కగా కల్పించబడెను. నాయందే (నేను అఖండాత్మ స్వరూపుడై వున్నప్పటికీ, అనగా అంతా ఆత్మస్వరూపమైవున్నప్పటికి) నామారూపాలు కల్పించబడినవి. నామ రూపాలు మిథ్యయే. అంతా బంగారమే అయివున్న, కాసులపేరు, వడ్డాణము, గాజులు వగైరా నామములు రూపములు కల్పింపబడినట్లు అని తెలియవలెను.

4) ప్రణతోస్మి = నేను నిత్యము ప్రతిదినము నమస్కారము చేయుచున్నాను. ఈ నమస్కారమునకు "శరణాగతియే" అర్థముగా గ్రహించవలెను. సర్వార్పణ భావముతో తన్ను తాను పూర్తిగా గురుమూర్తి కర్పించుకొనుటే శరణాగతి. ఇదియే ప్రపత్తి. "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణంవ్రజ" అని భగవానుడు గీతాచరమశ్లోకమునందు భక్తుల నాదేశించుచున్నాడు. త్రికరణశుద్ధిగా ప్రతిదినము గురుమూర్తికి తన్నుతానర్పించుకొంటూవుంటే యిక గురుపరమాత్మయే గాని తాను తద్విలక్షణంగా లేనేలేడు. తానూ, విశ్వమూలేవు. వున్నదంతా గురుస్వరూపమే లేక పరమాత్మ స్వరూపమే. తానే పరమాత్మ పరమాత్మయందు తోచబడినవన్నీ తనయందు తోచబడినట్లే తోచబడిన నామరూపాలు మిథ్యయే గనుక తోచబడిన సర్వమూ కూడా తానే.

ఈ నమస్కారము కేవలం ఆరూఢత చెందిన భక్తుడు కృతజ్ఞతా పూర్వకముగా చేయు నమస్కారము మాత్రమే కాదు. ఆరూఢ జ్ఞానము ఆసించిన భక్తులు గూడ సాధనా రూపముగ చేయు నమస్కారము గూడనై యున్నదని తెలియవలెను. కనుక గురుపరమాత్మకు నిత్యము యిట్టి శరణాగతి సర్పులము చేయుచుందుముగాక.

శ్లో॥ శోషణం భవసింధోశ్చ, దీపనం క్షర సంపదాం॥
గురోఃపాదోదకం యస్యతస్మై శ్రీ గురవేనమః

తాత్పర్యము : ఏ గురుదేవుని పాదోదకము సంసార సాగరమును యింకంప చేయగలదో, మరియు నాశనశీలమగు ఐహికాముష్మిక సంపదను ప్రకాశింప చేయగలదో, (అభివృద్ధి పరచగలదో) అట్టి మహా మహిమాన్వితుడగు గురుమూర్తికి నమస్కారము.

విశేష వివరణము : 1) శోషణ దీపనములు 2) క్షరాక్షర సంపత్తులు 3) గురుపాదో దకము. ముఖ్యముగా యీమూటిని గూర్చి వివరించి తెలుసుకొనవలసి యున్నది.

1) శోషణ దీపనములు = శోషణ మనగా యెండించుట లేక యింకింప జేయుట. దీపనము : ప్రకాశింపచేయుట లేక ప్రజ్వలింప చేయుట. ఈ రెండు కార్యములు అగ్ని భూతము యొక్క కార్యములై యున్నవి.

సృష్టి విధానము నందు అగ్ని నుండి జల ముత్పత్తి యగుచున్నది. చివరకు అగ్నియందు లయమగుచున్నది. అగ్ని కారణము, జలము కార్యము, కారణమునుంచి కల్గిన కార్యవస్తువు కారణమునందు పర్యవశించుట న్యాయమే.

అగ్నికి వేడియు, వెలుగు అని రెండు లక్షణములున్నవి. సింధువనగా జలరాశి. దానిని యింకింపచేయవలెనంటే దానికి కారణమగు అగ్ని అవసరం. ఇది సాధారణ జలరాశిగాదు. జన్మ స్థితి లయ రూపమగునదే భవసింధువు.

ఈ భవసాగరమును యింకింపచేయునగ్ని ఏది? ఈ సంసార సముద్రమున మునకలిడు జీవుడు అజ్ఞానముచే యందుగల కించిత్సౌఖ్యములకే యాశపడి అందుకై చేయరాని పనులు చేయుచు పరమార్థమునకు దూరస్థుడైపోవుచున్నాడు. ఆ అల్ప సుఖములనే జీవితాశయముగానెంచి వాని యభివృద్ధికై వేయి దేవుళ్లకు మ్రొక్కులిడుచున్నాడు. ఏది భవసాగరమును యింకింప చేయునని చెప్పబడిందో అదే సర్వసంపదలను ప్రకాశింపచేసి అభివృద్ధిపరుచునని ఈ శ్లోకంలో చెప్పబడింది. ఆ యగ్ని ఏది? ఆ అగ్ని గురుపాద తీర్థము నందున్నట్లుగా యీ శ్లోకము అభివర్ణించుచున్నది.

2) క్షరాక్షర సంపత్తులు : క్షరమనగా నశించునది. అక్షర మనగా నశించనిది అని అర్థము. ఈ లోకమునందు మానవునికి సౌఖ్యమొసంగు స్రక్చందనవనితాదులు ధన కనక వస్తు వాహనములు అయివున్నవి. ఊర్ధ్వలోకములయందు ఆనందము విశేషముగానూ, విశేషకాల ముండునదియునై యుండవచ్చునేగాని అదియు నశ్వరమే అనగా అశాశ్వతమే, ఇదంతయు క్షరసంపద క్రిందనే జమకట్టవలెను. ఇక అక్షరసంపద యేది? అఖండమగు జ్ఞాన సంపత్తియే చిత్ ప్రకాశము. అది సచ్చితానంద స్వరూపమగు పరమాత్మ స్థానీయమైయున్నది. ఇదియే అక్షరసంపద.

ఇక్కడ నొక్క విశేషము గమనించదగియున్నది. క్షరాక్షర సంపత్తులు రెండు నశ్వరములే అని తెలియవలెను. జ్ఞానము కూడా అశాశ్వతమేనా? ఎట్లు? అని సందేహం కలుగవచ్చు. కాని సృష్టికి పూర్వం ఒకరీతిగాను సృష్టి కాలమందొకరీతిగాను, సృష్టి అనంతరం జీవోపాధులతో న్యూనాధిక్యతలతో మరొకరీతిగానూ జ్ఞానము మారును. మరియు నా వుపాధులలో జాగ్రదా ద్యవస్థలలో వేరువేరు రీతులుగా మారుచుండెడి జ్ఞానము శ్వాశత మనరాదు. ఎప్పటికీ ఏ మార్పూ లేకుండా వుంటే శాశ్వత మనవచ్చును. అజ్ఞానము జ్ఞానమువల్ల నశించును. అజ్ఞానము అశాశ్వతమన్నారు. జ్ఞానము జ్ఞానాతీతమగు పరిపూర్ణ పరబ్రహ్మమునందు లేదు. దాని దృష్ట్యా అశాశ్వతముగానే చెప్పవలసియున్నది. యీ జ్ఞానాజ్ఞానములు పరస్పర సాపేక్షికములు మరియు నివి ఏకవస్తువు యొక్క మారురూపములు. "జ్ఞానాజ్ఞానంబులు యీ జ్ఞానానివేగాని వేరుగా వెన్నటికీ" "జ్ఞానము వచ్చును పోవును, జ్ఞానాతీతమును దానుగాంచిన దాకన్" అనిన్నీ

శ్రీకృష్ణదేశికులు అభివర్ణించినారు. జ్ఞానము క్షరసంపదలోనే చేరును. గురుగీతలోనేయున్న యీ క్రింది శ్లోకముగూడా యీ భావనను యెట్లు స్థిర పరచుచున్నదో విచారించిచూడుడు.

శ్లో॥ శోషణం పాపపంకస్య దీపనం జ్ఞానతేజసా।
గురోఃపాదోదకం సమ్యక్ సంసారార్ణవతారకం॥

యీ శ్లోకముగూడా గురుపాద తీర్థము యొక్క మహిమనే వర్ణించు చున్నది. ఈ రెండు శ్లోకములను ఒకదానితో నొకటి పోల్చి తారతమ్యములను సాదృశ్యములను విచారణ చేయవలసి యున్నది.

1) "శోషణం భవసింధోశ్చ" అని మన మెత్తుకొన్న గురుగీతా శ్లోకములో వుండగా "సంసారార్ణవ తారకం" అని రెండవ శ్లోకములో యున్నది. అనగా సంసార సముద్రమును దాటించును అని అర్థము. సముద్రమును దాటినవాడు మరల సముద్రములో పడుట కవకాశమున్నది. సముద్రమే యింకిపోయినచో ఆ ప్రమాద ముండదు. ఆ సముద్రమేది? అజ్ఞానమే సంసార సముద్రమని యితరులంటారు. జ్ఞానా జ్ఞాన రూపమైన (యెరుక మరుపుల రూపంలో వుండే యెరుక) జ్ఞానమే ఆ సంసార మహా సముద్రము అని అచల ఋషులంటారు.

2) రెండవ శ్లోకములో శోషణం పాపపంకస్య అన్నారు. మొదటి శ్లోకములోని భవసింధువునకు, పాపమే బురద లేక వూబియై యున్నది. ఆ వూబిలో దిగబడిన జీవుడు మరల పైకి తేలుట దుస్తరము. ఈ పాపమే దోష స్వరూపము. క్షరాక్షరోపాధి ద్వయదోషమని కృష్ణదేశికేంద్రుల వారన్నారు. అయితే ద్వయదోషమేది? పాపపుణ్యములనే రెండు రూపాలు దోషస్వరూపాలే. ఒకటి యినుప సంకెలుగా బంధిస్తే మరొకటి హిరణ్యశృంఖలంగా బంధిస్తుంది. ఇందు క్షరోపాది పాపమని చెపితే అక్షరోపాధి పుణ్యలక్షణమని చెప్పవచ్చును.

3) "దీపనం క్షరసంపదాం" అని మొదటి శ్లోకంలో వుంటే దీపనం జ్ఞాన తేజసాం" అని రెండవ శ్లోకంలో కలదు. అంటే రెండవ శ్లోకంలో పాపపంకమునుండి జీవుని లేవనెత్తి పుణ్యరూపమైన జ్ఞానతేజస్సుతో గూడిన అక్షర సంపదను గురుపాదోదకం కలిగించును అని అర్థం. ఈ అక్షర సంపద్రూపమగు జ్ఞానము హిరణ్యశృంఖలములవలె బంధకారణమని యిదివరకే చెప్పబడినది. పర్యవసానమేమనగా

4)"శోషణం పాపసంకస్య" అను శ్లోకములో గురుపాద తీర్థము పాపమును నాశనము చేసే పుణ్యఫలరూపమగు జ్ఞాన సంపత్తి చేకూర్చుట ద్వారా జన్మకారణమగు అజ్ఞానమనే భవసాగరమును దాటింప చేయును అని సామాన్యంగా యితరులుచెప్పే అర్థము. "శోషణం భవసింధోశ్చ" అను శ్లోకార్థము అతీత భావమునే చెప్పుచున్నది. శాశ్వతముగా భవసాగరము యింకిపోవలెనంటే, అనగా శాశ్వత జన్మరాహిత్యము సిద్ధించవలెనంటే, అందుకు గురుపాదతీర్థమే కారణమైయున్నది. యెట్లనగా, భవసాగరమునకు మూలకారణము అజ్ఞానము కాదు. జ్ఞానాజ్ఞానము లుగా ఏ ఒక్క జ్ఞానమే అభివ్యక్తమై జీవేశ్వర జగత్తుకు కారణము అయినదేదో అదే ఆవశ్యకము. పరిపూర్ణ బోధాగ్నియే భవసాగరమును యింకింపచేయునగ్ని. కనుకనే

కృష్ణదేశికేంద్రులు "మక్కువనే బోధించిన చక్కని బోధాగ్నిచేత సాధించుకోరా" అని హెచ్చరించి నారు.

3) గురుపాద తీర్థము : సముద్ర గర్భమందు బడబాగ్ని యున్న రీతిగా, గురుపాదోదక ముల యందు బోధాగ్ని యిమిడియున్నది. అందుకే గురుగీతలో

శ్లో॥ ప్రసన్న వదనాక్షంచ సర్వదేవ స్వరూపిణిం
తత్పాదోదకంచధారా నిపతంతీ స్వమూర్ధని
తయా సంక్షాళయే దేహస్వాంతర్బాహ్యగతం మలం
తత్క్షణాద్విరజో భూత్వా జాయతే స్ఫటికోపమః

అను శ్లోకమునున్నూ "వందే గురుపద ద్వంద్వం, వాఙ్మనోతీతగోచరం। శ్వేత రక్త ప్రభాభిన్నం శివశక్త్యాత్మకంపరం" అను శ్లోకమున్ను గురుముఖతః విచారిస్తే నిర్గుణమగు గురుపరమాత్మ యొక్క పాదద్వంద్వమేదియో, గురుపాదోదకము యొక్క వాక్యార్థ లక్ష్యార్థము లేవియో తెలియబడును. గురుపాదోదక స్నానపానములచే శిష్యుని స్థూల సూక్ష్మశరీరము లెట్లు పవిత్రీభూతము లగుచున్నవో తెలియనగును.

అట్టి సద్గురు పరమాత్మ యొక్క సగుణ నిర్గుణ రూపములను అహరహము భజించు శక్తి గురుపరమాత్మ అనుగ్రహ విశేషముచే మనకు సిద్ధించును గాక!

శ్లో॥ అజ్ఞాన మూలహరణం జన్మ కర్మ నివారణం
జ్ఞాన వైరాగ్య సిద్ధ్యర్థం గురుపాదోదకం పిబేత్॥

తాత్పర్యం : అజ్ఞానమునకు అత్యంత మూలకారణమగు వస్తువును నశింపచేయునదియును, శాశ్వతముగా జన్మకర్మలు రెంటిని తొలగించు నదియును,జ్ఞానమందలి ఆపేక్షను తొలగించి, జ్ఞానా జ్ఞాన రహితమగు శాశ్వత జన్మరహిత్య రూప మోక్షమును సిద్ధింపచేయునదియును అగు గురుపాద తీర్థమును భక్తితో గ్రోలుము అని తాత్పర్యము.

ఈ శ్లోకమునందలి శబ్దశబ్దార్థములను వివరించుటకు ముందు పాఠకులు.

శ్లో॥ గురుపాదోదకం పానం, గురోరుచ్ఛిష్టభోజనం
గురుమూర్తి స్సదాధ్యానం, గురోర్నామ సదాజపేత్

అను గురుస్తోత్రమును మరొకసారి పఠించుట అత్యావశ్యకము. మరిన్ని "అజ్ఞాన" శబ్దార్థము భావపదార్థమా! అభావ పదార్థమా! అస్తిసిద్ధమా? భాతి సిద్ధమా? అసలు అజ్ఞానమునకు ఉనికి ఉన్నదా? అను విషయముల గూర్చి వివరింపబడిన అనుబంధ గురుస్తోత్రములు చూడనగును. ఇపుడు తిరిగి చర్చించుట చర్వితచర్వణమగును.

విశేష వివరణ : 1) అజ్ఞాన మూలము 2) జన్మకర్మలు 3) జ్ఞానవైరాగ్యసిద్ధి

1) అజ్ఞాన మూలము : అజ్ఞాన మెట్లు కలుగుచున్నది? మాయ. మాయవలన అజ్ఞానము అజ్ఞానము వలన అవివేకము. అవివేకమువల్ల అభిమానము. అభిమానమువల్ల రాగద్వేషములు. రాగద్వేషాదులవల్ల కర్మ. కర్మవలన జన్మ పరంపరగా వచ్చెనని కొందరందురు.

కాని ఇందు అజ్ఞానమునకు కారణము మాయయనియు, మాయ అనగా "యా, మా, సామాయ" అనగా ఏది లేనిదో అదే మాయయని నిర్వచనము ఇచ్చియున్నారు. అయితే మాయకు స్థానము, బ్రహ్మమేననియు, బ్రహ్మము యొక్క సన్నిధానమందు మాత్రమే జడమైన మాయకు చైతన్యము కలిగి క్రియాకారకమగునవియు వారే అందురు. బ్రహ్మము వినా మాయకు స్థానముగాని, క్రియా కారకత్వముగాని లేదన్నప్పుడు ఆ బ్రహ్మమే మాయకు కారణమననగును. అంతేకాదు. బ్రహ్మమే మాయ, మాయయే బ్రహ్మము అని చెప్పుటయే సమంజసము. అపుడు అజ్ఞానమునకు కారణము మాయ యనియు, మాయకు కారణము బ్రహ్మమనియు, బ్రహ్మమే అజ్ఞానమునకు అత్యంత మూలకారణమనియు, అజ్ఞానమూలము బ్రహ్మమేననియు సిద్ధించు చున్నది.

కాని ఇందొక శంక అనివార్యముగా కలుగుచున్నది? ఏమనగా బ్రహ్మము చిద్ఘనమును, అఖండ జ్ఞానస్వరూపమును అయి వున్నది. మహా చైతన్యవంతమగు సత్పదార్థముగా నున్నది. ఇక, అజ్ఞానమో, జడము, అత్యంత జ్ఞానరహితము, అసత్పదార్థము అయి ఉన్నదే. అట్టి అజ్ఞానమునకు అట్టి బ్రహ్మము కారణమగునా! ఇందుకేమైన దుష్టాంతము చెప్పగలరా? అని ఎవరైన ప్రశ్నించవచ్చును. దీపము స్వచ్ఛమైన చిమ్నీచేత ఆవరింపబడి పరిశుద్ధమైన ప్రకాశము ఇచ్చుచున్నది. కాని ఆ దీపము ప్రకాశముతోపాటు పొగనుకూడా విసర్జించు చున్నది. విశేషముగా విసర్జించబడిన ఆ పొగ స్వచ్ఛమైన ఆ చిమ్నీని దట్టముగా కప్పినపుడు, అదివరకు ప్రకాశవంతమై యున్న ఆ దీపమే ఇపుడు ధూమావృతమై ప్రకాశ హీనమై చివరకు కేవలము అప్రకాశ రూపమే అగుచున్నది. అట్లే బ్రహ్మమునందు బీజరూపముగా అణగిమణగియున్న సత్వరజస్తమో గుణముల మూడింటిలో తమోగుణ విజృంభణయే సచ్ఛిదానంద స్వరూపమగు బ్రహ్మమును అనృత జడ దుఃఖాత్మకమైన అజ్ఞానముగా మార్చివేయుచున్నది. ఈ విధముగా బ్రహ్మము అజ్ఞానమునకు మూలకారణమగుచున్నది. శ్రీకృష్ణదేశి కేంద్రులవారు తమ కంద పద్యములలో "జ్ఞానాజ్ఞానంబులు ఈ జ్ఞానానివేకాని వేరుకావు ఎన్నటికి" అని శెలవిచ్చి యున్నారు. ఒక్కజ్ఞానరూపమగు బ్రహ్మమే సత్వగుణాధిక్యతచే కేవల జ్ఞానస్వరూపముగా నున్నట్లును, తమోగుణాధిక్యతచే కేవలం అజ్ఞానముగా నున్నట్లును భాసించుచున్నది. అజ్ఞానమునకు అత్యంత మూలకారణము బ్రహ్మమే. సూర్యుని మేఘము కప్పినట్లు, గర్భస్థ పిండమును మావి ఆవరించినట్లు, శరీరమును చర్మము కప్పియున్నట్లు, వరి గింజను పూక కప్పియున్నట్లు, జ్ఞానమును అజ్ఞానము ఆవరించినదని శాస్త్రములలో పలుచోట్ల గానవచ్చును. జ్ఞానాజ్ఞానములు వేరువేరు భిన్నభిన్న పదార్థములని వానికి అర్థము చెప్పుట వలన అద్వైత హానియే అగుచున్నది. ఈ విప్రతిపత్తి ఎట్లు తొలగును? అని సమన్వయ దృష్టితో యోచించిన 1) సూర్యుని ఆవరించిన మేఘము సూర్యుని వల్ల పుట్టినదే 2) గర్భస్థ శిశువును ఆవరించిన మావి ఆ శిశువు వల్లనే శుక్ల శోణితమువల్ల ఉత్పత్తి అయినదే 3) శరీరమును కప్పిన చర్మము శరీరమువలెనే సప్తధాతుమయమే 4) వరిగింజను ఆవరించిన ఊక వరిగింజతోపాటు వరిమొక్కనుండి వచ్చినదే అని గుర్తించినచో ఎట్టి విప్రతిపత్తియునూ లేదు. ద్వైతాపత్తియున్ను లేదు.

2) జన్మకర్మలు : వర్తమాన జన్మకు, ఈ జన్మయందు జీవులనుభవించు ప్రారబ్ధ రూపమగు సుఖదుఃఖములకు, పూర్వపూర్వజన్మలయందలి, ఇంతకు పూర్వము ఫలోత్పత్తికి రాని కర్మవాసనలే కారణమని సనాతన ధర్మసిద్ధాంతమైయున్నది. జన్మ ఎత్తికదా! కర్మచేయ వలెను? కర్మకు జన్మయే కారణమనవలెను. కాని జన్మకు కర్మ కారణమనరాదు అని కొందరనవచ్చును. కాని సృష్టి అనాది అనియు పూర్వ పూర్వ సృష్టుల యందలి కర్మసంస్కారములే ఉత్తరోత్తర సృష్టులందలి జన్మలకు కారణమగుచున్నవనియు కొందరు సమాధాన మిచ్చు చున్నారు. అయితే మొట్టమొదటి సృష్టి యందలి జన్మలకు కారణమగు కర్మసంస్కారము లెక్కడివి? అనిమొదటి వారు రెండవ వారిని ప్రశ్నించుచున్నారు. అందుకు రెండవవారు సృష్టి అనాధి అన్నాము కదా! ఇక మొదటి సృష్టి అనేది నిర్ణయింపబూనుట నీ అవిద్యా దోషమే అని మొండిగా సమాధాన మిడుచున్నారు. ఇందుకు పరిష్కారమేది? మీ జవాబు ఏమి? అని పరిపూర్ణ భావజ్ఞులను ఇతరులు ప్రశ్నిస్తున్నారు. సృష్టికి పూర్వము ఏకమై, శుద్ధమై, బుద్ధమై, నిత్యమై, అఖండమైయున్న ఇతరులు చెప్పే బ్రహ్మమే సర్వకారణ స్వరూపమనియు, అదియే జన్మకర్మలు రెంటికి ఆధారము, అధిష్ఠానము అయి ఉన్నదనియు, అదియే జన్మలెత్తి కర్మలు చేయుచూ పునఃపునఃచర్విత చర్వణముగా జన్మకర్మలలో పొర్లాడుచున్నదనియు పరిపూర్ణుల భావము.

ఈ భావమునే శ్రీకృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థములలో "ఆటాడి అడకుండును" అనే కందార్థములో "చేటుపాటుల రెంటిచే వచ్చు ఫలము ముమ్మాటి కనుభవించి మరణ జననము లొంద అతడేరకర్తా" అని ఉద్ఘాటించియున్నారు. ఎట్లు అని పాఠకులు ప్రశ్నించవచ్చును. సృష్టికి పూర్వము సృష్టి కారణమైన ఈ బ్రహ్మము కూడా అచలమై యుండెను. అపుడా బ్రహ్మమునందు సృష్టిగాని, సృష్టి సంకల్పముగాని లేదు. పిమ్మట "సోఽ కామయత బహుస్యాం ప్రజాయేయ" అని సృష్టి సంకల్పము కల్గెను. ఈ సంకల్పము కలుగుటయే దానికి జన్మ, అచల స్థితిలోనున్న ఈ బ్రహ్మమునకు ఈ ప్రథమ చలనము కలుగుటయే కర్మ. ఆ బ్రహ్మము యొక్క సృష్టి సంకల్పమే జన్మ. అదియేకర్మ. అది కర్మ యెట్లగును? అంటే చలనము లేనిచో కర్మ లేదు. కనుక చలనమే కర్మ. సృష్టి సంకల్పము కూడ చలనమే. ఇది మానసిక చలనము. లేక మానసిక కర్మ.జన్మకర్మలు రెండునూ బ్రహ్మము యొక్క జన్మకర్మలే అయివున్నవి. ఇందు ఏది ముందు? జన్మయా? కర్మమా? అంటే రెండూ ఏకకాల మందే కలుగుచున్నవి. దృష్టాంతమేమి? అంటే గుణమధురములే. బెల్లముముందా? తీపిముందా? అంటే రెండు ఏకకాలమందే కలుగుచున్నవి. ఒకేసారి పోవుచున్నవి అని శ్రీకృష్ణదేశికేంద్రులున్ను శెలవిచ్చి యున్నారు. ఈశ్లోకములో జన్మకర్మలు అని ద్వంద్వ సమాసము ప్రయోగింపబడినది. అన్నింటికి మూలము నేనైన బ్రహ్మమేనని గీతయందు భగవానుడు కూడా.

శ్లో॥ గతిర్భర్తా ప్రభుస్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
ప్రభవఃప్రళయస్థానం నిధానం బీజమవ్యయం॥

అని చెప్పియున్నాడు.

జ్ఞాన వైరాగ్యములు : 1. జ్ఞానము 2. వైరాగ్యము. ఈ రెండునూ సిద్ధించుటకు గురుపాదోదకపానము చేయవలసియుండునని ఈ శ్లోకము విధించుచున్నట్లు స్థూలార్థములో తోచుచున్నది. అట్లగుచో జ్ఞానము సిద్ధించినచో వైరాగ్యము సిద్ధించునా? లేక వైరాగ్యము కలిగినవానికి ఆ పిదప జ్ఞానముసిద్ధించునా? అను ప్రశ్న ఏర్పడుచున్నది. మహావాక్యార్థ జ్ఞానము శ్రవణ, మనన, నిధి ధ్యాసలచే సిద్ధించుచునని, అందుకు అధికారి సాధన చతుష్టయ సంపత్తి కలవాడనియు వేదాంత శాస్త్రము చెప్పుచున్నది. సాధన చతుష్టయ సంపత్తిలో ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము (అనగా ఐహికాముష్మిక సుఖములందు వైరాగ్యపరుడై యుండుట) రెండవ సాధనముగా పేర్కొనబడినది. అందుచే వైరాగ్యపరునకే జ్ఞానోత్పత్తి కలుగగలదని చెప్పినట్లైనది. మరిన్ని వైరాగ్య బోధోపరతులని క్రమము చెప్పబడి యున్నది. కాని ఈ శ్లోకంలో జ్ఞానమే ముందు కలుగునని ఆ పిమ్మట వైరాగ్యము సిద్ధించునని చెప్పినట్లే అగుచున్నది. దీని పరిష్కారమేమి? పరిష్కారము సిద్ధాంతీకరించుటకు ముందు జ్ఞానము అననేమో నిర్ణయించుట ముఖ్యావసరము.

శ్లో॥ ఆధ్యాత్మజ్ఞాన నిత్యత్వం తత్వ జ్ఞానార్థ దర్శనం
ఏతత్ జ్ఞానమిత్రిపోక్త మజ్ఞానం యదతోఽ న్యథా॥

తాత్పర్యము : ఆత్మజ్ఞాన నిశ్చయము (నిత్యత్వము) తత్వజ్ఞాన స్వరూప అనుభవము అనునది అంతయు జ్ఞాన మనబడు చున్నది. దీనికి భిన్నమైనదంతయు అజ్ఞానము అని గీతాకారుడు శలవిచ్చియున్నాడు. అనగా పిండ బ్రహ్మాండములయందలి తత్వము లన్నియూ పరిశోధించి వాని అన్నిటికీ అధిష్టాన స్వరూపమైన పరమాత్మ యొక్క స్థాన స్వరూప, స్వభావములు వస్తు నిశ్చయముగా తెలియుటయే జ్ఞానము. అనగా సృష్టికి పూర్వమున్న కారణ బ్రహ్మమేదియో, ఆ కారణ బ్రహ్మమును సాక్షాత్కరింప చేసుకొనుటయే జ్ఞానము. లేక బ్రహ్మజ్ఞానము. అట్టి వస్తు స్వరూప జ్ఞానము సాధించినవాడు "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్టం" అను శ్రుతి న్యాయముగా జగత్తునందలి నామరూప దృష్టిని విడిచి సర్వము ఆత్మమ యమైయున్నదని అనుభవ జ్ఞానము సాధించగలడు. ఇదియే జ్ఞానము. ఇట్టి జ్ఞానము లేనియెడల వాడు అజ్ఞానియే అని గీతాకారుడు అన్నట్లే.

వైరాగ్యము : వైరాగ్యమనగా రాగము (లేక గాఢమగు ప్రేమ) లేకపోవుటయే. అయితే దేనియందు ఇట్టి వైరాగ్య ముండవలెను? అను ప్రశ్న ముఖ్యముగా విచారించవలసియున్నది. ఏది బంధకారణమగుచున్నదో దానియందు వైరాగ్యము కలిగియుండుట అవసరము కదా! శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాత్మకమగు ప్రపంచమందలి దృశ్య వస్తు కోటియే మానవుని ఆకర్షించి బంధకారణమగుచున్నదని సామాన్యముగా లోకులందురు. కారణమేమంటే " యద్దృశ్యం తన్నశ్యం" అనే న్యాయంగా దృశ్య వస్తువులన్నియు క్షణికములు, నశించునవి అయివున్నవనియు, ఈ విషయము విస్మరించి వానిని ఆశించుట అవివేక మూలమగు

అజ్ఞానమనియు, తుచ్ఛములు, నశించునవి అయిన ఈ వస్తువునందలి ప్రేమ పెంపొందించు కొనక వైరాగ్యము పొందుట ముఖ్యా వసరమనియు భార్యా, పుత్ర, ధన కనక వస్తు వాహమునము లందలి ప్రేమను చంపుకొని, ఆ యన్నింటిని విసర్జించి సన్న్యసించుటే ధీరుడగు పారమార్థికుని కర్తవ్యమనియు కొంచె మించు మించుగా సామాన్యముగా ఏల్లరు తలంచుచున్నారు. కాని దేనియందలి ప్రేమచేత ఈ వ్యక్తులయందు వస్తువులయందు ప్రేమ కలుగుచున్నదో విచారించుటలేదు. తన ఆనందముకొరకే మానవుడు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములందలి లవలేశరూపములగు ఆనందము కొర్కై అర్రులుసాచి, పాప పుణ్య సంకోచము విడిచి దుష్కృతము లొనర్చి, నూతన సంస్కారము లేర్పరుచుకొని, కర్మ బంధమున చిక్కుకొనుచున్నాడు. ఈ విషయమునే బృహదారణ్యకోపనిషత్ "ఆత్మవస్తు కామాయ, పతిఃప్రియోభవతి, ఆత్మవస్తువ కామాయా, జాయా ప్రియాయభవతి, ఆత్మనస్తు కామాయా, పుత్రాః ప్రియాభవంతి" ఆత్మనస్తు కామాయా, సర్వం ప్రియం భవతి" అంటూ చక్కగా వివరించినది. దీనిని బట్టి తేలిన దేమనగా, వస్తువు యందలి గుణదోషములు బంధకారణమగుట లేదనిన్నీ, తనయందలి గుణదోషములే బంధకారణమగుచున్నవని,తనరహితమునందుగాక తన యందలి గుణదోషములు రహితము కావని తేటతెల్లమగుచున్నవి. కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులవారు "క్షరాక్షరోపాధి ద్వయదోష రహిత పరమ తత్వకందములు" వ్రాయవలసివచ్చినది. వ్యక్తుల యందు, వస్తువుల యందు గల నశ్వరత్వము గమనించి, వానియందు వైరాగ్యము బూనమని ఇతరులు హెచ్చరించుచున్నారు. పీఠాధిపతులగు శ్రీమద్ధయానంద పొన్నాల రాజయోగీంద్రులవారు తమ "నిజ ప్రబోధ" అను గ్రంథమునందు "వైరాగ్య" శబ్దమును నిర్వచించుపట్ల "రూప నామ క్రియాస్పద మగు నంతర్బాహ్య ప్రపంచమనిత్యమని తెలుసుకొనుట కంటే వానిని తెలియునట్టియు తెలియచేయు నట్టియు చేతన బ్రహ్మమే అని తలంచి దానియందు వాంఛ లేకయుండుట వైరాగ్యము అని శెలవిచ్చి యున్నారు. శ్రీకృష్ణదేశికేంద్రులవారు కూడా "దేశాటనంబు చేసితి" అనే కందార్థములో మోక్ష స్వరూపమగు ఆత్మయందు "రోసితి మోక్షాద్యపేక్ష రూఢిగ వినుమీ, నీవిట్టి ఆరూఢత గనుమీ" అని నొక్కి వక్కాణించియున్నారు. పరిపూర్ణబోధకు అధికార నిర్ణయము చేయుటలో శ్రీశివరామ దీక్షితుల వారు" జ్ఞాన భ్రాంతి కలవారికి చెప్పవద్దన్నారు" అని తాము రచించిన బృహద్వాశిష్ఠ గ్రంథములో శెలవిచ్చియున్నారు. ఆత్మరూపమగు "ఎరుక" యందలి భ్రాంతిని వదలుటే నిజమైన వైరాగ్యమని పరిపూర్ణ భావజ్ఞుల పిండితార్థము. ఎరుక యొక్క వస్తు నిశ్చయము లేనిదే ఎరుకయందు వైరాగ్యము కలుగుట ఎట్లు? ఆత్మజ్ఞానము ముందుగా కలిగిన పిదపనే ఏరుక భ్రాంతి రహిత రూపమగు వైరాగ్యము కలుగవలెను. కనుకనే శ్లోక మందు కూడా "జ్ఞానవైరాగ్య సిద్ధ్యర్థం" అంటూ జ్ఞానమే ముందు కలుగవలెను అని సూచింపబడినదని సిద్ధాంతము.

జ్ఞానవైరాగ్యసిద్ధి : ఈ సమాసమును రెండు విధములుగా అర్థము చేసుకొనవచ్చును. 1) జ్ఞాన వైరాగ్యములు రెండున్నూ సిద్ధించుట అనేది ఒక అర్థము. 2) జ్ఞానమునందు కూడ

వైరాగ్యము సిద్ధించుట అనునది రెండవ అర్థము. మొదటి అర్థములో "పరిపూర్ణ మెరుకల నెరిగి ఎరుకను మాను" అనుటలో ఎరుక నెరుగుటయే జ్ఞాన సిద్ధి, ఎరుకను మానుటయే వైరాగ్యసిద్ధి. రెండవ అర్థములో సామాన్యముగా మానవుడు సర్వము తెలుసుకొనవలెనని, తనకు తెలియనిదంటూ ఏదీ ఉండరాదని, సర్వశాస్త్రముల భావము. తనకు తెలియవలెనని ఆశించి జ్ఞాన సముపార్జనయందు రాగము పెంచుకొనుచున్నాడు. జ్ఞాన సముపార్జన తన జన్మరాహిత్యమునకు తోడ్పడునంత వరకు మాత్రమే ముఖ్యావసరముగాని శాస్త్ర వాసన దూష్యమని పెద్దలందురు. "ఎందుకు నీకింక ఇతర శాస్త్రముల జోలి అందు గుర్తుండి పోదు" అన్నారు కృష్ణదేశికేంద్రులు. వాసనాత్రయములలో శాస్త్ర వాసన ఒకటి అగుటయేకాగ మిక్కిలి బలీయమై మానవుని బంధించునదిగాయున్నది. ఇట్టి జ్ఞానమునందు కూడా వైరాగ్యము కావలెనని తెలుచున్నది. "వాగ్ వైఖరీ శబ్దఝురీ శాస్త్ర వ్యాఖ్యాన కౌశలం..........భుక్తయే నతు ముక్తయే నతు ముక్తయే" అనిన్నీ అనుష్ఠాన ఆచరణలులేని శాస్త్రజ్ఞానము "ఖరశ్చందన భారవాహి" అనిన్నీ "దర్వీపాక రసంయధథా" అనిన్ని దూషింపబడినది. అంతేగాక "శాస్త్రజ్ఞానం బహుక్లేశం, బుద్ధేశ్చలన కారణం, ఉపదేశాద్ధర్భుద్ధారమతే సర్వకర్మసు" అని గురుగీత కూడా శాస్త్ర జ్ఞానము వలన గాక, గురూపదేశమువలననే తరించవలెనని ఉద్భోదించు చున్నది. ఇట్టి శాస్త్ర జ్ఞానము నందు వైరాగ్యబుద్ధి కలుగుట కూడా గురుపాదోదకపానము వలన సిద్ధించుచున్నది.

అనుగ్రహ పూర్వకముగా సచ్ఛిష్యులకు తీర్థప్రసాదము లిచ్చి కృతర్థులను చేయుచున్న శ్రీ సద్గురు దేవుల దివ్యశ్రీ చరణములను నిరంతరము సేవించుదుముగాక!

శ్లో॥ అజోఽ హమమరోఽ హంచ అనాది నిధనోవ్యాహం
అవికారశ్చిదానందో హ్యణీయాన్ మహతో మహాన్॥

తాత్పర్యము : నేను అజుడను, అమరుడను, ఆది లేనివాడను అంత్యము లేనివాడను, వికారములులేనివాడను, చిదానంద స్వరూపుడను, అణువుకంటె సూక్ష్మ స్వరూపుడను, మహత్తుకంటెను పెద్దవాడను.

విశేషవివరణము : 1) శ్లోకము యొక్క పూర్వాపరములు 2) అహము 3) అజము, అమరము 4) అనాది, విధనములు 5) అవికారము 6) చిదానందము 7) అణీయాన్ 8) మహతోమహాన్ ఈ విషయములు వివరించి తెలుసుకొనవలసియున్నది.

1) శ్లోకము యొక్క పూర్వాపరములు : 1) అహం అనగా నేను. ఈ శ్లోకములో చెప్పబడిన నేనే ఏదియో తెలుసుకొనవలెనన్న ఈ శ్లోకమునకు పూర్వాపర శ్లోకములను గమనించవలెను. దీని పూర్వ శ్లోకము.

శ్లో॥ అంగుష్ఠమాత్రం పురుషం ధ్యాయేత్ చిన్మయంహృది।
తత్రస్ఫురతి యో భావః శృణు తత్కథయామి తే॥

అనగా హృదయమునందు గురువును అంగుష్ఠమాత్ర పురుషునిగా ధ్యానించినచో, ఎట్టి

అనుభవరూపమగు జ్ఞానోదయము కలుగుచున్నదో చెప్పుచున్నానని చెప్పి ఆ పిమ్మట "అజొహ..........." అను యీ శ్లోకముతో ప్రారంభించి వరుసగా మూడు శ్లోకములు చెప్పబడినవి. గురుధ్యానముచే కలిగెడు అనుభవరూపమైన జ్ఞానము యీ శ్లోకములో వర్ణింపబడుచున్నది.

2) అహం = నేను, నేననే అహం వృత్తి స్థూల సూక్ష్మ కారణ మహా కారణ శరీరములతో వ్యవహారకాలమున సంబంధపడి నేను అని పలుకుచున్నది. స్థూల శరీరముతో తాదాత్మ్యము చెంది నేను పొట్టివాడను, బలసినవాడను, నల్లనివాడను యిత్యాదిగా పలుకుచున్నది. నేను సుఖముగానున్నాను నేను దుఃఖములతోనున్నాను అని సుఖదుఃఖములను అనుభవించి సూక్ష్మ శరీర సంబంధమగు మనస్సుతో తాదాత్మ్యము చెందినేనని పలుకుచున్నది. కారణ శరీరమగు అజ్ఞానతాదాత్మ్యముచే నేను నిద్రలోనుంటిని, ఏమియు తెలియనైతిని, అని పలుకుచున్నది. మహాకారణ శరీరమైన ప్రత్యగాత్మతో తాదాత్మ్యము చెంది నేనే పరమాత్మను, అహం బ్రహ్మాస్మి అని పలుకుచున్నది. ఇదంతయు నేను యొక్క వ్యవహారమే, ఈ శ్లోకములో "అహం" శబ్దముచే మహాకారణ శరీరముతో తాదాత్మ్యముచెందిన "నేను" వుపలక్షింపబడినది.

ఈ నేననే వృత్తి (లేక నేననే గుర్తు) యెట్లు కలుగుచున్నది? జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలలో యెట్లు పనిచేయుచున్నది? మనఃప్రాణముల చేరికలో మనోవ్యాపారము తోపాటు నేననే వృత్తిన్ని గలుగుచున్నదని స్పష్టము. కృష్ణ దేశికేంద్రులవారు "అన్నపు సూక్ష్మాంశము మనస్సు, యెన్నగనీరంబు ప్రాణ మీ రెండెన్నడు గలియవో నాడే సున్న సుమీ యెరుక మాట సుగుణ సంపన్నా, కలసుటే సుమి యెరుక...." అని సిద్ధాంతీకరించినారు. ఈ కందార్థమును గురుముఖతః విచారించిన వారికి యెరుక యొక్క వుత్పత్తి స్థితి నాశముల విషయము స్పష్టము గాగలదు. ఈ నేను యొక్క స్థాన స్వరూప స్వభావములను గూర్చి ధ్యానించి చక్కగా గుర్తెరుగుట ప్రథమ కర్తవ్యమని శ్రీ రమణ మహర్షులవారున్ను శెలవిచ్చినారు.

3) అజము, అమరము : అజము అనగా పుట్టనిది. అమరము అనగా మరణము లేనిది అని అర్థము. మనఃప్రాణముల చేరికలో గల్గిన నేననే వృత్తి లేక వ్యష్టి గుర్తు ప్రత్యక్షముగా పుట్టుచున్నది. పోవుచున్నది. వున్నపుడు క్షణక్షణమున్నూ నానావిధాలుగా మార్పులున్నూ చెందుచున్నది. ఇట్టి నేను పుట్టువాడను, మరణములేనివాడను అనుట యెట్లు పొసగును. వ్యష్టియెట్లో సమిష్టియు నట్లేనని గురుముఖతః విచారించి తెలుసుకొనవలెను. పుట్టని దొక్క పరబ్రహ్మము మాత్రమేనని చెప్పబడుచున్నది. 1) పుట్టు చావులు ప్రత్యక్షముగా గల నేను బ్రహ్మము కాజాలను. 2) లేదా నేను ఏ బ్రహ్మమునగుదునో ఆ బ్రహ్మమునకున్ను పుట్టు చావులున్నవి అను రెండు వికల్పములు కలుగుచున్నవి. ఐతే (అద్వైత సిద్ధాంతరీత్యా) నాలుగు వేదములూ మహావాక్య నిర్ణయముచేత నేనే బ్రహ్మమనని సిద్ధాంతము చేయుచున్నవి. ఈ శ్లోకము నేను పుట్టుకలేనివాడను మరణములేనివాడను అని వుద్ఘాటించుచున్నది. నేను యేబ్రహ్మమునగుదునో దానికిన్ని పుట్టుచావులు లేవు అని చెప్పి తీరవలెను. మరి పరిపూర్ణ భావజ్ఞులు పుట్టని చావని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే. అది ఇది కాదు. ఇది అది కాదు. అని సిద్ధాంతము యెట్లు చేయుచున్నారు? వీరి సిద్ధాంతము శ్రుతి విరుద్ధంకాదా? యని శంక

కలుగవచ్చును. దీనికి పరిష్కారమేమి? అంటే

1) పుట్టు చావులులేని, కేవల పరిపూర్ణ బ్రహ్మము సర్వలక్షణ విలక్షణమైయున్నది. అది నేను యెన్నడూ కాజాలను.

2) పూర్ధ్వ అధోరూప పరిణామములు చెందుచూ సర్వస్వరూపములు. తానే అయి కొద్ది గొప్పలుగా నుండునది, మహావాక్యములలో చెప్పబడిన బ్రహ్మమున కర్థము. ఇదే పుట్టు చావులుకల నేను అయివున్నాను. పూర్ణమిదం అని చెప్పబడినరీతిగా యిదియును పూర్ణమేయై వున్నది. కాని "పూర్ణమేవావశిష్యతే' అనగా ఎప్పటికిని శేషించివుండే కేవల పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రం కాదు. కనుక యిది అదిగాదు అది యిదికాదు.

ఐతే "అజోహం అమరోహం" అను మాటలకు సమన్వయము యెట్లు? ఎట్లనగా కేవల పరిపూర్ణ పరబ్రహ్మమందు నేననే వృత్తి ఎన్నడూ లేనేలేదు. పుట్టనే పుట్టదు. నేను పరిపూర్ణ పరబ్రహ్మమందు పుట్టనేలేదు. పుట్టని నాకు మరణ మెట్లుండును? నాకు చావున్ను లేదు. నా హృదయ మందు గురువును ధ్యానము చేయుటచేత పరిపూర్ణ పరబ్రహ్మమందు నేను పుట్టనేలేదు" అను పూర్ణభావము కలుగు చున్నది అని పిండితార్థము (సారాంశము)

3) అనాది నిధనములు : ఆది అను శబ్దమునకు 1) మొదలు 2) మూలము 3) పుట్టుక 4) మొదలగు అనే అర్థములు గలవు. "నేను" కు మొదలులేదు. తుదయులేదు. "నేను" కు తుదా మొదలు లేవు అన్నపుడు రెండర్థములు సిద్ధించుచున్నవి. 1) దేశమును పురస్కరించుకొని మొదటి కొనయే మొదలు, చివరి కొనయే తుద 2) కాలమును పురస్కరించు కొని, ఆరంభించిన కాలము, 'అది' ముగించిన కాలము "అంత్యము", ఆద్యంతములు 3) పుట్టుక అనే అర్థములో "నేను" కు పరిపూర్ణ పరబ్రహ్మమందు జనన మరణములు లేవు. అజోహమమరోహం అని ముందే చెప్పినారు. యీ అర్థమే మరల చెపితే పునరుక్తిదోషము సిద్ధించును. 4) మొదలగు అనే అర్థము గ్రహించుట సమంజసముకాదు. ఏలననగా "ఏకమేవాఽ ద్వితీయం బ్రహ్మ" "సర్వంఖల్విదం బ్రహ్మ" అనే శ్రుతులు నేనైన బ్రహ్మము ఏకము అద్వితీయము. అదే అనేకమై సర్వమూ అదే అయివున్నది. దేశకాలములు సహితము అదే అయివున్నది. దానికి పూర్వం దేశకాలములులేవు. పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రం దానికిపూర్వం వుండియే వున్నది. దేశకాలాతీతం అయివున్నది.

నిధనము = నాశనము. వస్తువు తిరిగి పుట్టుట కేమీ అవకాశము లేనపుడే అది నాశనమైనదని చెప్పవలెను. "నేను" అనేది తిరిగి తిరిగి పుట్టుచునే వున్నది. విత్తనమునుంచి వృక్షము, వృక్షము నుంచి విత్తనము రీతిగా నేననేవృత్తి దాని ఆవరణమునందే అవిర్భావ తిరోభావములు పొందుచున్నది. దానికి నిధనము అనగా నాశనము లేదని చెప్పబడినది.

5) అవికారము : అనగా నిర్వికారము, వికారములులేనిది. షడ్భావవికారములు అనగా ఆరు వికారములు చెప్పబడినది. 1) అస్తితే = తల్లి గర్భమందుండుట 2) జాయతే = పుట్టుట 3) వర్ధతే = పెరుగుట 4) పరిణమతే = పరిణామము చెందుట 5) అపక్షియతే = క్షీణించుట 6) వినశ్యతే = నశించుట. ఈ వికారములన్నియు ఆవరణరూపమైన దేహమునకేగాని

ఆత్మరూపమైన దేహికి లేవు. నేను మేనులు రెండూ ఒక్కటైనా స్థూలరూపమైన మేను మాత్రమే దృగ్గోచరమగుచున్నది. దాని వికారములే కండ్ల బడుచున్నవి. నేను కంటికి కానరానిది. అందుచే దాని వికారములు కండ్ల బడుటలేదు. దానికిన్ని వికారములున్నవా? లేకపోవుటయేమి? తప్పకయున్నవి. ఇచ్ఛాసంకల్ప రాగద్వేషాదులన్నియు వికారములు గావా? అంటే అవి మనోధర్మములు గాని ఆత్మధర్మములుగావు అని జవాబు చెప్పవచ్చును. కాని అట్టి మనస్సు దేని వికారము? ఆత్మ వికారముగదా? ఐతే అది అవికారము అని ఎందుకన్నారంటే, సృష్టి సంకల్పమే కలుగనపుడు దానియందే వికారములు గానరాలేదు. మొదట్లో అట్టి నిర్వికార స్వరూపుడనే నేను, నాకు యిపుడీ జీవలక్షణములు సర్వవికారములు కల్గినవి అను స్వస్వరూపానుభవం కలుగుచున్నది.

6) చిదానందము = ఆత్మకు సచ్చిదానందములు స్వరూప లక్షణముగానున్నవి. త్రికాలములయందునూ బాధింపబడకనుండు వస్తువు సత్పదార్థము, సృష్టికి పూర్వము, సృష్టికాలమున, సృష్ట్యనంతరముకూడా అఖండవునికి గలిగియున్న దానికి సత్ యని పేరు చిత్ అనగా స్వయం ప్రకాశవస్తువుగా తానుండి సర్వమును ప్రకాశింపచేయునదియై యుండు అఖండజ్ఞానమే చిత్. ఆనంద మనగా దుఃఖలేశమెరుగనట్టియు దుఃఖ పర్యవసాయి గానట్టియూ అఖండ సుఖస్వరూపమే ఆనందము. ఇది ఆత్మనిష్ఠయేగాని వస్తునిష్ఠము గాదు. తీపి కొందరి కిష్టము మరికొందరికి కయిష్టము. ఆనందము వస్తు నిష్ఠము అనగా వస్తువునందే వుండేదైతే తీపి వస్తువు అందరికి ఆనందము కలుగచేయవలెను గదా! అట్లు చేయకపోవుట వల్ల అది వస్తు నిష్ఠము గాదని సులువుగా గ్రహింపనగును. తీపి యిష్టమైన వానికి కూడా తీవ్ర జ్వరబాధలో నున్నపుడు ఆ వస్తువే చేదుగా నుండును. అట్టే శబ్ద స్పర్శ రూపరస గంధము లన్నియు సుఖదుఃఖ ద్వంద్వ లక్షణములు గలవై యున్నవి. ఆత్మానందము విషయ జనకమైనదిగాక స్వరూప లక్షణమై యున్నది.

7) అణీయాన్ = అణువు అనగా బహు చిన్నది వుదాహరణకు యింటి కప్పులోని రంధ్రముగుండా సూర్యకిరణము లింటిలోనికి ప్రవేశించుచునపుడా కిరణపు వెలుగులో తేలియాడు అనేక నలుసులు మనకు కానవగును. అందొక నలుసు అణు ప్రమాణము గలదనిచెప్పనగును. అంతకంటె సూక్ష్మమైన వస్తువు మనకు కానరాదు. ఆత్మ అంత సూక్ష్మముగా నుండుటచేతనే మనకు కానరాకున్నది. అనేకాణువులు దగ్గరగాచేరి ఒకదానితో నొకటి గట్టిగా కరచిపెట్టుకొని యుండుటచే వస్తు వేర్పడినది. వస్తువు నందు సూక్ష్మంగా అణువులు, అంతకంటె సూక్ష్మముగా ఆత్మ నిండియున్నది. అట్లే బ్రహ్మాండ భాండానంతములన్నిటియందు ఆత్మ నిండియున్నదన్నమాట. అట్లని వస్తు రూపము గానరాక నిరవయవరూపముగానున్న వాయువు ఆకాశములయందుకూడ ఆత్మ యున్నదా? యను శంకరావచ్చును. కాని పంచభూతములు మాత్రమేగాక కాలము దిక్కులు మనస్సు, ఆత్మ అను నాలుగు కలసి నవవిధ ద్రవ్యములు అనగా వస్తువులుగా చెప్పబడియున్నవి. యీ నవవిధ ద్రవ్యములయందు కూడా ఆత్మ సూక్ష్మముగా వ్యాపించియున్నది. అణోరణీయాన్ అణువుకంటె సూక్ష్మముగా నున్నది. ఏ వస్తువు

యొక్క సూక్ష్మము ఆ వస్తువునందే వుండును. ఆత్మ వస్తువులయందు మాత్రమే వుండి వస్తువు బయటలేదా అనుశంకను పరిహరించుటకై మహతోమహీయాన్ అని వెంటనే చెప్పబడినది.

8) మహతోమహాన్ అనగా గొప్పది లేక పెద్దది. మహత్ లోపలనే సృష్టి జరిగినది. సృష్టి యెంతవరకు వున్నదో ఆ ఆవరణము కంటెను పెద్దదై మహత్ అతిక్రమించి అనగా మీరి యున్నది. అట్టి మహత్ కంటెను పెద్దదై దానిని గూడా మీరి అతిక్రమించి (నేను) ఆత్మ యున్నదన్నమాట. సృష్టి విధానము "బ్రహ్మణో రవ్యక్తాన్, అవ్యక్తాన్, మహత్........" అనగా బ్రహ్మము నుంచి అవ్యక్తము అవ్యక్తము నుంచి మహత్ యిత్యాదిగా సృష్టి క్రమం చెప్పబడినది. బ్రహ్మము లోపలనే అవ్యక్తము, పిదప మహత్తు కల్గినవి. మహత్తు కంటె బ్రహ్మా వ్యక్తములు పెద్దవై యున్నవన వలెను. అట్లే "ఏతస్మాత్తస్మాదాత్మనః ఆకాశస్సంభూతో ఆకాశాద్వాయుః" అను శ్రుతి యందు ఆత్మయందు ఆకాశము పుట్టినదని చెప్పుచుండుటచే ఆకాశము కంటెనూ ఆత్మ పెద్దదనవలెను. నేను ఆ సృష్టికి పూర్వమున్న ఆత్మను లేక బ్రహ్మమును అయివున్నాను. నేను అణువు కంటె చిన్నవాడను మహత్తుకంటెనూ పెద్దవాడను అని వర్ణింపబడినది.

అణురూపముగా "తదంతరస్య సర్వస్య" = అన్నింటికి లోపలవున్నది. "తదుసర్వ స్యాస్య బాహ్యతః" = విభురూపంగా సర్వ వస్తువులకు బైట వ్యాపించియున్నది. అది అంత గొప్ప స్వరూపము కనుకనే దానికి గురుస్వరూపమనిన్ని పేరు.

దేహములో హృదయమందు అంగుష్ఠమాత్ర పురుషునిగా గురువును ధ్యానించుట వలన జ్ఞానము కలుగుచున్నది అని యితఃపూర్వపు శ్లోకము వుటంకించినది. ఆ గురుమూర్తిని అణుస్వరూపునిగా యుపాసించవలెనా లేక విభుస్వరూపంగా యుపాసించుట లెస్సయా? అని యోచిస్తే, "యోవై భూమాతత్సుఖం. యదల్పం తదుఃఖం నాల్పేసుఖమస్తి, "భూమాన మిత్యుపాస్య" అనగా దానిని భూమాపదార్థము అనగా గురుస్వరూపముగా యుపాసించుటయే సుఖమని బృహదారణ్యకోపనిషత్తు శాసించుచున్నది. సహజముగ గురుస్వరూపము అట్టే భూమాపదార్థమేయైనను సగుణరూపములో సాక్షాత్కరించి సులభసాధ్యుడైయున్న శ్రీ గురుమూర్తి నామరూపముల కివే మావందనములు.

శ్లో॥ అపూర్వ మపరం నిత్యం స్వయం జ్యోతి ర్నిరామయం
విరజం పరమాకాశం ధ్రువ మానంద మవ్యయమ్॥

తాత్పర్యము : దేనికి పూర్వాపరములు అనునవి లేవో, ఏది స్వయం ప్రకాశమై యున్నదో, దేనికి వ్యాధిరూపమగు బాధలేమియులేవో, రజోగుణము లేనిదేదో, ఏది శ్రేష్ఠమగు అకాశముగా నున్నదో ఏది నిశ్చయమై ఆనంద అవ్యయ లక్షణములతో నున్నదో అట్టిదే గురుపరమాత్మ యొక్క స్వరూపము.

విశేష వివరణము : అపూర్వం, అపరం, నిత్యం : అపూర్వం అను మాటకు అది సరికొత్తది, అటువంటి దెన్నడూ అదివరలో చూచి యుండలేదు అని సామాన్యార్థము కాని దానికి పూర్వమగునదే లేదు అని విశేషార్థము. కాలరీత్యా దానికి పూర్వకాలములేదు. అంటే దానికి మొదలు అనగా ప్రారంభము అనేదే లేదు. కనుకనే అది అనాది వస్తువు అన్నారు. అట్లే

అపరం అనే మాటకు దాని అనంతరం (అయిపోయిన తర్వాత) అనే మాట లేదు. కారణ మేమనగా అది పోయేది కాదు. శాశ్వతమైనది. ఆద్యంతములు లేనిది. దానికి పూర్వాపరములు భూత భవిష్యత్కాలములు లేవు. అదే కాలస్వరూపమై యున్నది. కనుకనే త్రికాలబాధ్యమైన సత్పదార్థమని దానికి నామకరణము చేసినారు. ఐతే దానినుంచియే సర్వసృష్టి అయినదే అపుడు పరమాత్మ మొదటిదై సృష్టి తదనంతరపుది అవుతోంది గదా! "అపరం" అని ఆ పరమాత్మను అనవచ్చునా అని శంకించవచ్చును. కాని సృష్టి ఆ పరమాత్మకంటె భిన్నమైన దన్నా, సృష్టి ఒక కాలమందు లేదని చెప్పగల్గినా పరమాత్మను "అపరం" అని వర్ణించుటకు వీలులేదు. పరమాత్మయే సృష్టికారణము, పరమాత్మయే సృష్టికార్యము. సృష్టించబడిన సమస్తము పరమాత్మయందు బీజరూపముగా ఎప్పుడూ వుంటూనే వుంది. సృష్టి అని చెప్పబడే సమస్తమూ పరమాత్మరూపమే, "ఆ బ్రహ్మస్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం" అనగా తృణము మొదలుకొని బ్రహ్మవరకు సమస్తము పరమాత్మయే అనీ, "విశ్వైవేదం బ్రహ్మమిదం వరిష్టం" అనీ ఈ విశ్వమంతయు శ్రేష్ఠమైన, ఆ బ్రహ్మస్వరూపముగా తెలుసుకొమ్మని, సర్వం ఖల్విదం బ్రహ్మ" అంతయూ ఆ బ్రహ్మమేననీ శ్రుతులు నిర్ణయించుచున్నవి. దృఙ్మనోగోచరమగు సమస్తము ఆ పరమాత్మ స్వరూపమేగాని అన్యమేలేదు. అట్టి పరమాత్మను పూర్వాపరములులేని నిత్యవస్తువు అన్నారు.

స్వయంజ్యోతి అని ఆ పరమాత్మను వర్ణిస్తున్నారు. ప్రతి ఫలిత చైతన్య రూపమై నేత్రస్థానమున లేక భ్రూమధ్యస్థానమున నిర్ణయింపబడినది ఆపోజ్యోతి. సూర్య చంద్ర నవగ్రహ, నక్షత్రాదుల యందు ప్రకాశమానమై అగ్ని భూత సంబంధముగానున్నది భూతజ్యోతి. ఈ రెంటికి ఆధారమై మూలమైయున్నది పరంజ్యోతి. యిదే కేవలం జ్ఞానస్వరూపమై "జ్యోతిషాం జ్యోతిః" అనగా జ్యోతుల కెల్ల జ్యోతి స్వరూపముగా నున్నది. యిది శ్రేష్టమైనది సర్వోత్కృష్టమైనది. కనుకనే దీనిని పరంజ్యోతి అన్నారు. జ్యోతి అనగా దీపము అని సామాన్యార్థము. ఒక్క దీపముంటే ఆ దీప సహాయముచే మరొక దీపము, దాని సహాయముతో మరొకటి యిట్లే అనంతకోటి దీపములను "దీపాదీపాంతరం యథా" (అనగా దీపము నుండి మరొక దీపము అన్నట్లు) వెల్గించవచ్చును. అదేవిధంగా భూతజ్యోతి కిన్ని, ఆపోజ్యోతికిన్ని ఆపరమాత్మయే మూలకారణము లేక ఆ పరమాత్మయే అట్లు అభివ్యక్తమైనాడు అని చెప్పవచ్చును. దీప దృష్టాంతములో ఆ మొట్టమొదటి దీపము గూడా సహజంగా ఎవరో వెలిగించినదే అయి వుంటుంది. కాని అన్ని జ్యోతిస్సులకు మూలమైన యీ పరంజ్యోతిని వెలిగించినవారెవ్వరు? అని ప్రశ్నిస్తే మరొక రెవ్వరు కానరారు. దాని స్వరూపమే ప్రకాశరూపము. అనగా జ్ఞానస్వరూపము. అది చిద్ఘనమై యున్నది. ఆ ప్రకాశము నకు మూలప్రకాశమనునది వేరేలేదు. దానినే స్వయం ప్రకాశము లేక స్వప్రకాశము అన్నారు. దానినే యీ శ్లోకములో స్వయం జ్యోతి అని వర్ణించినారు.

నిరామయము అనగా వ్యాధులు లేనిది, పరమాత్మకుకూడా వ్యాధులా? పరమాత్మకు శరీరము లేదుగదా? అని కొందరనవచ్చును. కాని అది సరికాదు. "ఆకాశ శ్శరీరం బ్రహ్మ"

అని శ్రుతి చెప్పుచున్నది. ఆకాశము, అసంగము, అచలము. నిష్క్రియము. అయివున్నది గదా దానియందు వ్యాధులేమి గానవచ్చుచున్నవి అని అడుగవచ్చును. ఆకాశము జడప్రకృతి రూపముగానున్నా అదియే పరమాత్మతో గూడి (లేక పరమాత్మ సన్నిధానమున) మిగతా నాలుగు భూతములుగా పరిణతిచెంది సర్వమునకు తావిచ్చుటయే దానికి గల ముఖ్యవ్యాధి ఆకాశము నకుగల వ్యాధులు మనకున్న వాత పిత్త శ్లేష్మ సంబంధములు కావుగాని అవి సత్వరజస్తమోగుణ సంబంధముగల వ్యాధులని తెలియదగును. ఈ గుణత్రయప్రకృతిని బీజరూపముగా తనయందే యిముడ్చుకొని తాను తానైయున్న కేవల బ్రహ్మస్థితియందు మాత్రమే ఆ పరమాత్మ నిరామయుడు. ప్రకృతితో గూడిన సగుణరూపుడగు పరమాత్మకు ఆ నిరామయ శబ్దము వర్తింపదు. "సోఽ కామయత బహుశ్యాం ప్రజాయేయ" అనీ "ఇచ్ఛామాత్ర ప్రభు సృష్టి", అనీ "తదైక్షిత్" అనీ చెప్పుచున్న శ్రుతి వాక్యములలో ఇచ్ఛాద్వేష ప్రయత్నాది సర్వగుణత్రయ వ్యాధులు గానవచ్చుచున్నవి.

యీ శ్లోకములోని "నిరామయం" అని చెప్పిన వెంటనే "విరజం" అని చెప్పబడుట గమనార్హం. విరజం అనగా పాపరహితమనీ రజోగుణ సంబంధము లేనిదని రెండర్థములున్నవి. దుష్టకర్మ ఫలమే పాపము. కర్మకు చలనము, చలనమునకు ప్రాణము, ప్రాణచలనమునకు రజోగుణము కారణములు. పాపములేనిదన్నా రజోగుణం లేనిదన్నా ఒకటే. ఐతే గుణత్రయ ప్రకృతి పరమాత్మయందు గర్భీకృతమై బీజరూపముగా అణగిమణిగియున్న స్థితియందు మాత్రమే పరమాత్మ "విరజం" అని చెప్పదగియున్నది. రజోగుణం లేనపుడు శారీరక మానసిక చలనములేమియూ యుండవు. సృష్టికామనగాని సృష్టిపరిణామముగాని యుండదు. అట్టి స్థితియే నిరామయమని, విరజం అనీ వర్ణింపబడినది.

పరమాకాశం అనగా శ్రేష్ఠమగు ఆకాశము, ఆకాశము లెన్ని? వాని స్థానస్వరూపాదు లేమి? యిత్యాది విమర్శ యిట అప్రస్తుతము. ఆకాశమనగా అసలు ప్రకాశించని జడము అని ఒక అర్థమున్నది. మరియు ఉత్తరగీతలో.

శ్లో॥ ఆకాశోహ్యవకాశశ్చ, ఆకాశవ్యాపితం చయత్
ఆకాశస్య గుణశ్శబ్దో నిశ్శబ్దో బ్రహ్మముచ్యతే॥

ఆకాశమనగా అవకాశరూపము, ఖాళీ ప్రదేశము నామరూపాత్మకమగు సర్వజగత్తు నందు సూక్ష్మముగా వ్యాపించియే యున్నది. దానిగుణము శబ్దము. బ్రహ్మము నిశ్శబ్దమైయున్నది అని యీ శ్లోకార్థము. యీ నిశ్శబ్దరూపమగు ఆకాశమే పరమాకాశమని శ్లోకమునం దభివర్ణితమై యున్నది. నిశ్శబ్దమనగా యెట్టిదో ముందుగా విమర్శించి తెలుసుకొనవలసియున్నది. స+శబ్దము = సశబ్దము. శబ్దముతో గూడినది. నిర్+శబ్దము = శబ్దముతో గూడనిది. శబ్దముతో గూడుట కూడకపోవుట అను రెండు లక్షణములు ఒక ఆకాశమునకే యున్నవి. శబ్దముతో గూడినపుడు భూతాకాశము, శబ్దముతో గూడనపుడు అదే పరమాకాశమనబడుచున్నది. దానియందు శబ్దము బీజరూపముగానున్నది. దానినే పరావాక్కని అందురు. నిశ్శబ్దమనగా కేవల పరావాక్కుకూడా

లేనిదికాదు. పరమాకాశమని తాను తానై యున్న ఆ ఆత్మనే వర్ణించినారు.

ధృవం అనగా ఉన్నదో లేదో అనే అనుమానం లేకుండా నిశ్చయముగానున్నది.

శ్లో॥ "యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి నిశ్చయా
యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి నిశ్చయా"

అంటూ సర్వేంద్రియములచేతను ప్రత్యక్షముగా గోచరిస్తూ వున్నపుడు దానిని లేదని అనుటకు సావుకాశమేలేదు. ఐననూ పరిపూర్ణ పరబ్రహ్మమందు మాత్రం దానికి స్థానముగాని మూలంగానిలేదు.

ఆనందము : ఆనందము, సుఖము అను శబ్దముల తారతమ్యము గమనార్హము. సుఖ దుఃఖములు అనేవి ద్వంద్వములు సుఖము వెన్వెంటనే దుఃఖము కలుగుచున్నది. మరియు సుఖము దుఃఖ సమ్మిశ్రితమయ్యేవున్నది. ఈ సుఖదుఃఖములు రెండునూ శబ్ద స్పర్శరూపరస గంధాత్మకములగానున్నవి. కాని ఆనందము శబ్దాది విషయజన్యమగునట్టిదికాదు. వాని కతీతమైనది. బ్రహ్మము పంచతన్మాత్ర రూప పరిమాణము చెందని స్థితిలో తాను తానుగా నిస్సంకల్పస్థితిలో నున్న బ్రహ్మము యొక్క విలక్షణస్థితియే ఆనందరూపము. ఆనందమే బ్రహ్మమునకు స్వరూపలక్షణమై యున్నది. "ఆనందోబ్రహ్మేతి విజానీయాత్" అనీ "రసోవైసః" అనీ వర్ణింపబడు చున్నది.

అవ్యయం అనగా తరుగనిది. ఆ పరమాత్మ జీవేశ్వర జగద్రూపముగా పరిణమించినా ఏమీ తరుగదు. అందేభాగమూ నశింపదు. నామరూపముల మార్పే గాని వస్తువుయందు హాని వృద్ధులేమీ వుండవు. ఒక రాశి మట్టిలో నుంచి కొంతభాగము విడతీసి కుండలు వగైరా చేసినచో దానియందు తరుగు గానవచ్చును. కాని ఆ రాశియందే కుండల కొరకు మట్టిని తీసుకుంటే మట్టియందలి తరుగెట్లు గానగును? "పాదోస్య విశ్వాభూతాని త్రిపాదస్యామృతం దివి" అనుదానికి ఒక నాల్గవభాగం విడిపోయి జీవేశ్వర జగద్రూపంగా పరిణమించి, మిగతా మూడు భాగములు మాత్రమే దివ్యంగా వుందని అర్థంచెప్పితే మొత్తం బ్రహ్మపదార్థమునందు ఒక భాగం తరుగు కనిపించవచ్చును. కాని సోపాధికంగా నున్నదీ పరమాత్మే. నామరూపాల వ్యత్యాసమేగాని అన్యంలేదు అనే అఖండాత్మదృష్టియందు ఆపరమాత్మ అవ్యయంగానే వున్నది.

ఈ విధంగా పూర్వాపరములు చెప్పరాక, స్వప్రకాశరూపమై, నిరామయమై మహాకాశ రూపంగానున్న ఆగురుపరమాత్మ కివే మా జోహార్లు.

శ్లో॥ అగోచరం తథాగమ్యం నామరూప వివర్జితం
నిశ్శబ్దంతు విజానీయాత్స్వభావాద్బ్రహ్మ పార్వతీ

తాత్పర్యము : "ఓ పార్వతి! తన స్వభావముచేతనే గోచరముకాక, పొంద నశక్యమై నామరూపములు లేనిదై, నిశ్శబ్దరూపమైయున్న బ్రహ్మమును తెలిసికొనుము" అని శివుడు చెప్పెను.

విశేష వివరణ : ఇందు 1) అగోచరము 2) అగమ్యము 3) నామరూప వివర్జితము 4) నిశ్శబ్దము

5) స్వభావము 6) విజానీయాత్ అను పదములను విమర్శించి తెలుసుకొని, యీ శ్లోకమునందు చెప్పబడిన బ్రహ్మము సృష్టికారణ బ్రహ్మమేగాని, పరిపూర్ణ బ్రహ్మము గాదని తెలియవలెను.

1) అగోచరము : అనగా కానరానిది. దేనికి కానరానిది? అని ప్రశ్నించుకొంటే, జ్ఞానేంద్రియములగు, శ్రోత్ర త్వ క్చక్షుర్జిహ్వాఘ్రాణేంద్రియములలో దేనిచేతనూ గ్రహింపరానిది. కారణమే మనగా శబ్దాది విషయపంచకము దానియందు ప్రత్యక్షముగా కానవచ్చుటలేదు. ఆ విషయములను గ్రహించు జ్ఞానేంద్రియముల కది గోచరించుటలేదు. కాని యీ బ్రహ్మమే, అవ్యక్తము, మహత్తు, మహదహంకారము, పంచతన్మాత్రలుగా పరిణతి చెందినదికదా! తన్మాత్ర స్థితిలో నున్నపుడు మాత్రము, అపంచీకృతమైయుండుటచే యింద్రియ గోచరమగుటలేదుకాని అవే పంచీకృతమై, శబ్దాది విషయ రూప పరిణామము చెందినపుడు గోచరమగుచునే యున్నవి. "యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం, తత్తదాత్మేతి భావయేత్, యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి భావయేత్...." అంటూ యోగతత్త్వోపనిషత్ శబ్దస్పర్శాది విషయరూపంగా గానవచ్చే సమస్తము ఆత్మయే యని భావించుమంటూంది.

మొదట అనగా సృష్టికి పూర్వం గోచరంగాక, అనంతరం శబ్దాది విషయరూపంగా, ఆబ్రహ్మయే తన్నుతాను ప్రకటించుకొన్నది. అదంతయు వస్తుతః పరమాత్మ స్వరూపమే. "ఆ బ్రహ్మస్తంభపర్యంతం, పరమాత్మ స్వరూపకం" అని చెప్పబడుతూనేవుంది. అట్లా ప్రకటించుకొననిస్థితియందు మాత్రం అది కేవలం అగోచరంగానున్నదా?

శ్లో॥ సుఖాత్యంతికం, యత్త ద్బుద్ధిగ్రహ్యా మతీంద్రియా
వేత్తి యత్ర నచై వాయం స్థితశ్చలత తత్వతః॥

జ్ఞానేంద్రియములకు గోచరం కానరానప్పటికి బుద్ధికి మాత్రము అది గోచరించునని చెప్పబడుచున్నది ఐతే

శ్లో॥ విద్యాంతం, బ్రహ్మ విద్యాంతం, వార్తికాంత మగోచరం
పూర్ణ బోధం ప్రవక్ష్యామి శ్రుణుశిష్య మహోత్తమం॥

అను శ్లోకములోని, దేనికిన్ని గోచరముకాని కేవల పరిపూర్ణ బ్రహ్మము మాత్రం కాదనిన్ని, ఒక స్థితిలో మాత్రం గోచరింపక మరొకస్థితిలో గోచరించే ద్వంద్వలక్షణములుగల సృష్టి కారణమగు బ్రహ్మమే యీ గురుగీతాశ్లోకమునందు చెప్పబడినదనిన్ని స్పష్టమగుచున్నది.

2) అగమ్యము : గమ్యమనగా లక్ష్య వస్తువు అనీ, పోయి చేరుకోవలసినది అని అర్థము. అగమ్యము అంటే చేరరానిది అని అర్థము. ఒకచోట నుండి మరొకచోట లేనిచో, లేనిచోటు నుండి వున్నచోటుకు ప్రయాణము చేసి చేరుకొనవలసియుండునేకాని, ఎక్కడచూస్తే, అక్కడే తోచేదానిని, పోయి చేరుకొనవలసిన పనిలేదు గదా! కాశీలోని విశ్వేశ్వరుని, రామేశ్వరములోని రామలింగేశ్వరుని చూడవలెనంటే అక్కడకు పోవలెనుగాని, ఆకాశమువలె సర్వవ్యాపకమగు దానిని చూచుటకై ఎక్కడకు పోవలెను. కనుకనే అది గంతవ్య హీనమని అభివర్ణింపబడినది. అగమ్యము + అగోచరము అను రెండు పదములను ఒకచోట చేర్చినచో

''అగమ్యగోచరము'' అగును. యీ సమాసమున కర్థమేమి? ఏమీ అర్థంకాకుండా తికమకపెట్టి దానిని అగమ్యముగోచరంగా వుందని మనం అంటూంటాము. అట్లాంటిదే ఈ సృష్టికారణబ్రహ్మం, ఏలనంటే, గోచరంకాదుగాని బుద్ధికి గోచరిస్తుంది. అంతటా వున్నట్టుగా వుందేగాని పొందరానిదిగావున్నది. ''వద్దనే వున్నది గుద్దుకున్నా తెలియదన్నారు'' కాని గురుకృపాపాత్రులై వస్తునిశ్చయం పొందిన వారికి మాత్రం కరతలామలకమే. మాయా లక్షణమైన అనిర్వచనీయత దీనియెడల కూడా సార్థక్యము చెందుతోంది.

3) నామరూపవివర్జితము : సృష్టికి పూర్వం, ఈ కారణ బ్రహ్మమున కేపేరుపెట్టుటకైనా యెవరుండిరి? దాని రూపము చూచుటకు మాత్రం ఎవరుండిరి. అపుడునామరూప వ్యవహారమే లేదు. సృష్ట్యనంతరం, ఏదైన నొకదానిని గూర్చి చెప్పవలసినపుడు దానికేపేరు ప్రత్యేకముగా పెట్టుట అవసరమయ్యెను. లేనిచో ఆ వస్తువును వస్త్వంతరములనుండి కేటాయించి తెలిసికొనుట ఎట్లు? సృష్టికి పూర్వం, ''ఏకం'' (ఒకటి)గా నున్నదే సృష్టియనంతరం ''ఏకం అనేకం భవతి'' అనేక మాయెను. అంటే అనేక రూపములైనట్లేగదా! ఒక్కొక్క రూపమునకు ఒక్కొక్క పేరు వ్యవహారార్థము కల్పింపబడెను. సృష్టికి పూర్వము ఒకే వస్తువుగదా! అపుడు దానిరూపమును అప్పట్లోనే గోచరింపచేసుకొని దానికో పేరు పెట్టినవారు లేకపోవుటచే దానిని నామరూప వివర్జిత మన్నారు. ఐనా, యిపుడు వస్తునిశ్చయం పొంది స్వరూపసాక్షాత్కారం చేసుకున్న వారుండనే వున్నారుగదా! దానికి, తమ వైఖరి వాక్కుచే తమతమ భాషలలో ఏదో పేరుపెట్టుకొని వ్యవహరిస్తూనే వున్నారుగదా! ఏ వస్తువునకైనా దానిపేరు దాని నుదుట వ్రాసిపెట్టబడి యుండదు. దృశ్యాదృశ్య వస్తువుల కన్నింటికీ కూడా, వాని గుణ కర్మ స్వభావ శక్తుల ననుసరించి మానవులు నామకరణములు చేస్తూ వచ్చినారు. ఐతే మానవులు పుట్టకనేయున్నపుడు దాని కేపేరూలేదు. అని అనవచ్చునా? అనరాదు ఏలననగా నామము అక్షర సముదాయముతో గూడిన వర్ణాత్మక శబ్దస్వరూపం, శబ్దం వర్ణాత్మకంగా మారనపుడు ధ్వన్యాత్మకమై, పరావాగ్రూపముగా నుండెను. అంటే నామమునకు ఆధారముగా నుండు ధ్వన్యాత్మకమగు శబ్దము దాని యందే నిగూఢముగా నుండగా దానిని కేవలం నామవివర్జితం అనుటకు వీలులేదు. ఆస్థితిలో నున్నదానికి ''తస్యవాచకః ప్రణవః'' అని పతంజలి సూత్రీకరించియే యున్నారుగదా! ఓంకారమే దానికి పేరు అన్నారు.

అట్లే సర్వాకారములు. సర్వరూపములు (వాని కాధారమగు రూపతన్మాత్ర) ఆ బ్రహ్మము నందు తిరోభావముజెంది బీజరూపముగానున్నవి. అంతేకాదు. ఆ పరమాత్మ స్వయం ప్రకాశమై (తన ప్రకాశమునందే తాను ప్రకాశించుచూ, అన్యమును గూడా ప్రకాశింపజేయుచున్నందుననే దానికి'శ్రీ' కారమని పేరున్నూ కలిగినది. శ్రీ మహావిష్ణువు యొక్క నాభికమలమందుద్భవించిన చతుర్ముఖ బ్రహ్మ సృష్టి చేయవలసినదిగా శ్రీమహావిష్ణువుచే నాజ్ఞాపింపబడినవారై యే రూపాలతో యేయే వస్తువులను సృష్టించవలెనో తెలియక తికమకపడి తానుద్భవించిన కమలనాళము ద్వారా విష్ణువు యొక్క కుక్షి లోనికి ప్రవేశించి యుందు నిక్షిప్తమైన అనంతకోటి

బ్రహ్మాండములలో నొక బ్రహ్మాండమును నమూనాగా గైకొని "యధాపూర్వ మకల్పయత్" పూర్వ బ్రహ్మాండమును యధారీతిగా రూపొందించెను అని యొక పురాణగాధ గలదు. నిజంగా ఏకాలమందునూ కేవల నామరూప వివర్జతంగా లేనేలేదనవలసినదే. "వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవ సత్యం" అనగా సర్వ ఆకారవికారములు వాచాడంబరములే. మృత్తి కేసత్యము. దానియందు ఘటశరావాదులె నామరూపములు అసత్యములు, ఐనా సత్యాసత్యరూపములు దేనివి? దానివే గదా! సృష్టికి పూర్వం నామరూపాలు ప్రకటంగాకుండా వున్నందున స్థూలంగా నామరూపవివర్జితమై యున్నదని యీ శ్లోకంలో వర్ణింపబడినది.

కేవలం నామరూపవివర్జితమైనదొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే అయివున్నది. "ధ్వని మొదలగు తన్మాత్రలు కనుగొనగా లేశమైన" అందు గాన్పింపవు దాని కే నామము లేనేలేదు. నరునినోట యెంగిలి కాని దా పరిపూర్ణ పరబ్రహ్మమొక్కటే. దానికి తటస్థ, స్వరూప లక్షణములు లేనేలేవు. అది సర్వలక్షణ విలక్షణము.

నిశ్శబ్దము : నిర్ + శబ్దము = నిశ్శబ్దము, స+శబ్దము =సశబ్దము. శబ్దముతో గూడినపుడు సశబ్దము. శబ్దముతో గూడనపుడు అదే నిశ్శబ్దము. కనుక, శబ్దనిశ్శబ్దరూపములు రెండూ యీ కారణ బ్రహ్మము యొక్క లక్షణములే. ఒక మహావక్త ఒక రోజున మౌన వ్రతము పూనియుండగా చూచి అతని వక్తృత్వమెరుగని నూతన వ్యక్తి యాతనిని మూగవానిగా నిర్ణయింప వచ్చును. అట్లే అజ్ఞులు ఈ కారణ బ్రహ్మము కేవల నిశ్శబ్ద రూపమని భ్రాంతిచెందవచ్చును. దీనియందు లేశస్వరూపముగా ధ్వన్యాత్మకశబ్దము నిగూఢమైయుందని అందుకే ప్రణవమని పేరొందినదని పై పేరాలో తెలుసుకొంటిమి.

5) స్వభావము : స్వ+భావము = తనయొక్క భావము, తన సహజ గుణము. సర్వద్వంద్వములు యీ కారణబ్రహ్మమునకు సహజ స్వభావములే అయివున్నవి. ఇదే క్షరాక్షరులుగా, క్షేత్రక్షేత్రజ్ఞులుగా పరాపరాప్రకృతుగా, తెలియరానిదిగా, తెలియబడేదిగా, పొందరానిదిగా, పొంద దగినదిగా, నామరూప వివర్జీతముగా వానికి ఆధార అధిష్టానములుగా,శబ్ద నిశ్శబ్దములుగా, యీ విధంగా ద్వంద్వ లక్షణమే స్వరూపంగా, దాని స్వభావముచేతనే అది తెలియ దగియున్నది. కనుకనే విజానీయాత్ అనే శబ్దము యీ శ్లోకంలో వుద్దేశపూర్వకముగా ప్రయోగింపబడినది.

6) విజానీయాత్ : తెలియవలయును అని అర్థము. యిది కేవలము విజ్ఞేయ బ్రహ్మమే శ్రుతులు " సోఽ న్వేష్టవ్యః సజిజ్ఞాసితవ్యంః" అది వెదకి (అన్వేషించి) తెలుసుకొనదగినది జిజ్ఞాస చేయతగినది అనగా మనస్సుచే విచారించి తర్కబుద్ధిచేతను తత్వదృష్టి చేతను తెలియదగినది అని అర్థం. "ఆత్మావాఽ రేద్రష్టవ్యః" అనీ " మనసైవానుద్రష్టవ్యం" అనీ యితర శ్రుతులున్నూ గలవు. కాని పరిపూర్ణ పరబ్రహ్మము అట్టిదికాదు. అది అవిజ్ఞేయము. పలుకున పలుకరానిది. తలపోయుద మనిన మదికి దగులదు. "నచక్షుర్గచ్ఛతి నవాగచ్ఛతి నో మనః" అవిన్నీ. "అన్యదేవతద్వి తాదరో అవిదితాదధి" అనగా తెలిసినదాని కంటెను తెలియని దాని కంటెను (జ్ఞానాజ్ఞానములు రెంటికిన్ని) విలక్షణమైనదని కేనోపనిషత్తున్ను సఏష నేతి నేత్యాత్మాఽ

గృహ్యోనహి గృహ్యాతే" అనగా ఇదికాదు, ఇదికాదు అని సర్వమును అతద్వ్యావృత్తి లక్షణముచే నిషేధించగా శేషించే ఆ పరిపూర్ణ పరబ్రహ్మము దెలియ నశక్యమని బృహదారణ్యకోపనిషత్తున్ను ఘోషించుచున్నవి.

ఈ శ్లోకమునందలి శబ్దములలో 1) అగోచరము 2) అగమ్యము 3) నిశ్శబ్దము 4) నామరూపవివర్జితము అను పదములు పరిపూర్ణ పరబ్రహ్మమునే సూచించుచున్నవను అపోహకు దారితీయుచున్నవి. కాని "స్వభావాత్" "విజానీయాత్" అను పదప్రయోగము ఖచ్చితంగా ఆ భావమును ఖండించి పూర్వపక్షము చేయునదిగా నున్నది. ఏలననగా ఎరుక రూపమగు కారణ బ్రహ్మమునకు స్థాన, స్వరూప, స్వభావములు చెప్పనగునేకాని, నేను, తాను అనే ఎరుకను స్థానంగాని, మూలంగాని లేని పరిపూర్ణమునకు స్వభావము (తనయొక్క భావము) ఒకటున్నదని చెప్పరాదు గదా! పరిపూర్ణము, భావముకాదు. అ భావముగాదు. స్వభావమనేది వుండుటకే వీలులేదు. అది కేవలము భావాతీతము. అది తెలియబడే విజ్ఞేయ బ్రహ్మమున్నూ కాదు. "నాహం మన్యేసువేద నోన వేదవేదచ" అనగా నాకు తెలిసినది అనికాని, తెలియదనిగాని, నేను తలంపను అని మహర్షి చెప్పుచున్నాడు.

సర్వ నామరూపాలకు ఆధార అధిష్ఠానములుగా నుండి సకల సృష్టికి కారణ కర్తృత్వములు వహించి సగుణ నిర్గుణ రూపములుగా గానవచ్చే గురుపరమాత్మ యొక్క నామరూపముల కివే మా ప్రణతులు.

శ్లో॥ స్వయం తథా విధోభూత్వా, స్థాతవ్యం యత్రకుత్రచిత్
కీటోభృంగ ఇవధ్యానా ద్యథా భవతి తాదృశః॥

తాత్పర్యము : నిరంతర ధ్యానముచే భ్రమర కీటక న్యాయరీత్యా తుమ్మెద యొక్క రూపము సిద్ధించినట్లు, గురు స్వరూపమును ధ్యాన యోగముచే శిష్యుడు పొందగల్గునని భావము.

విశేష వివరణము : వేదాంత ప్రబోధమునందు భ్రమర కీటక న్యాయము ఒక దృష్టాంత ముగా చెప్పెదరు. కీటకము ( అనగా పురుగు) తుమ్మెద యొక్క నాదమును వినుటవల్ల ఎట్లు తుమ్మెద రూపమునే వహించునే అట్లే శిష్యుడు గురుప్రబోధను వినుచూ వుండుటవల్ల గురుస్వరూపమునే అనగా బ్రహ్మస్వరూపమునే పొందగలడని చెప్పబడినది. పురుగు తుమ్మెద అగుట నిజముగా ఆశ్చర్యకరమే. ఇతరులు యిది ఎట్లు జరుగుచున్నదని వివరింతురో, సాంప్రదాయక ప్రబోధము నందు దీని వివరణ ఎట్లు చేయబడుచున్నదో ఆ తారతమ్యమును గమనింపవలసియున్నది.

ఇతరులు చెప్పేదేమనగా - తుమ్మెద ఒక పచ్చపురుగును పట్టి తెచ్చి తన గూటిలో నుంచి తన తొండముతో దానిని ఒక పోటుపొడిచి పిదప ఝుంకార నాదము చేయుచు ఆ గూటి చుట్టును ఎగురుచుండును. కొంచెము సేపట్లు ఎగిరి మరల ఆ పురుగును ఒక పోటు పొడిచి మరల నాదము చేయుచు గూటిచుట్టు ఎగురుచుండును. ఇట్లు అనేక పర్యాయములు

చేయగా ఆ పురుగు మూర్ఛావస్థచెందును పిదప తుమ్మెద ఎటో ఎగిరిపోవును. కొంతకాలమునకు మూర్ఛావస్థ చెందిన ఆ పురుగు తుమ్మెద రూపము చెంది మూర్ఛావస్థ నుండి తేరుకొని ఎగిరిపోవును.

సాంప్రదాయక ప్రబోధమునందు చెప్పనదేమనగా, "తుమ్మెద పురుగును తెచ్చి తన గూటిలో నుంచి మాటిమాటికి దానిని పొడుచుచు దానిచుట్టు పరిభ్రమించుచుండును. తుమ్మెద పొడుచు పోటులకు చివరకా పురుగు మరణించును. మరణించిన పురుగు యొక్క కళేబరముపై తుమ్మెద గ్రుడ్డు పెట్టును. ఆ గ్రుడ్డు యొక్క కళేబరములోనున్న మాంసాదుల యొక్క రసముచే అభివృద్ధి చెంది గ్రుడ్డు నందలి తుమ్మెద పిల్ల గ్రుడ్డును బ్రద్దలు కొట్టుకొని తుమ్మెద రూపములో ఎగిరిపోవును. "ఉభయపక్షములకు వ్యత్యాస మేమనగా మొదటి పక్షమునందు పురుగుయొక్క శరీరమే తమ్మెద రూపము వహించును. రెండవ పక్షమునందు పురుగు తుమ్మెదగా మారదు. కాని పురుగు యొక్క కళేబరము నుండి గ్రహించిన ఆహారముచే తుమ్మెద గ్రుడ్డు పెరిగి పిల్ల అగుచున్నది. పురుగు యొక్క కళేబరము జీర్ణమై యెండిపోవుచున్నది.

ఇందేది సత్యము? సమంజసము? అని తెలిసికొనవలసియున్నది. భౌతిక విజ్ఞాన శాస్త్ర రీత్యా రెండవ పక్షమే సత్యమని ఆ శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. సాంప్రదాయక ప్రబోధము నందు వివరించిన రెండవ విధానమే సత్యము సమంజసము కాని మొదటి పక్ష మంగీకారము కాదు. ఆదిలో భ్రమర కీటక న్యాయమును దృష్టాంతముగా నిచ్చిన వారలు (ఋషులు) అంత తెలియని వారా! వారికి తెలియదని పలుకుటకు మనము సాహసించలేము. అయితే మొదటి పక్షములో వివరించిన పొరపాటు అభిప్రాయము ఎట్లు ప్రచారములోనికి వచ్చెను? అంటే, యిది వ్యాఖ్యాతల దోషమేకాని ఆదిలో దృష్టాంతమిచ్చిన పెద్దల అభిప్రాయంకాదు అని అనుకొనవలసియున్నది. ఆ ఋషుల యొక్కయు అచల ఋషుల యొక్కయు అభిప్రాయము లో యీ భ్రమర కీటక న్యాయము ఎట్లు పొసగుచున్నదో విచారించవలసియున్నది.

భ్రమర కీటక న్యాయము గురుశిష్య న్యాయమునకు ఎట్లు వర్తించుననగా గురూపదేశమునకు పూర్వము శిష్యుని యొక్క అంతఃకరణమును సూక్ష్మ శరీరము గాఢమగు అజ్ఞానాంధకారమయమై యున్నది. అట్టి అజ్ఞాన శరీరమును గురువు తన ప్రబోధముచే నాశనము చేసి జ్ఞాన బీజమును అందు నాటుచున్నాడు ఆ జ్ఞాన బీజమే. మొలకెత్తి మహావృక్షమై గురుపరమాత్మ శరీరరూపమునే చెంది విజ్ఞాన ప్రభలచే వెలుగొందు ఆత్మ స్వరూపుడుగా శిష్యుడు అగుచున్నాడు. ఇందు పోలికలు ఎట్లు అనగా గురువే తుమ్మెద. శిష్యుడే పురుగు. పురుగును చంపుచున్నట్లుగా గురువు శిష్యుని అజ్ఞాన శరీరమును నశింపచేయుచున్నాడు.

3) గురువు శిష్యుని ఉపాధియందు జ్ఞాన బీజము నాటినట్లుగా పురుగు శరీరము (కళేబరము) పై తుమ్మెద గ్రుడ్డు పెట్టుచున్నట్లుగా శిష్యుని అజ్ఞానావృతమగు అంతఃకరణము నందు గురువు జ్ఞాన బీజమును నాటుచున్నాడు.

4) పురుగు కళేబరముపై పెట్టబడిన గ్రుడ్డు నుండి తుమ్మెద వెలువడినట్లుగానే శిష్యుడు జ్ఞానప్రభలతో ఆత్మస్వరూపుడై జ్ఞానప్రభాప్రకాశము చెందుచున్నాడు. దృష్టాంతమునందు

గమనించవలసిన ముఖ్యవిశేషమేమనగా గురువు అజ్ఞాన శరీరమును నాశనము చేసి విజ్ఞాన శరీరము ఉత్పత్తి చేయుచున్నాడు. కనుకనే "గురుర్బ్రహ్మ" అనగా గురువే సృష్టికర్త అగు బ్రహ్మ అని చెప్పబడుచున్నాడు.

5) తాబేలు తన తలపుచేతను, చేప తన చూపుచేతను, పక్షి తన స్పర్శచేతను తన బిడ్డలను పెంపొందించినట్లే తుమ్మెద తన ఝుంకారముచే అనగా తన వాగ్రూపమైన శబ్దముచే తన బిడ్డకు తన నామరూపములను ప్రసాదించుచున్నది. భ్రమరము యొక్క నాదమునకును గురుప్రబోధమునకును పోలిక చెప్పబడినది.

అయితే మూలశ్లోకమునందు ధ్యాన యోగముచే శిష్యుడు గురుస్వరూపమును చెందుచున్నట్లుగా చెప్పబడుచున్న విషయము ఎట్లు సమర్థనీయము? కీటకము అనగా పురుగు ధ్యానము చేసి తుమ్మెద రూపము వహించలేదు. తుమ్మెద గ్రుడ్డులోని బిడ్డయే తుమ్మెద రూపముగా వచ్చినది తల్లివంటిదే బిడ్డ అగుటలో ఆశ్చర్యమేమున్నది? భ్రమ కీటక న్యాయము చెప్పవలసిన పనియేమున్నది? అను శంకలును వచ్చును. హిరణ్య కశిపుని భార్యయగు లీలావతి గర్భమందువున్న ప్రహ్లాదుడు నారదోపదేశమును గ్రహించి మహాభక్తుడైనట్లే అని సరిపుచ్చు కోవచ్చును. లేదా శిష్యుడికి సిద్ధించిన జ్ఞాన శరీరమును ఎక్కడ నుంచో గురువు క్రొత్తగా తెచ్చిపెట్టలేదు. అదివరకే శిష్యునియందంతర్భూతమై బీజరూపముగా నున్న ఆత్మప్రకాశమును రగిల్చి పెంపొందింపచేసినాడే గాని క్రొత్తగా గురువు కల్పించలేదు. అనియును చెప్పవచ్చును.

గురుప్రబోధమువలన శిష్యుడు మరచిపోయిన స్వస్వరూపమును మరల చెంది తన స్థాన స్వరూప స్వభావములను చక్కగా గుర్తెరిగి గురుబోధ ఆరూఢపరుచుకొన్న పిదప శిష్యుడెం దున్నను ఏమియు అభ్యంతరము లేదు. ఏలననగా తాను శిష్యస్వరూపమును వదలి గురుస్వరూప మునే చెందినాడు. "స్వయంతీర్ణఃపరాన్ తారయతి" అను న్యాయముగా తాను తరించినాడు కనుక యితరులను తరింపచేయవలసియున్నది. యితరులకు బోధించుటవలన తన విజ్ఞాన మేమియు తరుగదుగదా, వెలుగుచున్న ఒక దీపముతో అనేక దీపములను వెలిగించ వచ్చును గదా! అందువల్ల మొదటి దీపమునకు ఏ హానిరాదుకదా! గురుప్రబోధముచే నారూఢత చెందిన శిష్యుడు "దీపాదీపాంతరం యథా" అను న్యాయముగా తాను శ్రవణముచేసిన గురు ప్రబోధను యితరులకు బోధించవలసియున్నది. ఆ విధముగా అనేక మంది శిష్యులకు జ్ఞాన ప్రదానము గావించి తరింపచేయుచు తన సాంప్రదాయక ధర్మమును ఆచంద్రార్కము భూమండలములో వుండునట్లు విచార ఆచార ప్రచారములు గావించుచున్న సద్గురుమూర్తికివే మా జోహారులు.

శ్లో॥ పిండే ముక్తాః పదేముక్తా రూపే ముక్తావరాననే
రూపాతీతేచ యే ముక్తాస్తే ముక్తా నాత్ర సంశయః

తాత్పర్యము : పిండమందును, పదమందును, రూపమందును, రూపాతీతమందున్నూ ముక్తిపొందినవారే ముక్తులని చెప్పవలెను. ఇందుకు సందేహములేదు.

విశేష వివరణము : పిండ మనగా కుండలినీ శక్తి యనియు, పద మనగా హంసమనియూ, రూప మనగా బిందువనియు, రూపాతీత మనగా నిరంజనమైన (మాయా రహితమైన) బ్రహ్మమనియు, దీని పూర్వశ్లోకమందు నిర్వచింపబడినవి. ఈ నాల్గింటియందుసూ ముక్తి పొందినవానినే ముక్తుడని చెప్పవలెను గాని ఇందు దేనినుంచి ముక్తి (లేక విడుదల) పొందకున్నను అతడు ముక్తుడు కాడని అర్థము స్ఫురించుచున్నది. " భ్రాంతిరహిత మిదం మోక్షం" అని చెప్పబడినది. మోక్షము, ముక్తి అనునవి పర్యాయపదములు పైన జెప్పబడిన నాల్గింటినుంచి భ్రాంతి రహితస్థితి చేకూరినపుడే శాశ్వతమైన ముక్తి లేక విడుదల సిద్ధించును.

ముక్తి అనగా, సంసార బంధము, లేక జన్మబంధమునుండియే ముక్తి యనియు, జనన మరణ ప్రవాహమే సంసారమనియు, ఇంతకుముందు అనేకసార్లు వుటంకించియే యున్నాము. శాశ్వతముగునట్టి జన్మరాహిత్యము సిద్ధించుటకు యేయే భ్రాంతి స్థానముల నుండి సాధకుడు ముక్తి పొందవలెనో యీ శ్లోకము వివరించుచున్నది. భ్రాంతి స్థానములు చెప్పితే భ్రాంతిలేని స్థానమంటూ ఒకటున్నదా? అని శంక కలుగును. ఉన్నస్థానములు (దేశములు) అన్నియూ భ్రాంతి లోనివే. దేశకాలాతీతమగునది నిజముగా పరిపూర్ణ పరబ్రహ్మ మొక్కటే ఏలననగా ఆవరణ రహితమగుటచే దానిని దేశమనిగాని స్థానమని గాని చెప్పరాదు. నిజమైన ముక్తి, ఒక పదవికిగాని, స్థానముకనకుగాని, సంబంధించినదికాదు. మరియు, జీవబ్రహ్మైక్యమనిగాని ప్రత్యగ్బ్రహ్మైక్యమని గాని చెప్పబడెదేదిన్నికాదు. ముఖ్యసమానాధికరణ, బాధ సమానాధికరణములచే సిద్ధించేదిన్నిగాదు. కూటస్థబ్రహ్మములకు ముఖ్యసమానా ధికరణము, అభాసునకు బ్రహ్మమునకు బాధ సమానా ధికరణము. ముఖ్య సమానాధికరణ మనగా రెండు వస్తువులు భిన్న నామ రూపములు గల్గియున్నా తత్వతః ఒకే మూలపదార్థమునకు సంబంధించినపుడు ఆరెంటికి ముఖ్య సమానాధికరణము చెప్పవచ్చును. ఉదాహరణకు, మట్టికిన్ని కుండకున్ను లేక బంగారముకున్ను నగలకున్ను వుండు సంబంధము. ముఖ్య సమానాధికరణం అనగా రెండు వస్తువులయందు గానవచ్చే విరుద్ధ లక్షణ పరిత్యాగముచే భేదమును బాధించి ఆ రెంటియందు సమానముగానున్న వస్తువును గ్రహించురీత్యా ఏకత్వము ను సాధించుట యిదే భాగత్యాగ లక్షణము.

ఉదా: జీవేశ్వరులలో మాయా విద్యలను, అందలి ప్రతిబింబములున్ను బాధింపబడి నచో అపుడు అధిష్ఠాన చేతన బ్రహ్మము మాత్రము ఏకముగానే యుండును. ఈ రెంటిలో పరిపూర్ణ బ్రహ్మమే సమానాధికరణముచేగాని సాధింపబడేదిగాదు. ఎరుక బాధింపబడినపుడు పరిపూర్ణము స్వతస్సిద్ధము అగుట లేదా, బాధ సమానాధికరణమెందుకు చెప్పకూడదు? అని శంక కలుగ వచ్చును. కాని పరిపూర్ణమునకున్ను యెరుకకున్ను ఏలాంటి సంబంధము ఎప్పుడున్ను లేదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు ఎరుక లేనేలేదు. దానికి లేనెరుకయని పేరుపెట్టినారు. లేని వస్తువునకు బాధింపబడుట అనేదే చెప్పరాదు. మరియు బాధసమానాధికరణముచే పరిపూర్ణము సిద్ధించునంటే ఎరుక తోచినా తోచకున్నా,వున్నా లేకున్నా పరిపూర్ణ మెప్పటికి యేకరూపమే. గనుక బాధ సమానాధికరణమున్ను చెప్పరాదు. ముక్తి అనే శబ్దమునకు నిజమగు అర్థము

భ్రాంతి రహితమే దేనినుండి ముఖ్యముగా భ్రాంతి రహితము చేసుకొనవలెనో ఈ శ్లోకం చెప్పు చున్నది. ఆ పిండ, పద, రూప, రూపాతీతములను వివరించి అవి భ్రాంతి కారకము లెట్లైనవో మనము విచారించి తెలుసుకొనవలసియున్నది.

పిండమనగా కుండలినీశక్తి అనగా సుషుమ్నానాడియందు సంచరించు ప్రాణము మహాశక్తి వంతముకాగలదు. అట్టిశక్తికే కుండలినీ శక్తి యని పేరు. ప్రాణమునకు బలమనియు, జ్ఞానమకునకు రసమనియు వైదిక పరిబాషయందు కాననగును. సాధారణముగా ప్రాణము యిడా పింగళ అనబడే నాడుల ద్వారా మాత్రమే సంచరించుచూ వుచ్ఛ్వాస నిశ్వాసలు జరుపు చుండును. అప్పుడు కూడా వుచ్ఛ్వాస నిశ్వాసలు బిగించి యెంతటి బరువైనను యెత్తి బల ప్రదర్శన గావించవచ్చును. ఈ బలం స్థూల శరీరమునకే మిగతా శరీరములకు బలము కలుగవలెనన్న ప్రాణము సుషుమ్నా నాళమున ప్రవేశించవలెను. సుషుమ్నా నాడి యనేది, వీణాదండమనీ, బ్రహ్మదండిగయనీ చెప్పబడే వెన్నెముక యందు గలదు. ఆకారమునుబట్టి యిది సర్పముగా వర్ణింపబడినది. ప్రాపంచికులయందు యీ కుండలిని అధోముఖమై నిద్రించుచుండును. యిది మేల్కొనినపుడుగాని సాధనకు పారమార్థిక బలము చేకూరదు. దీనిని మేల్కొలుపుటే కుండలినీ భేదమని చెప్పబడును. దీనిని మేల్కొలుపుటకు ప్రాణాయా మమొక సాధనము.

వెన్నెముకకు క్రింది కొనయందు మూలాధారస్థానమున యొక పల్చటి చర్మపుపొరచే వెన్నెముక పొడుగునా నున్న నాళం మూయబడి యుండును. ప్రాణవాయు సంచారమున కిది అవరోధముగా నుండుటచే యీ పొరను ఛేదించిన గాని సుప్తమైయున్న కుండలిని మేల్కొనదు, కుంభకాది ప్రాణాయామ విధానముచేత యిది ఛేదింపబడి కుంభించిన వాయువు సుషుమ్న యందు ప్రవేశించి తన వత్తిడి శక్తిచే అందుండు ద్రవ పదార్థమును పైకి లేపును, యిదియే కుండలినీ భేదనమని చెప్పబడుచున్నది. కుంభక బలము హెచ్చిన కొలది ఆ ద్రవము పైనవున్న చక్ర స్థానములకునెట్టబడుచుండును. యీ కార్యములందు ప్రాణసత్తా పని చేయు చుండుటచేతను మనస్సునకు బలము నీయకుండుటచేతను మనస్సు యింద్రియములతో గూడి శబ్దాది విషయ గ్రహణచేయక తనయందే తాను జాగరితమైయుండును గాని స్వప్నావస్థయందువలె బలహీనమై యుండును. మూలాధారస్థానము నుండి క్రమముగా స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధి, చక్రస్థానములకు యీ ద్రవ పదార్థము నెట్టబడుచు పైనవున్న ఒక్కొక్క స్థానము చేరుకొలది ఒక్కొక్క మానసికానుభవమును పొందుచూ దశవిధ నాదములు, దశవిధమండలములు ముప్పది యెనిమిది చిత్కళలు, ఆపోజ్యోతి, పండువెన్నెల బయలు యిత్యాదిగా నాద బిందు కళానుభవములు హృదయాకాశమున చెందుచుండును. యివన్నియు స్వప్నానుభవము వంటి మిథ్యాస్వరూపములే. సహస్రారస్థానముననే అధిరోహించి నపుడు మనస్సు శూన్యాకారము వహించి తాత్కాలికముగ నిస్సంకల్పస్థితి చేకూరును. దీనికే సమాధియని పేరిడినారు. యిది సుషుప్తివంటిదే. కావలెనని సాధనలచే సాధించినది సమాధిస్థితి. సర్వులకు సహజముగా ఏ సాధనతో నిమిత్తం లేకుండా నిత్యమూ సిద్ధించునది సుషుప్త్యవస్థ,

యింతే తేడా, కనుక కుండలీని శక్తి మేలుకుంటే ముక్తి అనేది భ్రాంతియేకాని సత్యముకాదు. యిట్టి భ్రాంతి రహితమే పిండమునుంచి ముక్తి చెందుట.

ఈ యోగపద్ధతిలలో తారకయోగమొకటి. ఇందు ఆసన, ముద్ర, ప్రాణాయామములు, ఆహార విహార నియమములు మంత్రజపము యిత్యాదులన్నియు విధింపబడినవి. యిట్టి యోగస్థితియే ముక్తి యని తారక యోగుల భ్రమ. ముక్తియనగా విడుదల గదా! తారకము దేనినుండి విడుదల కల్గించుచున్నది? అంటే యింద్రియముల ద్వారా విషయగ్రహణ చేయక మనస్సు మంత్రమునందో, నాదబిందు కళానుభవము నందో నిలకడజెంది ఏకాగ్రత సాధించుచుండును. అయినను యోగకాలమందే ఈ ఏకాగ్రతగాని యితర సమయముల యందు విక్షేపము తప్పదు. "తారకంబు మనశ్శుద్ధికారకంబు" మాత్రమే. తాత్కాలికముగ మనోపరిభ్రమణము నుండి విముక్తి కలుగుచున్నది కాని సాధకుడాశించిన శ్వాశత జన్మరహిత్య రూపమగు ముక్తి చేకూరుటలేదు.

యీ తారకయోగమే ముక్తిసాధనమను భ్రాంతి కలుగుటకు కారణము. ఆత్మాన్వేషణ చేయుటలోపూర్వఋుషులు. ఆదిలో స్థూల శరీరమే ఆత్మయనీ, మనోరూప యింద్రియమే ఆత్మయనీ, యిత్యాదిగా సోపానక్రమమును జిజ్ఞాస చేయుటలో కొందరు, మనస్సే ఆత్మయని ఇంకొందరు నిర్ణయించిరి. కాని వారిలో మరికొందరు విక్షేప దోషమున్న మన స్సాత్మ యెట్లగునని శంకించి, మనస్సును శుద్ధిచేసి విక్షేపరహితం గావించినచో మనస్సే ఆత్మకాగలదని సమాధానపడి మనశ్శుద్ధికై తారకయోగసాధన మభ్యసించిరి. యీ సాధన జన్మరాహిత్యరూప ముక్తి ఎంత దూరమో యోచించవలెను.

యిందుకు అభ్యాసయోగము కావలసియున్నది. కేవల జ్ఞాన యోగముకాదు. అభ్యాస యోగమున ప్రాణాయామము ముఖ్యావసరమైయున్నది. లయ హఠ యోగములతో గూడినది వైకృత ప్రాణాయామని చెప్పబడుచున్నది. మంత్రయోగముతో గూడినది ప్రాకృత ప్రాణా యామము. మూలాధారాది సప్తచక్రములయందు, వరుసగా గణపతి, బ్రహ్మ, విష్ణు, రుద్ర ఈశ్వర సదాశివ సద్గురువలకు 600, 6000,6000, 6000, 1000, 1000, 1000 మొత్తం 21,600 అజపారూపముగా, ప్రణవం, పంచాక్షరీ, అష్టాక్షరీ మొదలగు మంత్రజపం వుచ్ఛ్వాస నిశ్వాసమలతో పాటు యీడా పింగళుల ద్వారా జరుపుచు యుండుటయే ప్రాకృత ప్రాణాయా మము. ఈ తారక యోగముచేత సాధకునకు నాద బిందు కళలు అనుభవమునకు వచ్చును. చివరకు ఆపోజ్యోతి దర్శనమై ఆదియును అడంగి పండువెన్నెల బయలు కాన్పించును. ఇదియే పరమాత్మయనీ దాని సాక్షాత్కారమే ముక్తియనియు కొందరు భ్రాంతి చెందుచున్నారు. ఇది స్వప్నానుభవము వంటి మానసిక భ్రాంతి మాత్రమే.

తారకయోగములో హంస తత్వానుభపముకల్గిన పిదపనే బిందువు నిశ్చలమై నాద, కళానుభవములు కల్గును. శ్లోకములోని "పదము" అను శబ్దమునకు హంసయే అర్థము అని చెప్పబడినది. అట్టి పదమందు ముక్తి యేదియో వివరించి తెలుసుకొనవలసియున్నది.

హంస శబ్దార్థమును ముందుగా విమర్శించి తెలుసుకొనవలసియున్నది. హంస అను

శబ్దము. హకార, సకార పూర్ణానుస్వారముల చేరికలో యేర్పడినది. ఈ మూడక్షరములలో మొదటిదగు హాకారము పరమాత్మ తత్వమును 'స' కారము మూల ప్రకృతిని, మధ్యనున్న పూర్ణానుస్వారము, ఆ రెంటికి గల తాదాత్మ్య సంబంధమును సూచించును. హంస యనగా మాయా సహిత బ్రహ్మము అను అర్థము కలుగుచున్నది. మాయా విద్యలు రెండూ యొకటే. అవిద్యచే ఆవరింపబడినది 'హంస' యనగా జీవుడని కూడ నర్థము చెప్పవచ్చును. 'హం' = బీజము, "సః"=శక్తిః అని గురుగీతయే ప్రథమాధ్యాయములో నిర్ణయించినది మరియు బీజప్రదాతయని పరమాత్మ అభివర్ణింపబడుచున్నాడు.

శ్లో॥ "గతిర్భర్తా ప్రభుస్సాక్షీ, నివాసశ్శరణం సుహృత్।
ప్రభవః ప్రళయస్థానం నిధానం బీజమవ్యయం॥

ఈ శ్లోకము పరమాత్మను సర్వసృష్టికి బీజము లేక మూలకారణముగా పేర్కొనుచున్నది. తనయందలి మాయనే వుపాదానముగా గ్రహించి "తత్సృష్ట్వా" అనగా అన్ని స్థూలోపాధులను నిర్మించి "తదేవానుప్రావిశత్" అనగా వానియందు తాను, "అనుప్రవేశము" గావించెను. 'అనుప్రవేశ'మనగా తిరిగి ప్రవేశించుట, మొదటి ప్రవేశము సృష్టి. ఆయుపాధులయందు తిరిగి తాను జీవరూపముగా ప్రవేశించుటయే 'అనుప్రవేశము'. పరమాత్మ మాయాసహితుడై సర్వశరీరముల యందుండి సకల సంసారమును అనుభవించు జీవుడనీహంసయనీ చెప్పబడుచున్నాడు. తారకయోగము వివరించు పట్ల హంసశబ్దమునకు జీవుడనే ముఖ్యార్థమును గ్రహించి లక్ష్యార్థము మాత్రము మాయాసహిత పరమాత్మగా నిర్ణయించుకొనవలెను.

హంసయొక్క స్థానము నిర్ణయించుపట్ల తారకయోగము పిండాండమునకు సంబంధించినదే యని గుర్తుంచుకొనవలెను. హృదయస్థానమందు, అధోముఖమై అష్టదళ పద్మముయొక్క ప్రతిబింబమున్నది. దీనికే హృదయకమలమనిపేరు. దీనిని ఆశ్రయించియుండి, యిడా పింగళ ద్వారా ఉఛ్వాస నిశ్వాస రూపముగా (ప్రాణము) సంచరించుచూ మనఃప్రాణము లతో గూడి సంకల్ప వికల్పాదులు గావించుచూ "పూర్వ దళే పుణ్యామతి రాగ్నేయే నిద్రాల స్యాదయోభవన్తి, యామ్యేక్రౌర్యే మతి, నైఋతే పాపేమనీషా, వారుణ్యాం క్రీడా, వాయవ్యాంగ మనా దౌ బుద్ధి, సౌమ్యేరతి ప్రీతి, ఈశానేద్రవ్యాదనం, మధ్యేవైరాగ్యం కేసరే జాగ్రదావస్థా, కర్ణికాయాం స్వప్నోలింగే సుషుప్తి పద్మత్యాగే తురీయం" అని హంసోపనిషత్తులో చెప్పబడిన వృత్తులను ఆయాదళములపై వ్రాలి చెందుచుండును.

'హంస' అనునది హృదయపద్మమునందలి రేకులపై విహరించు ననుటలో 'హంస' హృదయపద్మమునకు వేరుగానున్నట్లు తోచవచ్చు. బోధార్థము తొలిపాఠములలో నట్లుచెప్ప బడినదే గాని నిజముగా హృదయపద్మము 'హంస' కు భిన్నముగాలేదు. మరియు సంకల్ప వికల్పాత్మకమై అధోముఖముగా నుండి విషయానందముకోరు మనస్సున్ను ఉఛ్వాస నిశ్వాసరూపమగు ప్రాణమున్ను కూడా హంస శబ్దముచేతనే వ్యవహరింపబడుచున్నది. హంస అను పదమునకు సందర్భమునకు బట్టి 1) పరమాత్మ 2) జీవుడు 3) హృదయకమలము

4) మనస్సు 5) ప్రాణము అను అర్థములను గ్రహించుకొనవలసివున్నది.

హంసతత్వానుభవమును పొందినగాని బిందువు స్థిరముగా నిలువక చంచలమై యుండును.

శ్లో॥ ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరాబుద్ధి ర్యో బుద్ధేఃపరతస్తు సః॥ భ.గీ. 3-42

ఇంద్రియ మనస్సుల కన్నింటికంటెను బుద్ధి పరమై ఆత్మకత్యంత సన్నిహితమైయున్నది. అది హృదయకమలమున కగ్రభాగమున "మనోగ్రే వసతేబిందు" అని చెప్పబడిన రీతిగా నుండి యుండును. సహజముగా నీ బిందువునకు చలనము లేకున్ననూ, హృదయకమలము (హంస లేక మనఃప్రాణములు) యొక్క చలనము వలన బిందువు కూడ చలనము కల్గియున్నదానివలె తోచబడుచుండును. బిందువు స్థిరముగా నిలబడెవలెనన్న హృదయ కమలము యొక్క చలనమునే నిలువవలసియున్నది. పిదపనే తారక లక్ష్యమగు నాదకళానుభవము సిద్ధించు చున్నది.

అట్టి హంసతత్వానుభవము కలుగుటకై తారక యోగము సాధనా క్రమమును విధించుచున్నది. ఎట్లనగా "ఇంద్రియములను వాని వాని వృత్తుల నుండి మరలించి, యింద్రియ ప్రాణ మనంబులను యేకాగ్రత గావించి, సమస్త భూతముల హృదయకమలముల నాశ్రయించి హంసయని పలుకుచు సంచరించుచు నేనే పరమాత్మననే భావముతో, 'హం' 'స' అను రెండక్షరములను, ప్రాణ మనంబులతో చేర్చి యెల్లప్పుడు ధ్యానించవలెను.

శ్లో॥ హకారేణ బహిర్యాతి, సకారేణ విశేత్పునః
హంస హంసేతి యన్మంత్రం జీవోజపతి సర్వదా॥

తాత్పర్యము : నిశ్వాస రూపముగా బైటికి పోవు గాలితో హకారమును, ఉఛ్వాసం రూపముగా లోనికిపోవు గాలితో సకారమును (పల్కుచు) 'హంస' యనే మంత్రమును జీవుడెల్లపుడు జపించుచున్నాడు. దినమునకు 21,600 జరుగుచున్న శ్వాసలతోపాటు ఈ విధముగా జరుగు హంసమంత్ర జపమే ఆ జపాగాయత్రియని చెప్పబడినది. ఇది తెలిసి యీ విధంగా జరిగించినపుడు హృదయకమలము (లేక మనస్సు) యొక్క చలనమడంగును. తద్వారా ఆ హృదయకమలాగ్రమున గల బిందువు (బుద్ధి) స్థిరముగానుండును. ఈ బిందువు జాగ్రదవస్థయందు అంతఃకరణమనీ, (బుద్ధియనీ) సుషుప్త్యావస్థయందు అజ్ఞానమనిన్ని పేర్కొనబడుచున్నది. కర్మల నాచరించుచు కర్తృత్వ భోక్తృత్వముల బూని కర్మానుభవమును పొందిన దీ బిందువే. స్థిరమై నిలచిన బుద్ధియందు దోచిన ప్రతిబింబమే చిత్కళ కనుక నాదకళానుభవము సాధించుటకు ముందుగా బిందువును (స్థిరమైన బుద్ధిని) సాధించవలసి యున్నది.

హంస తత్వానుభవమును యెరిగినవారే పరమహంస లనిన్ని పరబ్రహ్మ స్వరూపమగు నీ హంసతత్వము నెరిగిన మహాత్ముడు హంస క్షీరనీరములను విడదీయగలిగిన విధంగా

ప్రపంచము నిస్సారమనిన్ని పరమాత్మయే సారభూతుడనిన్ని అతనిని వేరుచేసి గుర్తెరిగి పరమహంస యని సార్థక నామధేయుడగుచున్నాడనిన్ని తక్షణమునందే ముక్తుడగుచున్నాడనిన్ని కొందరందురు. కాని యిదియును భ్రాంతియే ఏలననగా జనన మరణ రూప సంసారము యొక్క నివృత్తి కానంతవరకు దానిని మోక్షమనీ ముక్తియని యనుటకు వీలులేదు. హంసతత్వానుభవము పొందుటవలన ఒకవేళ ఆత్మస్వరూప వస్తు యదార్థతను గుర్తెరుగ గల్గిప్పటికీ సంసార మూలకారణమును గుర్తించినవాడే అగుచున్నాడు. కాని ఆ మూలకారణమును రహిత పరచిన వాడు అగుటలేదు. తారకమునకు ముక్తిరూప సామర్థ్యమున్నదనుకొనుట యొకభ్రాంతి మాత్రమే. ఇత్యాది భ్రాంతులకెల్లను పట్టణమనదగిన మూల భ్రాంతి నుండి విముక్తి గలిగించిన గురుపరమాత్మ కివే మా నమస్కృతులు.

శ్లో॥ పిండే ముక్తా పదే ముక్తా రూపే ముక్తా వరాననే।
రూపాతీ తేచ యే ముక్తా స్తే ముక్తా నాత్రసంశయః॥

హంస నుండి కూడా ముక్తి లభించవలెనని యీ శ్లోకము చెప్పుచున్నది. తారకము పిండాండమందుగల హంసను, దాని సంచారమును వివరించి, హంస తత్వానుభవమును పిమ్మట నాద కళానుభవమును కల్గించుచున్నదని గ్రహించితిమి. హంసనుండి ముక్తి పొందుట యనేది ఎప్పుడే విధముగా సిద్ధించుచున్నదో తెలిసికొనవలసియున్నది.

హకారము పరమాత్మయు, సకారము ప్రకృతియునని హంస శబ్దమునకు అర్థము చెప్పబడినదికదా! ఐతే అట్టి పరమాత్మ, దేహమందు యిడా పింగళుల ద్వారా సంచరించు ప్రాణవాయువుతో చేరినపుడు జీవహంసయని నామము చెందినది. యీ జీవహంస తిరిగి పరమహంస స్వరూపము (అనగా పరమాత్మ యగుటయే హంసనుండి ముక్తియని చెప్ప వచ్చును) అనగా ప్రాణవాయువుతో చేరి జీవహంసగా మారినది. ప్రాణవాయువునుండి విడిపోయినపుడు, జీవహింసకు ముక్తియని చెప్పవచ్చును. ఇదెప్పుడెట్లు సిద్ధించును?

దినమునకు 21,600 చొప్పున నడచుచున్న, హంసలు లేక శ్వాసలు యీ స్థూల శరీర పతనముతో లయమగుచున్నవి. కాని యింతటితో హంసల నుండి ముక్తి లభించుట లేదు. సంస్కార రూపమగు మనస్సు, ఆయా కర్మసంస్కారముల అనుభవమునకై నశించక మిగిలియే యుండి కర్మయానము, పితృయానము, దేవయానము అని చెప్పబడే మార్గముల ద్వారా వుత్క్రాంతి చెందును. వాయువు గంధమును మోసుకొని పోవునట్లుగా, ప్రాణము ఈ సంస్కారములను మోసుకొని పోనిచో యీ వుత్క్రాంతి అసంభవం సూక్ష్మ కారణ శరీరముల రెంటిని మోసుకొనిపోవు ప్రాణము నుండి కూడ విడుదల పొందినపుడే హంస నుండి ముక్తి అని చెప్పవలయును. స్థూల దేహము 21,600 హంసలు నడచినట్లుగానే, సూక్ష్మ శరీరమునకు 2,200 హంసలున్ను కారణ శరీరము 1200 హంసలున్ను నిర్ణయించబడినవి. ( ఈ సంఖ్య లెట్లు నిర్ణయింపబడినవో తెలుసుకొనగోరువారు శ్రీమద్దయానంద పొన్నాల రాజయోగీంద్రుల వారు (పీఠాధిపతులు) రచించిన "తారకామృత పరమహంస ప్రబోధిని" అను గ్రంథము చూడనగును)

ఈ సూక్ష్మ కారణ శరీర సంబంధములుగా 3,400 హంసలు కూడా లయము కావలెను. యివి యెట్లు లయమగును?

గురుముఖతః ఆత్మస్వరూప నిశ్చయము బొంది, అట్టి అఖండాత్మ స్వరూపమే తానని, అట్టి తనయందు సర్వమున్నూ కలదనిన్ని, ఆ సర్వమునందూ తానే వ్యాపించియున్నాని, ఎవని కారూఢమగునో వాని కారణ శరీరమగు వ్యష్టి అజ్ఞానము నశించి "జ్ఞానాగ్ని స్సర్వ కర్మాణి భస్మ సాత్కురుతేతధా" అనీ, "తత్వజ్ఞానేన సంచితః" అనిన్ని చెప్పబడినరీతిగా మనోనాశ వాసనాక్షయములు సిద్ధించినపుడే సూక్ష్మ కారణ శరీర సంబంధమగు హంసలు కూడా లయము కాగలవు. పదమందు, (లేక హంసనుండి) ముక్తి అనగా సూక్ష్మ కారణ శరీరముల నాశనమేగాని, వానిని మోసుకొనిపోవు ప్రాణము యొక్క నాశనము గాదనిన్ని మూలాజ్ఞాన నాశనము కాని, మహాకారణమందలి భ్రాంతి నాశనము కాని కాలేదనిన్ని గుర్తించవలెను. ఐననూ ఆదిలో పిండాండమందు ప్రవేశించిన హంసలు స్వస్థానమైన శింశు మార చక్రమున చేరిపోవును. యిది పదమునుండి ముక్తి అని భావింపబడినది. కాని మూలాజ్ఞాన నాశనము గాని, భ్రాంతి నాశనము కాని కాకపోవుటచే జనన మరణ భ్రాంతి రూపమగు అనాది సంసార విముక్తి మాత్రం కాలేదు.

రూపేముక్తా.................కనుకనే రూపమునందు కూడా ముక్తి కావలెనని యీ శ్లోకము చెప్పుచున్నది. రూపమనగా "రూపం బిందురితి జ్ఞేయం" అని దీని పూర్వ శ్లోకము రూపశబ్దమునకు నిర్వచనము చెప్పినది. జ్ఞేయ రూపమై అనగా తెలియదగినదై, స్వరూప లక్షణముతో నుండిన ఆత్మ స్వరూపము, అచంచలమగు నిశ్చయాత్మకబుద్ధికి విషయమైయున్నది. అట్టి బుద్ధికే బిందువు అని పేరు. ధ్యానయోగములో యీ బిందువు ఆత్మ స్వరూపంతో తాదాత్మ్యము చెందగలదు. బిందువును రూపమని యీ శ్లోకము, పేర్కొనుచున్నది. మరియు సర్వరూపములను తెలియచేయు ఆత్మప్రకాశము, బిందువు ద్వారా (వ్యష్టి, సమిష్టి అంతఃకరణములు బిందువునకర్థంగా గ్రహించ వలెను) గుర్తెరుగుచున్నది గనుక బిందువునకురూపమని పేరిడిరి. ఆత్మవస్తు నిశ్చయము చెందిన మనస్సు సంస్కారములనుండి విముక్తి చెంది "మనోగ్రేవసతే బిందు" అని చెప్పబడిన రీతిగా, నిశ్చయాత్మకమగు బుద్ధి రూపపరిణామము చెందును. యిదియే బిందువు. యీ బిందువు ఆత్మాను సంధానముచేసి ఆత్మరూపమునే ధరించును. లేక జ్ఞేయబ్రహ్మమును గుర్తించి తానే తద్రూప తాదాత్మ్యమును చెందును. అందుకే "బుద్ధిగ్రాహ్య మతీంద్రియం" అనగా యింద్రియ వ్యాపారము వదలిన బుద్ధికి ఆత్మ తెలియబడుననిభావం "యో బుద్ధేఃపరతస్తుసః" అని బుద్ధికి కూడా అతీతమైనదిగా అతని వస్తువు చెప్పబడినది. ఇదియే జ్ఞేయ బ్రహ్మముగా చెప్పబడుచూ సర్వవ్యాపకమై యుండి పిండాండమందు బుద్ధికంటె పరమైన ఆత్మగా నున్నది.

శ్లో॥ జ్ఞేయం సర్వమతీతంచ జ్ఞానంచ మనువుచ్యతే।
జ్ఞానం, జ్ఞేయం సమంకృత్వా యధానాన్యద్వితీయకం॥

అని గురుగీత మరొక శ్లోకములో తెలియజేసినది. జ్ఞేయ బ్రహ్మము సర్వమునకు అతీతమై యున్నది. మనస్సే (అతీంద్రియమై) జ్ఞానమని పేరుగాంచినది. యీ జ్ఞానజ్ఞేయముల నొకటిగా చేసినచో యిక రెండవది లేదు. ఈ శ్లోకములో చెప్పబడిన జ్ఞానమే బిందువు. ఈ బిందువు జ్ఞేయ బ్రహ్మరూపందాల్చుటే ముక్తి లేక మోక్షము. ఇంతకంటె యేమీ లేదని కొందరి నిర్ణయం. ఇది కేవలము భ్రాంతియేనని అచల ఋషుల సిద్ధాంతం. అందుకే శ్రీ భాగవతుల కృష్ణదాసుగారు.

కందార్థము :

బిందువు తనువు నబుట్టును
బిందువు తనునింద్రియముల బృందం బసువుల్
అందముగ కలుగునివి దేనందున బుట్టినవో తెలియ
నజునికి తరమా, మూలము లేనివని తెలుసుకొనుమా

....................'' అన్నారు. బిందువే, వ్యష్టి, సమిష్టుల యందు సర్వమూ అయి వున్నప్పటికీ దానికొక పుట్టువు స్పష్టముగా కనుపిస్తూ వున్నదనీ, కాని దానికి మాత్రము మూలము లేదని తెలుసుకొనమనీ శెలవిచ్చినారు. ఆ బిందువు (వ్యష్టి లేక సమిష్టి అంతఃకరణం) ఆత్మతాదాత్మ్యస్థితి జెంది తద్రూపం వహించేదైనా అదే ముక్తి అనుట భ్రాంతియే. కనుకనే "రోసితి మోక్షాద్యపేక్ష రూఢిగనిసుమీ, నీ విట్టి యా రూఢతగనుమీ'' అని హెచ్చరించినారు.

"రూపాతీతేచ యే ముక్తా'' : రూపమునందు ముక్తి యనుట కూడా భ్రాంతియే, రూపాతీ తమైన పరిపూర్ణము నందు కూడా ఎవరు ముక్తి చెందెదరో వారే ముక్తి చెందినవారు అని శ్లోకము తెల్పుచున్నది. పరిపూర్ణపరబ్రహ్మము నందు కూడా ముక్తి చెందుట యననేమి? అన్ని గుణములకు భ్రాంతులకు మూలమైన ఈ మూలములేని గుర్తెరిగే శరీరమునకు పరిపూర్ణ పరబ్రహ్మమునందు మూలమేలేదు. కొనకు ప్రవేశించేటందుకు స్థానమే లేదు అని ఆరూఢత చిక్కిన పిమ్మట పరిపూర్ణము వున్నది యని గాని అందు యెరుక లేదు అని గాని అనుట కూడా యెరుక వాక్యమే అగును. అవియును భ్రాంతి రూపములే. కనుక నిర్ణయమే మహాపాపము అని దీక్షితులవారును, ఏ నిర్ణయమును చేయడు. నేననని మహాత్ముడెపుడు అని కృష్ణదేశికేంద్రులవారున్నూ తెలిపియున్నారు.

శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మా దేహోనాస్తి కదాచన
అస్తినాస్తీతి కోవేద నిర్ణయో నాస్తి సర్వదా॥

అని అచల సిద్ధాంతము. ఇట్టి ఆరూఢతయే పరిపూర్ణ పరబ్రహ్మమునందు కూడా ముక్తి చెందుట.

కందార్థము :

యిది తప్ప ఏమి లేదని మొదటిది మొరపెట్టుచుండు
ముదమున వినుమా యిది ఏమిలేదు పొమ్మని

వదలక రెండోది లెస్సవదరూచుండునురా
బయలెరుకాల నిది నిశ్చయమురా
అదిగాన నీరెంటి నరసి నీ విప్పుడు విదితముగ రెంటినీ విడరా
మంత్రములిట్లు వదురూచుండునురా
బయలెరుకాలనిది నిశ్చయమురా॥

సిద్ధాంత వాక్యములను పరిశీలించి పిమ్మట ఆ వాక్యములను కూడ విడచి వేయవలసినదే నని కృష్ణదేశికేంద్రులవారు తెలుపుచున్నారు.

1) పిండము అందు అనగా కుండలినీ శక్తిని మేలుకొల్పుట ముక్తియనిన్ని 2) హంస తత్వానుభవరూపమైన పదమునందు ఒక ముక్తియనియు 3) ఆత్మరూపము చెందుట ముక్తియనియు, రూపాతీతమైన పరిపూర్ణ పరబ్రహ్మమునందు ముక్తియనియు, ఒకదానికంటె మరొకటి ఉత్తమముగా భావించి నాలుగు విధముల ముక్తి చెందినవాడే నిస్సంశయముగా ముక్తి చెందినవాడుయనియు యీ శ్లోక భావమైయున్నది. కాని నిరాలంబోపనిషత్ "కేవల మోక్షాపేక్ష సంకల్పో బంధః" అని చెప్పుచున్నది. "తన్ మోక్షం పరమం సుఖం నిర్వాణంచ మహత్ సుఖమ్" అన్నారు. అనగా జీవేశ్వర జగత్ భ్రాంతిని విడచి స్వరూప స్థితి చెందటమే విడుదలకాదు. తన్మోక్షం అనగా ఆస్వరూపస్థితిని (మూలంలేని గుర్తెరిగే శరీరం) విడవడమే పరమసుఖం" అన్నారు. ఆ విధంగా స్వరూపస్థితిని విడవడమే నిర్వాణం. అట్టి నిర్వాణమే పరమ శాంతి రూపము కనుక మహత్ సుఖం అన్నారు. అదియే భ్రాంతి రహితం. పరిపూర్ణ బోధచే సర్వభ్రాంతి రహితం గావించు శ్రీ సద్గురు మూర్తి కివే మా నమస్కారములు.

శ్లో॥ గురుర్ధ్యానేనైవ నిత్యం దేహీ బ్రహ్మమయోభవేత్
స్థితశ్చయత్ర కుత్రాపి ముక్తో ఒసౌ నాత్రసంశయంః॥

తాత్పర్యము : ఎల్లప్పుడు గురుధ్యానము చేయుట వలన మాత్రమే సాధకుడు బ్రహ్మ స్వరూపుడు కాగలుగుచున్నాడు. అట్టి వాడెచ్చట ఏవిధముగా నున్నను వాడు ముక్తుడే. ఇందుకు సందేహమేమీలేదు.

విశేష వివరణము : 1) గురుధ్యానము 2) ఏవ 3) నిత్యం 4) దేహి 5) బ్రహ్మమయత్వము 6) స్థితశ్చ యత్ర కుత్రాపి 7) ముక్తి.

1) గురుధ్యానము : నిశ్చయాత్మకమైన బుద్ధిదేనినైన ననుసరించి లేక దేనియందైన నిలచి యెడ తెగక సాగుచుండునో అట్టి ధారావాహికమైన క్రియకే ధ్యానమనిపేరు. గురుదేవుల సగుణ లేక నిర్గున రూపములయందు ధారా వాహికముగ మనస్సు లేక బుద్ధిని నిలబెట్టుటయే గురుధ్యానము. ఈ ధ్యానము అవిచ్ఛిన్న తైలధారవలె తెంపు లేక సాగుట ధ్యానసిద్ధి అని చెప్పబడినది. ఇట్టి ధ్యానమునందుత్తీర్ణుడు కావలెనన్న పట్టుదలతో శిష్యుడు అభ్యాసము గావింపవలెను. ఇందుకు పూర్వాంగముగ గురుదేవుని నామ రూపములను సదా చింతించు చుండవలెను. గురువు సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపుడే అను భావము మనస్సును ఎన్నడును

పడరాదు.

శ్రవణం, కీర్తనం, స్మరణం, విష్ణోః పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదనమును నవ విధ భక్తి మార్గములను అనుసరించుచు బాహ్యభక్తి సలిపెనేని గురుడు నరుడనే భావనపోయి గురుడే పరుడు అనగా కేవలం పరమాత్మ స్వరూపుడే అను దృఢత్వము కుదురును. అపుడుగాని గురువునందు తనకు గురియే కలుగదు గురువు కల్గించిన ఆత్మ స్వరూప వస్తునిశ్చయ జ్ఞానమున్ను ఆరూఢముగాదు.

అంతవరకు సాధకుడు సగుణ రూపంలో గురువుయొక్క నామ రూపాలయందు బుద్ధిని నెలకొల్పియుండును. ఇక యిపుడు బుద్ధిని గురువుచూసిన ఆత్మ వస్తువునందు ప్రతిష్టించి జ్ఞానేంద్రియములచే గుర్తించు సమస్తమునందు ఆ ఆత్మవస్తువునే గమనించు అభ్యాసమునే చేయవలెను. ఇదియే అనన్య భక్తి సాధన, ఇట్టి అనన్య భక్తి యందే ప్రహ్లాద కుమారుడు "తనయందు నిఖిల భూతములయందు నొకభంగి సమహితత్వంబున" నుండగల్గెను. అనన్య భక్తి లక్షణముతో బుద్ధిని ప్రసరింపచేయుట ధ్యానమునందు ద్వితీయ సోపానము. తానూ యితరమూ అను ద్వైత బుద్ధికూడా నశించి తానే ఆ గురు పరమాత్మ ఆ గురు పరమాత్మయే తాను అను అఖండజ్ఞానము సిద్ధించుటయే యేకాంతభక్తి. ఇదియే భక్తి సాధనకు పరాకాష్ఠ. ఏకాంత భక్తి యందిక ధ్యానమనేది యుండదు. ఉండుటకు వీలులేదు. ధ్యాత=ధ్యానము చేయువాడు, ధ్యానము = ధ్యానరూప వ్యవహారము, ధ్యేయము = ధ్యానింపబడు వస్తువు అను త్రిపుటీ రహితము కాగలదు గురుస్వరూపమే తానై మధ్యాహ్నాం దిన మార్తాండునివలె సాధకుడు ప్రకాశించును. ఇదే బ్రహ్మమయుడగుట.

2)ఏవ = అనగా మాత్రమే, గురుధ్యానేనైన = 1) గురు ధ్యానముచేత మాత్రమే అనీ 2) గురుధ్యాన మాత్రంచేతనే అనీ రెండు విధముల నిది విమర్శింప దగును.

ఎ) గురుధ్యానముచేత మాత్రమే బ్రహ్మమయత్వము సిద్ధించును. అన్య దేవతా ధ్యానముచే నిది చేకూరదు అని భావము. ఏలననగా గురువు అను మాటకు గొప్ప లేక పెద్ద అని అర్థము. గురుస్వరూపముకంటె పెద్ద వస్తువులేదు. లోకంబులన్నియు దానిలోనివే. "అద్యతిష్ట ద్దశాంగుళం" అన్నట్లు అన్నిటినీ మీరి అది అతిక్రమించియున్నది. కనుక గురూపాసన చేసినచో సర్వదేవతారాధన చేసిన వాడే అగుచున్నాడు.

బి) గురూపాసనతోపాటు యితర దేవతారాధనకూడా చేసినచో తప్పులేదుగదా! యని కొందరు అన్య దేవతారాధనకూడా గావింతురు. ఇది అనన్య భక్తి సాధన కెంత విరుద్ధమో వేరే చెప్పవలసిన అవసరం లేదు. అనేక దేవతోపాసకునికి అనన్యభక్తి ఎన్నడున్ను చేకూరజాలదు. "ఏకోదేవఃకేశవోవా శివోవా" అన్నట్లు శివకేశవులకు భేదము లేకున్నా అందొక్కరినే వుపాసన చేసినపుడే అనన్యభక్తి చేకూరగలదు. అట్లే గురుస్వరూపమే అంతా. అంతా గురుస్వరూపమే అను భావన ఆరూఢమగుటకు గురువు నొక్కనినే యుపాసించవలెనుగాని యితర దేవతా రాధనలు చేయరాదు.

సి) గురూపాసనయందు సహితము నవవిధ భక్తుల కంటెను ధ్యాన ముత్త మోత్తమును

అని చెప్పుటలో సందేహమేమీలేదు. నవ విధ భక్తులు బాహ్య సాధనములు. ధ్యానము అంతరంగ సాధనము. ధ్యానబలము లేనిచో అనన్య ఏకాంత భక్తులు చేకూరజాలవు. గురూపాసనలో కూడా ధ్యానమునకు విశిష్ట స్థానమున్నది. కాని ఉన్న సాధనలలో ధ్యానమార్గము ఎంత గొప్పదైనా కర్మ, భక్తి, జ్ఞాన మార్గము లన్నియు దానికి సహకారులని మాత్రం మరువరాదు. ఏలననగా సత్కర్మానుష్ఠానము లేనిచో అంతఃకరణశుద్ధియే చేకూరదు. భక్తిలేనిదే ఏకాగ్రత కుదరదు. శ్రవణ మనన నిధిధ్యాసలు లేనిచో వస్తునిశ్చయ జ్ఞానము కలుగదు. ధ్యాన సిద్ధికి మిగిలిన వన్నియు అంగ వుపాంగములేగాని కేవలము వ్యర్థములు కానేరవు.

గురుధ్యాన మాత్రముచేతనే అను అర్థంలో మిగిలిన పద్దతుల వల్ల బ్రహ్మమయత్వ సిద్ధి చేకూరుట కష్టము. ధ్యానపద్ధతిచే నది సులభసాధ్యము అని అర్థము స్ఫురించుచున్నది.

బ్రహ్మమయత్వ సిద్ధికి సాధన మార్గము లన్నిటికంటెను ధ్యాన మార్గము చాలా గొప్పదనియు, "ధ్యానమూలం గురోర్మూర్తిః" అని అన్నట్లు యితర దేవతా ధ్యానము వలన నది చేకూరదనియు గురుమూర్తియొక్క ధ్యానమొక్కటియే చేయవలెను గాని దానితోపాటు యితర దేవతాధ్యానము చేయరాదనియు, గురుధ్యానము అత్యంత సులభోపాయమనియు, యేవ అను శబ్ద ప్రయోగము సూచించుచున్నది.

3) నిత్యము అనగ ప్రతినిత్యమూ అనీ, సర్వకాలముల యందు అనీ రెండర్థము లున్నవి. ప్రతి నిత్యము అను నెడల ప్రతి దినము ఏదో కొంతకాలము అని మాత్రమే అర్థము, సర్వకాలముల యందు ఎల్లప్పుడూ అనే అర్థమే గ్రహించవలెను. ఐననూ స్వప్న సుషుప్త్యాది అవస్తలయందు ధ్యానము సాధ్యముకాదు. కనుక ఎల్లప్పుడు అనుట జాగ్రదావస్తలో నున్న కాలమంతయు అని అర్థము గ్రహించవచ్చును. కాని "పానీయంబులు ద్రావుచున్ గుడుచుచున్ భాషింపుచున్, హాసలీలా నిద్రాదులు సేయుచున్" అని బమ్మెర పోతన్న గారు నిద్రలోగూడ హరిని మరువడు. ప్రహ్లాదుడు అని వ్రాసినారే? వారి భావనయేమి? యని శంక కలుగవచ్చును. మానవుడు గాఢనిద్రలోనికి జారుటకు ముందు తుదిక్షణములో ఏభావనతో నుండునో నిద్రనుండి లేచిన తొలిక్షణమున ఆ భావముతోనే నిద్రలేచును. నిద్రకు పూర్వోత్తరక్షణములందు అనగా ఆద్యంతము లందున్న భావము మధ్యలో గూడ నున్నట్లే అని యెంచి పోతన్నగారట్లు వ్రాసియున్నారని యనవచ్చును. "నిత్యం" పేరు శబ్దమును "గురుధ్యానే నైవనిత్యం" అని కలిపి నిత్యధ్యానం వుండవలెనా? నిత్యంబ్రహ్మమ యుడై వుండవలెనని చదువవలెనా? అంటే నిత్యం బ్రహ్మమయుడై వుండుట సాధ్యముగాదు. ఏలననగా ప్రాణధర్మములగు ఆకలిదప్పులు బాధించుట తన్నివారణకై ఆహారపానీయ సముపార్జన చేయుట అవసరము గదా! కనుక మొదటి అన్వయమే స్వీకరింపదగును. ఐతే యెల్లప్పుడు ఆత్మధ్యానమందు లేక గురు స్వరూప ధ్యానమందుండుట మాత్రము సాధ్యమా! తాను గృహస్థాశ్రమధర్మముల నన్నింటినీ పాటించవలెను గదా! అని శంకింపనవసరములేదు. రాజాధిరాజై దేశమును పరిపాలించు రాజు అంతఃపురమందున్నా రాజ్య సభయందు రాజకార్యములను జరుపుచున్నా, వేటకేగినా, యుద్ధముచేయుచున్నా న్యాయాధిపతియై, దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేయుచున్నా తాను రాజుననే

భావమును వదలకనే ఎట్లు సర్వకార్యములు నెరవేర్చుచుండునో, అట్లే సాధకుడు ఎట్టి ప్రాపంచిక కార్యములలో నిమగ్నుడైయున్నా, గురుధ్యానమును వదలవలసిన పనిలేదు.

శా॥ గానంబున్నటనంబు దాళగతులం గావించుచున్ జారు వి
ద్యానైపుణ్యము జూపుచున్ శిరముమీదన్ గల్గు పెందొంతరన్
బూనం గైకొను నాట్యశీలుని గతిన్ బుంఖాను పుంఖోజ్వల
న్నానార్థానుభవజ్ఞుడయ్యు బుధుడానందాత్ము గాంచున్ మదిన్

భావ, రాగ, తాళ, నృత్య విశేషాదులయందు ప్రజ్ఞచూపుచు ప్రేక్షకులనుర్రూత లూగించు చున్ననూ నాట్యశీలుడు తలమీద నున్న దొంతర లేమాత్రము కదలకుండునట్లు జాగ్రతపడుచూ వానిపై దృష్టిని ఎట్లు విడువడో అట్లే ధ్యానశీలుడు నానావిధ కర్మలాచరించు చున్నను ధ్యేయవస్తువు నుండి బుద్ధిమరల్చడు.

4) దేహి-దేహమును ధరించినవాడు, దేహములో నున్న వ్యక్తి లేక జీవుడు "జీవో బ్రహ్మైవ నాపరః" అని చెప్పబడినది. అనగా జీవుడు బ్రహ్మమే గాని యితరముకాదు అని అర్థము. ఐతే నిక జీవశబ్ద మెందుకు అని శంక కలుగును. క్లుప్తంగా చెప్పాలంటే, బ్రహ్మము ప్రాణ మనోరూప పరిణామము చెందినపుడు జీవనామము చెందినది. అంతఃకరణ విశిష్టత్వమే జీవత్వము. మనస్సు జ్ఞానేంద్రియముల ద్వారా శబ్దాదులను గుర్తెరిగి భావనారూపముగానూ, క్రియా రూపముగానూ కర్మలొనర్చి ఆకర్మ ఫలము లనుభవించుటకు నానావిధ దేహములను ధరించుచు దేహి అని పేరొందినాడు. కర్మ వాసనలచే అవృతమై తానే అఖండ బ్రహ్మ స్వరూపుడననే జ్ఞానము కోల్పోయి దేహమనః ప్రాణాధికములతో తాదాత్మము చెందుచున్నాడు.

5) బ్రహ్మమయత్వము : అనగా బ్రహ్మస్వరూపుడే అయి దేహీ దేహ లక్షణములను పూర్తిగా విడనాడుటయే బ్రహ్మమయత్వము. అంతఃకరణము, అజ్ఞాన రూపము, అంతఃకరణ మందలి జీవ భావము నశించి బ్రహ్మభావము ప్రకాశించుటే బ్రహ్మ మయత్వము. గురుధ్యానముచేత దేహి బ్రహ్మమయు డెట్లగుచున్నాడు. అనగా, సృష్టికి పూర్వము "జ్ఞానాదేవతు కైవల్యం" అని చెప్పబడ్డ స్థితిలోనున్న స్వరూపమును ధ్యానించుట నిర్గుణ ధ్యానము. "మనోహి జతువత్" అనగా మనస్సు లక్కవంటిది. లక్క కరిగినచో ఏ రూపమైనను వహించును. అట్లే మనస్సు ఏకాగ్రమగుచో తన అజ్ఞాన లక్షణము గోల్పోయి జ్ఞాన స్వరూపము చెందును. ఇదే బ్రహ్మమయమగుట.

6) స్థితశ్చ యత్ర కుత్రాపి = ఎక్కడెక్కడ నున్నప్పటికీ అని అర్థము. అనగా బ్రహ్మాకారా కారితమైన మనస్సుగల యటి మహాత్ముని స్థితి దేశ కాల భేదములచేగాని ఆశ్రమ భేదముచేగానీ, ఎట్టి మార్పునూ జెందదు. అనగా అతడు కాశీప్రయాగాది పుణ్యక్షేత్రములలో నున్నా పర్వతారణ్య విజన ప్రదేశములలోనున్నా, సంకీర్ణ జనావాసములయందున్నా. బ్రహ్మచర్య, గృహస్తవానప్రస్త సన్యాసాశ్రమములయందున్నా యిక నాతని ముక్తస్థితికేమీ భంగములేదు. అతడు నివసించు స్థానమే పుణ్యక్షేత్రము అనజెల్లును.

7) ముక్తోసౌ = అతడు ముక్తుడే అనగా అజ్ఞాన రూపబంధము నుండి విముక్తి పొందినవాడే. అంతఃకరణ అజ్ఞానావృతమనియు, ఆ అజ్ఞానమువలన అవివేకము. అభిమానము, రాగద్వేషములు, కర్మ జన్మ అనునవి పరంపరగా ప్రాప్తించుబంధములనీ యివన్నియు అజ్ఞాన నాశనము వలన నశించుచున్నవనీ యిదియే ముక్తి యనియు కొందరం దురు. ఈ విధమగు బంధమోక్షములు మిధ్యయని అద్వైతమే చెప్పుచున్నది.

శ్లో॥ ననిరోధో నచోత్పత్తిర్నబద్ధో నచసాధకః

నముముక్షు ర్నవై ముక్తః యిత్యేషా పరమార్థతః గౌ॥కారి 5:32

నిజముగా జ్ఞానాజ్ఞానములు రెండును బంధహేతువులే, జ్ఞాన బంధము హిరణ్య శృంఖలముల వంటిది. జ్ఞానా జ్ఞాన ద్వంద్వస్వరూపమగు వస్తువు తన నిజస్వరూపమే అయివున్నది. అదియే నిత్యమని సత్యమని దాని కతీతమగు కేవల బ్రహ్మము లేనేలేదని భ్రాంతిచెందియున్నవారికి జన్మయందు భ్రాంతియును రహితముగాదు. యీ గురుగీతా శ్లోకమునందు చెప్పబడిన బ్రహ్మమ యత్వమే ముక్తి. అట్టి ముక్తియే పరమాదర్శము అని చెప్పినట్లుకలేదా? అని ప్రశ్నించవచ్చును. కాని ఆ గురు గీతయే అన్యత్రా ఏమిచెప్పినదో గమనించదగును.

శ్లో॥ "స్వయం బ్రహ్మమయో భూత్వా
తత్పరం చావలోకయేత్
పరాత్పర తరంనాన్యత్
సర్వగం తన్నిరామయంః"

అనగా తాను బ్రహ్మమయుడై, తత్పరంచ అనగా అపుడు తన కన్యముగా నున్న దానిని కూడ చూడవలెను. తాను బ్రహ్మమయుడైన పిదప నిక తెలియదగినదేది? అదియే పరిపూర్ణ పరబ్రహ్మము అదియే కేవలము బ్రహ్మమయత్వ సిద్ధియే పరమావధిగాదని తెలియదగును. అది ముక్తస్తితియే యగుగాక! కాని అదియు నొక విధమగు బంధస్థితియే యగుగాక! కాని అదియు నొక విధమగు బంధస్థితియే. కనుకనే నిరాలంబోపనిషత్ "కేవల మోక్షాపేక్ష సంకల్పోబంధః" అని యుద్ఘాటించినది. బ్రహ్మమయత్వ సిద్ధి చరమసోపానము మాత్రమే. ఆపైన పరిపూర్ణ బ్రహ్మమే. ఐతే యీ విధముగా బ్రహ్మమయుడై శాశ్వతముగ అఖండ బ్రహ్మాకార వృత్తిలో నుండిపోవలెనా? యిది సాధ్యమున్నుగాదు. అవసరమున్నూగాదు. ఏలననగా పరిపూర్ణబోధయందు అది కూడ విడవదగినస్థితియే కాని తెలిసి విడువవలెను. కనుక యీ స్థితి క్షణకాలమైన అనుభవము లోనికి రావలసియేయున్నది.

బ్రహ్మమయత్వ సిద్ధి చేకూర్చుటయేగాక పరిపూర్ణ బోధోక్త స్థితిగూడ యే సద్గురు కృపవలన సిద్ధించునో అట్టి గురుమూర్తి కివియే మా నమస్కారములు.

శ్లో॥ లౌకికాద్ధర్మతోయాది, జ్ఞానహీన భవార్ణవే।
జ్ఞానభావేచయత్సర్వం, కర్మనిష్కర్మశామ్యతి॥

తాత్పర్యము : లౌకికధర్మములను మాత్రము పాటించి జ్ఞానహీనుడు, జనన

మరణరూపమగు సంసార సముద్రమునందే మునక లిడుచుండును. జ్ఞాని సర్వకర్మములనూ చేసినను, ఆయా కర్మఫలము లేమియు నాతని నంటక నిర్వీర్యములై నశించుటవలన అతనికి నైష్కర్మ్యతే సిద్ధించును.

విశేష వివరణము : 1) లౌకిక ధర్మములు ఏవి? 2) జ్ఞానహీనుడెట్టివాడు? 3) నైష్కర్మ్యసిద్ధి యెట్లు? అను ముఖ్యమగు మూడు విషయములు చర్చనీయాంశములై యున్నవి.

1) లౌకిక ధర్మములేవి? లౌకిక ధర్మములు యీ లోక సంబంధమైనవి లేదా లోకాంతర సుఖసంతోషాలు సాధించుటకు నిర్ణయింపబడినవి. వైదికములు (వేదోక్తములు) అవైదికములు (వేద నిషిద్ధములు ), ఐహికాముష్మిక సుఖప్రాప్తి సాధనములగునవన్నియును లౌకిక ధర్మములే. ఏలనన మానవుడు సంఘజీవి. యితర మానవాళితో, యితర ప్రాణికోటితో నాతనికి నిరంతర సాహచర్యము తప్పదు. సాంఘిక ధర్మములు, నైతిక ధర్మములు, రాజకీయ ధర్మముల నెన్నిటినో అతడు పాటించకనూ తప్పదు. యీ ధర్మములను పాటించినచో నాతడుత్తమ పౌరుడుగా లేక మానతా ధర్మములను విశేషముగా పాటించినచో ఆదర్శమానవుడుగా నెన్నబడును. అదంతయు కర్తవ్యకర్మమే యగుచున్నది. దానినాచరించుటచే మానవునికి పుణ్యమురాదు. కాని వాని నుల్లంఘించినచో అతడు సాంఘికముగ లేదా రాజకీయముగా నొక దోషిగా పరిగణించపబడి శిక్షార్హుడగును.

సత్యాహింసలు, అంతర్బాహ్యశౌచములు, నిష్కాపట్యము. పరిశుద్ధ ప్రవర్తన త్రికరణశుద్ధి మొదలగునవి బూనిననాడే నిజమగు మానవుడు. కాని అట్టి సత్ప్రవర్తనయున్నంత మాత్రమున అతడు భవవారాశిని తరింపనేరడు. సత్ప్రవర్తన యుంటే చాలు, దేవునితో మాకు ప్రసక్తియేమి? అని కొందరు వ్యర్థ ప్రలాపములు గావింతురు. ఆత్మాస్తిక్యబుద్ధియే లేనిచో ధర్మాచరణకు తగిన ప్రేరణయే యుండదు. ఆత్మాస్తిక్యత నంగీకరించని బౌద్ధమతావలంబకు లగు చైనా మొదలగు దేశీయుల ప్రవర్తన లెట్లున్నవో పరిశీలించిన చాలును. బుద్ధభగవానుడు శూన్య వాదమును ఎన్నడూ ప్రతిపాదించకపోయినను ఆయన అనుయాయు లాయన వాక్యముల కపార్థము కల్పించి శూన్యవాదులై ఆత్మప్రేమను బోధించక కేవల నైతిక ధర్మముల మాత్రము ప్రబోధించుట చేతనే బౌద్ధ మతం హిందూ దేశమున నిలబడలేకపోయినది.

యజ్ఞ దాన తపోరూపమగు కర్మాచరణవలన స్వర్గమందు సుఖ సంతోషములను కొంతకాలము పొందగలదేగాని "క్షీణె పుణ్యేమర్త్య లోకం విశంతి" అనగా ఆర్జించిన పుణ్యఫలము అనుభవముతో క్షీణించగా మరల నాతడు యీ భూమియందు తిరిగి పుట్టవలనసినవాడే యగుచున్నాడు. భక్తి మార్గమువలభించి యిష్టదేవతారాధన నిష్కామంగా చేయునేని, సాలోక్య, సామీప్య, సారూప్యాది ముక్తులు చెందును. కాని, "లోకంబులు, లోకేశులు, లోకస్థులు తెగిన తుది" మరల జనన మరణాదులు పొందవలసినదే. జన్మాదులనుండి విడుదల జ్ఞానహీనునకు లేదు అని యీ శ్లోకము చెప్పుచున్నది. అన్ని ధర్మాలు వదలి భగవంతుని శరణాగతి చేసినచో మోక్షంకూడా సిద్ధించునని గీతా చరమశ్లోకం.

శ్లో॥ "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వాసర్వపాపేభ్యో మోక్షాయిష్యామి మాశుచ"

అని చెప్పుచున్నది. ప్రపత్తి మోక్షసాధనం కాదా? అని కొందరు ప్రశ్నించవచ్చును. ఐతే మామేకం = ఒక్కడైననన్నే అన్నారు. ఆ ఒక్కటైన "నేను" అను పదార్థమేది? అది అఖండరూపమగు పరమాత్మ స్వరూపమే అని తెలియనగును. ఆ పరమాత్మ తత్వమును వస్తునిశ్చయముగా తెలిసినగాని, అట్టి అఖండత్వమున తన వ్యష్ట్యహంకారమును లయముచేయుట యెట్లు? దానిని వస్తునిశ్చయపూర్వకంగా గుర్తించి ఆపిమ్మట ఆ వస్తువే తాను, తనయందే సర్వము, సర్వమునందు తాను అను దృఢబుద్ధితో వ్యవహరించుటే జ్ఞానము.

2) జ్ఞానహీనుడెట్టివాడు: స్వరూపవిస్మృతి (లేక మరుపు) అనగా తన నిజస్వరూపమును మరచియుండుటయే జ్ఞానహీనము. ఆ స్వరూపము యొక్క నిరంతర సంస్మృతియే యెరుక. కందార్థములలో శ్రీకృష్ణ దేశికేంద్రులవారు "యెరుకనగా యెరిగేటిది, మరుపనగా యెరుక తనను మరచటము" అంటూ ఎరుక మరుపులను నిర్వచించి యున్నారు.

శ్లో॥ "యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి నిశ్చయా
యద్యచ్ఛృణోతి కర్ణాభ్యాం తత్తదాత్మేతి నిశ్చయా"

అంటూ పంచేంద్రియ గోచరమగు సమస్తము ఆత్మయే. "ఆత్మనోన్యం నకించన" అను తెలివితో సకలక్రియలు చేయుట జ్ఞానము. అట్లుగాక నామ రూపాదులయందు, సత్యత్వబుద్ధిపూని విషయభోగము లాశించుట జ్ఞానహీనము. పారమార్థిక జ్ఞానజీవన సంపత్తి లేనివాడు జ్ఞానహీనుడు. కాని ప్రాపంచిక విద్యావైదుష్యము లేనివాడు అని అర్థముకాదు. ఐతే అతడెంత మేధావియైనా యెంత శాస్త్రపండితుడైనా, యెంత మహా మహిమాన్వితుడైనా, యెంతటి యోగసిద్ధుడైనా అట్టి పారమార్థికజ్ఞానము లేనినాడాతడు జ్ఞానహీనుడే. "జ్ఞానేన హీనఃపశుభిస్స మానః" అని పశుతుల్యుడే యగుచున్నాడు.

నైష్కర్మ్యసిద్ధి : నైష్కర్మ్యమనగా కర్మరహితము. ఎట్టి చలనమున్నా కర్మయున్నట్లే, ఎందుచేతననగా చలనముంటే తప్ప కర్మయుండదు. త్రికరణములచేత మనము కర్మచేయుచున్నాము. త్రికరణములయందునూ చలనమున్నది. మానసికచలన మద్భుతమైనది. మహావేగముగలది. వస్తుతః వాయుసంబంధమగు మనస్సునకు చలనమనేది సహజస్వభావమై యున్నది. ఏమాత్రం మనస్సు చలించినా మానసిక కర్మ చేసినట్లే, మనస్సు విస్మృతియందు మగ్నత చెందినపుడు కూడ ప్రాణచలనముంటూ నేయున్నది చివరకు సమాధి యందు మనః ప్రాణాది సర్వచలనములు అరికట్టబడియున్నా శరీర మందలి గోళ్ళూ వెంట్రుకలూ పెరుగుచునేయున్నవి. శరీరమందలి జీవాణువులు నిరంతర చలనము కలిగియేయున్నవి. కౌమార వార్ధక్యాద్యవస్థా పరిణామములు కలుగుచునేయున్నవి. తుదకు మరణించిన పిదప సూక్ష్మ శరీరము కర్మయాన, పితృయాన, దేవయానములలో ఏదో యొక్కటి సాగించుచునే యున్నది. శరీరములయందేగాక బ్రహ్మాండమందలి సమస్తము చలనాత్మకమయ్యే యున్నది. మూల

ద్రవ్యముల యొక్క పరమాణువులయందుకూడా యెలక్ట్రాన్ ప్రోటానుల యొక్క నిరంతర చలనముంటూనే యున్నది. గుర్తెరిగే తానూ, తన యూహకందే సమస్తమూ చలనాత్మకమయ్యే యున్నది. అనగా కర్మస్వరూపమే అయివున్నది. కాన యీ మొత్తమునంతనూ కదలించేది ఏది? అది సర్వకారణమైన పరమాత్మయే. అదియే మూలగుర్తు. దానికి మాత్రం మూలంలేదు. దాని సంకల్పమే జగజ్జీవేశ్వరుల చలనములకెల్ల కారణము. సకల కర్మలకు కారణము: "తస్య కర్తార మపి విధ్యకర్తార మవ్యయం" అని. సర్వకర్తవైనా అకర్త అని తెలిసికోమంటున్నాడు భగవానుడు. అకర్తగా తోచబడినా కర్తయే అంటున్నాడు నిజంగా, బాహ్యంగా చలించేది సూదియేగాని నిజంగా చూస్తే చలింపజేసే అయస్కాంతానిదే చలనం. అలా విచారిస్తే పరమాత్మకు నిష్క్రియత్వం చెప్పటానికి వీలేలేదు. శుద్ధనిష్క్రియమైయున్న దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమే.

సకల క్రియలకు మూలమైన, మూలంలేని యీ గుర్తెరిగే శరీరమునకు, నిష్క్రియమైన పరిపూర్ణ పరబ్రహ్మమునందు మూలంలేదు అని పూర్ణభావము. పై నుండి వ్రేలాడు గొలుసు రింగులలో పై నున్న మొదటి రింగు వూడగొట్టినచో మొత్తమంతయు కూలిపోవునట్లుగా క్రియారహితమైన (నిష్క్రియమైన) పరిపూర్ణమునందు సకల క్రియలకు మూలమైన గుర్తెరిగేజ్ఞానమే లేదని తెలియుటవల్ల కర్మలకు మూలంలేదు. నైష్కర్మ్యము (పరిపూర్ణం) మాత్రమే స్వతస్సిద్ధమై యున్నది. అనుభవ మారూఢమగును. ఇది నైష్కర్మ్యసిద్ధికి ప్రప్రథమ సోపానము.

నిష్క్రియత్వమనేది యొక్క పరిపూర్ణ పరబ్రహ్మమునందు మాత్రమేయుంటే, ముముక్షువు నకు నైష్కర్మ్యము సిద్ధించుట అనగా నేమి? పరిపూర్ణము నిత్యసిద్ధ వస్తువుగదా! మరియు దానిని పొందుట యనిగాని దానియందైక్యమగుటయనిగాని చెప్పరాదు గదా! ఇక నైష్కర్మ్యసిద్ధియేమి? అని ప్రశ్నించవచ్చును. మానవుడీ జన్మయందొనర్చు శుభాశుభకర్మల వాసనలు అంతఃకరణయందు అంటకుండా నిర్వీర్యమైపోవుటయే నైష్కర్మ్యసిద్ధి, అపుడు ఏ కర్మచేసినా చేయని వాడే యగును.

ఇది ఎట్లు జరుగును? కర్మకారణము లైదింటిలో కర్తృభావంలేనిచో కర్మచేసియు చేయనివాడే యగుననియు. పరిపూర్ణ భావజ్ఞుడు, కర్మ ప్రవృత్తికి (కర్త, కర్మ, క్రియలకు) హేతువైన అఖండ యెరుక యొక్క అభావత్వమును గుర్తించియున్నందున అతని కొక్కనికే కర్తృత్వరహిత కర్మాచరణ సాధ్యమగుననియు గతంలో 'కర్మమయోపశాంతి' అనుశీర్షిక యందు చర్చించి యుంటిమి ఒక మనిషి యొక్క లేదా దృశ్యము యొక్క ఛాయాచిత్రము (ఫోటో) తీయువలెనంటే ఒక విధమగు రసాయనిక ద్రవ్యము పూయబడిన గాజు అద్దము నుపయోగింతురు. అట్టి రసాయనిక ద్రవ్యమును తుడిచివేసినచో చిత్రము ముద్రపడదు. అట్లే కర్తృత్వకామనలులేని యంతఃకరణము నందు యెట్టి సంస్కారము ముద్రపడదు. అట్టి కర్తృత్వ రహిత కర్మాచరణ తెలిసి అశరీర పద్ధతి యందుండుట ద్వితీయ సోపానము. యిది

ఆచరణకు సంబంధించినది. యీ రెండు విధానములయందు శిష్యుల కారూఢత గల్గించు కృపాసముద్రుడగు గురుమూర్తి కివే మా ప్రణతులు.

శ్లో॥ ఏకాకీ నిస్పృహ శ్శాంత శ్చింతాసూయా వివర్జిత
బాల్యభావేన యో భాతి బ్రహ్మజ్ఞానీ సవుచ్యతే॥

తాత్పర్యము : ఒంటివాడు, ఆశలేనివాడు, శాంతచిత్తుడు ఏవిధమైన చింతలేనివాడు, అసూయలేనివాడు అయివుండి పసిబాలుని, వలెనుండు నాతడే బ్రహ్మజ్ఞాని యని చెప్పబడు చున్నాడు.

విశేష వివరణము : 1. ఏకాకి మొదలగు శబ్దార్థ విశేషము 2) బాల్య భావము 3) బ్రహ్మజ్ఞాని, అనువానిని వివరించి తెలుసుకోదగును.

1) ఏ) ఏకాకి : విజన ప్రదేశమునందొంటిగా నుండువాడే ఏకాకి అనే సామాన్యార్థము చాలదు. ఇతర మానవుడు లేనంతమాత్రాన ఒంటరితనమెట్లైనది? ఇతర జీవరాసులెన్నైన నుండవచ్చునుగదా! తన మనోరూపమగు సూక్ష్మశరీరము తనతో గూడా నుంటున్నదిగదా! కనుక తానేకాకిగాడు.

పోనీ, అద్వితీయాఖండ స్వరూపుడైన పరమాత్మను ఏకాకి యనవచ్చునా! "ఏకమేవాఽ ద్వితీయంబ్రహ్మ" యనీ "బ్రహ్మణోన్య నకించన" యనీ శ్రుతులు పల్కుచున్నవి. అనగా బ్రహ్మము వినావేరులేదు. నానాత్వమంతయు నామరూప భేదము మాత్రమే మిథ్యారోపితమే. అధిష్ఠానము మాత్ర మొక్కటియే అయివున్నది. ఆ అధిష్ఠాన బ్రహ్మభావముపొంది ఆ బ్రహ్మమే నేను అనే ఆరూఢత నొందిన వాని దృష్టిలో తాను తప్ప రెండవది లేనేలేదు. కనుక అతడే ఏకాకి అని అద్వైత రీత్యా చెప్పవచ్చును. కాని "ఏకం అనేకం భవతి" "అనేకం ఏకం భవతి" అని చెప్పబడినరీత్యా ఏకానేకములుగా ఒకే వస్తువు మార్పులు చెందుచున్నది. 'ఏక' మందు "అనేకం" గర్భీకృతమైయున్నది కనుక, నేనా యద్వితీయ బ్రహ్మస్వరూపుడనే అని ఆరూఢత నొందిన జ్ఞాని కూడా ఏకాకియని చెప్పుట కవరోధముగా నున్నది.

నిజమైన ఏకాంత ప్రదేశ మొక్క పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రమే. అందు ఏకాకి ననుకొన్న తాను, తనయందు గర్భీకృతమైన సమస్తముతో సహా ఏమీలేదు. ఏక + అంతము = ఏకాంతము = ఒక్కటైనది లేక యున్నదే ఏకాంతము. ఏకమైన ఆత్మస్వరూపమునకు తనయందు మూలముగాని స్థానముగాని లేనిదే ఏకాంతమైన పరిపూర్ణ పరబ్రహ్మము. అట్టి ఏకాంతమును గురుముఖతః దెలిసి తన రహితమునందు పరిపూర్ణ పరబ్రహ్మ నిశ్చయమైన వునికి గలిగినవాడే ఏకాకి. అట్టి వునికి గల్గినవానిని గూర్చియే "ఉత్తపరిపూర్ణమే తాను తానే వుత్తపరిపూర్ణ" మన్నారు శివరామదీక్షితుల వారు. "అట్టి వునికి గల్గిన యట్టి ఘనుని సన్నుతిచేయ జనులకు శక్యమంచన రాదు. వినరాదు" అన్నారు కృష్ణదేశికేంద్రులవారు. పోనీ పరిపూర్ణమందితరమేమీలేదు. కనుక పరిపూర్ణమును ఏకాకి యనవచ్చునేమోనని యూహించవలయునుగదు. ఏలననగా పరిపూర్ణము ఏకమూకాదు. అనేకమూ కాదు. పరిపూర్ణం సంఖ్యకేరాదు. కనుక ఏకాకియని యిక నెవరినన

వలెను? ఏకాంతమైన పరిపూర్ణమును, ఏకానేకములుగానున్న యెరుకను యెరిగి తాననే యెరుకయొక్క రహిత నిశ్చయమునందు అశరీరుడైయున్న పూర్ణగురువు మాత్రమే యేకాకి యనదగియున్నాడు.

బి) నిస్పృహ : ఆశలు లేకుండుట అని నిరాశ చేసుకొనుట కాదు. ఏలననగా ఆశ నెరవేరేదికాదని వదలుకొనుట నిరాశ. కాని ఆ వస్తువు చిక్కే అవకాశముంటే దానికి ఆశ మరల మరల పొటమరించుచునే యుండును. నిస్పృహలో అట్లుకాదు. ఆశలు కల్పించుటకు, లేక ఆశా సంపూర్తికి సంకల్పము గావించు వస్తువునందు రాగముదుగుట వల్ల ఏ వస్తు సంపాదనము నందును అభిరుచియుండకపోవుట నిస్పృహ, "ఆత్మవస్తుకామాయసర్వంప్రియం భవతి" తనయందలి ప్రేమచేతనే భార్య పుత్ర విత్తాదులయందు ప్రేమ కల్గియుండును. తనయందు తన కుండే ప్రేమయే రహితము చేసుకొన్న స్వార్థరహితుడు దేనిని కామించగలడు? దేనిని ప్రేమించగలడు? రాగద్వేషములు కలిగియుండుటకు అవకాశమే లేకుండ చేసుకొన్న వాని యొక్క అంతఃకరణస్థితిని, నిస్పృహయని యనవచ్చును.

సి) శాంతః = అనగా ఒక్క కోపము మాత్రము పోయినవాడు కాదు. ఆకాశము యొక్క స్థూలాంశ గుణములగు కామక్రోధ లోభ మోహ భయములు అంతఃకరణమును ఆవరించకుండా చేసుకొన్నవాడే శాంతుడు. అతడు శబ్దాది విషయ చింతన చేయనే చేయడు. భగవద్గీతలో చెప్పిన పరంపరా రూపమగు పతన హేతువు లుండజాలవు. ఎట్లనగా,

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంస స్సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతే కామః కామాత్ క్రోధోభిజాయతే॥
క్రోధాద్భవతి సమ్మోహ స్సంమోహాత్ స్మృతి విభ్రమః
స్మృతిభ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశ్యాత్ ప్రణశ్యతి॥

అనగా విషయచింతన వలన, యింద్రియము లావిషయములయందు లగ్నమై సంగమేర్పడును. సంగమువలన కోరిక లుద్భవించును. కోరిక తీరనిచో కోపము (తీరినచో ప్రాప్తించిన వస్తువు యందు మోహము, ఆ వస్తువునందు లోభము, వస్తువునకు హాని కలుగు నేమోయని భయము) కోపములో సమ్మోహము, స్మృతి భ్రంశము, బుద్ధినాశము, వరుసగా గల్గి సర్వనాశముగావించును. ఈ అంతకూ మూలకారణమగు విషయచింతనయే చేయని జ్ఞాని అంతఃకరణము శాంతి నిలయమై ప్రకాశించును.

డి) చింతాసూయా వివర్జిత : పైన చెప్పిన నిర్మలాంతఃకరణమందు దుఃఖమునకు తావేవుండదు. తన కెట్టి కోరికలేదు. గనుక ఏ కోరిక లెవరికి సిద్ధించినా అతడీషణ్మాత్రము అసూయచెందడు. అంతేకాదు తానుకూడా వారితోపాటు ఆనందించును. పరిపూర్ణబోధచే వ్యష్టి సమిష్టి రూపమగు అంతఃకరణమేలేదని స్థిరపరచుకొన్నవానికి చింతాసూయలకు స్థానమేలేదు.

2) బాల్యభావం : తమ ఆనందమునకై తల్లిదండ్రులు తమ శిశువును యనేక సువర్ణ భూషణాధికములతో నలంకరింతురు. ఆ యలంకారములుంచినను, తీసినేసినను, దుష్టు లపహరించుచున్ననూ శిశువు యొక్క ప్రసన్న వదనమునందెట్టి మార్పునూ యుండదు. అట్లే

ధనాదికము ప్రాప్తించినా, వున్న సంపద నష్టపడినా అట్టి యోగ క్షేమములకు జ్ఞాని సుఖ దుఃఖములు పొందక ప్రశాంత చిత్తుడై యుండుటే శిశుభావము లేక బాల్య భావము. అంతేగాని మలమూత్రాది ఏహ్యపదార్థముల దృష్టిలేక వానిలో పొర్లాడుటకాదు.

3) బ్రహ్మజ్ఞాని : అనగా బ్రహ్మవేత్తకాడు మనోవాక్కుల కందని పరిపూర్ణ బ్రహ్మమునకు వేతృత్వములేదు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మము తానైన సచ్చిదానంద వస్తువుకాదు. తానుగాని ఆ పరిపూర్ణ పరబ్రహ్మమందు తమ జ్ఞానప్రకాశము చొరబడుటకు అవకాశమే లేదు. అది పంచతన్మాత్ర రహితము కనుక యింద్రియములచేగాని, భావాబావరహితమగుటచే మనస్సు చే గాని తెలియరానిది ఇట్లు తన సంగతినీ తన కన్యమై సర్వాతీతమైన దాని విషయమున్నూ గురుముఖతః తెలుసుకొన్నవాడే బ్రహ్మజ్ఞాని. యీ క్రిందివిధముగా మాత్రమే దానిని తెలుసుకొనగలుగుచున్నాడు. "నాహం మన్యేసువేదేతి నో నవేదేతి, వేదచ" కేనోపనిషత్ - దానిని నేను చక్కగా తెలిసికొంటినిగాని, తెలుసుకొనజాలక పోతిని. అని గాని తలంచుటలేదు అని తెలుసుకొన్నవాడే బ్రహ్మజ్ఞాని. ఏలననగా అది తెలివిచే గ్రహింపదగినది. అంటే అదే తానై పోవును. నాకు వేరుగా దానిని గ్రహించితిని అని అంటే అది నాకు వేరైన జడవస్తువు గావలెను. పరిపూర్ణము తెలివి రూపముగాదు. జడమూకాదు. పరిపూర్ణ మెరుకల రెంటినీ ఆ విధముగా తెలుసుకొని తాను తరించి భక్తులను తరింపచేయు సద్గురుమూర్తికిమే మా ప్రణుతులు.

శ్లో॥ ఏకమేవాఽ ద్వితీయోహం గురువాక్యేన నిశ్చితః
ఏవ మభ్యస్యతా నిత్యం నసేవ్యం నైవ నాంతరం॥

తాత్పర్యము : గురువాక్యముచే పొందిన నిశ్చయమును నిత్యమూ అభ్యసించుటచేత 'నే నొక్కడనే వున్నాను. రెండవది లేనేలేదు" అను అఖండ జ్ఞానము దేశకాలములతో నిమిత్తం లేకుండా యెక్కడైనను బొందదగియున్నది. అడవి మధ్యమునందే పొందవలెనను మాటలేదు.

విశేష వివరణం : ఇదిగో యిది ఆత్మస్వరూపము, ఈ ఆత్మ కంటె నీవు వేరుగా లేవు. "తత్ త్వం అసి" అనగా అదే నీవై యున్నావు అని బోధించునదే గురువాక్యము. తత్ త్వం అది అను నా మూడు పదముల అర్థమును జెప్పి వానిని వస్తురూపముగా చూపించిన గురుమూర్తికి నమస్కరించుచున్నాని, గురుగీతలోని మూడు శ్లోకముల వివరణము ఇదివరకే తెలుపబడి యున్నది. కడవలోని పాలు, గ్లాసులోని పాలు ఒకటేయైనా, వ్యవహారార్థము వేరుగా చెప్పుకొనుచున్నాము. ఈ వ్యావహారిక భేదము చేత, "నేను, నేను" అని వేరుగానున్ను "అది, అది" అనబడేది తనకు విలక్షణముగా వేరుగా నున్నట్లున్ను తోచబడుచున్నది. ఈ భేదముపోయి, నేను ఆ బ్రహ్మమును అనే అఖండ జ్ఞాన మారూఢమగుటకు ఏమి చేయవలయునన్నదే జిజ్ఞాసితవ్యము. ఈ ప్రశ్నకు యీ శ్లోకమును దీని తరువాత శ్లోకమును జవాబు చెప్పుచున్నవి.

"ఏవమభ్యస్యతా నిత్యం" యీ విధముగా యెల్లప్పుడును అభ్యసించవలెనని పై శ్లోకము విధించుచున్నది. "అహం బ్రహ్మాస్మి" అనగా నేనే బ్రహ్మమును నేనే ఆ బ్రహ్మమును, అంటూ ప్రసంఖ్యానము లేక వాచిక జపము చేయుటయే అభ్యాసమగునా? కాదు ఏలననగా, వాచికజపము వస్తుసాక్షాత్కారము కలుగచేయదు. మరెట్లు అభ్యసించవలెను? "తజ్జపస్తదర్థ

భావనం'' అనగా దాని అర్థభావన చేయుటయే దానిని జపము చేయుట అగును, కాని వాక్యోచ్చారణ మాత్రము చేయుట జపము కాదు. అంతేకాదు అర్థభావనయనగా శబార్థమును చింతించుటయు కాదు. అన్నముయొక్క స్మరణ మాత్రముచే ఆకలి యెట్లు తీరదో శబ్దార్థ విచికిత్సచే వస్తు నిశ్చయము కాజాలదు. కనుక మహావాక్యములోని పదార్థములను, అన్వయ వ్యతిరేకయుక్తులచే విమర్శించుట వలననూ ప్రయోజనము అల్పమే. అర్థభావన యనగా శబ్దముచే లక్షింపబడిన వస్తునిర్దేశము గావించుకొని దాని వస్తురూపంలో ననుసంధానము చేసుకొనుచుండుటయే. అదియే జపము అనవలెను తత్, త్వం, పదములచే లక్షింపబడిన వస్తువులను ప్రత్యక్షముగా గుర్తెరిగి, ఆరెంటి ఏకత్వములో అఖండరూపంగా నున్న స్వరూప సాక్షాత్కారము బొందుటే అభ్యాసమునకు ఫలము, అట్టి ఫలప్రాప్తిని యుద్దేశించియే, శ్రీకృష్ణ దేశికేంద్రులవారు 'పిండబ్రహ్మాండంబులు రెండును, ఆ రెంటిలోని రెండహములు, యీ ఖండములు నాల్గుగూడి యఖండంబగు యెరుక రూపు గనరా మా తండ్రీ యిది దెల్పిన ఘనుడే తల్లిదండ్రీ'' అంటూ యొక కందార్థములో శెలవిచ్చినారు. ఆ నాలుగు ఖండములు, వస్తునిశ్చయ రూపంగా దెలుసుకొన్నవాడై ఆ నాలుగుతో గూడిన అఖండ యెరుకను గుర్తించి, ఆ పిదప "ఏకమేవాஉ ద్వితీయోహం" అను అఖండార్థమును మరువక యుండవలెను. మరువకుండుట అనగా పురుషుల మధ్య సంచరించుచున్న స్త్రీ, నేను స్త్రీని నేను స్త్రీని అని మాటిమాటికి స్మరించక పోయిననూ ఆమె ప్రవర్తనయందు మాత్రము అభావము యెట్లు ప్రకటీకృతమగుచుండునో అట్లే ఆత్మదృష్టి సహజమైపోవలెను.

ఇందుకు అభ్యాసము ఏవిధంగా చేయవలెను? అదియును, గురుమూర్తి శిష్యుని అధికారమునుబట్టి నిర్ణయించి విధించవలసినదే. ఐననూ కడవలోని పాలూ, గ్లాసులోని పాలూ ఒకటేగాని ఏమీ భేదము లేదు అను వాక్యము ప్రత్యక్షముగా ఋజువు చేసుకొనుటకు శిష్యుడేమి చేయవలెను? గ్లాసులోని పాలను కడవలోని పాలలో పోసి ఆ పిదప అవసరమగు పాలను కడవలోనుంచి గ్లాసుతో తీసుకొంటే, భిన్నత్వము ఔపాధికంగా దోచుచుండినా అభిన్నత్వమునందు యెట్టి సంశయము యిక వుండుటకు సావుకాశము లేదు. అట్లే నాలుగు ఖండముల ఏకత్వరూప మగు అఖండత్వమును ఒకసారి దర్శించి, ఆ పిదప తన వ్యష్టిరూపమగు పిండాండమును, పిండాండమందలి అహమును వ్యవహారార్థము స్వీకరించవలెను. అపుడు తాను వేరుగా వ్యవహరించుకొనుచున్ననూ, అందువల్ల అఖండార్థమగు ఏకత్వముతో తనకు ఏవిధమగు భిన్న భావమున్నూ తిరిగి కలుగజాలదు. ఇట్టి అఖండాత్మ దృష్టి 'గురుకృప'' వుంటేనేగాని సాధ్యంకాదు. అట్టి గురుకృపా సంసిద్ధి కొరకే అనుష్ఠాన విధానము గురుపుత్రులకు విధింపబడినది. యిహపర శ్రేయోదాయకమగు యీ గురు మంత్రానుష్ఠాన ప్రభావము యింతిం తని వర్ణింప నలవికాదు.

ఈ అభ్యాసమునకు దేశకాల నిర్ణయము లేమీ లేవు. కాశీ మహాక్షేత్రమున పవిత్ర గంగానదీ ప్రవాహోదకములో అరుణోదయ కాలమందు మొలబంటి నీటిలోనిలచి అభ్యాస అనుష్ఠానాదులు చేసినా, శారద రాత్రులయందు పండు వెన్నెల కాంతులలో వుద్యానవనమందు

పుష్ప సౌరభము గుబాళించుచుండగా అభ్యసించినా యొకటేగదా! ఏకాంతముగ పర్వత గుహారణ్యములలోనున్నా భార్యాపుత్రాదులతో సంసార నిమగ్నుడైయున్నా ఈ ఏకత్వసాధన కవరోధ మేమిన్ని లేదు. "గురోరంఘ్రిపద్మే మనశ్చేన్నలగ్నం తతఃకిం, తతః కిం, తతఃకిం" అంటే గురుపాదములయందు మనస్సు లగ్నము చేయనిచో అనగా గురుతత్వముతో అభిన్నత్వ ము పొందని యెడల, ఏమియున్నా, ఎంతవున్నా నిష్ప్రయోజనమని గుర్వష్టకము బోధించు చున్నది. దీనినే వ్యతిరేకార్థములో చెప్పవలసివస్తే "గురుపాదములయందు హత్తుకొని వీడక మనసు నిలచివుంటే యెన్ని సుఖాను భవములు పొందుచున్నా ఏమీ బాధలేదు. ఇదేకదా రాజయోగ రీవి.

కృతత్రేతాది యుగములయందు ఋష్యాదులు వేలకొలది సంవత్సరములు తపస్సు చేసిరని చెప్పబడుచున్నది కాని గురుముఖతః వస్తు నిశ్చయరూపంగా అఖండాత్మ దర్శనము చేసిన గురుకృపా పాత్రలకు నిముషంలో సమాధిస్థితి లభ్యమగుచున్నది. అనగా తన మనస్సు ఆ అఖండ బ్రహ్మాకారము వహించుచున్నది. కనుకనే గురుగీతలో

శ్లో॥ అభ్యాసాన్ని మిషేణైవ సమాధి మధిగచ్ఛతి
ఆజన్మ జనితం పాపం తత్క్షణాదేవ నశ్యతి॥

సమాధియన్నా, మనస్సు బ్రహ్మాకారము వహించెనన్నా, తత్వ జ్ఞానం సిద్ధించెనన్నా యొక్కటే యర్థమని గ్రహించవలెను. ఆ క్షణము నందే జన్మాదిగా చేసిన పాపములు అన్నియు నశించునని పై శ్లోకములోని రెండవ పాదములో శివుడు పార్వతికి చెప్పుచున్నాడు. జన్మాదిగా అంటే, తల్లి గర్భము నుండి ఈ శరీరము బయట కొచ్చిన దాదిగా అని అర్థముకాదు. జీవుడెప్పుడు తొలిజన్మ మెత్తెనోగాని, నాటి నుండి యెత్తిన అన్ని పూర్వజన్మలయందలి పాపములన్నియు నశించు చున్నవి. పాపమనగా దుష్ట సంస్కారము మాత్రమే కాదు. శుభ సంస్కారములు గూడ హిరణ్య శృంఖములవలె జీవుని బంధించి జన్మకారణముగా నున్నందున శుభాశుభ సంస్కారములన్నియు "పాపము" అను శబ్దమునకు అర్థముగా చెప్పవలసియుండును. పైన చెప్పిన విధంగా తత్వజ్ఞానోదయ కాలమువరకూ గల సమస్త పుణ్యపాప సంస్కారములు (ఒక్కమాటలో చెప్పాలంటే సంచితమంతయు) నశించు చున్నది. కనుకనే "ప్రారబ్ధం భోగతో నశ్యేత్, తత్వజ్ఞానేన సంచితం" అనీ "జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా" అనీ చెప్పబడినది.

"గురువాక్యేన నిశ్చితః" అనగా గురువాక్యముచేతనే అట్టి ఆరూఢత సిద్ధించునా. అను సందేహ మవసరంలేదు. గురువు శక్తి పాతముచే గూడ శిష్యుని తరింపచేయగలడు. ఐనను, గురువాక్యమనుటలో శబ్దమాత్రముగా గురువుచేయు ప్రబోధము మాత్రమేగాదు. సచ్ఛిష్యుని మనస్సు గురువాక్యముచే లక్షీకృతమైన వస్తుస్వరూపము దాల్చుటరీత్యా శిష్యునికి ప్రత్యక్షానుభూతి చేకూరుచున్నది. అట్టి విననేర్పుగల్గిన శిష్యుని మెచ్చుకొని "నా నోటిమాట వెంబడి తానెప్పుడు సంచరించే తగ నీచిత్తంబే, నది గని యీ బోధ నిధానము నీకిస్తి" నని శ్రీకృష్ణదేశికేంద్రులు శెలవిచ్చినారు. అట్టి దయాసాగరుడగు గురుమూర్తి కివే మా నమస్కారములు.

శ్లో॥ అభ్యాసాన్ని మిషేణై సమాధి మధిగచ్ఛతి।
ఆజన్మ జనితం పాపం తత్ క్షణాదేవ నశ్యతి॥

తాత్పర్యము : ఓ పార్వతీ! జనుడు గురువాక్యము నిమిష మాత్రం అభ్యసించుటతోడనే సమాధిని పొందుచున్నాడు. పుట్టిన దాదిగా, ఉత్పత్తి చెందిన సమస్త పాపములు ఆ క్షణమునందే నాశనంచెందు చున్నవి.

విశేష వివరణము : యిందు 1) అభ్యాసము 2) సమాధి 3) ఆ జన్మజనిత పాపము 4) తత్క్షణాత్ అను పదములు విమర్శనీయములు.

1) అభ్యాసము : అనగా అలవాటు చేసుకొనుట అని అర్థము. దేనిని అలవాటు చేసుకొనుట? అదివరకు తనకు చేతగానిదానిని నేర్చుకొనుట. ఇందుకొంత శ్రమ, పట్టుదల కూడ ఇమిడియే యుండును. ఈ శ్లోకమునందు వేని నెట్లు అభ్యాసము చేయమన్నారు? "ఏకేవాఽ ద్వితీయోహం గురువాక్యేన నిశ్చితః" అని అంతకు పూర్వపు శ్లోకమలో చెప్పబడినది "నేను రెండవది లేని ఏకమాత్ర స్వరూపుడను" అని గురువాక్యముచే నిశ్చయించుకోమన్నారు. ఆ గురువాక్య మేదీ? "తత్వమసి" అను మహా వాక్యము. "గురువాక్యం యధాతధా" అన్నారు గదా! కనుక "నేనే ఆ ద్వితీయమగు ఏకవస్తువును" అని కేవలం నమ్మి నిమిషమాత్రము ఆవిధంగా అనుకొంటూ కూర్చుంటే సమాధి సిద్ధించునా? సిద్ధించునంటే మహావాక్య శ్రవణం చేసి నిమిషమాత్రమీయర్థమును భావించినచో ప్రతివాడును సర్వపాపములనుండి విడువబడి మోక్షము చెందవలసినదేగదా! అంతసులభసాధ్యమా ఆమోక్షము!

అవును, సులభసాధ్యమే. వాడు పూర్ణాధికారి యైతే సరి, మహ వాక్యార్థజ్ఞానము నిశ్చయమౌతుంది అనివారనవచ్చును. వాడు పూర్ణాధికారి( అనగా సాధనచతుష్టయసంపత్తి కల్గినవాడైనా) "గురువాక్యము నందు నిశ్చయజ్ఞానము కలుగవలెను. "తత్వమసి" వాక్యమునకు "అది నీవు అయితివి" అని అర్థము. శిష్యుడెంత అధికారి అయిననూ గురువు, త్వంపదార్థమును, తత్ పదార్థమును అనగా "నేను" అనే వస్తువేది? ఆ బ్రహ్మమేది? అని రెంటిని చూచి యీ "నేను" ఆ బ్రహ్మము" ఒకటే చూచుకో అని అఖండత్వమును చూపినగాని వాక్యార్థమునందు శిష్యునికి నిశ్చయజ్ఞానము కలుగజాలదు.

శ్లో॥ స్థావరం జంగమం వ్యాప్తం యత్కించి త్స చరాచరం
త్వంపదం దర్శితం యేన తస్మైశ్రీ గురువేనమః॥

శ్లో॥ అఖండ మండలాకారం వ్యాప్తం యేన చరాచరం॥
తత్ పదం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః

శ్లో॥ చిన్మయం వ్యాపితం సర్వం త్రైలోక్యం సచరాచరం॥
అసిత్వం దర్శితం యేన తస్మై శ్రీ గురవేనమః

అను గురుగీతా శ్లోకములలో యీ భావము విశదీకరించబడినది. ఆ విధంగా గురువు చూపిస్తేనే తత్, త్వం పదార్థముల ఏకత్వమును దర్శించి శిష్యుడు నిశ్చయజ్ఞానము గలవాడగును. అట్టి నిశ్చయ జ్ఞానముతో ఆ అఖండవస్తువునందు నిమిషము మనస్సు నిలిపినచో సమాధి

పొందగలడు. భేదదృష్టి కలవాటుపడిపోయిన తన మనశ్చక్షువులను అఖండాత్మ దృష్టిలో నుంచుకొనుటకై కొంత ఏకాగ్రతా సాధన అవసరము కనుక అభ్యాసము కావలెనన్నారు. అంతేగాని వాక్యమును ప్రసంఖ్యానము లేక జపము చేసినంత మాత్రమున ఏమియూ ప్రయోజనముండ జాలదు. "తజ్జప స్తదర్థ భావన" అని పతంజలి జపమనగా వస్తువును గూర్చిన భావనయే, తదేక ధ్యానమే జపము అని స్పష్టీకరించినారు. అంతేగాని, వాచిక, మానసికములచే వాక్యమును స్మరించుట జపము కానేరదు.

2) సమాధి : 'ధీ' అనగా బుద్ధి, బుద్ధికి సమత్వము కలుగుట, పంచేంద్రియములచే శబ్దాది విషయములను గుర్తించినంతకాలము బుద్ధికి భేదజ్ఞానమే సిద్ధము. ఆ పంచతన్మాత్రల యేకైక రూపమగు బ్రహ్మవస్తువును అవలోకించినపుడు విషయజ్ఞానముగాని భేదజ్ఞానముగాని వుండజాలదుగదా! సమాధి అనగా సమబుద్ధి సుఖదుఃఖాకారకములగు శీతోష్ణములు, లాభాలాభములు, జయాపజయములు మొదలగు సమస్తము నందును రాగద్వేషములు లేకుండుట సమబుద్ధి. అమృతము, విషము యీ రెండునూ యెంతో విరుద్ధఫలములనిచ్చు విరుద్ధ ధర్మములు గల భిన్న వస్తువులు, వీనియందు సమబుద్ధి యెట్లు కల్గును? ఆ రెండు విరుద్ధ వస్తువులయందున్న సామాన్య ధర్మమును గుర్తించినచో ఆ వైరుధ్యభావనపోయి సమబుద్ధి కల్గును. అమృతము, హాలాహలము రెండూ క్షీరసాగరమందు యుత్పన్నమైనవే కనుక కారణదృష్ట్యా ఆ రెండూ ఒకే క్షీరసాగరము యొక్క ద్వంద్వరూపములు అని తెలుసుకోగలము. వస్తుదృష్టిచేత ద్వంద్వ రూపముగా లేక నానాత్మకముగా దోచు సమస్తమూ కారణ దృష్ట్యా లేక ఆత్మదృష్ట్యా, ఆత్మయే గాని వేరుకాదు. అట్టి కారణరూపమగు ఆత్మస్వరూపమును గుర్తించినందుననే తనయందు నిఖిలభూతములందు నొకభంగి సమహితత్వంబున ప్రహ్లాదుడు నడువగల్గెను. గీతలోచెప్పినట్లుగా "సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం" అనగా సర్వమునందు సమంగా వున్న పరమాత్మను దర్శించినవాడు. అతడు మాత్రమే సుఖదుఃఖములను సమముగా చూడగలడు అట్టి స్థితియే సమాధిగా గాని, ముక్కు బిగించి గాలిమూటగట్టుట కాదు. గురుకృపచే అఖండాత్మదర్శనము చేసినవానికి యిట్టి సమాధి కరతలామలకమై యుండును. క్షణములో సమబుద్ధిపూనగల నేర్పున్నూ యుండును.

3) ఆజన్మజనితం పాపం : తల్లి గర్భమునుండి దేహం పుట్టిన దాదిగా చేసిన పాపములు అని సామాన్యార్థ మిచ్చుట యుద్దేశింపబడలేదు. నిజంగా విచారించినచో స్థూలశరీరముయొక్క విచారణ వేదాంతవిచారణ యందేమీ ప్రయోజనం కారి గాదు. జనన మరణాలు, బంధమోక్షాలు మొదలగునవన్ని పొందుచున్నానని అనుకొనే సూక్ష్మ శరీరవిచారణయే ముఖ్యంగా కావలసినది. అట్టి సూక్ష్మశరీరము పుట్టినప్పటి నుంచి, సంస్కార రూపముగా మనస్సునందు ముద్రింపబడి పేరుకొనియున్న కర్మరాశియంతా ఆ జన్మ జనిత పాపమనుమాటకు అర్థమని గ్రహించవలెను.

4) తత్క్షణాత్ : ఏక్షణమున జ్ఞానోదయమగునో ఆ క్షణమునకు పూర్వమున్న కర్మ సంస్కారములన్నియు జ్ఞానాగ్నిచే దగ్ధమైపోవును. యిది యెట్లు? "ప్రారబ్ధం భోగతో నశ్యేత్,

తత్త్వజ్ఞానేన సంచితం" అని చెప్పబడినది. గీతయందు భగవానుడు "జ్ఞానాగ్ని సర్వకర్మాణి భస్మసాత్ కురుతేతథా" అని సెలవిచ్చినాడు. ఐనను ఆ క్షణమునందే యెట్లు నశించును? అని శంక కలుగవచ్చును. అఖండాత్మ దర్శనము గావించినపుడు వానికి వ్యష్టిమనస్సుండునా? దేని యందు లగ్నతయగునో మనస్సు ఆ రూపమే వహించును. అఖండాత్మను దర్శించినపుడు మనస్సు ఆత్మస్వరూపముగా మారిపోవును గదా! అపుడిక మనస్సేది? అంతయు అఖండాత్మయే మనస్సే లేకుంటే దానియందుండే పాపసంస్కారములు మనస్సుతోనే నశించగలవు గాని మిగిలియుండునా? అఖండాత్మ దర్శన సంసిద్ధిచే సమబుద్ధి కల్గును. సంచిత రాశి యంతయు ఆ క్షణముననే దగ్ధమగును. అట్టి అఖండాత్మను వస్తునిశ్చయముగా శిష్యులకు తత్, త్వం, అసి, పద పదార్థములను దర్శింపచేయు మా గురుమూర్తి సగుణ నిర్గుణ రూపముల కివే మా ప్రణతులు.

శ్లో॥ తస్యావలోకనం ప్రాప్య సర్వసంగవివర్జితః
ఏకాకీ నిస్పృహ శ్శాంత స్థాతవ్యం తత్ప్రసాదతః ॥

తాత్పర్యము : గురుకృపా విశేషమున పరిపూర్ణ పరబ్రహ్మా వలోకనము చేసినవాడు. దేని యందునూ సంగములేక, తానే లేకపోవుటచే దేనియందునూ గుర్తు నిలుపక, శాంతుడై, సుస్థితుడై, స్థిరుడై (అచలుడై) యుండును.

విశేష వివరణము : 1) తస్యావలోకనం 2) ప్రాప్య 3) సర్వసంగ వివర్జితః 4) ఏకాకీ 5) నిస్పృహః 6) శాంతః 7) స్థాతవ్యం 8) తత్ప్రసాదతః అనువానినన్నిటిని వివరించి తెలుసు కోదగును.

1) తస్యావలోకనం = తస్య అనగా దాని యొక్క లేక అతని యొక్క అని అర్థము. తస్య అనగా గురుస్వరూపముయొక్క అవలోకనమా? లేక పరిపూర్ణ పరబ్రహ్మము యొక్క అవలోకనమా? అవలోకన మనగా చక్కగా చూచుట. చర్మచక్షువుచే గాకున్నను జ్ఞాన చక్షువుచే గురుపరమాత్మ స్వరూపం చూడదగినదే అయివున్నది. కనుకనే ఆత్మావారే ద్రష్టవ్యః............" అనిన్ని "మనసైవాను ద్రష్టవ్యం" అనిన్ని శ్రుతివాక్యములు పల్కుచున్నవి. ఐతే యిక్కడ మనస్సనగా శుద్ధ మనస్సు లేక అతీంద్రియమగు మనస్సు అనియే శ్రుతుల తాత్పర్యము. మరి పరిపూర్ణ పరబ్రహ్మమో! "న చక్షుర్గచ్ఛతి, నవాగ్గచ్ఛతి, నో మనః" అని చెప్పబడేది గనుక అది కంటికి, వాక్కుకు, శుద్ధ మనస్సునకు గూడ గోచరింపనిది. పరమాత్మ స్వరూప సాక్షాత్కారము పొందుటచేతనే నిస్సంగత్వము. నిస్పృహ, శాంతి అంతఃకరణ స్థిమితము గల్గునని స్థూలముగా గోచరించుచున్నది.

ఐతే, తస్య అనగా దేనిని వుద్దేశించి చెప్పబడినదో, అది పూర్వ శ్లోకమును గమనించిన తప్ప స్పష్టము కాదు. ఆ శ్లోకము

శ్లో॥ స్వయం బ్రహ్మమయోభూత్వాః తత్పరం చావలోకయేత్
పరాత్పరం నాఽన్యత్ సర్వగం తన్నిరామయం॥

అనగా తాను బ్రహ్మ స్వరూపుడై, ఆ పిదప ఆ తానైన బ్రహ్మమున కతీతముగానున్న

దానిని (పరిపూర్ణ పరబ్రహ్మమును) గూడ అవలోకనం చేయవలయును.

(ఈ శ్లోకముయొక్క విపుల వాఖ్య అన్యత్రా లోపల పేజీలలో నివ్వబడినది. అవలోక యేత్ అను శబ్దమే ప్రయోగింపబడినది. ఆ పూర్వ శ్లోకము దృష్ట్యా, తస్య అను శబ్దము పరిపూర్ణ పరబ్రహ్మమునకే వర్తించవలెను. కాని యిటీవల ముద్రింపబడిన పీఠ గ్రంథములలో "స్వయం బ్రహ్మమయోభూత్వా.........." అనే యీ శ్లోకమునకు పూర్వమే స్థిర లక్షణము అనే శీర్షిక క్రింద యీ "తస్యావలోకనం" అనే శ్లోకము, ముద్రింపబడినదేమి? అని యడుగవచ్చును. శీర్షికలు వేరేవేరే కూర్చుటలో అట్లు ముద్రింపబడినదేగాని, పూర్వ ప్రతులలో "స్వయం బ్రహ్మమయో భూత్వా" అనే శ్లోకమే మున్ముందు గాన వచ్చి వెంటనే తస్యావలోకనం ప్రాప్య.........అను శ్లోకము ముద్రింపబడి యున్నది.)

పరిపూర్ణము గానవచ్చునది కాదుగదా? అవలోకనమనే మాట దానికెట్లు సమన్వయింప వచ్చును?అని రెండవ శంక. దేనికిన్ని తెలియబడని ఆ అవిజ్ఞేయ బ్రహ్మ మొకటున్నదనుట సమంజసమెట్లౌను? అంటే, దాని కచల ఋషుల సమాధాన మేమనగా, ఆ పరిపూర్ణపరబ్రహ్మము యెరుకతో తెలియబడదు, గాని "లేనెరుకతో దాన్ని కనిపెట్టు" మంటున్నారు. అనగా యెరుకకు మూలముగాని వుండేటందుకు స్థానముగాని లేదని గురువాక్యరీత్యా దృఢనిశ్చయంచేసు కొన్నపుడు, వున్నదా పరిపూర్ణ పరబ్రహ్మమేనని పరోక్ష జ్ఞానము కల్గును. యెరుక విడచినపుడది అపరోక్షమే. అనగా యెరుక రహితమునందే ఆ పరిపూర్ణ పరబ్రహ్మ నిశ్చయ మన్నమాట. ఎరుక విడుచుట యెట్లు? అను ప్రశ్నకు "యెరుక తనకు దా వీడిపోదు యెరుకను విడిపించలేరు యెవ్వరు ధాత్రిన్ గురుడొకడుదప్ప" అంటూ "గురునికి పరిచర్య యొనర్చిన బోధపద్ధతి" గనుమన్నారు. అపరిచర్య వలన ఫలితము గురుకృప. గురుకృపవలననే 1) గురుపరమాత్మయొక్క స్వరూప సాక్షాత్కారము 2) యెరుక బంధము వీడి పోవుట 3) పరిపూర్ణ పరబ్రహ్మము స్వతస్సిద్ధమై అపరోక్షమగుట అనే ఈ మూడు కార్యములూ సఫలీకృతమగుచున్నవి. శ్రీకృష్ణదేశికేంద్రులవారు తమ కందార్థములలో "అపరోక్షమౌనె మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృపలేకన్" అని ప్రశ్నించి అందుకు జవాబుగా ఆ కందార్థములోనే " అపరోక్షమౌను మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృపకలుగా కీలిదె లేనియెరుక తాతొలుగా" అని చెప్పుచు "విపరీతమౌ బుద్ధి విడచి నీవిప్పుడు, వుపచారములు చేయుచుండు మా గురునికీ అని ఆదేశిస్తున్నారు. శ్రుతి "పూర్ణమదః పూర్ణమిదం.........." అనే శ్రుతిలో ప్రత్యక్షముగా గానవస్తూవున్న "ఇదం" శబ్ద వాచ్యమగు శుద్ధ యెరుక విడిచినచో పూర్ణమదంః అని చెప్పబడిన పరోక్ష పూర్ణము (పరిపూర్ణ పరబ్రహ్మమే) స్వతస్సిద్ధమై అపరోక్షము (వున్నదే అది గనుక) కాగలదన్నమాట.

2) "ప్రాప్య" అనుటచే అవలోకనమేగాని ప్రాప్తించవలసియున్నది. ఆ పరిపూర్ణ పరబ్రహ్మము క్రొత్తగా ప్రాప్తించవలసిన అవసరములేదు. ఏలననగా ఆ పరిపూర్ణము నిత్య ప్రాప్తము, స్వతస్సిద్ధమూనై యున్నది. దాని కన్యముగా నిజంగా యే వస్తువూ లేనే లేదు. ఎరుక (తాను) అనే తెరయే అవరోధంగా నున్నది. ఆ ఆవరణ రహితమునందు, పరిపూర్ణబ్రహ్మము

యొక్క నిశ్చయమైన యునికి అరూఢమగుచున్నది. ఆ విధముగా లేనెరుకకు దాని యవలో లోకనము సిద్ధించవలసి యున్నది. ఎంత నడివర్షాకాలములోనైనా మేఘము చాటున సూర్యుడుండనేయున్నాడు. సూర్యుడు క్రొత్తగా వుదయించవలసిన పనిలేదు. మేఘావరణము వలన సూర్యుని అవలోకనము మాత్రము జరుగుటలేదు. కనుక ప్రాప్తించవలసి నది అవలోకనము మాత్రమే. పరిపూర్ణము సాధనానంతర నిరపేక్షకము.

సాధారణముగా, ఏ వస్తువునైననూ చక్కగా నవలోకనము చేయునపుడు, చూచువాడు, చూపు, చూడబడిన వస్తువు ( ద్రష్టా దృక్ దృశ్యములు) అని త్రిపుటి వుండదు. తానూ, తన మనస్సూ వస్తురూపమే అయిపోవును. కాని పరిపూర్ణ పరబ్రహ్మావలోనములో తానే లేడు. అపుడు ఏకమూ అనేకమూ అనే నిర్ణయమున్నూలేదు.

3) సర్వసంగ వివర్జిత : సంగము అనగా ప్రేమపూర్వకమగు కూడిక. యిదియే రాగము అనబడును. విషయములయందు ప్రేమచేతనే వాని యందు, రాగము ఏర్పడుచున్నది. తదన్య విషయములయందు ద్వేషమున్ను కల్గుచున్నది. "ఆత్మవస్తు కామాయఃసర్వం ప్రియం భవతి" ఆత్మయందలి ప్రేమయే రాగమునకు కారణము. అనాత్మ వస్తువులని చెప్పబడేవాని యందు ద్వేషమును కలుగుచున్నది. కనుక రాగద్వేషముల రెంటికి ఆత్మయందలి ప్రేమయే కారణముగా నున్నది. సర్వసంగ వివర్జితః అనగా సర్వవస్తువులయందు రాగద్వేషములనుండి విడువబడుట మాత్రమేకాదు. సర్వసంగకారణమైన ఆత్మాభిమానము నుండి విడువబడుట అని అర్థము గ్రహించవలసివున్నదని "సర్వ" శబ్ద ప్రయోగము సూచించుచున్నది. సర్వమునకూ సర్వభ్రాంతులకూ, సర్వసంగమునకూ అత్యంత మూలకారణమైన ఆత్మయందలి అభిమానము పరిపూర్ణ బోధ సిద్ధాంతమువలన గాక మరియొక విధంగా నివర్తించదు. ఆ సిద్ధాంతాను సారముగా ఆత్మాతీతమైన కేవలాత్మ యొక్క అవలోకనముచేతనే ఆత్మయందలి సంగము (లేక ఎరుక భ్రాంతి) నశించును. ఆ అవలోకనము ప్రాప్తించుట చేత సర్వసంగ వివర్జితమగు చున్నది. తాను దాని పట్టునుండి విడిపించుకొనుట తనకు సాధ్యముకాదు. ఒక కఱ్ఱ వరదవెల్లువలో కొట్టుకొని పోవుచున్నదని భావించి ఈదుకొనిపోయి దాని నొకడు పట్టినాడు. అది నిజమైన దుంగకాదు. అదియొక యెలుగుబంటి "ముందు సుడిగుండమున్నది. దానిని వదలి రమ్మని" ఒడ్డునుండి జనం కేకలు వేస్తుండగా నేను దానిని వదలవలెనన్నా అది నన్ను వదలుట లేదని ఈతగాడు రోదనముచేస్తున్నట్లుగా తాను విడిపించుకొందామనుకొన్నా యెరుక భ్రాంతి నుండి స్వయంగా తప్పించుకొనలేడు, అదియే తనను వదలి పెట్టవలె పరిపూర్ణ పరబ్రహ్మావలోకనమునే అది నిర్వీర్యమైనపుడే దాని పట్టు వదలి పోవును. అందుచేతనే "వివర్జితః" అనగా "వదలి పెట్టబడినవాడై" అని యీ శ్లోక ముద్ఘాటించుచున్నది.

వస్తువుయొక్క అనిత్య భావనవల్ల వస్తువుయందు ప్రేమపోదు. ఆ కానవచ్చే వస్తువు కూడా తానే అనే భావనవల్ల "యిదం" వృత్తి మాత్రమే (నానాత్వ రూపమగు ప్రపంచ దృష్టి) పోవును. కాని "యిదం" వృత్తి నాశనమువల్ల "అహం" వృత్తి (అనగా సర్వం నేననే తలంపు) పోదు. ఐతే "అహంవృత్తి" రహితమైతే "యిదం" వృత్తి ఆనాడే నశిస్తుంది. అహంవృత్తి అంటే

నేను నేనను అహంకారము మాత్రమేగాదు. దానికి కారణమైన "బ్రహ్మోహం" అనే బ్రహ్మాకార వృత్తి కూడా లేకపోయినపుడే అహంవృత్తి కత్యంత నాశనము. ఇట్టి అహంవృత్తి పరిపూర్ణ బోధచేగాని రహితం గాదు. పరిపూర్ణ బ్రహ్మావలోకనమువలన మాత్రమే సర్వసంగ వివర్జితుడగుచున్నాడు.

ఏకాకీ : అనగా వంటరివాడని శబ్దార్థము. ఏకాంతమునందున్నవాడు ఏకాకి. అన్యములేనిది ఏకాంతము. కాని అపుడుగూడ అన్యము లేదని గుర్తించిన తానుమాత్రమున్నాడు. తోచబడు నానాత్వమంతయు తానే అని ఏకమాత్రుడై ఏ సంకల్పము లేకుండుటే ఏకాంతమని, అట్టివాడే ఏకాకియని సామాన్యార్థము. ఏక + అంతము = ఏకాంతము. అనగా ఆ ఒక్కడైన తాను లేనని ఆరూఢత జెంది అశరీరస్థితిలో నున్న పరిపూర్ణ భావజ్ఞుడే నిజమైన ఏకాంత స్థితియందున్నవాడు. అట్టివాడే ఏకాకి అని అర్థము గ్రహించవలసియున్నది.

నిస్పృహ = అనగా కోరిక లేకయుండుట దేనియందునూ ఆశలేకుండుటే నిస్పృహ. యితడే వైరాగ్యపరుడు అంటున్నారు. కాని ఏగుర్తుచే సర్వ కోరికలను విడచినాడో ఆ గుర్తు (తెలివి) మాత్రమున్నది. స్పృహ అనగా గుర్తె. స్పృహయే లేకుండుటే నిస్పృహగాని గుర్తువుండి దేనినీ కోరకుండా వూరుకొనుటే నిస్పృహగాదు. అన్ని కోరికలు తన యాత్మయందు తనకున్న ప్రేమ చేతనకలుగునని " ఆత్మ వస్తు కామాయ సర్వం ప్రియంభవతి" అని శ్రుతి చెప్పుచున్నది. కారణ రూపమైన ఆత్మ ప్రేమ వదలక, కార్యరూపమైన నానావస్తు భోగమునందలి ప్రేమవదలుట మార్గముకాదు. అయితే నిస్పృహ అంటే నిద్రా, మూర్ఛా, సమాధి, మరణదశలలో స్పృహ గోల్పొవుట వంటిస్థితి అనిభావించ రాదు. నిర్+స్పృహ = నిస్పృహ. స్పృహవుండియు తనయందు గాని అన్యము నందుగాని తన గుర్తు లగ్నముగాక నిర్వీర్యమైయుండు విలక్షణస్థితియే నిస్పృహ. "ఇవి ఎండమావులు, దీనియందు నీరులేదు" అని నిర్ణయము గాని 'ఇవి నీళ్లు. దాహ శాంతి చేసుకొనవచ్చు" ననే నిర్ణయముగాని రెండునూ లేకయుండుటే నిస్పృహ. "ఇది ప్రపంచము, దీనియందలి విషయములు భోగ్యములు" అనియూ తలంచడు. "ఇది నాకన్న అభిన్నము నేనే ఆనందరూపుడనైన బ్రహ్మమునైయున్నాను. నాకు విషయానందమేల" అని వైరాగ్యమున్నూ పూనడు. యీ విధముగ "ఏ నిర్ణయమును సేయడు. నేనని మహాత్ముడెపుడు నేనను వాడే నానావిధాల వదరును నేనను తనవంటివారి నెప్పుడుగనినన్" అన్నారు కృష్ణదేశికేంద్రులు నిర్ణయమే మహాపాపమన్నారు శ్రీ శివరామ దీక్షితులవారు. పరిపూర్ణావలోకనము గావించిన మహాత్ముడు ఏ నిర్ణయము చేయకవుండును. అదియే నిస్పృహ శబ్దమున కర్థమని గ్రహించవలెను.

"శాంతః" = అనగా శాంతము కలవాడు. శాంతి అనేది అంతఃకరణము యొక్క సాత్విక వృత్తి. అంతరింద్రియ నిగ్రహ రూపమగు శమము కల్గినవానికే శాంత స్థితి లభించును. అంతరింద్రి యములలో ప్రధానమగు మనస్సు యుద్రేక రహితమై దాని లక్షణము లన్నియు వుపశమించుటే శాంతి, మనస్సునకీ యుద్రేక లక్షణములెట్లు కలుగుచున్నవి? జ్ఞానేంద్రియ ములచే విషయపంచకమును యీ మనస్సు గుర్తించుచూ, వానియందలి మాధుర్య మును గూర్చి చింతించుటే అశాంతికి ప్రథమ కారణము. భగవద్గీత.

శ్లో॥ ధ్యాయతో విషయాన్ పుంసః సంగస్తేషూపజాయతే
సంగాత్సంజాయతేకామ, కామాఃత్క్రోధోభిజాయతే॥

అని ప్రారంభించి విషయచింతనవలన సంగమును, సంగమువలన కామమును, కామమువలన క్రోధమును కల్గును. క్రోధమువలన, సమ్మోహము, సమ్మోహంవలన స్మృతి భ్రంశము, స్మృతి భ్రంశము వలన బుద్ధి నాశము, బుద్ది నాశము వలన సర్వనాశనము సంభవించునని భగవద్గీత వుద్ఘాటించుచున్నది. ఇన్నిటికి మనస్సు జ్ఞానేంద్రియములచే విషయ పంచకమును గుర్తించుట మూలకారణమైయున్నది. యీ వ్యష్టి మనస్సునకు మూలకారణము అధిష్ఠానము అగు సమిష్టిమనోరూపమగు గుర్తే లేక శుద్ధ యెరుకే కారణంగా వున్నది. దానిని, పరిపూర్ణ బ్రహ్మావలోకనముతో నిర్వీర్య మొనర్చిననే తప్ప అంతఃకరణమునకు శాంతి లభించదు. ఆ పరిపూర్ణ బ్రహ్మమును 'చూస్తూనే యెరుక పారిపోవునురా'' అనిన్ని, "పోయిన యెరుక మళ్లీ, మళ్లేనా?'' అనిన్ని శ్రీకృష్ణదేశికేంద్రులు శెలవిస్తున్నారు. ఆ విధంగా పోయిన యెరుక మరల రానిచో ఆ పరిపూర్ణ భావజ్ఞుడు వ్యవహార మెట్లు చేయగలడు? నామమాత్రావశిష్టముగా తనయందున్న గుర్తునకు పరిపూర్ణ పరబ్రహ్మమునందు మూలమే లేదు. కొనకు ప్రవేశించు టందుకు స్థానమే లేదు అనే నిశ్చయంపై నాతడు విషయములందు వర్తిస్తున్నా విషయములాతని నంటవు. వస్తువులను గుర్తించునేగాని వస్తువునందలి శబ్దాది విషయములందాతని గుర్తుండదు. ఎట్లనగ్గా పంచదారను గుర్తించునేగాని దాని యందలి రసమాధుర్యముపై గుర్తుండదు. శబ్దాది విషయములందే వైరాగ్యముగాని వస్తువులయందు వైరాగ్యములేదు. యిదియే రాజయోగ లక్షణము. సీ॥ జలజపత్రమునందు సలిలమంటనియట్లు..........'' అంటూ భద్రాద్రిరామ శతకమునందు చెప్పబడినరీతిగా పరిపూర్ణ భావజ్ఞుడైన రాజయోగీ "అఖిల వ్యవహారములుచేసి అంటడధిప'' అని గుర్తెరుంగవలెను.

ఇదియే పరమశాంతి. యిట్టి పరమశాంతి పరిపూర్ణ బోధయందారూఢుడైనవానికే సాధ్యము. స్వస్వరూప సాక్షాత్కార మాత్రమున యీ పరమశాంతి లభించదు. తాత్కాలిక శాంతి స్థితి మాత్రమే చేకూరును. ఏలననగా యీ స్థితికి ఒకచ్యుతి, తదనంతము గతియు సహజములై యున్నవి. ఎట్లనగా సృష్టికారణమగు నా పరమాత్మ సృష్టికి పూర్వము అచలమై శాంతస్థితి గలిగియున్నమాట నిజమేగాని దానికి సృష్టి సంకల్ప రూపమైన చలనదృష్టి కలుగుచున్నది. ద్వంద్వ రూపమగు చలాచలములు రెండూ దానికి సహజములే. కొండశిఖరము పైనున్న గుండ్రాయి అచలస్థితిలోనున్నా, ఒకప్పుడు ఏదోకారణమున చలించినచో ఏమి జరుగును? దానికి స్థితి భంగమై చ్యుతికల్గి ఒకగతి (ప్రయాణం) ఏర్పడిన క్రమశఃవేగముపుంజుకొని దారిలోనున్న యింకా పెద్దరాళ్లను గూడా నెట్టుకొని అధోగతి పొందగలదు. అట్లే అచలమై ఏకమై, శాంతమైయున్న పరమాత్మ చలన రూపమగు సృష్టి సంకల్పముతో అనేకమై అశాంతి కాలవాలమైపోవుచున్నది.

అశాంతి లక్షణము నెన్నడును కలుగని దొక్క పరిపూర్ణము మాత్రమే. దానియందన్య

వస్తువు బీజరూపంగానైనలేదు. అశాంతి కారణములగు పంచతన్మాత్రలు లేశమైన వాని యందులేవు. పరిపూర్ణ బోధ నారూఢపరచుకొని అశరీరస్థితియందున్న మహాత్ములకే యిట్టి పరమశాంతి లభించును.

స్థాతవ్యం = పైన చెప్పిన పరమశాంతి యందు సుస్థిరుడై యుండవలెనన్నమాట, అట్టి సుస్థిరత. పరిపూర్ణబోధ యారూఢమై సమిష్టి వ్యష్టి రూపమగు అంతఃకరణ పరిపూర్ణ పరబ్రహ్మయందు యెన్నడూ పుట్టనేలేదని నిరసనగల్గిననాడే లభించును. "నీనీడయందుండి యొక్క భూతము నిను వెన్నంటి వచ్చుచున్నది. దాని నిపుడు నా మంత్ర శక్తిచే తరిమివేసితిని" అని భూతవైద్యుడు చెప్పె మాటలు నిర్భయత్వము కలిగింపజాలవు. ఏలననగా మరల నాభూతము తిరిగి రావచ్చును కాని భూతములు అసలేలేవు. నీ భ్రాంతి మాత్రమే నని ఋజువు చేసుకొని సంతుష్టుడైనవాడే వానికి నిర్భయత్వము సిద్ధింపగలదు. ఎరుక పుట్టనేలేదు. అని స్థిరపరచుకొన్న వానికి గాక భ్రాంతి రహితమైన సుస్థిరశాంతి కలుగనేరదు. అంతఃకరణమును మిగుల్చుకొని "విషయ సంస్కారములు పోవలెను. తిరిగి యెట్టి సంస్కారములు కలుగకూడదు" అని ఆశించుట బెల్లపుగడ్డ యిక్కడే వుండవలెను. కాని ఈగలు ముసరరాదు అని ఆశించినట్లే కాగలదు. "ఎరుకొక్కటుండెనేనియు, యెరుకే యీ విశ్వరూప మేర్పడ దాల్చున్" అన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు యెరుక యొక్క భ్రాంతి రహితము నందే పరిపూర్ణ బ్రహ్మయొక్క అవలోకనము తత్ఫలరూపమగు పరమశాంతి లభించగలదు.

"తత్ప్రసాదతః" అనగా తత్‌శబ్ద వాచ్యమైన పరబ్రహ్మము (లేక గురుపరమాత్మ) యొక్క అనుగ్రహ విశేషము. అదియే గురుకృప. ఆ గురుకృపా సంసిద్ధి వొక్కటుంటే శాస్త్రకృప (వేదకృప) ఆత్మకృప (సంపూర్ణారోగ్యము లేక ఆధ్యాత్మిక తాపనివృత్తి) దైవ కృప (ఆదిదైవిక తాపనివృత్తి) మొదలగు అన్ని కృపలున్ను గలుగగలవు.

అహరహము గురుసేవ గురునిష్టలయందు సుస్థిరత్వముకల్గి కృషిచేయు శక్తి సామర్థ్యములు మనకందరికి ప్రసాదించమని సగుణ నిర్గుణ రూపమగు గురుపరమాత్మను ప్రార్థించుచున్నాము.

శ్లో॥ సర్వజ్ఞ పదమిత్యాహు ర్దేహీ సర్వమయోభువి
సదాౖ ౖనంద స్సదాశాంతో రమతే యత్రకుత్రచిత్॥

తాత్పర్యము : తానే సర్వమయుడై, శాంత్యానందములకు నిలయుడై, సోపాధిక నిరుపాధికముల యందు సర్వత్ర నిండి క్రీడించుచున్నానని ఆరూఢత గల్గియుండుటయే సర్వజ్ఞత్వ పదమని చెప్పబడుచున్నది.

విశేష వివరణము : 1) సర్వజ్ఞ పదము 2) దేహీ సర్వమయోభువి 3) సదానంద స్సదాశాంతో 4) రమతే 5) యత్రకుత్రచిత్ అనువానిని గూర్చి విచారించదగును.

1) సర్వజ్ఞ పదము : సర్వమును తెలిసికొనగల్గియుండుటయే సర్వజ్ఞత పదమనగా స్థానము, జీవుడు కించిజ్ఞుడనియు, ఈశ్వరుడు సర్వజ్ఞుడనియు చెప్పబడుచున్నది. ఈశ్వర స్థానమే

సర్వజ్ఞ పదమని స్థూలముగా చెప్పవచ్చును. ఆ యీశ్వరుడెవరు. అతని స్థానమేది? "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశేఽ ర్జున తిష్ఠతి" అంటూ భగవద్గీత చెప్పుచున్నది. హృదయ ప్రదేశముల యందు మాత్రమే వుండి యితర చోట్ల లేడా?

"వికార రహితేవ ఈశ్వరః" ఏ వికారములు లేనివాడీశ్వరుడని అర్థము. శుభాశుభ సంకల్పములు, నామరూపాత్మక పరిణామము మొదలగునవన్నియు వికారములేగదా! హృద్దే శములు (అంతఃకరణములు) అనేక జన్మ వాసనా వాసితములై సర్వ సంకల్పములకు మూల స్థానములై యున్నవిగదా! వికార రహితుడు సర్వ వికారముల కాలవాలములగు స్థానములను తాను కాపురముండుటకు యెన్నుకొనునా!

ఏ వికారములూ గోచరించని స్థితి సృష్టికారణమైన బ్రహ్మము నందే కలదు. అది సృష్టికి పూర్వము, ఏకమూ సర్వవికార కారణములు తనయందు నిగూఢంగా బీజరూపంగా నున్ననూ, నిస్సంకల్ప రూపంలో నున్నది. సృష్టికాలమున తాను వికారములు చెందకనే తన సంకల్పముచే తనయందు నిగూఢముగానున్న వికార భూయిష్టములగు సర్వనామరూపములను ప్రకటపరచుచు ఈశ్వరుడని పేరొందినది. ఇదే అవికృత పరిణామము. ఆ యీశ్వరుడే సర్వజ్ఞుడు. అతడే సర్వజ్ఞపదమున్ను అయివున్నాడు.

"బ్రహ్మైవేదమగ్ర ఆసీత్" సృష్టికి పూర్వమున్నది బ్రహ్మము. సృష్టి సంకల్పమే కలుగని యా బ్రాహ్మీస్థితిని సర్వజ్ఞ పదమని యనరాదు గదా! సృష్టికి పూర్వము జీవుల ప్రసక్తియే లేదు. కనుక హృదయ క్షేత్రములున్నూ వుండవు. తన సంకల్పమే సృష్టి రూపం వహించినది. "తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్" ఆ సృష్టియందు తానే జీవరూపంగా క్రొత్తగా ప్రవేశించెను అని అర్థము చెప్పరాదు. ప్రవేశమని యనలేదు. అనుప్రవేశమన్నారు. అనుప్రవేశమనగా, తిరిగి మరొకమారు ప్రవేశించుట యని అర్థము. తన సంకల్పమే వుపాధులుగా రూపొందగా ఆ వుపాధులకు తన సంకల్ప రూపమైన తెలివిని గూడ అనుగ్రహించుటయే అనుప్రవేశము.

ఆ తెలివియే, హృత్ + అయం హృదయం. హృద్దేశేఽ ర్జున తిష్ఠతి" ఆ యీశ్వరుడే సర్వమునకు హృదయం అయివున్నాడు. హృదయం అనగా అంతఃకరణ స్థానమని అర్థము చెప్పినచో సరిపోదు. జీవుల వాసనా వాసితమగు అంతఃకరణము ఆ హృదయమును, మావి గర్భస్థ శిశువును ఆవరించినట్లు ఆవరించి యుండుటచే ఆ సర్వజ్ఞత మరుగుపడి నిర్వీర్యమైనది. మసికమ్మిన చిమ్నీ దీప ప్రకాశమును మరుగునపరచినట్లే యని తెలియవలెను. అందుచే జీవుడు స్వరూప విస్మృతిచెంది కించిజ్ఞుడైనాడు. స్వస్వరూప జాగృతి యందు సర్వజ్ఞత్వము ఏతత్ విస్మృతి యందు కించిజ్ఞత కలుగుచున్నవి. స్వరూప విస్మృతి చెందకపోతే యీశ్వరుడే విస్మృతి చెందితే జీవుడు మాత్రమే. ఎన్ని వుపాధులయందున్నా హృద్రూపమగు ఆ యీశ్వర చైతన్య మేకమే కనుక ఏకజీవవాదము ప్రవర్తిల్లినది. "ప్రజ్ఞానం బ్రహ్మ" యని మహావాక్యము గదా!

ఉపాధియందున్ననూ స్వరూప జ్ఞానము కోల్పోనిచో అపుడు ఇతర జీవుల ప్రసక్తియే లేదు. తానే యీశ్వరుడు సర్వజ్ఞుడు తన సంకల్పమే సకలోపాధులైన విషయం గుర్తెరిగి, వారి

సర్వసంకల్పములకు తన సంకల్పములకు. తన ఆది సంకల్పమే ఆధారము, అధిష్టానము కనుక అంతయు ఏక చైతన్యధారయే అని గుర్తెగుటయే సర్వజ్ఞత. యీ చైతన్యము, లేక తెలివి (జ్ఞానము) విశేషముగా గల్గియున్న మానవోపాధియందే సర్వజ్ఞత సాధింపదగియున్నది. "ఉత్తమఃపురుషస్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః యోలోక త్రయమావిత్యభివర్త్యవ్యయ యీశ్వరః" భ.గీ. ఉత్తమ పురుషుడని అవ్యయుడని, ఈశ్వరుడని, పరమాత్మయని పేరొందుచూ మూడు లోకములూ నిండి సర్వమునూ ధరించి భరించునదీ సర్వజ్ఞ లక్షణోపేతమగు పరమ తత్వమే. ఇదే త్రిపురుషైక పురుషుడు. కూటస్తుడగు అక్షర పురుషుడే పూర్వ దృష్టిచే పురుషోత్తముడూ, అధో దృష్టిచే క్షరపురుషుడూ అని పిలువబడుచున్నాడు.

పురుషుడు వేరు, అతని స్థానము వేరు, అను భావనయే దూష్యము, ఏలననగా స్థాన మిచ్చిన వస్తువు. ఆ పురుషుని కంటె పెద్దది కావలసివచ్చును. పురుషుని కేకదేశీయతయున్ను చెప్పవలసివుండును. పదము అను శబ్దమునకు స్థానము అను అర్థమున్ననూ, సర్వవ్యాపకుడగు పురుషునికి వేరే స్థాన నిర్ణయమంటూ చెప్పరాదు. అతడే సర్వజ్ఞుడు, సర్వజ్ఞ పదమున్ను అయివున్నాడు. సర్వజ్ఞ పదమనగా సర్వజ్ఞ హోదా లేక బిరుదు అని అర్థము చెప్పనగును. "సర్వతఃపాణిపాదస్తుసర్వతోక్షి శిరోముఖం............" అని అతడభి వర్ణింపబడుటకు కారణమేమి? అతనికి మనకున్నటువంటి శరీరము, చేతులు కాళ్లు కన్నులు శిరస్సు ముఖము చెవులు యిత్యాదిగా అవయవములు యింద్రియములూ వున్నవని చెప్పుట కాదు. అంతటనూ అతని నేత్రములే అయితే తప్ప సర్వమునూ ఒకేసారి అతడెట్లు చూడగలడు? అంతటనూ అతని చెవులుంటే తప్ప అతడెట్లు సర్వమును వినగల్గును? కనుక అలంకారికముగా అట్లు చెప్పబడినది. అంతటా అతని గుర్తెరిగే జ్ఞానమున్నదని మాత్రమే అర్థము గ్రహింపవలెను. అది అఖండ జ్ఞానము. మనది వ్యష్టి జ్ఞానము ఏదో ఒక అత్యల్ప స్థానమున నున్న శబ్దాదులయందు ప్రత్యేకముగా కేంద్రీకృతమైనపుడే దానిని, మనము సమగ్రముగా గుర్తింపగలము. ఉదాహరణకు : కొంత ప్రదేశమునకు వ్యాప్తమైయున్న ఒక సుందర దృశ్యము యొక్క అవలోకనము మన కానందము గల్గించును. కాని ఆ సుందర దృశ్యములోనియే ఒక భాగము యొక్క సంపూర్ణ సౌందర్య వివరణమునైనను మనము సంపూర్ణముగా అభివర్ణింపలేముగదా! ఒక గోడ చాటైతే ఆవలి విషయము అసలే గుర్తింపలేముకదా! మన జ్ఞానము,మన శక్తి యుక్తులు, మన లోపల బంధించిన సమస్తమూ పరిమితములే. కాని ఆ సర్వజ్ఞమూర్తి గోచరాగోచరమగు సమస్తమునూ ఏకకాలమున అవగతము చేసుకొనును. అతని జ్ఞాన మనంతము అపరిమితము. అతడు చిద్ఘనుడు. మనది క్షరపురుష స్థానము. అతడో అక్షర పురుషుడు పూర్ధ్వ దృష్టిచే పురుషోత్తముడు. అతడు అనుటలో పుంలింగ స్వరూపుడుగాడు వ్యక్తియే గాడు. అదియొక పరమ తత్వము మాత్రమే. అదే సర్వజ్ఞ పదము.

పదమను పదమునకు (మాట)కు నానార్థములున్నవి పదమను మాటకు, పాదము (కాలు), మాట, స్థానము, హోదా(పదవి) యిత్యాది అర్థములున్నవి. పాదము (కాలు) అను అర్థము గ్రహిస్తే మానవునికున్నవి రెండు పాదములు. సర్వజ్ఞ లక్షణయుతమగు అఖండ

జ్ఞానశక్తి యొక్క పాదమును, శక్తి (సర్వశక్తివంతుడు) మరొక పాదముగాను చెప్పుకొనవచ్చును. ఇవే రసబలములు, శివశక్తులు, జ్ఞాన క్రియలు, పురుష ప్రకృతులు, యెరుక మరుపులుగా వర్ణింపబడినవి. పాదమనగా నాలుగవ భాగము శ్రుతి. "పాదోస్య విశ్వాభూతాని. త్రిపాదస్యా మృతందివి" ఒక భాగమే విశ్వరూపం కాగా, మిగతా మూడు భాగములు అమృతస్వరూపము అయివున్నవని కూడా చెప్పబడినది. విద్యాపాదము, అవిద్యాపాదము, ఆనందపాదము, తురీయపాదమని నాలుగు పాదములు చెప్పబడినవి. యీ అర్థములో సర్వజ్ఞత్వము సగభాగమో, లేక మూడు భాగములో అయివున్నదని యనవలెను. పదమనగా, మాట అనే అర్థములో సర్వజ్ఞ పదమనగా సర్వజ్ఞ యనే మాట (పలుకు) అని అర్థము గ్రహించవలెను. మరియు పర, పశ్యంతి, మధ్యమ, వైఖరి అనే వాక్కులు శబ్దరూపములై జ్ఞాన పరిణామములై యున్నవి. ఆసర్వజ్ఞుడే ధ్వన్యాత్మక వర్ణాత్మక సకల శబ్దములూగూడనై మూలమునందు ప్రణవ స్వరూపమైయున్నాడు. స్థానము, హోదా అను అర్థములు ముందే గ్రహించియున్నాము. ఏ అర్థములో గ్రహించినా సర్వజ్ఞ పదము గుర్తెరిగే జ్ఞాన స్వరూపమైన పరమాత్మ యెడలనే సార్థక మగుచున్నది.

2) దేహీసర్వమయోభువి : సర్వజ్ఞ లక్షణములు యిక మిగతా శ్లోక భాగములో వర్ణింపబడినవి. అందు మొదటిది, దేహీ, యీ ప్రపంచమందు సర్వమయుడై వున్నాడని గుర్తిం చుట. దేహమంతటా దేహి పూర్తిగా వ్యాపకత్వము చెందియున్ననూ, అతని అభివ్యక్త స్థానము లుగా మాత్రమే సహస్రార, ఆజ్ఞా, అనాహత చక్రస్థానములు పేర్కొనబడినవి. అంతమాత్రమున గుర్తెరిగే తెలివి రూపమైన దేహీ ఆ స్థానములయందు మాత్రమే వుండి, మిగతా దేహముల యందు లేడని చెప్పరాదు. "దేహికావరణమై దేహమాయె" ననుటలో దేహ మొక పెట్టెవలె వుంటే, అందు ఏ మూలనో మధ్యనో దేహియున్నాడని యెంచరాదు. గుర్తులేక దేహము నిల్వదు, దేహములేక గుర్తురూపమగు దేహి తెలియబడదు. దేహీదేహములు అవినాభావ సంబంధములై యున్నవి. యీ విషయము, అధిష్టాన స్థానమున విచారణ చేసిన వారికే సుబోధ్య ము, సర్వమునందూ దేహి వ్యాపించి యున్నాడని తెలియుట సర్వజ్ఞత్వ పదవి యధిరోహించిన వాని లక్షణములలో నొకటి మానవాశ్వగవాది మశక పిపిలి కాంతము వ్యాపించి ప్రజ్ఞానమని పేరు పొందిన సమిష్టి చైతన్యమే దేహి యను మాటలో వుపలక్షితమైనది. "సర్వమయోభువి" అనగా విశ్వమంతటా వ్యాపించిన విష్ణుమూర్తి సర్వచైతన్య మూర్తి. సద్గురుమూర్తి సర్వజ్ఞ పదవాచ్యుడై యున్నాడు. "సర్వం విష్ణుమయం జగత్" అన్ననూ "దేహీ సర్వ మయోభువి" యన్ననూ ఒకటిగానే గుర్తించవలెను. మయ యనగా అది తప్ప అన్యమేమీ లేదన్నమాట. బెల్లం తీపిమయం అంటే బెల్లమునందు తీపి తప్ప అన్యమేమీ లేదన్నమాట. చిన్మయం అన్నా దేహీసర్వమయంభువిఅన్నా అంతే, దేహి రూపనామముల మార్పుచే దేహమైనాడు, సర్వ నామ రూపములూ కూడా అంతే, అంతా చిద్ఘనమే. అంతా యెరుకే అన్నీ యెరుకే, మరుపు కూడా యెరుక మారురూపమే. అంతా యెరుక విలాసమే, అన్న మాట లీదృష్టిలోనే సార్థకములు.

3) సదానంద స్సదాశాంతో : శాంతి ఆనందములను మాటలను యిదివరలో వివరించుట జరిగినది. సర్వసుఖ దుఃఖములకు అశాంతికి అలవాలమయినది వ్యష్టి అంతఃకరణము. శుద్ధ చైతన్యమును ఆవరించుటచే ప్రాణులకు సుఖదుఃఖములు అశాంతి కారణములగు భయాం దోళనలు కలుగుచున్నవి. సర్వనామ స్వరూపములతోబాటు, అంతఃకరణము (లోపలి పనిముట్టు) గూడ, అఖండ చిత్స్వరూపము యొక్క మారురూపమేనని తెలుసుకొన్న సర్వజ్ఞునికి అంతఃకరణ ధర్మములైన కామ, క్రోధ, లోభ, మోహ, భయము లెట్లు బాధించును? తన స్వరూపముకన్న భిన్నమయినదేమీ నిజంగా లేనేలేదని ఆరూఢమయిన సర్వజ్ఞుడు దేనిని కోరును? దేనిని విడచును? దేని యెడల కోపించును? అట్టి వానికి అంతఃకరణముగాని, దాని ధర్మములు గాని లేనేలేవు. ఆ స్థితియే ఆనందము. అపుడే పరమశాంతి.

4) యత్రకుత్రచిత్ : అనగా ఏక్కడెక్కడున్నా క్రీడించినా లేక విహరించినా, అతని కెట్టి వికారములు గలుగవన్నమాట. సర్వజ్ఞుడైన అట్టి పూర్ణ పురుషుడు యెందున్నా అతని శాంత్యానందములకు భంగము కలుగనేరదు. అతడు సంసారమును త్యజించనక్కరలేదు. తపోవనములకు గాని పుణ్యక్షేత్రములకు గాని పోయి అట నివాస మేర్పరుచుకోనక్కరలేదు. అతడున్న చోటే కాశీప్రయాగ రామేశ్వరాది పుణ్యక్షేత్రములతో సమానము. క్షేత్ర పవిత్రతను బట్టి ఏ వ్యక్తికే పవిత్రత రాజాలదు. వ్యక్తి పవిత్రతను బట్టియే క్షేత్రమునకు పవిత్రత రావలెను.అందుకే గురుగీత

శ్లో॥ కాశీక్షేత్ర నివాసశ్చ జాహ్నవీ చరణోదకం।
గురుర్విశ్వేశ్వర స్సాక్షాత్ తారకం బ్రహ్మనిశ్చితం॥

అని అభివర్ణించినది. సద్గురువు సర్వజ్ఞ పద మధిరోహించినవాడు. అట్టి గురుమూర్తి యెచట నివసించియున్నాడో అదియే కాశీ, అతని పాదోదకమే పవిత్ర గంగాజలము. అతడే సాక్షాత్ విశ్వేశ్వరుడు. శ్రీకృష్ణదేశికేంద్రులింకనూ మరొకడగు ముందుకు వేస్తూ, యీ విధముగా గురు మూర్తి సర్వజ్ఞతను గుర్తించి ఆ పిమ్మట, ఆ గురుమూర్తి వలన "తిరిగిరాని మరుగెరిగినట్టి నరుడు (గురుభక్తుడు)న్నచోట సుందర శేషగిరి భద్రగిరి రంగనాయిక పురమనదగి యుండు నన్నారు..

5) రమతే : అనగా క్రీడించుట, విహరించుట, అని అర్థము. సర్వజ్ఞుడైన ఆ పరమాత్మ ఏల కావలెనని యీ విశ్వ సృష్టి గావించి సృష్టించిన ప్రాణులయందు తానే ప్రవేశించి కించిజ్ఞు డేల కావలెను అన్న ప్రశ్న సహజంగా యుద్భవించును. "సోऽ కామయత బహుస్యాం ప్రజాయే యేతి" అనేకము కావలెనని అతడెందుకు కోరెను? "లీలా దేవతు కైవల్యం" అనగా అదియొక లీల. ఒక క్రీడ ఒక యాట అని సమాధానం. సర్వమూ దేశ కాలాదులతోపాటు సృష్టించి, సర్వమయుడై, సర్వజ్ఞుడై సర్వశక్తిమంతుడైయున్నవాని కిదియొక యాట కావలయును. ఐనను ఏ ప్రాణియందున్నా, నిరుపాధికుడైయున్నా తన సర్వజ్ఞత కోల్పోకయున్నపుడే అది క్రీడయగును. లేనిచో అది యొక బంధమే. గురుపుత్రులైనవారు ఆ సర్వజ్ఞ పదమగు గురుస్వరూపమును

గుర్తించి తామే ఆ గురు స్వరూపమని సర్వజ్ఞులై అలరారుచున్నపుడే రాజయోగ రీవితో వర్తింప గలరు.

ఇట్టి రాజయోగ రహస్యములను శిష్యులకు బోధించి సర్వజ్ఞుల చేయుటకు పూనుకొని అనుష్టాన ఆచరణలయందు నిష్ణాతులను గావించు సద్గురుమూర్తి కివే మా ప్రణామములు.

శ్లో॥ జ్ఞేయం సర్వమతీతంచ జ్ఞానంచ మన వుచ్యతే
జ్ఞానం జ్ఞేయం సమకృత్వా యదా నాన్యత్ ద్వితీయకం॥

తాత్పర్యము : సర్వమునకు నతీతముగానున్న జ్ఞేయవస్తువున్ను, జ్ఞానమున్నూ, రెండున్నూ మనస్సు గానే చెప్పబడుచున్నవి. జ్ఞాన జ్ఞేయముల యందు భిన్న దృష్టి పోయి, ఏకత్వదృష్టి కలిగెనేని అపుడు రెండవదిలేని అద్వైతము సిద్ధించుచున్నది.

విశేష వివరణము : 1) జ్ఞేయం సర్వమతీతంచ, 2) జ్ఞాన మనస్సులు 3) జ్ఞానం జ్ఞేయం సమంకృత్వా 4) నాన్యత్ ద్వితియకం అను నాల్గు విషయముల గూర్చి విమర్శించి తెలుసుకొనదగియున్నది.

1) జ్ఞేయం సర్వమతీతంచ : జ్ఞేయమనగా తెలివిచే (జ్ఞానంచే) తెలియదగినది. అది సమస్తమునకు అతీతముగానున్నదని వెంటనే చెప్పబడుటవలన అది చక్షురాదీంద్రియములకు గోచరముగాని బ్రహ్మపదార్థమే అనవలసియున్నది. అతీత మనగా ఎక్కడనో అన్యప్రదేశము నందున్న వస్తువని భావింపరాదు. అది సర్వాతీతముగాను సర్వగతముగానూ కూడా యున్నది. అనగా సర్వవ్యాపకమై సమస్తము తానేయై వున్నది. అతీత మనగా సర్వాతిరిక్తముగా నున్నదని చెప్పరాదు. "సర్వంఖల్విదం బ్రహ్మ" అను శ్రుత్యాను సారంగా సర్వమూ ఆ బ్రహ్మము యొక్క రూపాంతరమేనని తెలియదగును. భిన్నభిన్న రూపములకు తగిన భిన్న భిన్న వ్యవహార నామములు కల్గియున్నవి. కనుకనే నామరూపాలు మిధ్యయనీ, నానా నామరూపాలు ధరించిన వస్తువుమాత్ర మొక్కటేయనీ సూక్ష్మాతి సూక్ష్మమై తెలుసుకొనుటకు కష్టసాధ్యముగానున్నదనీ తెలియదగును.

2) జ్ఞాన మనస్సులు : అట్టి బ్రహ్మవస్తువు జ్ఞేయము అనగా తెలియదగినది అని చెప్పబడుతోంది గదా! దేనిచేత తెలియదగియున్నది? దానికి శబ్దాది గుణములేమున్నా, శ్రోత్ర నేత్రాది జ్ఞానేంద్రియములచే తెలుసుకొనవచ్చును. కాని శబ్దాది విషయపంచకము పైకి దాని యందు గానరాకపోవుటవలన నిర్గుణముగా నది కొందరిచే కొనియాడబడుచున్నది.మరిన్ని జ్ఞానేంద్రియము లచే తెలియరాకయున్నది. ఐనను, దేనిని తెలుసుకొన్నా తెలుసుకొనే తెలివి ఒక్కటేయై వుండవలెగాని అనేక తెలువులుండవుగదా! శబ్దాదులను తెలుసుకొనుచున్న దేదో ఆ తెలివిచేతనే జ్ఞేయబ్రహ్మమున్ను తెలియబడుచున్నది. శబ్దాదులను శ్రోత్రేంద్రియములు తెలుసుకొనుచున్నవి గదా? జ్ఞానేంద్రియము లున్ను జడములే కనుక యట్లనరాదు. అవి కేవలము ద్వారములే. వాని ద్వారా తెలుసుకొనేది అంతరేంద్రియ పంచకములోని జ్ఞానము. తెలుసుకొనే పనిముట్టు అదొక్కటే, జ్ఞేయ బ్రహ్మమును తెలుసుకొన్నా శబ్దాది విషయ పంచకమును తెలుసుకొన్నా ఆ జ్ఞానమే తప్ప మనయందన్యపరికరము లేదు. ఆ జ్ఞానము

శబ్దాది విషయ పంచకమును, శ్రోత్రాది జ్ఞానేంద్రియముల ద్వారా తెలుసుకొను చున్నట్లు, జ్ఞానము ఏ యింద్రియము ద్వారా జ్ఞేయ బ్రహ్మమును తెలుసు కొనును? అని ప్రశ్నించవచ్చును. జ్ఞానము ద్వారానే తెలుసుకొనుచున్నది అని సమాధానము చెప్పవలసియున్నది. దేని ద్వారా తెలుసుకొను చున్నదో ఆ జ్ఞానమునకే మనస్సు అని పేరు. కనుకనే ఆ జ్ఞేయ బ్రహ్మమును "మనసైవాను ద్రష్టవ్య" "మనసైవాను శ్రోతవ్యం" అని మనస్సుచే గుర్తించవచ్చునని శ్రుతి చెప్పుచున్నది. గుర్తెరిగే జ్ఞానమే సంకల్ప వికల్పములు గావించునపుడు వృత్తి భేదముచే మనస్సు అని పేరొం దెను. నిజానికి ఒక్కజ్ఞానమునకే వేర్వేరు పేర్లు వచ్చినవి. జ్ఞేయ బ్రహ్మమునకు అఖండ జ్ఞానమే స్వరూపము "జ్ఞానా దేవతు కైవల్యం" అని శ్రుతియున్నూ పల్కుచున్నది. జ్ఞాన జ్ఞేయములు రెండూ ఒక్కటే, రెండూ మనస్సే అని చెప్పబడినవి. జ్ఞానము, జ్ఞానము ద్వారానే, జ్ఞానమునే గుర్తించుచున్నది. అర్థసౌలభ్యం కొరకు జ్ఞానము మనస్సు ద్వారా జ్ఞేయమైన బ్రహ్మమును తెలియుచున్నది అని చెప్పవచ్చును.

జాగ్రదావస్థలో జ్ఞానము జ్ఞానేంద్రియముల ద్వారా శబ్దాది విషయ పంచకమును గుర్తించుచున్నది. స్వప్నావస్థలో జ్ఞానపరిణామమగు మనస్సు, మనస్సుచేత, మనోనిర్మిత ప్రపంచమును, గుర్తెరుగుచున్నది. సుషుప్తి యవస్థలో జ్ఞానము మరుపురూపము వహించి అజ్ఞానములోనున్నది. తురీయములో (తురీయమనగా బ్రహ్మవస్తువును తెలియుస్థితి) జ్ఞానము జ్ఞానముద్వారా జ్ఞానమునే గుర్తెరుగుచున్నది. ఆ స్థితిలో రెండవదిలేదు. తన్నుతాను చూచుకొనుట యిదే. అపుడు ద్విపుటీ, త్రిపుటీలేదు. జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయములు మూడు ఒక్క జ్ఞానమే అగుచున్నది. లేక మూడు కలసి జ్ఞేయ వస్తుమాత్రముగా నుండును. త్రిపుటిగా భాసించినా, లేక ఒక్కటిగానున్నా ఆ ఒక్కటే ఆ ఒక్కటి వున్నంతకాలము త్రిపుటి భాసించకపోయినా త్రిపుటి రహితమైనదని అనరాదు.

3)"జ్ఞానం, జ్ఞేయం సమంకృత్వా" : పైన వివరించిన విధంగా జ్ఞాన జ్ఞేయములు రెండూ ఒక్కటే అయినపుడు యిక సమముగా నొనర్చుటేమి? ఏకత్వ మొనర్చుట ఏమి? అంటే ఒకటేననే జ్ఞానము కలుగనంతవరకు, శబాద్ధి విషయములయందు భ్రాంతి కలుగుచునే యుండును.

"యద్యత్పశ్యతి చక్షుర్భ్యాం తత్తదాత్మేతి నిశ్చయా........." అని చెప్పబడిన రీతిగా కనబడినది, వినబడినది, సమస్తమూ ఆత్మయే "ఆత్మనోన్యం నకించన" అనగా ఆత్మకంటె కొంచమైనా యితర మేమీ లేదు. ఇదే సర్వాత్మ భావము. ఇట్టి ఆత్మదృష్టి పెంపొందించుటే జ్ఞాన జ్ఞేయములను లేక దృగ్దృశ్యములను సమంగావించుట లేక ఏకమొనరించుట యగును. అట్టి ఆత్మదృష్టి పెంపొందినవాడు "కిమిచ్ఛన్ కస్య కామాయ" అనేరీతిగా దేనిని ఆపేక్షించును? దేనిని తిరస్కరించును? అట్టివానికి కామవాసన లన్నియు నశించుననీ అదే యిచ్ఛారాహిత్య మనీ యితరులు అభిప్రాయపడుచున్నారు. కాని అచల ఋషుల సాంప్రదాయానుసారం యింతమాత్రం చేత యిచ్ఛారాహిత్యం కాదు. దేనికి యిచ్ఛగలుగుచున్నదో ఆ వస్తువు శేషించి యుండగా యిచ్ఛా రాహిత్యమెట్లు పొసగును? సకలేచ్ఛలకు మూలమైన వస్తువు తెలివి, లేక

జ్ఞానము, దాని రహితమందే యిచ్ఛా రాహిత్యము. ఇదే స్వచ్ఛమగు బోధయని కృష్ణదేశికేంద్రుల సిద్ధాంతము.

4) "యథానాన్యత్ ద్వితీయకం" =జ్ఞాన జ్ఞేయములు రెండూ ఒకటేనని తెలిస్తే, దానికి భిన్నమైన రెండవదిలేదు అని అర్థము. అట్లైతే పరిపూర్ణ పరబ్రహ్మము మాటయేమి? అది లేనేలేదా? లేక అదికూడా యీ జ్ఞానజ్ఞేయ రూపమగు విజ్ఞేయ బ్రహ్మమేనా. యీ రెండు వికల్పములున్నూ ఎంతమాత్రం సరికావు.

ఈ శ్లోకమునకు పాఠాంతరముగా మరియొక శ్లోకమున్నది.

శ్లో॥ జ్ఞేయం సర్వం ప్రతీతంచ జ్ఞానంచ మనవుచ్యతే
జ్ఞానం జ్ఞేయం సమంకుర్యా న్నాన్యః పంథా ద్వితీయకః॥

అని అనగా జ్ఞానముచే తెలియబడేదంతా ప్రతీతి మాత్రమే. జ్ఞానముకంటె భిన్నంకాదు. జ్ఞానజ్ఞేయములు రెండు మనస్సే, ఆ రెంటినీ ఏకము చేయుటే దృశ్యరాహిత్యమునకై యేకైక మార్గము అని తాత్పర్యము. అంటే నానాత్వముగా దోచబడేదంతా (జ్ఞేయము లేక దృశ్యము ) అంతా జ్ఞానకార్యమే అని తెలిస్తే జ్ఞానం తప్ప రెండవ జ్ఞేయపదార్థంలేదు అని సిద్ధించును. పరిపూర్ణ పరబ్రహ్మము వస్తువున్నూ కాదు జ్ఞేయమున్నూ కాదు. ఒకటి వున్నదని చెపితే రెండు, మూడు సంఖ్యానిక మంతయునుండును. అది అంతయు సాపేక్షిక జగత్తునకు సంబంధించినది. పరిపూర్ణము, కేవలం నిరపేక్షకము. అది దృక్కుగాదు, దృశ్యముగాదు, జ్ఞానముగాదు. జ్ఞేయముకాదు. కేవలం అవిజ్ఞేయమైయున్నది. ఇట్లుయే గురుమూర్తి యొక్క కృపాకటాక్షములచే మాకు విదితమైనదో ఆ గురువుయొక్క సగుణ నిర్గుణరూపముల కివే మా నమస్కారములు.

శ్లో॥ జ్ఞేయం సర్వం ప్రతీతంచ జ్ఞానంచ మనవుచ్యతే
జ్ఞానం, జ్ఞేయం సమం కుర్యాన్నాన్యః పంథా ద్వితీయకం

తాత్పర్యము : ప్రతీతి అయిన సర్వమూ జ్ఞేయ బ్రహ్మమే, దానిని తెలుసుకొను జ్ఞానమున్ను ఆ జ్ఞేయమున్నూ యీ రెండున్ను మనస్సు గానే చెప్పబడుచున్నవి. ఈ జ్ఞాన జ్ఞేయముల సమమొన ర్చుటయే, యేకైక మార్గం, రెండవ మార్గంలేదు.

వివరణములు : 1 వ శ్లోకం : దృగ్గోచరమగు సమస్త నామరూప ప్రపంచమునకు జ్ఞేయ బ్రహ్మము అతీతమైయున్నది. అతద్వ్యావృత్తి లక్షణముచే ఇంద్రియ గోచరమగు సమస్తము "యద్దృశ్యం, తన్నశ్యం" అనే న్యాయంగా నశ్వరమైయున్నది. గనుక, "నేతి, నేతి" అని నిషేధిస్తూపోగా, వృత్తులన్నియు నణగి మనస్సు బ్రహ్మాకార మగును. మనస్సునకు అఖండ బ్రహ్మాకార వృత్తి కలుగును. కనుకనే "మనసైవాను ద్రష్టవ్యం" అని శ్రుతి చెప్పుచున్నది. అదియే జ్ఞేయ బ్రహ్మమనీ, విజ్ఞేయ బ్రహ్మమని చెప్పబడును. దానిని తెలుసుకొను మనస్స అట్లు తెలుసుకొన్న సమకాలమునందు ఆజ్ఞేయ బ్రహ్మమేఅయివుండును. అపుడు తెలుసుకొనే మనస్సు వేరుగాను తెలియబడిన బ్రహ్మ వస్తువు వేరుగాను యుండవు. అపుడు ఆ బ్రహ్మము తప్ప రెండవది లేదు. జ్ఞేయ బ్రహ్మము దృగ్గోచరమగు నామ రూపాత్మకమగు సర్వ దృశ్యములకు అతీతముగా

నున్నది. అతీతమనగా, సర్వ దృశ్యములను దాటిన అన్య ప్రదేశమని అర్థముగాదు. సర్వనామ రూపాత్మకమగు వస్తు సముదాయము నందేగాక దాని నతిక్రమించి విశ్వగతమును విశ్వాతీత మును గూడ అయివున్నది. సర్వము కానరానపుడు అది ఆకాశమువలె సర్వవ్యాపకమై అఖండముగా నుండును. ఇదే జ్ఞేయ బ్రహ్మము, అనగా తెలివికి తెలియబడే (జ్ఞాన గోచరమైన) విజ్ఞేయ బ్రహ్మము జ్ఞానమనగా ఆ జ్ఞేయ బ్రహ్మమును గుర్తించిన తెలివి ఈ తెలివి, జ్ఞానమనో బుద్ధి చిత్తాహంకారములని చెప్పబడే అంత రేంద్రియములలో చెప్పబడిన జ్ఞానమే. యీ జ్ఞానము ప్రపంచాభిముఖమై, సంకల్ప నిశ్చయ చింతన అభిమానములు బూని సర్వ వ్యవహారకారణమగు చున్నది. వూర్ధ్వముఖమై, నామ రూపాత్మకమగు సృష్టికి, పూర్వాపరములయందుండు సృష్టి కారణమును నిస్సంకల్పరూపంజెంది గుర్తించుచున్నది. సంకల్పము పూని మనస్సనే పేరుతో వ్యవహరించునదీ, ఈ జ్ఞానమే గనుక జ్ఞానమే మనస్సు. మనస్సే జ్ఞానము.

ఈ శ్లోకంలో జ్ఞానము మనస్సేనని చెప్పటయేగాక జ్ఞేయము కూడ మనస్సే అంటోంది. ఇది యెట్లు అంటే, కంటిచే రూపము గల వస్తువును చూతుము గదా! రూపతన్మాత్ర యొక్క నిజాంశమే చక్షురింద్రియము. సర్వరూపములు చక్షువుచేత మాత్రమే గుర్తింపబడి చక్షురింద్రియ సంబంధమైయున్నవి. అట్లే జ్ఞేయ బ్రహ్మము చిద్ఘనము అనగా జ్ఞాన ఘనము. అనగా, బెల్లపుముక్కకు బయట లోపల అనే నిర్ణయము లేకుండా మొత్తమంతా యెట్లు తీపి మయమో అట్లే జ్ఞేయ బ్రహ్మము. జ్ఞానమయమైయున్నదన్నమాట. జ్ఞానమయమైన ఈ బ్రహ్మము జ్ఞానముచే గుర్తింపబడుటలో విడ్డూరమేమీలేదు. సమిష్టి జ్ఞాన రూపమై జ్ఞానఘనమైయున్న బ్రహ్మమును వ్యష్టి జ్ఞానము గుర్తించునపుడు వ్యష్టి, సమిష్టులు ఏకమై అఖండ బ్రహ్మమే అగుటలోనూ ఆశ్చర్యములేదు. జ్ఞాన జ్ఞేయములు భిన్నములుగాక అపుడేకమే యగుచున్నవి. అఖండ జ్ఞానరూపమైన జ్ఞేయ బ్రహ్మము సృష్టి స్థితి లయాది సంకల్పములు చేసినపుడు దానికి సమిష్టి మనస్సని దేహేంద్రియాదులగూడి వ్యవహరించునపుడు ఆ జ్ఞానమునే వ్యష్టి మనస్సని అనవచ్చును. జ్ఞేయ బ్రహ్మమున్ను జ్ఞానమున్ను రెండున్నూ మనస్సు అనే శబ్దం చేతనే చెప్పదగియున్నవి. యీ రీతిగా ఏకాగ్రమగు మనస్సుతో విచారించి దృఢ నిశ్చయ జ్ఞానము పొందుటే జ్ఞాన జ్ఞేయములను సమంగా చూచుకొనుట యగును. అపుడు ఏకరూపం పొందిన జ్ఞాన జ్ఞేయముల ఒకే బ్రహ్మమై యుండును. యిక ద్వితీయ వస్తువే లేదు. యిదే అద్వైత సిద్ధి. యిదే జ్ఞేయ బ్రహ్మ నిర్ణయము. యిది ప్రథమ శ్లోక భావము.

ఇక రెండవ శ్లోకములో "జ్ఞేయం సర్వం ప్రతీతంచ" అనుట వలన ప్రతీతయగు సర్వస్వము జ్ఞేయమేనని చెప్పబడినది. ప్రతీతి యనగానేమి? ఎరుగబడినది, భాసించునది లేక ప్రకాశించునది యని అర్థములున్నవి. తెలివిచే, యూహించదగిన సమస్తము, (జ్ఞానేంద్రి యములచే గుర్తింపబడేది మాత్రమే గాక) ప్రతీతి అను శబ్దార్థములోనికే వచ్చును. మరియు ప్రతీతి అనుటలో వస్తువు సత్య పదార్థమే అయి వుండవలెననే నిర్ణయము లేదు. రజ్జుసర్పము, మృగజలము యిత్యాదులన్నియు ప్రతీతి శబ్దములోనికే చేరును. ప్రత్యక్షముగా యింద్రియ గోచరమయ్యే శబ్ద స్పర్శాది విషయములే గాక, జ్ఞానముచే నిర్ణయింపబడేవి, మనస్సుచే

వూహింపబడేవి, అనుమాన ప్రమాణముచే నిర్ణయింపబడేవి. కేవలం వదంతులు నీలాపనిందలు యివన్నియు ప్రతీతి శబ్దములో యిముడు చున్నవి. యివన్నియు ఒక విధముగా జ్ఞేయ శబ్దార్థములోనికే చేరును. జ్ఞేయ బ్రహ్మము కూడా ప్రతీతియే అగుచున్నది. అది మనో వాక్కుల కందనిది కాదని, మనస్సే అయివున్నదని సిద్ధించు చున్నది. ఐననూ శుద్ధ బుద్ధిచే, తర్కించి సత్యాసత్య నిర్ణయము చేయుచు శ్రుతి యుక్తి అనుభవముల చే సత్య వస్తువుగా నిర్ణయింప బడిన వస్తువు జ్ఞేయ బ్రహ్మము "సర్వం ఖల్విదం బ్రహ్మ"అనే శ్రుతి న్యాయముగా ఆ బ్రహ్మము యొక్క అఖండ జ్ఞానమే యీ సర్వ ప్రతీతికి మూలకారణమై యున్నందున సర్వమూ జ్ఞేయమే. కాని సత్యాసత్య నిర్ణయముచేసి సత్యమునే గుర్తించు జ్ఞానము శుద్ధ మనస్సు అతీంద్రియమనస్సు లేక స్వావశీయ మనస్సు. అట్టి సత్యాసత్యములు నిర్ణయించుటకు తగిన శుద్ధత్వము లేనపుడు అనగా మలిన సంస్కారయుతమైనపుడు మనస్సు అని ఆ జ్ఞానమే పిలువబడు చున్నది. శుద్ధమైనా మలినమైనా ఆ మనస్సే కనుక జ్ఞానము కూడా మనస్సు అనే చెప్పబడు చున్నది. అట్టి జ్ఞేయ బ్రహ్మమును అవాఙ్మానసగోచరమని వర్ణించవచ్చునా! మనస్సుచేతనే సర్వప్రతీతి యగు చున్నది. సమస్తము గోచరించుచున్నది. "మనోహి జతువత్" అనగా మనస్సు లక్కవంటిది. కరిగిస్తే అది ఏ రూపమైన దాల్చుటకు సమర్థవంతమగును. అట్లే మనస్సు ఏ వస్తువునందు లగ్నమైనా ఆ వస్తురూపమును దాల్చును. ఏ వస్తువైనను మనస్సునకు గోచరమైనదని చెపితే అట్లు గోచరించిన కాలమున మనస్సా రూపం వహించేనన్నమాట. మనస్సు బ్రహ్మాకారమైనపుడు అది బ్రహ్మము యొక్క రూపమే అగుచున్నది. ఆ జ్ఞేయ బ్రహ్మమున్ను మనస్సుగానే చెప్పవలసి యుండును. తెలుసుకొను సాధనమైన మనస్సున్ను సాధింపదగిన జ్ఞేయమున్నూ రెండూ మనస్సుగానే చెప్పవలసియున్నది.

ఇట్లు జ్ఞాన జ్ఞేయముల సమముగా చేయుటయే పంథా అనగా మార్గము. రెండవ మార్గము లేదు అని యీ శ్లోకము ముద్ఘాటించుచున్నది. ఐతే, యీ ఏకైక మార్గమునకు గమ్యస్థాన మేదియో యీ శ్లోకము స్పష్టముగా చెప్పలేదు. దృశ్య రాహిత్యము సాధించుటకా! లేక దృగ్ రహితము సాధించుటకా? లేక ద్రష్ట, దర్శనము, దృక్కు అను త్రిపుటీ రహితమునకా? యీ మూటియొక్క రాహిత్యమునకున్నూ యిది ఏకైక మార్గమైనపుడే శ్లోకమునందు సిద్ధాంతీ కరింపబడిన విషయము సార్థకము కాగలదు.

కొందరు దృశ్య రాహిత్యము సాధించుటకు మాత్రమే యీ మార్గమని యనవచ్చును. "దృగ్ దృశ్యౌ ద్వౌ పదార్థౌ, తౌ పరస్పర విలక్షణౌ దృగ్బ్రహ దృశ్యం మాయేతి, యితి వేదాంత డిండిమః" అని వేదాంత డిండిమము దృక్కే బ్రహ్మము, దృశ్యం అనిత్యమైన మాయా కనుక దృశ్య రాహిత్యము కావలె. అపుడు దృక్కు శాశ్వతమైన బ్రహ్మముగా స్వతస్సిద్ధమై యుండును అని వారి వాదము. యీ గురుగీతలో యింతకుముందు శ్లోకములో "అనిత్యం ఖండయే త్సర్వం" అని వున్నది. దృశ్యము అనిత్యము. కనుక దానిని ఖండించవలెననంటారు నిజమే. దృశ్యము అనిత్యమే, కాని దృక్కు కూడా దృశ్యమేనని యీ శ్లోకంలో చెప్పబడినది. ఎట్లనగా జ్ఞేయము దృశ్యకోటిలో చేరును అది శుద్ధ మనస్సునకు దృశ్యము అయి వున్నది గదా! జ్ఞానమన్నా

దృక్కన్నా ఒకటే, "జ్ఞానం జ్ఞేయం సమంకుర్యాత్" అంటోంది యీ శ్లోకం. దృగ్దృశ్యములు రెండూ ఒకటే కనుక దృగ్ దృశ్యములు రెండి రాహిత్యమే సాధించనగును. కాని దృశ్యరాహిత్యం సాధించిన మాత్రమున చాలదు. ద్రష్ట (జ్ఞాత) దృక్(జ్ఞానము) దృశ్యము (జ్ఞేయము) యీ మూడున్ను త్రిపుటీ రూపము. యిందొకటి నిలచి మిగతా రెండూ పోయేవికావు. దృగ్ దృశ్యములు పోతే ద్రష్టయనే పేరే యుండ జాలదు. మరియు మనస్సున కనేక వృత్తులు కలవు. అఖండ బ్రహ్మాకార వృత్తి కూడా నొక వృత్తియే. వృత్తి రాహిత్యము సిద్ధించవలెనన్నపుడాయఖండ బ్రహ్మాకార వృత్తియు పోవలసినదే. నేను బ్రహ్మమునని అనుసంధానముచేయునపుడు నేను, బ్రహ్మము, అను ద్వైత ముండక తప్పదు.

ఆ వృత్తి కూడ నణగిన పిమ్మటనే మనస్సు బ్రహ్మమై నిలుచును. ఇదే జ్ఞేయ బ్రహ్మము. అపుడు దానిని తెలుసుకొనువాడు వేరే ఒకడుండడు. జ్ఞేయ బ్రహ్మము మాత్రమే నుండునంటారు కొందరు. ఇందుకు జ్ఞానముచే జ్ఞేయవస్తువును తెలసుకొని జ్ఞానమును వదలి పెట్టుమని వుత్తర గీతలో.

శ్లో ॥ ఉల్కాహస్తోయధాకశ్చిత్ ద్రవ్య మాలోక్యతాంత్యజేత్
జ్ఞానేన జ్ఞేయ మాలోక్య పశ్చాద్జ్ఞానం పరిత్యజేత్॥

అని ప్రమాణం యిస్తారు. కాని ఈ శ్లోకములో జ్ఞేయము శేషించియుండునని చెప్పనేలేదు. జ్ఞానమును పరిత్యజించమని మాత్రమే చెప్పబడినది. జ్ఞేయమును తెలుసుకొన్న జ్ఞానమును పరిత్యజిస్తే జ్ఞేయ బ్రహ్మము మిగిలియుండునా? జ్ఞాతృ జ్ఞాన శబ్దములు సాపేక్షికములు. ఒకే త్రిపుటికి సంబంధించినవి. అందేయొకటి పోయినా మిగతా రెంటియొక్క శబ్ద ప్రసక్తియే యుండజాలదు. అంతే కాకుండా జ్ఞేయ బ్రహ్మమునకు జ్ఞానమే స్వరూప లక్షణము కదా! స్వరూపము గోల్పోయిన బ్రహ్మము నిలిచియుండునని చెప్పుట, తీపిపోయిన పిదప బెల్లము, శేషించియుండునని చెప్పుట వంటిదే యగును. దీపం పోతే దీపావరణమైన ప్రకాశము నిలచునా? అట్లే జ్ఞానంపోతే జ్ఞానావరణమైన జ్ఞేయము నిలచునా? వ్యష్టి జ్ఞానము అఖండ రూపము చెందిన పిదప, వ్యష్టి జ్ఞానము వదలివేయుటయే పొసగదు. అపుడు జ్ఞానమును వదలుట అనగా అఖండ జ్ఞాన రూపమగు జ్ఞేయమును వదలుటయే యగును. (విపులంగా ఈ విషయం తెలుసుకొనగోరువారు "పరిపూర్ణ దర్శనము " చూడగలరు).

"ఆ జ్ఞేయ బ్రహ్మము కూడా పోతే యిక ఏముండును? శూన్యమే కదా!" అని యన వచ్చును. శూన్య ముండును అని గుర్తించే నీవు వున్నావుగదా! ఇంతకుముందు జ్ఞేయ బ్రహ్మముతో దాతాత్మ్యము పొంది జ్ఞేయ బ్రహ్మము శేషించునంటివి. ఇపుడు శూన్యముతో తాదాత్మ్యము చెంది శూన్య స్వరూపుడవు (లేనెరుకవు) ఐతివి. ఇట్టి లేనెరుక లేకుండా పోతేనే (అనగా శూన్యమే మహాశూన్యమైతేనే) కృతార్థుడవు. "లేనేలేనని నేను లేకపోయిన వెనుక తానుండుగద" అని శిష్యుడంటే "వుంటే దాన్నెట్లెరిగెదవీవు" అంటున్నాడు గురుదేవుడు.

అట్టి పరిపూర్ణ పరబ్రహ్మము జ్ఞానముచే తెలియరానిది. ఎరుకలేక సేవింపదగినది. అవాఙ్మానసగోచరమైనది. అట్టి పరిపూర్ణ పరబ్రహ్మమును వుండజూచి, జ్ఞాన జ్ఞేయ రూపమైన

జ్ఞేయ బ్రహ్మమును విడచుటయే గమ్యము, లక్ష్యము. ఇట్టి లక్ష్యసిద్ధికి ప్రథమంలో జ్ఞాన జ్ఞేయముల రెంటినీ సమంగా (నొకటిగా) చేయుమని యీ శ్లోక మాదేశిస్తూ, ఆ మార్గము తప్ప వేరే మార్గము లేదని యుద్ఘాటించుచున్నది.

అట్టి లక్ష్య సిద్ధిని చేకూర్చగల సద్గురుమూర్తి దివ్య శ్రీ చరణ సరోజములు హృదయ సారసమున ప్రతిష్ఠించుకొని అహరహము సేవించుచుందుము గాక!

శ్లో॥ స్వయం బ్రహ్మ మయోభూత్వా తత్పరం చావలోకయేత్
పరాత్పరతరం నాన్యత్ సర్వగం తన్నిరామయం॥

తాత్పర్యము : తాను పరబ్రహ్మ స్వరూపుడై, తనకు పరంగా నున్న పరిపూర్ణ పరబ్రహ్మమును చూడవలెను. పరబ్రహ్మమునకంటె పరంగా నున్న యీ పరిపూర్ణ పరబ్రహ్మము కంటెనూ పరంగా ఏమియులేదు. అది నిరామయమై సకలమునందు నిండి నిబిడీకృతముగా నున్నది.

విశేష వివరణము : 1) తాను బ్రహ్మమయుడగుట యన నేమి? యెట్లు బ్రహ్మమయుడు కాగల్గును?

2) ఈ పరబ్రహ్మమునకు పరంగా విలక్షణంగా మరియొకటున్నదా?

3) అవలోకన మనగా నేమి? ఆ పరిపూర్ణ పరబ్రహ్మమును అవలోకనము చేయ నగునా? అను హంశములు విచారణీయములు.

1) తాను బ్రహ్మమయుడగుట యననేమి?

"ఆ బ్రహ్మ స్తంభపర్యంతం పరమాత్మ స్వరూపకం" అనగా, గానవచ్చేది తోచవచ్చేది సమస్తమూ పరమాత్మ స్వరూపమేననిన్ని, "బ్రహ్మణోన్యం నకించన" అనగా ఆ బ్రహ్మమున కంటె అన్యమైనది కొంచెమైనా లేదనిన్నీ శ్రుతులు ఘోషించుచున్నవి. అపుడింక బ్రహ్మమయు డగుట అంటే నేమి? యిదివరకు బ్రహ్మమై యుండక పోతే యిపుడు క్రొత్తగా బ్రహ్మము కావలసియుండును. యిదివరకే బ్రహ్మమై యుండియు అది విస్మరించి నేను బ్రహ్మముగా మారిపోవలెనని కోరుట నిజముగా అజ్ఞాన కార్యమే. దీనికే ప్రాప్తప్రాప్తవ్యము అని శాస్త్రజ్ఞులు పేరిడిరి. యిందుకు కంఠచామీకరవత్" అనగా మెడలోనే హారమున్న సంగతి మరచి దానికొరకై వెతకులాడుట వంటిదని దృష్టాంతమిచ్చినారు.

ఉపాధిగతుడై, తన నిజరూపమును మరచి దేహతాదాత్మ్యము చెంది తన్ను గూర్చి పరిపరివిధములుగా చెప్పుకొనుచున్నాడు. దేశకాల పాత్రలను, నామరూపములను, జాతి, మత, కుల భేదములను పురస్కరించుకొని నేను భారతీయుడను. 50 ఏండ్ల క్రితం జన్మించితిని, నేను హిందూ మతస్తుడను, బ్రాహ్మణుడను, నా పేరు వెంకట శాస్త్రి, నేను ఎర్రగా లావుగా పొట్టిగా నున్నాను. అని యిత్యాదిగా స్థూల దేహ తాదాత్మ్యముచే బల్కుచున్నాడు. అట్లే నేను సుఖంగా నున్నాను లేక దుఃఖపడుచున్నాను. అని సూక్ష్మ దేహముతోనూ లేదా నేను వేదాంతిని పారమార్థికుడను లేక అజ్ఞానినిఅని కారణ దేహముతోను తాదాత్మ్య మేర్పరుచుకొని పల్కు

మన్నాడే గాని మహా కారణ శరీరతాదాత్మ్యము గల్గి "అహం బ్రహ్మాస్మి" నేను బ్రహ్మమునే అయివున్నానని, యదార్థ దృష్టిని పూనియుండుటలేదు. అట్టి ఆత్మదృష్టితో ప్రాపంచిక వ్యవహారములు అసలే జరుపుటలేదు. కాని, నిజంగా బ్రహ్మ తాదాత్మ్య స్థితిలో నుండి జీవయాత్ర సాగించినచో తాననే వ్యష్టి దృక్పథము నశించి నిస్వార్థపరుడై యొప్పారును. అట్టివానికి శరీరేంద్రియ మనోబుధ్యాది సమస్తము మాత్రమేగాక, తన శరీరమునకు బయట తోచబడే సమస్తమూ కూడా బ్రహ్మమే అనే అఖండాత్మ దృష్టి యుండును. యిదే బ్రహ్మమయుడగుట, అపుడాతని చిత్తము బ్రహ్మాకారాకారితమయ్యే యుండును. దానినే అఖండ బ్రహ్మాకార వృత్తి యని అనదగును. అపుడు జ్ఞాతృజ్ఞానజ్ఞేయరూపమగు త్రిపుటీ భేదమంతరించి "ఏకమేవాఽ ద్వితీయంబ్రహ్మ" అను శ్రుత్యర్థము సార్థకము కాగలదు.

బ్రహ్మమయుడగుట యెట్లు? యిది గురుకృపచేతనే సాధ్యము. కనుకనే కృష్ణదేశికేంద్రుల వారు "పిండబ్రహ్మాండంబులు రెండునూ, ఈ రెంటిలోని రెండహములు యీ ఖండములు నాల్గుగూడి అఖండంబగు యెరుకరూపు గనరా మా తండ్రీ! యిది తెల్పిన ఘనుడే తల్లిదండ్రీ....." అంటూ గురువును కొనియాడినారు.

పిండ బ్రహ్మాండములేవి? ఆ రెంటిలోని రెండహములు ఏవి? ఆ నాల్గుఖండములు గూడిన అఖండంబగు యెరుకరూపు ఏది? అను విషయములు గురువు వస్తు నిశ్చయముగా శిష్యుని కెరిగించవలసినదే తప్ప, ఎంత సునిశిత ప్రజ్ఞా దురంధరుడైనా సాంప్రదాయక గురుడు దెల్పక తెలిసికొనలేడు. అట్టి అఖండ రూపమును గుర్తించినపుడు "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనే శ్రుత్యర్థమందు ఎట్టి సందియమూన్ను యుండజాలదు.

"మాయామాత్ర మిదంద్వైతం, అద్వైతం పరమార్థతః" అనగా అఖండ రూపాత్మ యొక్కటే పారమార్థిక సత్యత్వము గలది. మిగితావన్నీ మాయామాత్రమే అని అర్థము. అది ప్రాతిభాసిక వ్యవహార సత్యత్వములకంటె గొప్పదేగాని, సృష్టికారణమై పరిణామ శీలమైన ఆ అఖండ యెరుక తిరిగి ఖండరూపములుగా కనుపించుచుండుటచే, కేవల పరిపూర్ణ పరబ్రహ్మ మిదికాదని తెలియ వస్తూనే యున్నది. యీ అఖండ ఎరుకే "అన్నియు తానై, తన కవిపన్నుగ వేరనుచు నోట బల్కుచు మరి తాన్ననింటి నెరిగే యెరుకై యున్నానని యెరుకే నూహింపు చుండు, తనలోతానే మోహించు చుండు నన్నారు. యిది చింతలతోట, వింతల పుట్టిల్లు, తంతులపేట, పంతములకు మూల బలము. భ్రాంతులకు పట్టణము, కాంతాది రూపములను కల్పించుటకు మూల బలము అన జెల్లియున్నది. దీని కతీతముగు ఆ పరిపూర్ణ పరబ్రహ్మ మెట్టిదో తెలియువరకు మానవుని జ్ఞాన పిపాస శాంతించలేదు. భ్రాంతి రహితం కాబోదు.

2) అఖండాత్మరూపమగు, పరబ్రహ్మమునకు పరంగా విలక్షణంగా మరియొక (పరిపూర్ణ మనేది) టున్నదా? ఆహా! తప్పకయున్నది. జీవేశ్వర జగత్తులు మూడున్ను, వాని కధిష్టానమగు, బ్రహ్మమున్నూ గూడ చలన రూపములయ్యే యున్నవి. ఈ చలనమంతయు తోచుట కైనను, ఏదో అచలమగు వస్తువుండి తీరవలెను. లేనిచో వాని చలనము గూడ స్పష్టవంగా నుండక అస్తవ్యస్తముగా నుండును. ఉదాహరణకు : కదలకుండా రైలు పట్టాలు బిగించి

యున్నప్పుడే గదా రైలెంత వేగంగా పరుగిడినా భయములేకుండుట? అట్లే మనం చూచేవీ, వూహించేవి సమస్తమూ చలనాత్మకమై వున్నవంటే చలనరహితమైన దొకటుండవలెననే సిద్ధిస్తూ వున్నది. మరిన్ని యీ చలనాత్మకమైన బ్రహ్మమే సర్వత్ర నిండియున్నది. యింకేమీ లేదు. అంటే మరొక విప్రతిపత్తి సిద్ధిస్తూ ఉన్నది. ఏమనగా సర్వత్రా వుంటే ఎక్కడకు కదలగలదు. కదలిక (చలనము) గల యీ చేతన బ్రహ్మము సర్వత్రా లేదని కూడా తేటతెల్లమగుచున్నది. "అంతటా గలదొక్క అచలమేగాని ఎరుకంతాట కలదాని అనరాదు. వినరాదు" అన్నారు కృష్ణదేశికేంద్రులు. ఖండాఖండరూపముగా చలనాత్మకముగా నున్న యీ చేతన బ్రహ్మమున కన్యంగా పరిపూర్ణ పరబ్రహ్మ మున్న దనుటలో ఏమీ సందేహము లేదు.

3) అవలోకనమనగా నేమి? ఆ పరిపూర్ణ పరబ్రహ్మమును అవలోకనము చేయనగునా?

అవలోకనమనగా చూచుట అని సామాన్యార్థమేగాని, మనస్సుచే వూహించుట, తెలివిచే వుండజూచుకొనుట అనునవి కూడా అవలోకనమున కర్థములే. అనగా జ్ఞానేంద్రియ పంచకము, మనస్సు అను యీ ఆరింటి చేతను తెలియబడేదంతయు అవలోకనమే. పంచతన్మాత్రవిషయములు యింద్రియముల చేతను, భావా భావ రూపములు మనస్సుచేతను మనము అవలోకనము చేయగలుగుచున్నాము.

కాని ఎరుక మరుపులు సాకార నిరాకారములు, సగుణ నిర్గుణములు, సదసత్తులు, భావా భావములుగాని, పంచతన్మాత్రలుగాని, లేనియా పరిపూర్ణ పరబ్రహ్మమును దేనిచే అవలోకనము చేయగలము అను ప్రశ్న ఎదురగుట సహజము. ఐతే, అది ఏమీకాదనీ, అందేమీ లేదనీ, "నేతి, నేతి, నేతీతి హోవాచ" అన్న రీతిగా వ్యతిరేక పద్ధతిగా "నెగటివ్" గా దానిని భావించు కోవచ్చును. కానిదాన్ని అవలోకనము చేయుట ఎట్లు? "లెనెరుకతో దీన్ని గనిపెట్టు" మనీ, "ఎరుక లేక సేవింపుమనీ" అన్నారు. ఐతే సూర్యుని చూడబోయిన చీకటివలె "చూస్తునె యెరుక పారి పోవునురా" అంటున్నారు. పరిపూర్ణ పరబ్రహ్మమపరోక్షమగుట ఎరుక లేకపోవుట సమకాలమునందే జరిగిపోవుచున్నవి. "పరిపూర్ణమును జూచిన యెరుక లేదు" అన్నారు. అవలోకనమనీ, అపరోక్షమనీ అనుటకూడా అపచారమే. కాని అంత కంటే శబ్దములులేవు కనుకనే "నవాగ్గచ్ఛతి" అంటోంది శ్రుతి. నరుని నోట యెంగిలికాని దిదొక్కటే.

నామ రూప క్రియా నటనలు ఏమీలేని యీ పరిపూర్ణ పరబ్రహ్మమును తెలియుటకు ముందు తాను బ్రహ్మమయుడైతేగాని సాధ్యం కాదంటోంది. యీ గురుగీతా శ్లోకం, ఏలననగా, అఖండ ఎరుక రూపుడేతానై నిలిస్తే, అపుడు తన్ను విడచి చూస్తే, అంతా కుంఠితం గాని వైకుంఠమే. కల్పనా రహితమైన కైలాసమే నన్నారు దీక్షితుల వారు.

"అపరోక్షమౌనె మనుజులకు, పరోక్షంబైన బయలు గురుకృప లేకన్?" అట్టి గురుకృపా సంసిద్ధికై గురుపుత్రులందరము అహరహము గురూపాసన గావింతుముగాక!

శ్లో॥ కిమావాహన మవ్యక్తే వ్యాపకేం కిం విసర్జనం
అముక్తాచ కథం పూజా కథంధ్యానం నిరామయే॥

(అముక్తాచ అనుచోట "అమూర్తేచ" అని పాఠాంతరము)

తాత్పర్యము : అవ్యక్త స్వరూపమై, సర్వమునందు వ్యా . ఆ సర్వముతో వేరుపం (నిరాకారమై) నిరామయమై యున్న జగత్కారణమైన పర కు ఆవాహన విసర్జనము పూజాధ్యానములు యెట్లు సంభవమగును? అనగా సం పనేరవు అని తాత్పర్యము.

విశేష వివరణము : సగుణోపాసన, నిర్గుణోపాసన యని న రెండు విధములు. షోడ చారములతో కూడిన అర్చనయు ఉపాస్య వస్తువును గూర్చి త్రజప స్తోత్ర ధ్యానాదులన్ని ఉపాసనా శబ్దమునకు సామాన్యార్థముగా చెప్పవచ కాని శబ్దార్థమును చక విచారించినచో, ఉప+ఆసన=ఉపాసన, ఉప అనగా సమీ న, ఆసన అనగా నిలకడ కూర్చుండుట ఉపాస్య వస్తువు యొక్క సన్నిధానమున మ ను స్థిరముగా నుంచుట, ధ ధారణములే ఉపాసన శబ్దమునకు విశేషార్థములు.

సగుణోపాసన అనగా నామరూపములతో కూడిన విగ్రహమునకో, లేక వ్య షోడశోపచార యుతంగా పూజయు, నామ జప స్తోత్రాదులు చేయుటయు సగుణోపాసన

శ్లో॥ శ్రవణం కీర్తనం స్మరణం విష్ణోఃపాదసేవనం
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మ నివేదనం॥

అను నవవిధ భక్తులు సగుణోపాసనలోనేసాధ్యం. ఇది అంతయు బాహ్యభక్తి గురూపా విధానంలో సగుణరూపుడై తనకు మంత్రోపదేశంచేసిన గురువుల యెడల శిష్యుడు ఈ బాహ్య ముఖ్యముగా ననుసరించదగియున్నది.

నిర్గుణోపాసన : సృష్టికి పూర్వము సృష్టి బీజములగు సత్వ, రజ స్తమోగుణము జీవుల సకల సంస్కారములు బీజరూపంగా తన యందు గర్భీకృతం చేసుకున్నా, పరమా నిర్గుణుడు అని చెప్పబడుచున్నాడు. ఈ నిర్గుణ రూపము, సృష్టి సంకల్పము కలిగి గుణత్రయ విజృంభణ జరిగినపుడు కూడా, వ్యక్తముకాకుండా అనగా ఇంద్రియ గోచరము కాకుండా ఉన్నందున అతడే అవ్యక్తమని పేరొందినాడు. నామరూపయుతుడై జీవేశ్వర జగత్తుగా పరిణ మించినపుడు సోపాధిక నిరుపాధికములగు సమస్తమునందు బెల్లమునందు తీపివలె వ్యాపించి నామరూపములచే ఆవృతుడై కండ్లకు అగుపించక యున్నాడు. అముక్తము అనగా బెల్లమును తీపి విడిచియుండని రీతిగా జీవేశ్వర జగత్తును వీడి అన్య దేశమునలేడు మూర్తము అనగా ఆకారము, రూపము లేకుండా నిరవయవముగా నుండు - అవ్యక్తము. సర్వవ్యాపకము. నిరామయము, అముక్తము (లేక అమూర్తము) అగు పదార్థ కు పూజాధ్యానములు చేయుట ఎట్లు? ఆవాహన విసర్జనలెట్లు? అని ఈ శ్లోకములో ప్రశ్నిం చుచున్నది. కాని క్రియా రూపము కాకున్ననూ, భావనా రూపముగా మనస్సుచే ఈ ఆత్మను (లేక బ్రహ్మమును) ఉపాసించవచ్చును. ఈ మానసిక పూజయందు ఉపాస్య వస్తువునకు నా రూపములు ఉండనక్కరలేదు. పూజాద్రవ్యములు అవసరంలేదు. క్రియా రూపమగు పూ పసరమగు కాయక వాచికము లతో పనిలేదు. కాని ఉపాస్య వస్తువు గురుముఖతః వస్తు మైనవారికి గాని తదితరులకు

ఇది అసాధ్యమే. నిర్గుణోపాసనా విధానమందు ఆత్మవస్తువు యొక్క స్థాన స్వరూప స్వభావములు తెలిసియుండుట ముఖ్యావసరము.

గురుమూర్తి యొక్క సగుణ నిర్గున రూపములు రెండును నిజ సాంప్రదాయక సచ్ఛిష్యులకు ఆవశ్యము ఉపాసింపదగినవై యున్నవి. శరీరధారియై మంత్రోపద్రష్ట అయి వున్న గురుమూర్తి నామరూపములు సగోణోపాసనయందు ఉపాస్యములై యున్నవి. కాని ఇందుకు అనుకూలమగు దేశ కాలపాత్రలు అవసరము. అయితే సృష్టికి పూర్వమే యున్న గురుస్వరూపము. (అనగా అత్యంత గొప్పదైన పరమాత్మ స్వరూపము) దేశకాలాదులతో నిమిత్తము లేకుండా వుపాసింపదగియున్నది.

ఐతే, ఈ శ్లోకమునందు యిట్లు చెప్పినారేమి? ఆ గురు స్వరూపం అవ్యక్తమూ, సర్వ వ్యాపకము, అముక్తము, అమూర్తము, నిరామయమూనై యుండగా కిం, కథం అను ప్రశ్నలచే ధ్యానాదులు అసంభవమని సూచింపబడినదేమి? అంటే, ఆ వాహన విసర్జనములుంటే ఏకదేశీ యతా దోషము కలుగును. ఎట్లనగా ఇక్కడ లేకుంటే కదా ఇక్కడకు పిలుచుట? అక్కడ లేకుంటే కదా, అక్కడకు విసర్జించుట? మరిన్ని పూజాదికమునందు త్రిపుటి ఉండక తప్పదు. ఉపాసకుడు, ఉపాసన, ఉపాస్య వస్తువు అను త్రిపుటి వుంటే తప్ప ఉపాసన ఎట్లు సాధ్యము? అట్లే ధ్యానమునందు కూడా ప్రధమంలో ధ్యాత, ధ్యానము, ధ్యేయము అను త్రిపుటి ఉండును. కానీ, ధ్యానము పరిపక్వము అగుకొలది త్రిపుటి నశించి ధ్యాన ధ్యేరూపం వహించును. అంటే ధ్యేయమగు గురుస్వరూపమే తానై ఏకభావన చెందును. అపుడిక ధ్యానమను మాటయే పొసగదు. ఈ స్థితియందు మాత్రమే నిర్గుణోపాసన సంభవము. అవిచ్ఛిన్న తైలధారవత్‌గా ధ్యానము చేయునపుడు కూడ ద్విపుటి త్రిపుటులు తప్పవు. ఈ త్రిపుటీ రహితమే ధ్యానమునకు పరాకాష్ట. కృష్ణదేశికేంద్రులు తమ కందార్థంలో "జనులాత్మానుభవంబైనను ముక్త్యని పల్కిరిట్లు నమ్మకు, యెరుకే కనరాదెచ్చట గురుకృప, అనుభవ మెవ్వరికిపైన, ఆ మాట నిజమో, అనుభవముళ్ళక్కీ మాట నిజమో?" తెలిసికో మంటున్నారు. అనుభవ శూన్య మైనది కనుకనే శూన్య సమాధి అని అనవలసి వచ్చెను.

ఈ శ్లోకమును పరిపూర్ణ బోధ పరంగా ఎట్లు అన్వయించవలెను? పరిపూర్ణ బోధ సిద్ధాంతమున పరిపూర్ణ పరబ్రహ్మమందు యెరుక లేనే లేదు. ఉన్నదొక్క పరిపూర్ణ పరబ్రహ్మ మగుచో అందులేని ఎరుకను ఎచటనుండి ఆహ్వానము చేయవలెను. ఎచ్చటకు ఉద్వాసన చెప్పి పంపివేయవలెను. ములుగ్రుచ్చసందులేని పరిపూర్ణ పరబ్రహ్మము లోనికి లేని యెరుక ఎట్లు చొచ్చుకొనిపోగలుగును?

ధ్యానించే ఎరుకే లేనిచో లేని ఎరుకచేత లేని ఎరుకను ధ్యానించుటెట్లు? సేవించు టెట్లు? వంధ్యాపుత్రుని కుందేటికొమ్ముచే కుమ్మి చంపుటవంటిదే.

విశేష వివరణములు :

1) కిమావాహన మవ్యక్తే : వ్యక్తము కాని (యింద్రియ గోచరముకాని) అవ్యక్త రూపమైన యెరుకను ఆవాహన చేయుట యేమి? అని అర్థము. ఉన్నవి రెండు 1) పరిపూర్ణము 2) లేని

యెరుక. మరి లేని యెరుకను ఎచ్చట నుండి ఆహ్వానించవలెను? లేని ఎరుక కానిదొక్క పరిపూర్ణమే. కాని దాని నుండి ఆహ్వానిద్దామా అంటే దానియందు ఎరుకకు స్థానము లేదు. అందు ఎరుక పుట్టనేలేదు. కనుక ఆవాహనం అనే మాట నిరర్థకమై పోవుచున్నది.

1) వ్యాపకే కిం విసర్జనం : సర్వత్రా వ్యాపించియున్నదన్నచో అది లేనిచోటు ఏది? పరిపూర్ణ పరబ్రహ్మమే అది లేని చోటు. ఆ పరిపూర్ణ పరబ్రహ్మములోనికి విసర్జిద్దామా? అంటే అదిములుగ్రుచ్చ సందులేనిది. "అందుదూర నేరదురా" అంటున్నారు కృష్ణదేశికేంద్రులు.

కనుక ఎరుకకు ఆవాహన విసర్జములు లేవు అని చెప్పవలసివచ్చెను.

3) అముక్తాచ ("అమూర్తేచ" అని పాఠాంతరము) కథంపూజా : అనగా వేరుపడకుండా ఉన్న దానిని, (లేక మూర్తివంతము లేని అనగా సాకారము కాని) దానిని పూజించుట ఎట్లు? రూపముంటే ఆ రూపము ఒకచో ప్రతిష్ఠించుకొని పూజించుకొనవచ్చును. కాని అరూపమైన యెరుక దాని ఆవరణమందే ఓ తప్రోతమై (అనగా పడుగు పేక రీతిగా) విడివడకుండా సోపాధిక మైయున్నపుడు దానిని విడదీసి పూజించుట సాధ్యము కాదుకదా!

4) నిరామయంః : నిర్ + ఆమయంః = నిరామయంః, అమయః అనగా వ్యాధి, వ్యాధి అనగా యోగ విఘ్నము. యోగ విఘ్నములు లేనివాడు నిరామయుడు. అనగా యోగము నందే యెడతెగక యుండువాడు యోగము అనగా కూడిక, దేనితో కూడిక, తన ఆవరణరూపమైన ప్రకృతితో అవినాభావముగా ఎప్పుడూ విడిచి వేరుకాకుండా నున్నవాడు. అతడు నిరామయుడని పిలువబడుచున్నాడు. ఆ పరమాత్మతో ఏకత్వసాధన చేయువాడు. నిత్యయుక్తుడు అని గీత వర్ణించినది.

పరాపూజ అను పేరుతో నిర్గుణోపాసన కీర్తింపబడినది. ఈ పరపూజ పరిపూర్ణ పర బ్రహ్మము యొక్క వుపాసన అని కొందరు దురభిప్రాయపడుచున్నారు. పరిపూర్ణమనగా అది తప్ప మరేమి లేనేలేదు. ధ్యానించువాడు లేక పూజించువాడు కూడా లేని స్థితి పరిపూర్ణమునకు పరాపూజ అనేది కూడ వర్తించజాలదు. పూజాధ్యానాదులన్నియు యెరుకకే. పరిపూర్ణమునకు ఏమీ చెప్పరాదు. చెప్పితే ఆ చెప్పబడినది పరిపూర్ణమే కాదు.

గురువులేక గురు స్వరూపము అను వాని శబార్థము అఖండ ఎరుకలోనిదేకాని పరిపూర్ణమని చెప్పరాదు. పరిపూర్ణ పరబ్రహ్మము గురువు కాదు. లఘువు కాదు. కనుకనే "అణోరణీ యాన్ మహతోమహీయాన్" అని చెప్పబడ్డ ఆత్మ స్వరూపమే గురుస్వరూపము. దానికి ఏ ప్రమాణము (కొలత) చెప్పరాదు. సృష్టి కాధారమైయున్న పరమాత్మ స్వరూపమే గురుస్వరూపము. ఆ గురుస్వరూపమునే బాహ్యభక్తి, అనన్యభక్తి, ఏకాంత భక్తులతో శిష్యుడు ఉపాసింపవలెను. అతడే ఉపాస్య వస్తువు "సర్వశరీరస్థ చైతన్య ప్రాపకోగురు రుపాస్యః" అని నిరాలంబోపనిషత్తున్ను యుద్ఘాటించుచున్నది.

సగుణ నిర్గుణ రూపములలో గురువే ముమ్మాటికి వుపాస్య దైవమై యున్నాడని తెలిసికొని, ఆ గురువునే అన్నివిధములచేతను అహరహము అర్చించి, ధ్యానించి, గురుకృపకు

పాత్రులమై, ఆ గురుకృపా ప్రసాదముచేతనే సర్వభ్రాంతిరహితము పొందుదుముగాక!

శ్లో॥ భవమూల వినాశాయ చాష్టపాశ నివృత్తయే
గురుగీతాంభసి స్నానం, తత్వజ్ఞఃకురుతే సదా॥

తాత్పర్యము : సంసార మూలకారణమును బట్టి ఛేదించుట కొరకున్ను కుల బలాది అష్టపాశముల నివృత్తికొరకున్ను జ్ఞాని యెల్లప్పుడును గురుగీతా జపములయందు నిమగ్నుడై యుంటున్నాడు.

విశేష వివరణము : 1) భవమూలము 2) అష్టపాశములు 3) గురుగీత 4) అంభస్సు 5) గురుగీతాంభసిస్నానం 6) తత్వజ్ఞుడు అను పదముల వివరణ గావించి తెలుసుకొన్నపుడే యీ శ్లోకస్వారస్యము తెలియనగును.

1) భవమూలము : భవము అనగా పుట్టుక లేక యే వస్తువు గానైనను అగుట (లేక తయారగుట) అనగా కృతకమైన వస్తువు. పుట్టుకకు చావున్ను, కృతకమైన దానికి, పూర్వదశకు అనగా కారణ స్థితికి పోవుటయున్ను, సహజము, పుట్టుకకు పూర్వము, లేక వస్తూత్పత్తికి పూర్వము ఆ పుట్టినది తన కారణదశలో నుండియుండునేగాని అసలే లేకుండా మాత్రముండదు. కారణమునుండి కార్య ముత్పత్తి చెందినట్లే, వస్తు నాశనానంతరం అనగా వస్తువు నామరూపాలు గోల్పోయినపుడు కార్యము కారణమునందు పర్యవసించును. కారణము లేనికార్యముండదు. పుట్టినదానికి గిట్టుటయు తప్పదు. యీ పుట్టుచావులు, (లేక జనన మరణములు) పునఃపునః ఒకదాని వెనుక నొకటిగా తెంపులేక, కలుగుచుండును. గనుక దీనికి జనన మరణ ప్రవాహ మనిపేరు. ఈ జనన మరణ ప్రవాహము కూడ భవమనే శబ్దముచే వ్యవహరింపబడుచున్నది. ఇదియే సంసారము. ఈ సంసార మూలకారణమేది? అదియే యెరుక, కూకుడువేరు. దాని నెరిగి త్రవ్వివేయ వలెనన్నారు కృష్ణదేశికేంద్రులవారు.

మాయ (లేక అజ్ఞానము) లేక ప్రకృతియే సృష్టికి మూలకారణమని కొందరు చెప్పుచున్నారు. సృష్టికారణము (జగత్కారణము) బ్రహ్మమేనని శ్రుతిస్మృతులు ఘోషించుచున్నవి.(యీ విషయం పరిపూర్ణ దర్శనమందలి సృష్టి విజ్ఞాన ప్రకరణంలో విపులపరచబడినది) బ్రహ్మమే నిమిత్త కారణమై తన ప్రకృతినే వుపాదానముగా గైకొని సృష్టిగావించి అభిన్న నిమిత్తోపాదాన కారణముగా నున్నదని కొందరు సమన్వయించినారు. జ్ఞానా జ్ఞానరూపంగా (యెరుక మరుపుల రూపంగా) నున్న బ్రహ్మమే (అఖండ యెరుకే) అన్నియు తానే అయి తన్ను చూచుకొని తానే భ్రమించుచున్నదని అ... ఋషుల తాత్పర్యమైయున్నది. తానైయున్న సమస్తమును తానే ఆడించి, ఆడుచు అన్నిటికి తానే కర్త అయి వూర్ధ్వ అధో పరిణామములను చెందుచూ యీ యెరుకే సర్వమునకు మూలకారణమై యున్నది.

అన్నిటికి మూలమ... యెరుకైతే, ఆ యెరుకకు మూలమేమి? అను ప్రశ్న తప్పక ...చ్చును. ఐతే యెరుకగాని ... పరిపూర్ణ పరబ్రహ్మమే. కాని అది యెరుకకు మూలం కాదు ...ని సిద్ధాంతము. మిగతా... యెరుకే. యెరుకకు అసలే మూలంలేదని కొందరంటారు. ...ంటే యితర వస్తువేదీ ... వని మాత్రమే అర్థం. యెరుకే ఎరుకకు మూలం అన్నమాట

ఇది యెట్లు? ఎరుకే మేను, యెరుకే (జ్ఞానము) అను రెండు రూపములుగానున్నది. ఒకరూపము మరొక రూపమునకు కారణమగుచున్నది. కందార్థం "మే నెరుకల రెండింటిలో దానిని యిది దీనినందియు తగసృజి యించున్" అన్నారు కృష్ణదేశికేంద్రులు. నేను మేనుల రూపంగానున్న యెరుకయే అనగా ద్వంద్వ రూపంగానున్న ఏకైక వస్తువైన యెరుకయే భవమూలము.

2) అష్ట పాశములు : పాశమనగా త్రాడు. ఎనిమిది రకముల త్రాళ్ళచే జీవుడు బద్ధుడై తన స్వాతంత్ర్యమును గోల్పోవుచున్నాడు. ఆ యెనిమిది యేవనగా 1) దయ 2) జుగుప్స 3) మోహము 4) భయము 5) సంశయము 6) కులము 7) బలము 8) శీలము ఇందు తొలుదొల్త చెప్పబడిన దయ కూడా బంధకారణ మగుట యెట్లు? అనగా దయ లేక కరుణ వల్ల హృదయము ఆర్ద్రీభూతమై ఒక్కొక్క యెడ తన కర్తవ్యమునుండి విముఖుని గావించును. చేయరాని దానిని చేయుట యెట్టిదో చేయవలసిన దానిని ( కర్తవ్యమును) చేయకుండుటయు నంతే దోషము. నేరస్తుని శిక్షించవలసిన న్యాయాధిపతి నేరము పూర్తిగా ఋజువైన పిమ్మట శిక్షాస్మృతి ప్రకారము నేరస్తుని శిక్షించకుండా వానియందు దయజూపి వదలివేయుట దోషము కదా! ఆతతాయులైన కౌరవులనూ, వారి పక్షము, వహించిన వారినీ ధర్మయుద్ధములో నెదుర్కొ నాశనముచేయుటయే అర్జునుని స్వధర్మమైయుండగా జీవకా[illegible]ణ్యముచే హృదయం ద్రవీభూత చేసుకొని తన కర్తవ్యము విస్మరించి గాండీవం చేతి[illegible]నుండి జారిపోగా, రథము చతికిలబడుటకు కారణం అతని దయయేకదా! చివరిదగు[illegible]ము బంధకారణమెట్లగును. శీలమనగా దోషదూషితమైన అంతఃకరణ ప్రవృత్తియే ఇక్కడ[illegible]ంపబడినది. సత్శీలముగాద తెలియవలెను.

3) గురుగీత : భగవంతునిచే గానముచేయబడినది [illegible]నుక భగవద్గీతయని పేరువచ్చి[illegible] దన్నారు కొందరు, భగవద్గీతను

ఆ అర్థంలో గురువుచే గానం చేయబడినది గను[illegible]గురుగీతయని పేరు వచ్చినది చెప్పవచ్చును. పరమేశ్వరుడే ఆదిగురువు. అట్టి పరమేశ్వరుడు [illegible]ర్వతికి గురుగీతనుపదేశించెన గనుక ఆదిగురువుచే గానము చేయబడినది కనుక దీని[illegible]గురుగీత అని పేరువచ్చినది సమర్థించవచ్చును. లేదా గురు తత్వమును గూర్చియు గురు[illegible]వమును గూర్చియు గానమ చేయునది అనగా కొనియాడునట్టిది గనుక నది గురుగీత అ[illegible]నదని చెప్పనొప్పును. గురు[illegible] స్కాందపురాణ వుత్తర ఖండములో ఉమామహేశ్వర సంవా[illegible]రూపంగా చెప్పబడినది.

4) అంభస్సు : "అంభోమరీచి ర్మర మాపో" అ[illegible] అంభః, మరీచిః, మరః ఆ అని ఆపోతత్వము నాల్గురకములు. ద్యులోకము లేక సువర్లో[illegible]నకు పై నుండు లోకము అనగా మహరాదిలోకములలో నుండునది అంభస్సు అని[illegible] సూర్యునికి దిగువ నంత మందు అనగా భువర్లోకమునందునూ సూర్యకిరణములందు [illegible] నుండునది మరీచి యని భూలోకమునందుండునది మర అను జలము లనిన్ని భూమి[illegible]ందుండునని అపస్సులని పేర్లు "అపోవా యిదగుం సర్వం" అన్నట్లుగా సృష్టియంద[illegible] లోకముల అన్నిటికి వుపాద కారణమూ జలములే. వీనిని ఐతరేయోపనిషత్ విశదీకరించు[illegible]చు వీనినే లోకములనుచున్న

జలము నుండియే మృత్పిండమగు పృథ్వీభూతమున్ను ఆవిర్భవించినది, "అపోమయః ప్రాణః" జలముల యొక్క సూక్ష్మాంశము ప్రాణము. అంభస్సు అనగా సూర్యస్థానమునకు పైన ప్రాణశక్తి రూపంగా వ్యాపించి యుండు పరమాత్మ ప్రకాశమే అంభస్సు అని చెప్పనగును. సృష్టికి పూర్వం శ్రీ మహా విష్ణువు శేషశయనుడై పవళించిన క్షీరసాగర మీ అంభస్సులే. వుదకం నారాయణ స్వరూపం అనికూడ చెప్పబడినది.

5) గురుగీతాంభసిస్నానం : వేదములు బ్రహ్మ ముఖమున వెలువడినట్లు గురుగీత గురుముఖమున వెలువడినది. అంభస్సులను జలములు ప్రాణమయమై మహాశక్తివంతములై యున్నట్లే గురుగీతయు మహాశక్తివంతమైయున్నది. యిట్టి గురుగీతా పావనోదకముల యందు స్నానమాచరించుట యనగా గురుగీతను సదా పఠన, పాఠన, శ్రుతములు గావించుచు తదర్థమును మనస్సునందు గాఢముగా ధారణ యొనర్చుటయే గురుగీతాంభసిస్నానం. ప్రవాహోదకములయందు స్నానమాచరించుటవలన స్థూల శరీర శుద్ధియు స్థూల శరీరమునకుగల వాత పిత్తాది దోషములన్ను తొలగును. గురుగీతా జలములయందు స్నానమువలన సూక్ష్మశరీర సంబంధమగు మల, విక్షేప, ఆవరణ దోషములున్నూ కారణ శరీర సంబంధమగు మూలావిద్యా దోషమున్ను తొలగిపోవును. అపుడే అష్టపాశ నివృత్తి కాగలదు.

6)తత్వజ్ఞుడు : అనగా తత్వమును దెలిసిన జ్ఞాని, గురుతత్వమే ప్రథమ తత్వము. తత్ త్వం పదార్థముల ఏకైక రూపమే అనగా పరమాత్మయే తత్వము. దానిని గుర్తించినవాడే తత్వజ్ఞుడు, ఆతత్వము యొక్క ప్రభావము నెరిగిన జ్ఞాని. అష్టపాశ నివృత్తియు భవమూల నాశనమును ఆసించి ఆ గురుగీతాంబువులయందే సర్వదా నిమగ్నుడై యుండును అని యీ శ్లోకము యొక్క ముఖ్యా భిప్రాయము.

పైన చెప్పబడిన గురుగీతా ఫలమెట్లు సిద్ధించును? గురుగీతా పఠన, పాఠన, విచారనాదులవలన గురుకృపా సంసిద్ధికల్గును. గురుకృపా సంసిద్ధికి తార్కాణ మేమనగా గురు స్వరూపమే. తాను తానే గురుస్వరూపము అను అఖండజ్ఞానప్రాప్తియే దానితో అష్టపాశములు ఛేదింపబడి బంధ విముక్తి చేకూరును. గాని భవమూలము మాత్రము శేషించియే యుండును. కాని పూర్ణాధికారియైన ఆ శిష్యుడికి గురుమూర్తి పరిపూర్ణ కృపాకటాక్షముచే నెరింగిన పూర్ణబోధయందా రూఢమై, బంధమోక్షములు లేక జనన మరణములు భ్రాంతి మాత్రములుగా తెలియబడును. అపుడుగాని భవమూలం ఎరుక కూకుడువేరు ఛేదింపబడదు. ఈ అంతటికి గురుకృపయే కారణము కనుకనే గురుగీత మరొక చోట

శ్లో॥ కరుణా ఖడ్గపాతేన ఛిత్వాపాశాష్టకం శిశోః
సమ్యగానంద జనకః సద్గురు స్సోభిధీయతే॥

అని గురుమూర్తిని కీర్తించుచున్నది. అనగా ఎవరు శిష్యునియొక్క అష్టపాశములను తన కరుణ (గురుకృప) యనే ఖడ్గధారణచేత ఛేదించి గొప్ప ఆనందమును కల్గించునో అతడే సద్గురువని చెప్పబడుచున్నాడు. అనగా గురుకృపామృతం గంగా శీతలోదకములవలె తాపత్రయాగ్నిని

చల్లార్చుటయేగాక శిష్యుని అంతఃకరణమును బంధించి సంసారమూలమును పోషించు. అష్టపాశములను వజ్రాయుధమువలె ఛేదించుటకు కూడా ఎంతో సమర్థవంతమైయున్నది. గురుకృపా విశేషముచే అష్టపాశములు ఛేదింపబడిన వెంటనే శిష్యుడు ఆత్మానందము అనగా ఆత్మవస్తునిశ్చయ జ్ఞానంచే కల్గిన సంతృప్తిచెందును. ఆ పిమ్మట గురుకృపకు పాత్రుడై పరిపూర్ణబోధచే ఆత్మాతీతమగు కేవలాత్మనెర్గి జనన మరణ భ్రాంతి రహితము గావించుకొనుచున్నాడు.

అట్టి గురుగీతా పుణ్యోదకములలో నిత్యము నిమజ్జన మాచరించు దీక్షను గురు పరమాత్మయే మన కనుగ్రహించునుగాక!

శ్లో॥ ఆసనస్థాశ్శయానోవా గచ్ఛన్త స్తిష్ఠతోపివా
అశ్వారూఢా గజారూఢా సుషుప్తా జాగ్రతోపివా॥

శ్లో॥ శుచిర్భూతా జ్ఞానవంతో గురుగీతాం జపన్తియే
తేషాందర్శన సంస్పర్శాద్దివ్య జ్ఞానం ప్రజాయతే॥ (పునర్జన్మ నవిద్యతే)

తాత్పర్యము : ఆసనము వేసి శరీరమును కదలిక లేకుండ చేసిన వాడైనా,పరుండియున్నవాడైనా, నడచుచున్నవాడైనా, లేక నిలబడియున్నావాడైనా, గుఱ్ఱము, యేనుగు మొదలగు వాని నెక్కియున్న వాడైనా, నిద్రలోయున్నా, జాగ్రదవస్థలోనున్నా, ఎవరు శుచిర్భూతులై గురుగీతను జపింతురో అట్టి వారిని దర్శించుట వలననూ స్పృశించుటవలననూ, ఆత్మజ్ఞానము కలుగును. జన్మరాహిత్యము కలుగునని పాఠాంతరము ఎల్లప్పుడు గురుగీతా జపము చేయువారి దర్శన స్పర్శనముల మాత్రము చేతనే జనుడు ముక్తుడగునని యీరెండు శ్లోకముల ముఖ్య తాత్పర్యము.

విశేష వివరణము : 1) సుషుప్తా జాగ్రతోపివా 2) గురుగీతా జపము 3) శుచిర్భుతా 4) జ్ఞానవంతో 5) దర్శన స్పర్శనములు 6) దివ్యజ్ఞానం 7) పునర్జన్మ నవిద్యతే. ఈ రెండు శ్లోకములలో మొదటి శ్లోకమునందు గురుగీతా జపము చేయు వాని స్థూల శరీరము ఎట్లున్నా జాగ్రత్ సుషుప్తలలో యే అవస్థలోనున్నా పరిగణింపపనిలేదని, అది అప్రధానమనీ, చెప్పబడినది. ఐతే యేది ప్రధానము? అంటే వాని మనస్సు యొక్క స్థితియే ప్రధానము, అందుచేతనే జాగ్రదవస్థ, సుషుప్త్యవస్థ మాత్రమే చెప్పబడినవిగాని స్వప్నావస్థ చెప్పబడలేదు. స్వప్నావస్థలో మనస్సు విక్షేపము చెంది, బహుచంచలమై భావనా ప్రపంచమున విహరించుచుండును. స్వప్నావస్థయందు మనస్సు పరిశుద్ధముగా (శుచిర్భూతముగా) నుండదు. జన్మాంతర సంస్కారములు లేదా వర్తమాన జన్మ సంస్కారములతో నుండి ఏకాగ్రత లేక మహా చంచలమై యుండును. ఆ అవస్థయందు జపము జరుగనే జరుగదు.

2)గురుగీతా జపం : "తజ్జప స్తదర్థ భావనం" అని జపశబ్దము నిర్వచింపబడినది. అర్థభావన యనగా శబ్దార్థము మాత్రమే కాదు. ఆ శబ్దముచే ఏ వస్తువు నిర్దేశింపబడినదో ఆ

స్తువు యొక్క ధారా వాహిక ధ్యానమే అర్థభావన. 2వ శ్లోకములోని జపశబ్దమున కీవిధమ అర్థమునే గ్రహించవలెన. గీతా జపము అనగా గురుగీతయందు యే వస్తు తత్వము తిపాదింపబడినదో ఆ స్వరూపం యొక్క ధారావాహికమగు ధ్యానమే గురుగీతా పముగాని మంత్రమును ధ్యాన మొనర్చుటగాదు. గురుగీతయందు సగుణ నిర్గుణ రూపములలో గురుతత్వమ పూర్ణముగా వర్ణింపబడియున్నది. కనుక అట్టి గురుతత్వము ందు మనస్సును నిలుపు మనస్సు గురుతత్వముతో నిండి తాదాత్మ్యము జెంది, నస్సే గురుస్వరూపముగ ఉంట) యే నిజమగు జపము. ఇదియే గురుగీతా జపము ని గురుగీతా శ్లోకములన యణ మొనర్చుట గురుగీతా జపము కానేరదు.

3) "శుచిర్భూతా" శుచిగలవాడై (పరిశుద్ధుడై) అని అర్థము. శుచి లేక శౌచము ండు విధములు. 1) బాహ్య 2) అంతశ్శౌచము. స్నానాదులచే స్థూల శరీరమునందలి న్ని విధములగు మాలిన్యమ ను లేకుండా చేసుకొనుట బాహ్యశౌచము. అంతఃకరణ మాలిన్యములగు, కామక్రోధా దుర్గుణము లెల్లను విడచి యుండుట అంతశ్శౌచము. ఈ కామక్రోధాదులు రజోగుణ సంబంధములు.

శ్లో॥ కామయేష క్రోధ ఏష రజోగుణ సముద్భవః
మహాశనో మహాపా ............" అనిన్ని

శ్లో॥ కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసాం
అభితో బ్రహ్మ నిర్వాణం వర్తతే విదితాత్మనాం" అనిన్ని

భగవద్గీత చెప్పుచున్నది. అనగా కామక్రోధములు రజోగుణము వలన పుట్టినవి. కామము అనగా విషయవాంఛ, ఎప్పటికి విషయానుభవమునకు తృప్తిలేదు. యివి పాపభూయిష్టములనిన్నీ, కామక్రోధాదుల జయించి నిశ్చలచిత్తుడై ఆత్మజ్ఞానము పొందినవారికి బ్రహ్మానందము కరతలామలక మనియు భావము. కామక్రోధాది దుర్గణము లన్నియు అసురసంపదకు చెందినవి. దైవసంపద కలవారికే, గురుగీతా జపము అనగా గురుస్వరూప ధ్యానము సాధ్యమై ఫలప్రదము కాగలదు. ఐతే త్రిగుణములులేని అంతఃకరణముండునా? అట్టి యెడ కామక్రోధాదులు ఎవనికైన నుండక తప్పదుగదా! అని సంశయింప పనిలేదు. సత్వగుణ ప్రధానమగు అంతఃకరణమునందే "సత్వాత్సంజా యతే జ్ఞానం" అని చెప్పబడినట్లుగా జ్ఞానోత్పత్తి కాగలదు. సత్వగుణ ప్రధానమనగా, రజస్తమో గుణముల నణగ ద్రొక్కి, ఎక్కువపాలులోనున్న సత్వగుణోపేతమగు అంతఃకరణము సత్వగుణ ప్రదానమని అర్థము. అంతేగాని ఆ యంతఃకరణ రజస్తమోగుణములసలె లేవని అర్థం కాదు. అంతః కరణ మాలిన్యములగు కామక్రోధాదులు నశించుట అంతశ్శౌచము. అంతశ్శౌచము గలవానికే గురుగీతా జపము సాధ్యము. గురుగీతా జపము వలన అంతశ్శౌచము కలుగును. ఒకదానిమీద నొకటి ఆధారపడి యుండును. ఐతే ఏది ముందు ఏది తర్వాత అని ప్రశ్నిస్తే రెండును ఏకకాలమునందే వికాసము పొందవలెను. జపము చేసిన కొద్దీ అంతశ్శౌచము కల్గిన కొద్దీ

జపసిద్ధి కల్గును. బాహ్యశౌచ మెంత గావించినా మరల స్థూల శరీరము మలినమగుచుండును. కాని అంతశ్శౌచ మట్లు కానేరదు. కామక్రోధములను జయించినవానికి జపసిద్ధి కలిగి సర్వత్ర (బాహ్యాభ్యంతరములయందు) బ్రహ్మమే భాసించుట వలన మరల నిక కామక్రోధాదులు దరిజేరలేవు.

జపము మూడు విధములు అని మంత్ర పునశ్చరణ విషయంలో చెప్పబడినది. 1) వాచికము 2) వుపాంశుజపము 3) కేవల మానసిక జపము. వైఖరీ వాక్కుచే శబ్దము పలుకుట వాచికము. కంఠనాళముల స్పందన మాత్రముగా చేయునది వుపాంశువు. కేవలం మనస్సునందే ఆ వృత్తి జరుగునది మానసికము. ఇందు మానసికముగా జరుపుటయే శ్రేష్ఠము. గురుస్వరూపము ను ధారణజేయుటయే గురుగీతా జపము. అది అంత శ్శౌచముగలవానికే సాధ్యమనుట నిస్సందేహము.

5) జ్ఞానవంతుడు : గురు స్వరూపము చిద్ఘనము (లేక జ్ఞానమయము) గదా! గురు స్వరూపమును మనస్సునందు ధారణ చేయుట వలన మనస్సు నిర్విషయమై నిజ స్వరూపమే కాగలదు. మనస్సును ఆ విధంగా వూర్ధ్వ పరిణామమును చెందించినవాడే జ్ఞానవంతుడు.

6) దర్శన స్పర్శనములు : పైన చెప్పిన జ్ఞానవంతుని దర్శనము చేయుటవలన ఉత్తేజితుడైన మానవునికి శుభ సంకల్పములు కలుగుటలో నాశ్చర్యమేమి? అట్టి శుభేచ్ఛయే అతని పురోభివృద్ధికి ప్రధమ సోపానము. తన బాహ్యాంతరములయందు జ్ఞానప్రకాశమే నిండుకొని యున్నట్లుగా జ్ఞాని నిరంతరం భావించు చుండును. "యాదృశీ భావనా యత్ర తాదృశీ భవతి నిశ్చయం" అను న్యాయంగా అతని శరీరము కూడా జ్ఞాన మయమైయుండును. అట్టివాని దర్శన స్పర్శనమువలన తప్తాయఃపిండము (కాలిన యినుప ముద్దను) స్పృశించిన వానికి దాని, వుష్ణము సోకిన విధంగా, జ్ఞానవంతుని శరీరము యొక్క దర్శన స్పర్శనములచే మానవుడు పునీతుడు కాగలడు. అందుకే "సాధూనాం దర్శనం పుణ్యం స్పర్శనం పాపనాశనం" అని చెప్పబడినది. "యస్య సన్నిధిమాత్రేన చిదానందాయ తేనమః" అని గురుగీత అన్యత్రా చెప్పుచున్నది.

"అధ్యతిష్ఠద్దశాంగులం" అని చెప్పబడిన రీతిగా ప్రతి వస్తువును పరివేష్టించి దాని తేజస్సు కొంత పరిధిలో వ్యాపించియుండును. ఆ పరిధిలోనికి వచ్చినచో ఆ వస్తుగుణము లేక శక్తి కొంత సంక్రమించగలదు. మంచిగంధపు చెట్టు సమీపములోని యితర చెట్టునకు కూడ ఆ సువాసన సంక్రమించినట్లేయని తెలియదగును. అందుచేతనే సుందర దృశ్యము, నిర్మల వాతావరణము, పవిత్రక్షేత్రము పారమార్థిక సాధకులకు విధింపబడినది. గురుగీతా జపమువలన శుచిర్భూతుడై (అంతరంగ శుద్ధికల్గినవాడై) జ్ఞానవంతుడైన వాని దివ్య సన్నిధి వలన దర్శన స్పర్శనములవలన దివ్యజ్ఞానము అనగా బ్రహ్మ జ్ఞానము కల్గి మానవుడు జన్మ రాహిత్య రూపమోక్షమునే చివరకు పొందగలడు. అని యీ శ్లోకములుద్ఘాటించుచున్నవి.

• సగుణ నిర్గుణ రూపములలో సాక్షాత్కారించి భక్తులను కరుణామృత దృష్టి హస్తమస్తక

సంయోగము పాద స్పర్శల మూలంగా దర్శన స్పర్శనల నొసంగి వుద్ధరించు సద్గురుమూర్తికివే మా సహస్ర సాష్టాంగ దండ ప్రణామములు.

శ్లో॥ అనన్తఫలమాప్నోతి గురుగీతా జపేనతు
సర్వపాప హరాదేవీ సర్వదారిద్ర్య నాశనీ॥

తాత్పర్యము : జనుడు గురుగీతను జపించుటచేత అధికమైన ఫలమును పొందుచున్నాడు. ఓ పార్వతీ! ఈ గురుగీత సమస్తపాపములను హరించునదియును, గొప్ప దరిద్రమును నశింప చేయునదియును అగుచున్నది.

విశేష వివరణము : 1) అనంతఫలము 2) గురుగీత జపేనతు 3) సర్వపాపహరము 4) సర్వదారిద్ర్య నాశని అను పదములను వివరముగా విచారించవలెను.

1) అనంతఫలము : అ+అంతఫలము = అనగా అంతులేని ఫలం, అంతకన్న గొప్పఫలం లేదన్నమాట, ఏకర్మలేక పని చేసినా దానికి ఫలిత ముండకమానదు. పుణ్యకర్మాచరణ ద్వారా పుణ్య ఫలము, పాపకర్మాచరణ ద్వారా పాపఫలము కలుగుచున్నవి. దాన ధర్మములు యజ్ఞయాగాది క్రతువులు, కృఛ్ర చాంద్రాయణాది వ్రతములు, జపధ్యానాది క్రియలు చేయుట ద్వారా అనేక పుణ్యసంస్కారములను ఏర్పరుచుకొని ఐహికసుఖములు, పరలోకభోగములు అనుభవించవచ్చును. కర్మకు కారణములైన మనఃప్రాణ వాక్కుల ద్వారా పుణ్యపాప కర్మాచరణలు చేయుటచే అని సంస్కార రూపములై నీచోత్తమ జన్మలకు దారితీయుచున్నవి. ఈ శ్లోకమునందు గురుగీతా జపమువలన అనంత ఫలము కలుగు నవి. పరమేశ్వరుడు పార్వతీదేవికి ఉద్భోధించెను. ఇక్కడ అనంతఫలము అననేమియో విచారించవలెను.

అనేక జన్మలలో చేసిన పుణ్య సంస్కారముల ఫలితమువల్లనే తనకు పవిత్రమైన ఈ మానవజన్మ లభించినదికదా! ఇట్టి మహోత్కృష్టమగు మానవోపాధికి వచ్చి తన స్వధర్మమును గుర్తించి మానవుడుగా ప్రవర్తిల్లగలుగుట ఇంకనూ అధికపుణ్యఫలమే! సత్సాంగత్యము ద్వారా తన నిజరూపమైన పరమాత్మస్థానమును పొందుటకు పురుషకారము పూని ప్రయత్నించుట ఇంకనూ అధిక పుణ్యఫలితమే! కాని ఇక్కడ ఒక ముఖ్యవిషయమును గమనించవలసియున్నది. పాపకర్మములు పుణ్యకర్మాచరణ ద్వారా పోగొట్టుకొనవచ్చునని యెంచి తాము ఏవిధముగానైన సరే ధనార్జన చేసి దానితో అనేక పుణ్యకార్యములు చేయుచూ ఉన్నారు. కాని ఏకర్మకు ఆకర్మ ఫలితము అనుభవించి తీరవలసినదే. పుణ్యకర్మవాసనలు హిరణ్మయ సంకెళ్ళు గాను పాపవాసనలు ఇనుపసంకెళ్ళుగాను, బంధించి మరల ఉపాధికి తీసుకుని రాక మానవు. యజ్ఞ యాగాది క్రతువులు జపానుష్టానాది సాధనలు చేసి స్వర్గాది సుఖభోగములు అనుభవిస్తున్నా "క్షీణే పుణ్యే మర్త్య లోకం విశంతి" అను గీతా నిర్ణయానుసారం తిరిగి "పునరపి జననం, పునరపి మరణం" అనునట్లు జన్మపరంపరలకు వచ్చి తీరవలసినదే. ఇదికాక మానవజన్మ పొందినందుకు ముఖ్యకర్తవ్యము మరల జన్మలేకుండా చేసుకొనవలెననియెంచి కొందరు తత్వవిచారణయో, యోగాభ్యాసమో, మతనిర్ణయానుసారప్రవర్తనయో, భక్తిసాధనయో లేక మంత్రోపాసనయో చేయుచూ జన్మకారణమైన పరమాత్మ స్థానమును పొందుటకు ప్రయత్నించు

చున్నారు. ఆ పరమాత్మ స్థానమును పొందినచో తన కింక జన్మకర్మలు ఉండవని వారి అపోహ.

అనేక జన్మల పుణ్య సంస్కారముల పలితము పరిపక్వమైనగాని స్వస్వరూప సాక్షాత్కారము కలుగుట అత్యంత దుస్తరము. వేయిమంది పండితులలో ఏ ఒక్కడో స్వస్వరూప పదార్థజ్ఞానము పొందినవాడుండుననుట అతిశయోక్తిగాదు. పుణ్యఫలమువల్లనే సాధుజన సత్సాంగత్యములు కలుగును. పిదప సద్గురు సందర్శనకలిగి ఆత్మాభ్యున్నతికి తీవ్రకృషి చేసి సఫలీకృతుడు కాగలడు. అనన్తఫలమనగా ఆత్మ స్వరూపమును పొందుటయే అని మనకు స్థూలముగా కొంతవరకు తెలియుచున్నది. కాని ఆత్మస్వరూపస్థితిని పొందియున్న వానికి కూడా మరల జన్మవిధానము తప్పదు. ఏలనన ఆత్మనుండియే సమస్త సృష్టి గావింపబడినదని వేదములు, ఉపనిషత్తులు ఘోషించుచున్నవి. అందువల్ల ఆత్మస్థానమును పొందుట మాత్రమే అనన్తఫలముకాదు. "ఆత్మాతీతం కేవలాత్మ" అనున్యాయంగా పరిపూర్ణభోద తనకు సంప్రాప్తమై "నస పునరావర్తతే" అను శ్రుతి నిర్ణయానుసారంగా తిరిగిరానిపూర్ణ యోగమైన పరిపూర్ణబోధ తనకు లభ్యమై తనకు ఆరూఢమై సర్వభ్రాంతి రాహిత్యస్థితి పొందుటయే అనంతఫలము అని చెప్పకతప్పదు. ఏలననగా అంతకన్న పొందగల్గేది లేదు గనుక అనేక జన్మల పుణ్య సంస్కారములు రాశీ భూతమై ఫలించినగాని తనకు పరిపూర్ణ గురుసందర్శనమే కలుగ జాలదు. "తన పుణ్యోదయమున గురునిగాంచి" అని శ్రీకృష్ణ దేశికులు పేర్కొన్నారు. ఇక సర్వోత్కృష్టమైన పరిపూర్ణ బోధ పొందుటకు ఇంకను ఎన్ని జన్మల పుణ్యమో పండినగాని లభ్యముకాదుగదా! ఒక గురుగీతాజపమువల్లనే అనంతఫలము అనగా తన నిజరూపమైన పరమాత్మ స్వరూపం తెలియబడుట, పిదప పరిపూర్ణ బోధచే సర్వభ్రాంతి రాహిత్యమును శాశ్వత జన్మ రాహిత్యమును సోపాన క్రమంగా లభించగలవని తెలియవలెను.

ఐతే, శాశ్వత జన్మరాహిత్యము లేక సర్వభ్రాంతి రహితము ఒక ఫలమగునా? కాజాలదు. ఏలననగా ఫలము అనేది కర్మవలన సిద్ధించును.గురుగీతాజపము గూడా ఒక కర్మయే అనుటకు సందేహము లేదు. గురుగీతాజపమువలన శాశ్వత జన్మరాహిత్యము ఎట్లు సిద్ధించును?అని న్యాయముగా సందేహము కలుగవచ్చును. ఐతే గురుగీత పరిపూర్ణ బోధ ఎట్లు ఆత్మతత్వరూపమునేకాక పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపముగూడా దర్శింపజేసి జన్మ రాహిత్యము ఎట్లు సమకూర్చునో వర్ణించియున్నది. గురుగీతా జపముచేత ఆత్మసాక్షాత్కారం పొందిన శిష్యుడు గురుకృపకు పాత్రుడై కేవలాత్మను కూడా అవలోకనము గావించుకొని సర్వభ్రాంతి రహితమును నదించితీరును. శాశ్వత జన్మరాహిత్యము అనంత ఫలమైయున్నది. అది గురుగీతాజపముచేత సిద్ధించు ననియు ఈ శ్లోకములో చెప్పబడినవి. పరిపూర్ణము నిత్యసిద్ధం అది ఒక కర్మఫలంకాదు.

2) గురుగీతా జపేనతు : అనగా గురుగీత జపించుటవల్ల అని అర్థం. గురుగీతాజపము అనగా నేమియో, తెలియవలసియున్నది. గురుస్వరూపమనగా పరమాత్మ స్వరూపమేకదా! అట్టి పరమాత్మ తత్వమును గూర్చి విపులముగా గురుగీతయందు పరమేశ్వరుడు పార్వతీ దేవికి చెప్పినట్లుగా తెలియుచున్నది. గురుగీతా జపమనగా ఊరికనే గురుగీతను పఠించుటకాదు. గురుస్వరూపనిర్ణయము పొందుట. పిదప "తజ్జపస్తదర్థ భావనం" అనే న్యాయంగా ఆ

వస్తువునందు మనస్సు లగ్నముచేయుటయే గురుగీతాజపము. ఆ గురుస్వరూపము ఏరీతి పొందదగియున్నదో గురుగీత ప్రథమాధ్యాయమందు చెప్పబడి యున్నది. "గురుకృపాప్రసాద సిధ్యర్థే జపేవినియోగః" అను నిర్ణయానుసారం గురుకృపకొరకై జపము చేయుమని సంకల్పము చెప్పబడు చున్నది. ఇక్కడ జపమనగా నేమియో తెలియవలసియున్నది.

1) వాచిక జపము : అనగా వైఖరీ వాక్కుతో బిగ్గరగా పైకి వినబడునట్లుగా చదువుట 2) ఉపాంశుజపము : అనగా పైకి వినబడకుండా లోపల కంఠనాళముల స్పందన ద్వారా తనలో తానే జపించుట 3) మానసిక జపము : అనగా మంత్రాక్షరములు కేవలము మనస్సులో తానే ఏవిధమైన చలనము తనయందు వ్యక్తము గానివ్వకుండా మనస్సు మంత్రరూపమగుట. ఇది మిగిలిన రెండు కంటె ఉత్తమమైనది. ఈ మానసిక జపము ద్వారానే ఏకాగ్రత సాధించి గురుమంత్ర సిద్ధిపొందుటకు ఎక్కువ వీలుకలదు.

ఇదియే గాక "తజ్జపస్తదర్థభావనం" అను యోగసూత్రప్రకారము అర్థభావన చేయుట అనగా మంత్రార్థమును గురుమంత్ర అధిష్ఠాన దేవతను గురుముఖతః ఎరిగి అనగా సాక్షాత్కరించుకొని దానిని భావించుట మంత్రార్థమును మాత్రమే గురువుచెప్పి వూరకుండునా! ఆ మంత్రాధిష్ఠాన దేవతయొక్క స్థాన స్వరూప స్వభావములను వివరంగా శిష్యునకు చెప్పును. అది విన్న శిష్యుడు మంత్రార్థ భావనతో మనస్సు స్వరూపమందే నిలిపి ధ్యానము చేయుట ద్వారా తానే ఆత్మస్వరూపు డనను, అఖండ జ్ఞానసిద్ధి పొందును. ఇది మిగిలిన అన్ని జపములకంటె అత్యంత విలువైనది. ఇపుడు గురుగీతాజపమనగా గురుగీతను పఠించుట కాదనియు, గురుస్వరూప నిర్ణయము మంత్ర నిర్మితపద్ధతిలో గురుముఖతః వస్తునిశ్చయము గావిని, స్వరూప నిర్ణయమందు మనస్సుతో అనన్యచింతనతో ధ్యానముచేయుట అని తెలియవలెను. ఇదియే నిజమైన గురుగీతాజపము. ఇదియే గురుకృపాప్రసాదసిద్ధి అట్టి గురుకృప పొందినగాని, అనంతఫలమైన పరమాత్మ స్వరూపము తెలియబడి, పరిపూర్ణబోధ లభ్యమై సర్వపాపములు హరించి, సర్వదరిద్రములు నాశనము కావని ఈ శ్లోకములో ఈశ్వరుడు పార్వతిని హెచ్చరించుచున్నాడు.

3) సర్వపాపహరము : సర్వపాపహరము అనగా సమస్త పాపములు హరించునవి అర్థము. అంతఃకరణయందు సుస్థిరమైయున్న శుభాశుభవాసనలవల్లనే అనేక పుణ్యాపాప కర్మాచరణలకు ప్రేరణ కలుగుచున్నది. ఈ కర్మాచరణంవల్ల మరల సంస్కారములు ఏర్పడి ఉత్తర జన్మలకు కారణమగుచున్నది. యిదే పాపము యొక్క స్వరూపము "బుద్ధిఃకర్మానుసారిణి" అను న్యాయముగా వాసనల ప్రేరణచే బుద్ధి కర్మలయందు ప్రవర్తిల్లుచున్నదనియు తద్వారా కర్మ వాసనలు బలీయములగుచున్నవనియు తెలియుచున్నది. ఈ పుణ్యాపాపవాసనవల్లనే మానవుడు సుఖ దుఃఖములు పొందుచున్నాడు. పారమార్థిక అభ్యున్నతికి ప్రథమసోపానము శుభేచ్ఛఏర్పడగలదు. ఇందు సర్వశబ్దప్రయోగముచే ఏ మాత్రము మిగల్చక సమస్తమూ హరించునని చెప్పుచున్నది. పాపసంస్కారములు లేక అశుభవాసనలు, శుభవాసనలచే అనగా పుణ్యకర్మాచరణ ద్వారా రద్దుచేసుకొనవచ్చునని కొందరు అభిప్రాయపడి దానినిమిత్తమై

(పుణ్యసంస్కారములకొరకై) అనేక పుణ్యకర్మలు చేయుచున్నారు. కాని పుణ్యసంస్కారముల వల్ల పాప సంస్కారములు రద్దు కావనియు. దేని ఫలితము అది వేరుగా అనుభవించి తీరవలసినదియే అనియు స్పష్టముగా తెలియవలెను. ఎందుచేతననగా ఈ పుణ్యపాప సంస్కారములకు వాసనలకు నిలయమైయున్నది అంతఃకరణయే కదా! ఈ అంతఃకరణము సమూలముగా నాశనము గావించినగాని ఈ సంస్కారబీజములు నాశనం కాజాలవు. "తత్వజ్ఞానము అనగా ఆత్మ స్వరూప నిశ్చయము పొందుట ద్వారా మనోనాశనము పొందవచ్చునని, తద్వారా ఈ పుణ్యపాపవాసనలు పోవునని చెప్పబడుచున్నది. కారణమందు సమూలముగా నాశనముచెందిన గాని కార్యమందు నాశనము కాదు. వాసనలకు పుట్టిల్లు, సుఖసంతోషములకు ఆశ్రయమై జనన మరణములు పొందుచున్న ఈ వ్యష్టి లింగశరీరమునకు కారణమైయున్న అఖండ ఎరుక (పరమాత్మ) కు పరిపూర్ణ పరబ్రహ్మమందు మూలముగాని, కొనకు ప్రవేశించుటకు స్థానముగాని లేదని ఆరూఢపరచుకొన్నవారికి వ్యష్టి సమిష్టి రూప అంతఃకరణము నాశనమై శుభాశుభవాసనలే లేకుండా సర్వపాపములతో సహా, పుణ్య సంస్కారములు కూడా నాశనమై శాశ్వత జన్మ రాహిత్యము గావించును. ఈ శ్లోకమందు సర్వపాపహరము అని పేర్కొనినా రేమి? అనుశంక కలుగవచ్చును. అనగా పాప సంస్కారములన్నియు రహితమై, పుణ్యసంస్కారముల పరిపక్వమై అంతఃకరణశుద్ధికలిగి, సద్గురు సందర్శన కలిగి తన నిజరూపమైన పరమాత్మస్థానము తెలియబడుటకు సర్వపాపములు గురుగీతా జపముచే సాధకుడు ప్రప్రథమమున నాశనము చేసి తీరవలసినదే ఏలనన పరమాత్మ స్థానము పొందిన వానికిగాని అనగా అఖండ ఎరుక నిర్ణయము వస్తు నిశ్చయముగా తెలిసినగాని పరిపూర్ణ భావము అతుకజాలదు. అందువల్ల పాపసంస్కారములు హరించుటరీత్యా పుణ్యఫలము వృద్ధియై పరమాత్మ స్థానముపొంది పిదప పుణ్య పాపసంస్కార రహితమై పిదప పరిపూర్ణ బోధను పొందవలసియున్నదని గ్రహించవలెను. యీ పుణ్యపాపములు ఎరుకయొక్క సహజచేష్టలుగా అభివర్ణిస్తూ, శ్రీకృష్ణ దేశికులు "పాపములు పుణ్యములు భువి ప్రాప్తించును, ఎరుకచేత భ్రమసినవారిన్‌ప్రాపింపవు ఏరుక నెడబాసిని తాపసులను" అని కందార్థమందు నిర్ణయించినారు. ఈ శ్లోకములో గురుగీతాజపము వల్ల సర్వపాపములు హరించుట రీత్యా ఆత్మస్వరూపము తెలియబడిపుణ్యసంస్కారములవల్ల పిదప పరిపూర్ణబోధ లభ్యముకాగలదని గ్రహించనగును.

4) సర్వదారిద్ర్య నాశనము : దారిద్ర మనగా లేమి ఏది లేక పోయినను దారిద్రమే అనవచ్చును. కాని గొప్ప దారిద్రమేది? అన్నచో జ్ఞానదారిద్రమే అని చెప్పకతప్పదు. ఏలనన. ఏ దారిద్రమైనా ఈ జన్మతో సమాప్తిపొందునేమోగాని జ్ఞానదారిద్ర్యము జన్మజన్మలకు వెంటాడుచునే వుండును. పారమార్థిక సాధనలో గురుసేవా శుశ్రూషల ద్వారా ఆత్మస్వరూపస్థితిని పొందక, అణిమాది అష్టసిద్ధులు పొంది, సుఖభోగములు అనుభవించుచున్నను పారమార్థికముగా వానిని దరిద్రుడెనని చెప్పవలెను. ఆత్మస్వరూపస్థితి పొందినవాడు ప్రాపంచిక దృష్ట్యా లేమిరికమే అనుభవిస్తున్నా వానిని ఐశ్వర్యవంతుడనియే చెప్పవలెను. అసంతృప్తియే దారిద్రమని శంకరాచార్యులవారు పేర్కొనినారు. అజ్ఞానమే దారిద్రమని కూడా నిర్ణయించినారు. ఈ దారిద్ర

ము అన్ని దారిద్రములకన్నా భరింపరానిది. తానే ఆత్మస్వరూపుడను అని ఆరూఢమైన జ్ఞానికి ఆశగాని నేను నాది అను మమకారములుగాని, అసంతృప్తిగాని యుండవు. కావున అతడే ఐశ్వర్యవంతుడని చెప్పబడును. అతడు పరమసంతృప్తితో వ్యవహరించును. కౌపీనవంతఃఖలు భాగవంతః అన్న మాట సార్థకమగును. ఇట్లు ఆత్మస్వరూప సాక్షాత్కారము శాస్త్రజ్ఞానముచేత గాని మరియే ఇతర సాధనలచేతగాని కలుగజాలదు. తత్వదర్శియగు గురుమూర్తి అనుగ్రహము వల్లనే సచ్ఛిష్యులు వస్తునిశ్చయమును పొందదగియున్నది. మహావాక్యార్థశ్రవణ మనన మాత్రముచే వస్తు వివరణ పొందగలరేగాని వస్తుసాక్షాత్కారమును పొందరనుట అతిశయోక్తికాదు. సర్వదారిద్ర్యనాశనము ఏట్లు చేకూరును? అన్నచో ఒక్క ఆత్మస్వరూప స్థితిపొందినపుడేనని చెప్పకతప్పదు. జ్ఞాని యనగా తత్వదర్శి అనిగీతయందు "జ్ఞానీనాం తత్వదర్శినః" అని నిర్ణయింపబడినది. ఒక్క గురుగీతాజపము మాత్రముననే శిష్యుడు సర్వదారిద్ర్యనాశనము పొంది తద్వారా ఆత్మస్వరూప యదార్థస్థితి పొందగలడని గ్రహించవలసియున్నది.

ఈ శ్లోకమందు పరమేశ్వరుడు పార్వతీదేవికి గురుగీత జప ప్రభావమును గూర్చి వివరిస్తూ గురుగీతాజపమువల్లనే అనేక జన్మల యందు చేయబడిన పుణ్యసంస్కారములన్నియు ఫలించి, అన్ని జన్మ లందు చేయబడిన గొప్ప పాపములన్నియు హరించుట ద్వారా గొప్ప దారిద్ర్యమగు అజ్ఞానమును పోగొట్టుకొని ఆత్మస్వరూప సాక్షాత్కారమును గురుకృపాప్రసాద సిద్ధిద్వారా పొందదగియున్నదని నిరూపించెను. వ్యాఖ్యానపదములన్నియు ఆత్మస్వరూప నిర్ణయమును కలిగించుటకు మాత్రమే నిర్దేశించుచున్నట్లు స్వల్పముగా గోచరించుచున్నవి. కాని విమర్శించినచో లక్ష్యార్థమందు పరిపూర్ణ భావముకూడా వ్యక్తీకరింపబడినది. ఎట్లనగా అంతఃకరణశుద్ధి ఏకాగ్రత మున్నగునవి సాధన రూపంగా పొంది సాధనలచే సాధ్యమైన ఆత్మ స్వరూపము (అఖండ ఎరుకను) వస్తునిశ్చయ పద్ధతిగా ఆరూఢపరచు కొన్న వానికిగాని పరిపూర్ణబోధ వినుటకు ఏమాత్రము అధికారములేదుకదా! అట్టి స్థితి పొందిన పూర్ణాధికారికి మాత్రమే ఏసాధనలులేని పరిపూర్ణబోధను ఎరిగింతునని ,సాధనలు ఇక మానమని గురుమూర్తి హెచ్చరిస్తున్నారు. "స్వయం బ్రహ్మ మయోభూత్వా తత్పరం చావలోకయేత్" అని గురుగీత శాసిస్తున్నది. తాను బ్రహ్మస్వరూపుడై నిలుచుట సామాన్యమైన విషయమా? అందుకు గురుకృపయే శరణ్యము. తానే పరమాత్మ స్వరూపుడై నిల్చుటకదా గురుకృప. ఇట్టి గురుకృప ఎట్లుకలుగును? గురుగీతాజపము చేతనని ఈ శ్లోకముటకించుచున్నది. "గురుకృపాప్రసాద సిద్ధ్యర్థే జపే వినియోగః" అని కదా గురుభక్తుడు గురుమంత్ర జపముగావించుచున్నాడు. కావున ప్రథమమున సాధకుడు అఖండ ఎరుకను గుర్తించిన గాని పరిపూర్ణము ఉండచూచు కొనుట పొసగదు. అందువల్ల పరిపూర్ణ భావమును ఆరూఢపరచు కొనుటకు తాను ఆత్మ స్వరూపుడై నిలుచుట ప్రథమసోపానము. తనస్థితిలో తానుండి తన కన్యముగా నుండు పరిపూర్ణపరబాహ్యమును ఆరూఢపరచుకొనుట ద్వితీయసోపానము. పరిపూర్ణ పరబాహ్య మందు తనకు మూలములేదని ఆరూఢపరచుకొని ఏనిర్ణయములేక అశరీరపద్ధతిలో నుండి దివ్య

జీవనము గడుపుట తృతీయ సోపానముగాను చెప్పవచ్చును.

ఇట్టి సర్వోత్కృష్టమగు పరిపూర్ణభావము గురుకృపవల్లనే అనగా గురుగీతాజపమువల్లనే సిద్ధింపగలదని యీ శ్లోకమందు ఉద్ఘాటింపబడుచున్నది. "గురోర్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః" అనిన్ని "గురూపదిష్టమార్గేణ మనశ్శుద్ధింతు కారయేత్" అనిన్ని గురుగీత నిర్ణయించినది.

సగుణ నిర్గుణ రూపములలో సాక్షాత్కారించుచు తన కృపావీక్షణచే శిష్యుల సర్వపాపములు హరించి, సర్వదారిద్ర్యములు నాశనము గావించి, అఖండజ్ఞానసంపత్తిగలిగించి, పరిపూర్ణ బోధచే భ్రాంతి రాహిత్యముగావించుచున్న సద్గురుమూర్తికివియే మా సాష్టాంగదండప్రణామములు.

శ్లో॥ గురుసంతోషణాదేవ ముక్తోభవతి పార్వతి
అణిమాదిషు భోక్తృత్వం కృపయాదేవి జాయతే॥

తాత్పర్యము : ఓ పార్వతీ! గురుసంతోష మాత్రముననే శిష్యుడు ముక్తుడగుచున్నాడు. అణిమాది అష్టసిద్ధులున్నూ అతనికి గురుకృపచేతనే కలుగగలవు.

విశేష వివరణము : 1) శిష్యుడు గురువునకు సంతోషమెట్లు కలిగించగలడు? 2) ముక్తుడగుట యనగా నేమి? 3) అణిమాదుల భోక్తృత్వము అను వానిని గూర్చి వివరించుచున్నాము.

1) శిష్యుడు గురువునకెట్లు సంతోషము కలిగించగలడు? : శిష్యుడు స్థాన, అంగ, ఆత్మ, భావ శుశ్రూషలు నాలుగూ చేసుకొంటూ గురూపాసనచేసి కృతకృత్యుడు కావలసియున్నది. ఈ శుశ్రూష చతుష్టయము యొక్క లక్ష్యార్థము శిష్యుని ప్రవర్తనకు సంబంధించియున్నది. గురువుగారి ఆత్మసంతోషపడునట్లు శిష్యుడు ప్రవర్తించుటయే ఆత్మశుశ్రూషకు లక్ష్యార్థము. మృష్టాన్న భోజనాదికముతోను, ధన కనక వస్తు వాహనాదులతోను గురుని సంతోషపెట్టుట సాధ్యము కాదు. ఏలననగా సద్గురు వట్టి లంచగొండి గాడు. లంచగొండి కెంతిచ్చినా, యింకా యెక్కువ యెందుకీయ లేదని బాధపడునేగాని తృప్తిచెందడు. ఏమిచ్చినా శిష్యుడు గురువును సంతోషపెట్టజాలడు. గురువు చెప్పిన చొప్పున నడచు సచ్ఛిష్యుని జూచి "ఆహా! యితడెంతటి భక్తుడు ఎంతటి క్రియాచరణ శీలుడు ! యిట్టివాడేగదా యీ బోధ కధికారి! ఈతనికెప్పుడీ బోధమర్మ ధర్మములను సాకల్యముగా చెప్పివైచి కృతార్థుని చేతునా?" అని గురువునకే తహతహ పుట్టించునట్లు నడచుకొన్నవాడే సచ్ఛిష్యుడు. వాని సత్ప్రవర్తనయే ఆత్మశుశ్రూష. అదొక్కటే గురువును సంతోష పెట్టగలదు. అవిధమైన సంతోషము గురునియంతఃకరణమున కల్గిన నాడే శిష్యుడు సర్వబంధములనుండి ముక్తిజెందుచున్నాడు.

2) ముక్తియనగా నేమి? బంధముక్తులు రెండునూ అజ్ఞానాశ్రిత జీవుని యొక్క భ్రాంతి రూపములేగాని యోచించినచో ఆత్మ స్వరూపుడేయైన తనకు బంధమేమి? ముక్తియేమి? తన స్వరూపమును విస్మరించుటయే తాను బద్ధుడై యున్నట్లున్ను తద్విమోచనము కావలసియున్నట్లున్ను ముక్తి అనేది కూడా యొక లోకరూపమైన స్థానమనిన్ని దానిని పొందవలసి యున్నట్లును భ్రాంతిచే భావించుచున్నాడు. బంధము పరిహృతపరిహార్థమనీ, ముక్తి ప్రాప్త ప్రాప్త్యమనీ

శాస్త్రములు పేర్కొనుచున్నవి. తన నీడలో దయ్యమున్నట్లు భ్రాంతిచే భయమెం దుచూ, ఆ దయ్యము తొలగిపోవలెనని తలంచుట పరిహృత పరిహార్యమునకు దృష్టాంత మీయబడినది. తన నీడలో దయ్యము నిజముగా లేనేలేనప్పటికి, వున్నదనీ అందుచేతనే తానెక్క డికి పోతే అక్కడకు తనతో కూడా వస్తూవున్నదనీ భ్రాంతిపడి, మంత్రవేత్తను పిలచి దానిని పారద్రోలితినని అతడు చెప్పగా, యిప్పుడు దయ్యము పోయినదనుకొనుట వంటిదే. యీ బంధ భ్రాంతి. నీయందొకప్పుడు దయ్యము లేనూలేదు. మంత్రవేత్త మహిమచే యిపుడు పోనూలేదు. కంఠహారము తన మెడలోనే వుండగా అది గమనించక అది యెక్కడో పోయినదని అంతా గాలించినట్లుగా తానే ఆత్మస్వరూపుడై యుండియు ఆత్మ యెక్కడనుంచియో వచ్చి తనకు సాక్షాత్కారమగునని యోచించుచున్నాడు. యిదియే ప్రాప్తాప్రాప్తవ్యము. ఆత్మ క్రొత్తగా ప్రాప్తించవలసిన పనియేలేదు. తానాత్మస్వరూపుడేయై యున్నాడన్న విషయం మరచుటయే బంధకారణము. తానే ఆత్మనని తెలుసుకొనుటే తద్బంద విమోచనము లేక ముక్తి. మరుపు, బంధమూ, ఎఱుక, మోక్షము, నన్నమాట. యీ బంధమోక్షములు మిధ్యయని శాస్త్రములు చెప్పుచునే యున్నవి. ఐనప్పటికి యీ రెంటిలో మరుపు మాయమని, ఎరుక సత్యమైనదనీ కొందరు వాదింతురు. బంధమోక్షములు, యెరుక మరుపులు రెండూ మాయయని పరిపూర్ణ భావజ్ఞుల నిర్ణయము. "ఎరుకనగా యెరిగేటిది, మరుపనగా యెరుక తనను మరచటము యీ రెంటినెరుగ నిదే బయలు............" అన్నారు కృష్ణదేశికేంద్రులవారు.

"ముక్తోభవతి" అను మాటలకు స్వరూప సాక్షాత్కారము కలిగి తీరును అని అర్థము. శిష్యుని ప్రవర్తన, ఆత్మశుశ్రూష, లక్ష్యార్థస్థాయికి చేరుకొనకున్నచో, శిష్యుడెంతటి ప్రజ్ఞాశాలియైనా, గురుడెంత గొప్ప ప్రబోధకుడైనా, వస్తు నిశ్చయ పూర్వకముగా ప్రబోధించినా, శిష్యునికి వాచాజ్ఞానమే గల్గును గాని స్వరూప సాక్షాత్కారానుభవము చేకూరజాలదు. "కుక్క యెంత బలసినా గోనెలు మోయగల్గునా?" అన్నారు. భక్తియును ప్రవర్తనయూ లేని శిష్యుని పాండిత్యము కుక్క బలుపు మాత్రమేనని గుర్తింపవలెను. "భక్తి" యనుటలోనే త్రికరణశుద్ధిరూప ప్రవర్తన యిమిడియున్నది. "మనసున వాక్కున తనువున పనియొక్కటి జరుపునట్టి భక్తునకు దయన్ వినిపించుము వినుమని యీ ఘనబోధను వానికతుకగల దుడుగకుమీ" అన్నారు కృష్ణదేశికులు.

3) అణిమాదిషు భోక్తృత్వం : అనగా అణిమాది అష్ట సిద్ధుల ఫలానుభవము, వీనికై సచ్ఛిష్యు డెన్నడున్ను భ్రాంతిపడడు కామ్యసంకల్పములన్నియు అతనికి నిషేదములే ఐనను అవన్నియు గురుభక్తిచే లభించును. కాని సచ్ఛిష్యుడా సిద్ధుల నెన్నడున్ను స్వార్థమునకై వినియోగిం చడు, అనగా వాని ఫలములను భోగింపడు, అనుభవించడు, పరపీడనమునకు వానిని వినియోగించువాడు నరరూప రాక్షసుడే. సచ్ఛిష్యుడు జన్మరాహిత్యము తప్ప దేనినీ కోరడు. దానికి గురుకృపయే ఆధారము కనుకనే "అపరోక్షమౌను మనుజులకు పరోక్షంబైన బయలు గురుకృప గలుగా, కీలిదెలేని యెరుక తా తొలుగా............" అన్నారు శ్రీకృష్ణ దేశికులు "గురుకృపా ప్రసాద సిద్ధ్యర్థే" అని మాత్రమే సంకల్పించి సచ్ఛిష్యుడు నిత్యానుష్ఠానము చేసికొనును.

యోగ మార్గస్తునికి సమాధి సిద్ధించుటకు పూర్వమే అష్ట సిద్ధిలున్ను కలుగగలవు. కొందరీ సిద్ధుల కొరకు యోగమార్గమవలంబింతురు. సచ్ఛిష్యుడట్టివేమియు ఆశింపడు. కఠినమైన యోగమార్గము పూనకనే గురుభక్తునకవి సులభంగానే సిద్ధించగలవు. సిద్ధులను గల్గించుటకు కూడ గురుకృప యెంతో శక్తివంతమైనదని కీర్తింపబడినదే గాని ఆయా సిద్ధులేమి యు పరమ ప్రయోజనములుగావు. అవన్నియు అవాంతర ప్రయోజనములు మాత్రమే. అనగా గమ్యము చేరులోపల గలుగునని మాత్రమే. వానినాశించెనేని సాధకునికి నాపై పురోగమన ముండదు. ఆశించిన ప్రయోజనము దూరస్థమై పోవును.

పరమ ప్రయోజనమైన జననమరణ భ్రాంతి రహితమాశించి గురుకృపాప్రసాద సంసిద్ధికై గురుపుత్రులమైన మనమందరము గురుమూర్తి సగుణ నిర్గుణ రూపములను అహరహము ధ్యానించుచుందుము గాక!

శ్లో॥ గురుర్దేవో గురుర్ధర్మో గురుర్నిష్ఠాపరంతపః
గురోఃపరతరంనాస్తి త్రివారం కథయామితే॥

తాత్పర్యము : గురువేదైవము. గురువే ధర్మము. అయివున్నాడు గురునిష్ఠయే శ్రేష్ఠమైన తపస్సు గురువునకంటె అన్యంగా శ్రేష్ఠమైనది యేదియూ లేదు, ముమ్మాటికి యిది సత్యము అని నీకు చెప్పుచున్నానని భావము.

విశేషవివరణము : దేవుడు అనగా సృష్టి స్థితి లయములకు కర్తయై శిష్టరక్షణ, దుష్టశిక్షణ గావించు ప్రభువు అని సామాన్యార్థము. కాని, వ్యుత్పత్తి అర్థమును విచారిస్తే, దేవుడు దైవము, దేవత, దేవి, దివి, దివ్యము యిత్యాది శబ్దములన్నియు "దివ్" = ప్రకాశించుట, అనే ధాతువునుండి వ్యుత్పత్తి చెందినవి. దేవుడనగా ప్రకాశస్వరూపుడు అని అర్థము. ఇచ్చట ప్రకాశ మనగా నేమి? తేజస్సు అనీ, వెలుగు అనీ అర్థము గ్రహించినవారందరూ పూర్తిగా పొరబడినట్లే. అగ్ని భూతమునకు తేజాంశము, ఉష్ణాంశము అను రెండు అంశములు గలవు. అగ్ని లేనిచో యీ వేడి, వెలుగు అనువానికి యునికియే చెప్పరాదు. పంచభూతములతోనే సృష్టికి యారంభము సృష్టికి పూర్వము అగ్ని భూతమునకుగాని దాని లక్షణములైన ప్రకాశాదులకుగాని వునికియే వుండజాలదు. "శ్రీమద్భాను సహస్రమండల విభాసీ సచ్చిదానందమూర్తి" అంటూ సృష్టికి పూర్వమున్న సచ్చిదానందమూర్తి వేయి సూర్యమండలముల సమిష్టి ప్రకాశముతో తూగగల ప్రకాశము కల్గియున్నాడని కవులు వర్ణిస్తే అది కేవలం అలంకారికమగు అభివర్ణనము మాత్రమేనని చెప్పకతప్పదు. సృష్టికి పూర్వమున్న తత్వమును గీత.

శ్లో॥ నతద్భాసయతే సూర్యోన శశాంకో న పావక
యద్గత్వాన నివర్తంతే తద్ధామ పరమం మమ॥

అని వర్ణించినది. అనగా నాది వ్యపదమును సూర్యచంద్రాగ్నులు ప్రకాశింపచేయ జాలవు అని అర్థము. "తమేవభాంత మనుభాతి సర్వం తస్య భాసా సర్వమిదం విభాతి" అనగా అది ప్రకాశించుటచేతనే యీ సర్వము ప్రకాశించుచున్నదని భావము. కనుక ఆత్మ

(బ్రహ్మము) స్వప్రకాశ మనీ. స్వయం ప్రకాశమనీ వర్ణింపబడుతోంది.

అపోజ్యోతి, భూతజ్యోతి, పరంజ్యోతి అని చెప్పబడే మూటిలో పరంజ్యోతియే ఆత్మ (బ్రహ్మము) ఇది భూతజ్యోతిస్సులగు సూర్య చంద్రాగ్ని విద్యుత్ ప్రకాశముల వంటిది కాదు కాని భూతజ్యోతిస్సుల కన్నిటికి ఆధారమును, అధిష్ఠానమునూ, సత్తా ననుగ్రహించునదియు, మూలకారణమునూ అయివున్నది. ఐతే, కార్యవస్తువులయందలి తేజస్సు, కారణవస్తువునందునూ వుండవలెను. పరంజ్యోతి అనీ, స్వప్రకాశమనీ, స్వయం ప్రకాశమనీ పేర్లుకూడా వచ్చినవే! దానికి ప్రకాశములేదు అని అనవచ్చునా? అని కొందరు ప్రశ్నించవచ్చును. పేర్లు వచ్చినవే గాని ఆ పరమాత్మకు తేజోరూపము గాని జ్యోతిరూపము గాని స్థూలరూపంగా ఏమీలేదు. భూత జ్యోతిస్సుల కన్నిటికీ మాత్రమే గాక సర్వమునకు తేజస్సును అనుగ్రహించునది అదే. అది సత్తా మాత్రంగా సూక్ష్మమై, బీజరూపంగా పరమాత్మయందు నిగూఢంగా నున్నదేకాని భూతజ్యోతిస్సులకువలె దానికి బాహ్యరూప ప్రకాశమేమీలేదు. ఏవర్ణమూ, ఏకాంతీ, ఏ తేజస్సు దానికి లేకపోవుటచేతనే అది పాటల వర్ణమని శుద్ధస్ఫటిక సన్నిభమనీ కీర్తింపబడుతూంది. సర్వమును అది ప్రకాశింపచేయగలదు అని అంటే దాని వెలుగుతో లేక కాంతిలో అన్నీ కనుపిస్తూ వున్నవి అని అర్థంకాదు. ఏవస్తువు ప్రకాశింపవలెనన్నా, అనగా తోచబడవలెనన్నా జ్ఞాతయొక్క సత్వాంశ, వస్తువునందుగల సత్వాంశతో జతపడినపుడు ఆ వస్తువు గోచరింపబడును లేక ప్రకాశించును. ఆ సత్వాంశ వస్తువునందు పరమాత్మ యనుగ్రహముచేతనే ప్రవేశించును. ఏలననగా ఆ పరమాత్మ "తత్సృష్ట్వా తదేవానుప్రావిశత్" అను శ్రుతిరీత్యా వానిని సృష్టించి వానియందు తాను ప్రవేశించెను. తనతోపాటు తన సత్వాంశము ప్రవేశించును. ఏ వస్తువైనను ప్రకాశము కల్గియుండుట కిదియే కారణము. పరమాత్మ ప్రకాశము చేతనే అన్నియు ప్రకాశించుచున్నవనుటలో అర్థమిదియే. అట్లే ఆత్మ స్వప్రకాశవస్తువు లేక స్వయం ప్రకాశం గలది అనుటలో గూడా దానిని గోచరింపచేసే మరొక వెలుగు లేదు. అని చెప్పకొను అర్థము సంపూర్ణము కాదు. శుద్ధమగు వజ్రము తనంతట తానే ప్రకాశించునట్లు తనయొక్క ప్రకాశము చేతనే ఆత్మ ప్రకాశించుచున్నది. కనుకనే దానిని నిరపేక్షిక స్వయం ప్రకాశవస్తువని కూడా అన్నారు.

ఇంతకూ ప్రకాశమునకు, తేజస్సు, కాంతి, వెలుగు అని అర్థము యిట వర్తించదు. కేవలము తెలివి, జ్ఞానము, ఎరుక అను అర్థమునే గ్రహించవలెను. ఆత్మప్రకాశ మనగా ఆత్మజ్ఞానమనే అర్థమే స్వీకరించాలి. స్వయం ప్రకాశమను మాటకు స్వతస్సిద్ధమైన, సహజమైన తనయొక్క స్వకీయజ్ఞానము అని అర్థము చెప్పకోవాలి. జ్ఞానము, లేక చిత్తు ఆత్మయొక్క స్వరూపలక్షణముగా కూడా గ్రహించబడుచున్నది. దాని తెలివి లేక జ్ఞానము అఖండరూపమై యితర సాపేక్షికమేమియు లేక వునికి గల్గియున్నది కనుకనే "స్వాభావికీజ్ఞాన బలక్రియాచ" అనగా జ్ఞాన బలక్రియలు మూడున్ను ఆత్మకు స్వాభావిక లక్షణములై యున్నవని శ్వేతాశ్వతరోపనిషత్తు దానిని వర్ణించుచున్నది.

ఆత్మయొక్క యీ అఖండజ్ఞానమే బ్రహ్మాండమందు అయిదు తెలువులుగానూ

పిండాండమందు 25 తెలువులుగానూ వుండి సర్వమును గుర్తించుటకు మూలకారణరూపంగా నున్నది. కాని యీ అఖండమగు ఆత్మజ్ఞానమునకు మాత్రము మూలకారణమగు మరొక జ్ఞాన మేమిన్ని లేదు. ఈ శ్లోకములో "గురుర్దేవో" అని చెప్పినపుడు, గురువు స్వయం ప్రకాశము లేక స్వతస్సిద్ధమైన జ్ఞానము గల్గియున్న పరమాత్మ స్వరూపుడే అయివున్నాడు అని తాత్వికార్థమునే గ్రహించవలసియుండును.

గురుర్ధర్మో : అనగా గురువే సర్వధర్మ స్వరూపుడు, గురువును మించిన ధర్మములేదు. గురువునందే సకల ధర్మములు, సకల శక్తులు కలవు. కనుకనే

శ్లో॥ ఏకయేవ పరోబంధు ర్విషమే సముపస్థితే
గురుస్సకలధర్మాత్మాతస్మై శ్రీగురవేనమః॥

అని గురుగీత మరొకచోట గురువును కీర్తించుచున్నది. అనగా ఆపదలు కల్గినపుడు భక్తుని రక్షించుటకు గురువొక్కడే సర్వసమర్థుడగు బంధువు అగుచున్నాడు. గురువు సర్వశక్తిమాన్ అనగా సర్వ శక్తివంతుడగు భగవంతుడై యున్నాడని సామాన్యార్థము. గురుమాలా మంత్ర మీశక్తులను విశదీకరించుచున్నది.

తాత్వికార్థము చాలా నిగూఢము. "ధార్యతే యితి ధర్మః" అను నిర్వచనానుసారం ధరించునదేదో అది ధర్మమని చెప్పబడును. భారమును మోయుటకు ఆధారమైయున్నదేదో అది ధరించుచున్నది అని చెప్పవలెను. జీవేశ్వరజగత్తున కంతటికి ఆధారమై, అధిష్ఠానమై, దానిని ధరించి భరించుచున్నదేది? పరమాత్మయేగదా! దేనియందు సృష్టి, స్థితి లయములు జరుగుచున్నవో అదే బ్రహ్మము అని తైత్తిరీయశ్రుతి "యతోవా. యిమాని భూతాని జాయంతె, యేన జాతాని జీవంతి, యత్ప్ర యంత్యభి సంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి" అని వ్రాకొనుచున్నది. ఐతే సూర్యచంద్రాది నవగ్రహములను నక్షత్రములను గతులు తప్పకుండా నడిపించునది కాలత్రయము లను ఒకదాని వెనుకనొకటి కల్గించునది. సముద్రములను హద్దుమీరకుండా పోటు పాటులలో బంధించియున్నది. వర్షశీతాతపములచే సస్యాదులను వృద్ధి గావించి సకల జీవోపాధులకు క్షుత్పిపాసాశాంతి చేయునది ప్రాణమే లేక ప్రాణశక్తియే అనిశ్రుతిస్మృతులే, గాక వైజ్ఞానిక శాస్త్రమును అంగీకరించుచున్నది. ఐతే యిపుడు విశ్వమును ధరించి భరించునది బ్రహ్మమని చెప్పవలెనా? ప్రాణమని చెప్పవలెనా? జ్ఞాన ప్రాణరూపములుగా నున్నదా బ్రహ్మమే. "యయేధం ధార్యతే జగత్" అని చెప్పబడుచున్నది. బ్రహ్మము, పరమాత్మ,లేక గురుతత్వము అన్నీఒకటే గాని అన్యముకావు. గనుక గురుతత్వమే ప్రాణరూపంగా సర్వమును ధరించి భరించుచున్నదని తెలియవలెను.

ధర్మము అను శబ్దమునకు యెన్నియో అర్థములున్నవి. శాస్త్ర విధుల నతిక్రమించ కుండా వర్తించుట ధర్మము. స్వార్థరహితముగా పరోపకారంచేయుట ధర్మము, అహింస సర్వధర్మములలో నుత్తమము. "పరోపకారఃపుణ్యాయ" అని "అహింసః పరమోధర్మః" అని చెప్పబడుతూనేవుంది. స్వార్థరహిత సత్య సంభాషనము ధర్మము. పరస్త్రీ పరద్రవ్యముల

నాశించకుండుట ధర్మము. లోకసేవకై జీవితమును కైంకర్యముచేయుట ధర్మము. బ్రహ్మవేత్త యగు సద్గురువునకు తను మన ధనము లర్పించి సేవించి గురువాజ్ఞమీరక వర్తించుట పరమ ధర్మము. కనుకనే శ్రీకృష్ణదేవుడు గీతలో

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహంత్వా సర్వపాపేభ్యో మోక్ష యిష్యామి మాశుచః॥

అని అర్జునుని హెచ్చరించి యున్నాడు.

గురుర్నిష్ఠాపరం తపః = అనగా గురుధర్మమునందు నిష్ఠగల్గియుండుటయే శ్రేష్టమైన తపస్సు యని అర్థము. జ్ఞాన ప్రాణ రూపంగా నున్నదని పైన పేర్కొనబడిన యే గురుతత్వము గలదో దానియందు నిలకడగా నుండుటయే నిష్ఠ. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అనీ, "బ్రహ్మై వేద మిదం వరిష్ఠం" అనీ శ్రుతులు యీ విశ్వమునూ విశ్వమందలి సమస్తమునూ బ్రహ్మ స్వరూపముగా పేర్కొనుచున్నపుడు ఆ బ్రహ్మమే తానై యునాని. తనకు నానాత్వముగా దోచబడు సర్వమూకూడా తనవలెనే బ్రహ్మస్వరూపమైయున్నదనీ, ఏమరక గుర్తించు ఆ ప్రాతిపదికపై జీవయాత్ర సాగించుటే బ్రహ్మనిష్ఠ లేక గురునిష్ట. ఇంతకంటె శ్రేష్ఠమైన తపస్సు లేదుగదా! ఏలననగా సర్వమును ఆత్మస్వరూపంగా చూచే ఆత్మదృష్టియందు రాగద్వేషాదులకు తావేలేదు.

గురోః పరతరం నాస్తి = అనగా గురువుకంటె అన్యంగా శ్రేష్ఠమగు వస్తువు మరొకటి లేదు అని ఈగురునిష్ఠను దృఢము చేయుటకై యీ శ్లోకము యొక్క రెండవపాద ముద్దేశింప బడినది. నామరూపము భేదమేగాని వస్తుతః సర్వము గురుస్వరూపమే, నిజముగా శ్రేష్ఠ, అ శ్రేష్ఠములను ద్వైత దృష్టికే తావులేదు. ఐనను వస్తుదృష్టిచే గూడ గురుతత్వముకంటె గొప్ప వస్తువు లేదు అని వుద్ఘాటింపబడినది. త్రివారం కదయామితే = అనగా ముమ్మాటికీ యిదే సత్యమని బోధదారుఢ్యము కొరకు నొక్కి చెప్పబడినది. అట్టి గురుస్వరూపమున కివే మా వందనశతములు.

శ్లో॥ ఆకల్ప జన్మకోటినాం యజ్ఞవ్రత తపఃక్రియాః
తాఃసర్వా సఫలాదేవీ గురుసంతోషమాత్రతః॥

తాత్పర్యము : సృష్టాదినుండి జీవుడు చేస్తూ వచ్చిన పుణ్య కర్మలు ( అనగా యజ్ఞములు, వ్రతములు, తపస్సులు, దాన ధర్మాధి యితర సత్కర్మలు) అన్నియు, గురుని సంతోషపరచినంత మాత్రమున సఫలీకృతములై ఫలప్రాప్తికి వచ్చుచున్నవి.

విశేష విరణము : 1) ఆకల్ప జన్మకోటినాం = కల్పారంభంనుండి యింతవరకు యెత్తిన అనేక కోట్ల జన్మలు అని అర్థము.

కల్ప మనగా : "కల్పయతః స్థితిం ప్రళయంచ కల్పో" అనగా ఉత్పత్తి నాశనములు చేయునది, ప్రళయమునిన్ని, ఆది అనిన్ని పునసృష్టి యనిన్ని, కూడ అర్థములు కలవు. బ్రహ్మ యొక్క అహస్సు (పగలు) ఉదయ కల్పము. రాత్రి క్షయ కల్పము. బ్రహ్మయొక్క పగటి కాలమందు జగత్తు చేష్టాయుక్తము కాగా వుత్పత్తి స్థితి నాశములన్నియు జరుగును.

రాత్రికాలమునందు జగత్తు నిశ్చేష్టితమగును. సృష్టి ప్రళయములు రెండున్ను బ్రహ్మయొక్క పగటియందే కలుగును. ఒక దినమున ప్రళయము సంభవించిన పిదప రాత్రి అయి మరుసటి పగలు ప్రారంభములో పునస్సృష్టి జరుగును. ప్రతిదినమట్లు సృష్టి ప్రళయములు జరుగుచు యుండుటచేతనే సృష్టి అనాది అనవలసివచ్చెను. ఒక కల్పముయొక్క కాలపరిమితి యెంత? అనగా మనకు జరిగే సంవత్సరము దేవతలకొక దినము. యిట్టి దినములు 360 దేవతల కొక సంవత్సరము. అట్టి దేవతా సంవత్సరములు 12000 దేవతల కొక యుగము. ఇట్టి దివ్య యుగములు 1000 బ్రహ్మకు ఒక పగలు. యిదియే కల్పమనబడును. ప్రకారాంతరముగా చూచినచో మానవులకు కృతయుగం =1728000 సంవత్సరములు, త్రేతాయుగం = 1296000, ద్వాపరయుగము = 864000, కలియుగము 4320000 మొత్తం నాలుగు యుగముల పరిమాణము 43,20,000 సంవత్సరముల కాలము మహాయుగము. యీ మహాయుగములు 74 గడచిన ఒక మన్వంతరము. అట్టి మన్వంతరములు పదునాలుగు జరిగిన బ్రహ్మ కొక్క పగలు, యిట్టి బ్రహ్మయొక్క పగటికాలము కల్పమనబడును. యీ రెండు విధముల కాల పరిమాణము యిందు మించుగా యొకటే.

బ్రహ్మయొక్క యిట్టి పగటి కాలమునందు, జీవుడనేక నీచోత్తమ జన్మలలో పుట్టి, చచ్చి, మరల పుట్టి మరల చచ్చుచూ, కోట్ల కొలది జన్మలెత్తుచున్నాడు. అందు ఫలోత్పత్తి కారణములగు కర్మలు ఒక్క మానవోపాధియందే సాధ్యము, మానవేతర జన్మలలో గత జన్మార్జిత కర్మఫలములను ప్రారబ్ధరూపముగా అనుభవించుటయేగాని ఆగామీ కర్మఫలోత్పత్తి కారణ రూపమగు కర్మలేదు. ఏలననగా పశుపక్షి క్రిమి కీటాకాదులకు జ్ఞాన శరీరములేదు. దేవతాది జన్మల యందు కర్మశరీరములేదు. జ్ఞాన కర్మ శరీరములు రెండూ గూడిపని చేస్తేనే అట్టి కర్మ ఫలోత్పత్తికి కారణము కాగలదు. ఒక బ్రహ్మ కల్పములో ఒక జీవుని మొత్తం మానవ, మానవేతర జన్మలన్నియు లెక్క చూచినచో అది అసంఖ్యాకమే (అనంతము) కాగలదు. ఒక కవి తానెత్తిన జన్మల సంఖ్య సృష్ట్యాదినుండి లెఖ్ఖ చెప్పుట అసంభవమంటూ, ఆ అన్ని జన్మలలోనూ తాను త్రాగిన మాతృక్షీర ములు పట్టుటకు సప్తసముద్రములైననూ చాలవని అభివర్ణించినాడు. మానవ జన్మలు మాత్రమే లెఖ్ఖించినను అవి అనేక కోట్లుండవచ్చును. అని తెల్పుటకే "ఆకల్ప జన్మకోటినాం" అంటూ యీ శ్లోకము చెప్పబూనినది. మానవజన్మయందే యజ్ఞవ్రత తపః క్రియా దానధర్మాధికములు చేయుట సాధ్యమని వేరే చెప్పనక్కరలేదు. దక్షప్రజాపతి మొదలగు వారు యజ్ఞాదులు చేసినట్లు కన్పించు చున్నదే అని సందేహము కలుగవచ్చును. కర్మ శరీరమే లేని దేవతలకు శారీరక కర్మతోగూడిన యజ్ఞమెట్లు సాధ్యము? ఆయా పురాణవార్తలన్నియు అలంకారికములగానో ఔపచారికముగానో మాత్రమే చెప్పబడే యుండునని త్రోసిపుచ్చవలసిదే.

"నా భుక్తం క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి" అనగా తాను చేసిన కర్మ మనేక కోట్ల కల్పములు గడచినను యా కర్మ ఫలము ననుభవింపనిదే నశించదు. నేటి మానవ జన్మకు పూర్వపూర్వములైన జన్మలయందలి సుకృత కర్మఫలములు యింకనూ అనుభవమునకు రాక

నిలచియున్నవన్నియు గురుని సంతోషపరుచుటచే వెంటనే ఫలప్రాప్తి చెందునని యీ శ్లోక ముద్ఘాటించినది. ఐతే కల్పాంతమైననూ జీవుల కర్మ నిలచియే యుండునా? ఆహా! నిలచి యుండును. గనుకనే, నూతన కల్పారంభమున పునారావృత్తికి కారణమగుచున్నదని తెలియ వలయును. యిదివరకు అనుభవింపబడుట ద్వారా క్షయమై పోయినవిపోగా మిగిలిన పుణ్యపాప కర్మలలో పుణ్యకర్మలన్నియు గురుసంతోష మాత్రమున వెంటనే ఫలప్రాప్తికి వచ్చునని యీ శ్లోకము చెప్పుచున్నది గాదా. ఆ పుణ్య ఫలము అన్నియు అనుభవించుటకు యెన్ని జన్మలెత్తవలసి వచ్చునో అని సందేహించరాదు. ఏలననగా ఆ పుణ్యకర్మము లెట్టివి? వాని ఫలప్రాప్తి ఏ రూపంలో కల్గును? మరి పాపఫలముల మాటయేమి? అని కూడా తెలుసుకోవలసియున్నది. యజ్ఞము, వ్రతములు, తపస్సులు, క్రియలు అవి యీ శ్లోకమే చెప్పుచున్నది. అన్ని పుణ్య సంస్కారముల సమిష్టి ఫలము చరమ పురుషార్థమైన మోక్షము అనగా ' నస పునరావర్తతే'' అని చెప్పబడిన జన్మరాహిత్యము. పాప సంస్కారములన్నియు ''తత్వజ్ఞానేన సంచితం'' అని చెప్పబడిన రీతిగా గురుముఖతః తెలుసుకొన్న ఆత్మ వస్తుసాక్షాత్కారముచే నశించుటలో ఏమియు సందేహము లేదు. ఆ విధంగా గురుకృప సర్వ సంచిత కర్మనాశనమునకు హేతుర్భూతమగుచున్నది. పై విధముగా సర్వపాప క్షయము, పుణ్యోదయము, గురుసంతోష మాత్రముచేత అనగా గురుకృపా సంసిద్ధిచేత ఏక కాలమునందే కలిగి గురుపుత్రుడు కృతకృత్యుడగుచున్నాడు.

యజ్ఞము : యజ్ఞమనగా స్రుక్కు, స్రువము, హవిస్సు మొదలగు హోమద్రవ్యముల తోను, మంత్రతంత్రములతోను చేయబడు క్రియాకలాపమంతయు కలసి యజ్ఞమని సామాన్యార్థము. వైదిక కర్మపరములైన యజ్ఞ యాగాదులు అనేక నామములతో ప్రసిద్ధములై యున్నవి. రాజసూయము, అశ్వమేథము యిత్యాది మహాయాగములే గాక, అగ్ని ష్టోమము, వాజపేయము, పౌండరీకము మొదలగునవి కూడ యజ్ఞ శబ్దార్థములోనికి వచ్చును. ఇందు హోమము, మంత్రజపము, తర్పణము, వేదపారాయణము, అభిషేకము, దానధర్మములు, అన్నశాంతి ముఖ్యముగా యున్నవి. ఈ యజ్ఞములన్నియు గృహస్తులకు మాత్రమే విధింపబడిన కర్మకాండ, ఇందు పాపపరిహారార్థము చేయబడు ప్రాయశ్చిత్త కర్మలు కూడా చేరియుండును. యజ్ఞము చేయుకర్త ఉపవాసాది కఠోర నియమములు పాటించవలసియుండును.

యజ్ఞములు : కామ్యములు, నిష్కామ్యములు అని ముఖ్యముగా రెండు విధములై యున్నవి. ''స్వర్గకామో యజేత'' అనగా స్వర్గాది భోగములు ఆశించి చేయబడునవి కామ్యము లు. ఇవి అధమములు. అట్లుగాక లోకశ్రేయస్సు కొరకు చేయబడు యజ్ఞములు మధ్యమములు. మోక్షప్రాప్తిని ఆశించి ఇతర కోరికలులేక చేయబడు యజ్ఞములు ఉత్తమోత్తమములు. ఈ అన్ని యజ్ఞములలోను త్యాగబుద్ధి ప్రధానముగా ఉన్నను మోక్షప్రాప్తిని కోరి చేయబడు యజ్ఞమందు ఇహామూర్ధ ఫలభోగ విరాగము కలిగిన వానికే ఆశయసిద్ధి చేకూరును. ఇట్టి యజ్ఞమునందే కర్మ, బ్రహ్మపరమై, కర్మ బ్రహ్మములు రెండును ఏకీకృతమగుచున్నది. '' బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ, బ్రహ్మణాహుతం: బ్రహ్మైవతేస

గంతవ్యం, బ్రహ్మకర్మ సమాధినా'' అనగా హవిస్సును సమర్పించు సాధనములు, ఆజ్యాదిహవిస్సు,హోమాగ్ని, కర్త, హవనక్రియ, సమస్తమైన యజ్ఞకర్మము యజ్ఞఫలము, యివి అన్నియు బ్రహ్మస్వరూపమే. ఇట్టి యజ్ఞమునందు బ్రహ్మవినా అన్య పదార్థములేదు. ఇందు ద్రవ్య త్యాగమే కాక కర్మ ఫలత్యాగముకూడ ఇమిడియున్నవి. కాని కర్తృత్వ త్యాగము మాత్రము లేదు. ఏలననగా నేను సోమయాజినని, యజ్ఞము చేసినానని, నేను బ్రహ్మ స్వరూపుడనని, యజ్ఞము చేసినా తానైన కర్త శేషించియే యున్నాడు. కర్తృత్వ త్యాగము ఒక్క పరిపూర్ణ బోధయందు మాత్రమే సాధ్యము.

గృహస్థు అయినవానికి ముఖ్యముగా పంచ యజ్ఞములు విధింపబడినవి. 1) భూత యజ్ఞము 2) మనుష్య యజ్ఞము 3) పితృయజ్ఞము 4) దేవ యజ్ఞము 5) బ్రహ్మ యజ్ఞము. మానవేతర ఉపాధుల ఆకలి తీర్చుట భూత యజ్ఞము. అతిథి అభ్యాగతుల ఆకలి తీర్చుట మనుష్య యజ్ఞము, పితృతర్పణము, పిండప్రదానము మొదలగునవి చేయుట పితృయజ్ఞము, దేవతల నుద్దేశించి నానావిధ ద్రవ్యములను హోమము చేయుట దేవ యజ్ఞము, వేదాధ్య యనము అనగా స్వాధ్యాయము, అధ్యాపకత్వము చేయుట బ్రహ్మయజ్ఞము. ఈ యజ్ఞములేకాక భగవద్గీతయందు ద్వాదశ యజ్ఞములు నిర్ణయింపబడినవి. ద్రవ్యయజ్ఞము అన్ని యజ్ఞముల యందు సమానమే. ఇంద్రాది దేవతల కృపాప్రసాద సిద్ధికొరకు చేయబడునది దైవయజ్ఞము. ఈ యజ్ఞాది రూపమగు కర్మవలన అంతఃకరణ పరిశుద్ధి ద్వారా జ్ఞానయజ్ఞమునకు అధికారత్వము లభించును. బ్రహ్మ అనెడి అగ్నియందు అనగా తత్పదార్థమునందు త్వం పదార్థము ఆహుతి చేయుటయే జ్ఞాన యజ్ఞము అని కొందరందురు. ఇంద్రియ విషయములను ఆత్మయందు లయము చేయుట ఒక విధమగు యజ్ఞము. విషయములను మనోనిగ్రహ రూపమైన యజ్ఞమందు హోమముచేయుట ఒక యజ్ఞము, ఇంద్రియ ప్రాణ వ్యాపారము లన్నియు సమాధి అనెడి యోగాగ్ని యందు హోమము చేయుట ఒక యజ్ఞము. అపాన వాయువునందు ప్రాణమును, ప్రాణవాయువునందు అపానమును లయము చేయుట ప్రాణాయామ యజ్ఞము. ఈ విధముగా 12 విధములైన యజ్ఞములు చెప్పబడినవి. ఈ అన్ని యజ్ఞములలోను జ్ఞానయజ్ఞమే మహా శ్రేష్ఠమైనది. ద్రవ్యయజ్ఞము, తపోయజ్ఞము, యోగయజ్ఞము, స్వాధ్యాయ యజ్ఞము మొదలగు ఈ అన్ని యజ్ఞములలోను సాత్విక త్యాగబుద్ధి, ప్రధానాంగము. నిజమైన త్యాగబుద్ధి లేనిచో ఈ యజ్ఞములవలన ఏ కించిత్ ప్రయోజనమును ఉండజాలదు. త్యాగ బుద్ధితో కూడిన యజ్ఞమువలన మాత్రమే అంతఃకరణ పరిశుద్ధి ఏర్పడగలదు. కర్తృత్వ త్యాగమే త్యాగమునకు పరాకాష్ఠ అయివున్నది. కర్తృత్వత్యాగము లేనిచో కర్మత్యాగముగాని, కర్మఫల త్యాగముగాని. సిద్ధింప నేరవు. కర్మ చేసినప్పటికి, చేయని వాడగుట ఒక్కకర్తృత్వ త్యాగము వలన మాత్రమే సిద్ధించును. ఒక్క పరిపూర్ణ బోధ చేతనే కర్తృత్వ త్యాగ సహితమగు కర్మ కౌశలము సిద్ధించగలదు. వ్రతము : అనగా నియమ నిష్టలతో కూడిన దేవతారాధనము. వ్రతములన్నియు ఫలాకాంక్షతో కూడిన, భక్తి విశేషములు. ఇవి అన్నియు అర్థార్థ భక్తి కోవలోనికే వచ్చును. వీనివలన

ఇహమందును, పరమందును సుఖానుభూతి మాత్రము సాధ్యము. ఎట్టి ఫలాకాంక్షయు లేక వ్రతము లాచరించుట సాధ్యమే అనుకొన్నను వీని వలన మనస్సుయొక్క విక్షేపము మాత్రము తగ్గి మనస్సునకు ఏకాగ్రత సిద్ధించగలదు. కృచ్ఛ్రచాంద్రాయణాది వ్రతములు, ఏకాదశి, పూర్ణిమా అమావాస్యా మొ॥ పుణ్య తిధులయందు జరుపు నైమిత్తిక వ్రతములు, శరీర మనస్సులను పరిశుద్ధము చేయుటకు మాత్రమే తోడ్పడగలవు.

తపస్సు : మనకందరికీ గల శరీరము, వాక్కు, మనస్సు అను ప్రధానాంగములే త్రికరణములను పేర ప్రసిద్ధి చెందియున్నవి. శరీరమునకు త్రివిధ వ్యాధులు అనగా వాత పిత్త శ్లేష్మములకు సంబంధించినవి. కాక జన్మ మృత్యు జరావ్యాధులు అను చతుర్విధ దోషములుకూడా చెప్పబడినవి. వాక్కునకు అసత్యము, అప్రియము ఉద్వేగము, మొదలగునవి యుండుటయే వాక్యమునకు సహజదోషము, మనస్సునకు 'అంతఃకరణకు) కామక్రోధాది దుష్టవృత్తులు, శోక మోహములు, సంకల్ప వికల్పములు, దోషములై యున్నవి. ఈ త్రికరణముల దోషపరిహార్థము కొందరు అష్టాంగయోగములచేతను మరికొందరు బలాత్కారములగు ఆసనములు. మౌన వ్రతములు, మణి మంత్ర ఔషధ ప్రయోగములు గావించుచున్నారు. ఇవి అన్నియు తాత్కాలిక ప్రయోజనములు మాత్రమే అయివున్నవి. కాయిక, వాచిక, మానసిక తపస్సులని గీతాకారుడు నిర్ణయించిన త్రివిధ తపస్సులను ఉత్తమోత్తమములు, సునాయాసములును కొంచె మించు మించు శాశ్వత ప్రయోజనకరములు అయివున్నవి. ఈ విధానమందు సంస్కారము (అనగా దోష నివారణము) మాత్రమే గాక గుణాధానము అనగా సద్గుణములను కలిగించుట అను రెండు ప్రయోజనములు సిద్ధించుచున్నవి. ఎట్లనగా స్థూల శరీరముచేత పరహింస, చౌర్యము, వ్యభిచారము వదలుటతో పాటు తన శరీరబలమును ఇతరులకు మేలుకలుగుటకై వినియోగించి దుష్టశిక్షణ, శిష్టరక్షణ గావించుట, శారీరక తపస్సునందు ఇమిడియున్నవి. అట్లే అసత్య సంభాషణము మొదలగునవి వదలుటతోపాటు యితరులకు వాక్సహాయముచేయుట హితబోధ గరుపుట మొదలగు వాచిక తపస్సుగా పేర్కొనబడినవి. దుష్ట సంకల్పములను దురాలోచనములను శాపనార్థములను విసర్జించుటయేగాక "లోకాస్సమస్తాస్సుఖినోభవంతు" అని చెప్పబడిన రీతిగా లోక శ్రేయస్సుకై మనస్సును ఏకాగ్రత సాధన చేయుట మానసిక తపస్సు, విశాలాంతఃకరణ కలిగి వసుధైక కుటుంబీకుడై పారమార్థిక అభ్యున్నతి పొందగలుగుట ఈ మానసిక తపస్సులకు ప్రయోజనములు.

క్రియ : సమిష్టి శ్రేయస్సునకై వాపీ కూప తటాక వన ప్రతిష్ఠాదులు గావించుట. సమిష్టి ప్రయోజనము కొరకై అన్న సత్ర, దేవాలయాది మందిర నిర్మాణములు గావించుట మొదలగు పుణ్య కర్మలన్నియు క్రియ అను శబ్దములో ఇమిడియున్నవి.

తాస్సర్వాస్సఫలాః : అన్నియు ఫలప్రాప్తికి వచ్చుచున్నవి అని అర్థము. ఫలము రెండు విధములు. 1. దృష్టము 2. అదృష్టము. కర్మ చేసిన వెంటనే ఆ పనికి తగిన ఫలము అనుభవించుట

దృష్టఫలము. 2. చేసిన పుణ్యపాపముల ఫలము వెంటనే అనుభవమునకు రాక జన్మాంతరము లందు లోకాంతరములందు అనుభవమునకు వచ్చునదిగా ఉండి సంస్కారములను మాత్రముత్పత్తి చేయునది. అదృష్టఫలము. ఈ శ్లోకమునందు పేర్కొనబడినది. అదృష్టఫలము మాత్రమేనని గ్రహించవలెను.

గురుసంతోషమాత్రతః : గురువునకు సంతోషము కలిగించినంత మాత్రముననే అని అర్థము. గురువును సంతోషపరుచుట ఎట్లు పంచభక్ష్య పరమాన్నములు, నూతన వస్త్రాలంకరణ ములు గృహారామక్షేత్రములు, ధనధాన్య మాణిక్యాదులు మొదలగునవి ఏమిచ్చిననూ స్వార్థ గురువులకు మాత్రము తాత్కాలిక సంతోషము కలుగవచ్చును. ఇవి అన్నియు నశ్వరములు. ఆ వస్తు సంపద వ్యయమైన వెంటనే స్వార్థగురువు ఆ శిష్యుడు మరల మరల అట్టి వస్తువులు ఇవ్వవలెనని ఆశకు లోనగుచుండును. కనుక గురుసంతోషమాత్రతః'' అనగా నిజగురుని సంతోషపరచుట ఎట్లు? 1) శిష్యుడుచేయు ఆత్మ శుశ్రూష అనగా శిష్యుని సత్ప్రవర్తన చూచి ఇటువంటి సచ్ఛిష్యునకు ఎపుడు బోధయొక్క మర్మధర్మములు తెల్పి కృతార్థునిచేతునా? అని గురుని అంతఃకరణమందు ఆవేదన కలుగునట్లు శిష్యుడు గురుని అజ్ఞాపాలన చేయుటయే ఆత్మ శుశ్రూష 2) ఎరుకను గురుదక్షిణగా నొసంగుట. నిజగురువు యితర గురుదక్షిణలు స్వీకరించుటతో తృప్తి నొందజాలడు.కనుకనే "ఎరుకను గురుదక్షిణగా మరి వేగిర మివ్వ వట్టిమాట లేమిటికీ, ఎరుకతో ఇంక కూడి మేమిటికీ" అంటున్నారు. 3) గురుఋణము తీర్చుట. శిష్యుడు గురుబోధ మర్మ ధర్మములు ఆ మూలాగ్రముగా గ్రహించిననూ, సదాచార పరుడై యున్ననూ ఎరుకను గురుదక్షిణగాఇచ్చి అశరీరపద్ధతిలోనున్ననూ గురునకు సంపూర్ణ సంతోషము కలుగజాలదు. శిష్యుడు గురు ఋణము తీర్చినపుడే గురునకు సంపూర్ణ సంతోషము చేకూరగలదు. నిజముగా గురు ఋణము ఎట్లు తీరుననగా తాను ఏరీతి గురుపదము లాశ్రయించి జనన మరణ భ్రాంతి రహిత స్థితిని సాధించెనో తత్తిద్వయ్యుగానే శిష్యులను సేకరించి వారికి అట్టి స్థితిని ప్రసాదించిననాడే గురు ఋణము సంపూర్తిగా తీరపోవును.

అయితే ఈ త్రివిధ రూపమగు సంతోషము. కలిగినపుడుగాని తాను చేసిన అదృష్ట రూపమగు పుణ్యఫలములు సిద్ధించవా? అను శంక కలుగవచ్చును. చేసిన అన్ని పుణ్యములకు ముఖ్య ఫలప్రాప్తి ఏది? అనగా పూర్ణబోధ లభించుటయే అట్టి ఫలప్రాప్తి ఎంతో పూర్వజన్మ సుకృతమున్నగాని పూర్ణబోధ ప్రాప్తించదు. అట్టి పూర్ణబోధ ఆత్మ శుశ్రూష చేతనే లభించగలదు. ఆత్మ శుశ్రూష చేసిన వానికే ఇంకనూ ఫలప్రాప్తికి రాక నిలచియున్న పుణ్య సంస్కారములన్నియు ఫలప్రాప్తికి వచ్చి పూర్ణ బోధ పొందుటకు అధికారిని చేయును. కనుకనే "చెప్పదగును గురుడు బోధను చెప్పిన పనిచేసెనేని శిష్యాగ్రణికిన్'' అని కృష్ణదేశికేంద్రులు శెలవిచ్చినారు. గురుడు చెప్పిన ఆచరణ విధానమందు తూచా తప్పక ప్రవర్తించుటయే చెప్పిన పనిచేయుట ఆ విధముగా చెప్పిన పనిచేయుటయే ఆత్మశుశ్రూష. ఆత్మశుశ్రూష చేతనే తన పూర్వ పుణ్య కర్మలన్నియు పలప్రాప్తికి వచ్చుటయు గురువు సంతోషించుటయు పరిపూర్ణబోధ పొందుటయు పరంపరా ప్రాప్తమ్ము లగుచున్నవి. పూర్వపుణ్యోదయమునగాని పూర్ణబోధ లభ్యము కాదని ఆత్మశుశ్రూషచేత

గాని గురునకు సంతోషము కలుగదని గురు సంతోషంచేతగాని పూర్ణబోధలభ్యము కాదని అన్నప్పుడు ఆత్మ శుశ్రూషకు గురుపాదము లాశ్రయించుట అవసరముకదా! ఇందు ఏది ముందు అని శంక కలుగవచ్చును. గురుసందర్శనము, పూర్వ పుణ్యోదయము వలననే కలుగును. పిదప గురు పాదము లాశ్రయించి ఆత్మకు శుశ్రూష చేయును. ఆ పిదప గురునికి సంతోషము గలిగి పూర్ణబోధ ప్రసాదించును. పుణ్యోదయమైనపుడు గురుసందర్శనము, ఆ పుణ్యము పండినపుడు పూర్ణబోధ లభించునని పిండితార్థము.

ఇట్టి ఆత్మ శుశ్రూష యొనర్చుట ఎట్లో శిష్యులకు బోధించి తానాచరించి శిష్యుల నాచరింపచేయుచూ ఆచార్య సార్థక నామధేయుడైన సద్గురు దేవునకివే మా అనంతకోటి సాష్టాంగ ప్రణామములు.

శ్లో॥ సచ్చిదానంద రూపాయ వ్యాపినే పరమాత్మనే
నమఃశ్రీగురునాథాయ ప్రకాశానంద మూర్తయే

**తాత్పర్యము** : సత్తు, చిత్తు ఆనందములే స్వరూప లక్షణముగా గలవాడును, అంతటను, అన్నింటియందును సంపూర్ణంగా వ్యాపించియున్నవాడును, సృష్టికి అతీతంగా కూడా పరబ్రహ్మ రూపంగా నున్నవాడును, జ్ఞానానందములుమాత్రమే ఆ కారముగా గలవాడును సర్వమంగళా కారుడునునగు సద్గురు పరమాత్మకు నమస్కరించుచున్నాను.

శ్లో॥ సత్యానంద స్వరూపాయ బోధైక సుఖకారిణే
నమో వేదాంత వేద్యాయ గురవే బుద్ధి సాక్షిణే

**తాత్పర్యము** : సత్యము, ఆనందము అను లక్షణములతో విరాజిల్లువాడును. పరిపూర్ణ పరమమేల్కయందలి శాంతి సుఖములను ప్రసాదించువాడును, వేద శిఖలనబడు ఉపనిషద్వా క్యములచే దెలియదగినవాడును, వ్యష్టి శరీరములయందలి సమస్త బుద్ధి వృత్తులకు సాక్షి రూపముగా నుండువాడును, అన్నిటికంటె పెద్దదగు ఆవరణ రూపమగు శరీరమును గలవాడు నునగు గురుదేవునికి నమస్కరించుచున్నాను.

విశేష వివరణము : 1) సచ్ఛిదానందములు 2) వ్యాపినే 3) పరమాత్మనే 4) ప్రకాశానందమూర్తి.
2 వ శ్లోకములో విశేష వివరణము : 1) సత్యానందములు 2) బోధైక సుఖకారిణే 3) వేదాంత వేద్యత్వము 4) బుద్ధిసాక్షి.

1) సచ్ఛిదానందములు : సత్తు + చిత్తు+ ఆనందము = సచ్ఛిదానందములు. త్రికాలా బాధ్యము అనగా మూడు కాలములయందు మార్పుచెందని రూపముగలది సత్తు, చిత్తు అనగా అఖండమూ అనంతమూఅగు జ్ఞానము, దుఃఖలేశంకూడా లేని సుఖస్వరూపము. సచ్ఛిదానంద ములు ఆ పరమాత్మ వస్తువును యెన్నడును విడువకుండా వున్నందున యివియే ఆ పరమాత్మకు స్వరూప లక్షణముగా చెప్పబడినవి. సృష్టి స్థితి లయములు చేయువాడే పరమాత్మ యన్నప్పుడు, సృష్ట్యాదులకు పూర్వోత్తర స్థితులు కూడా యుండుటచే అది తటస్థ లక్షణమని చెప్పబడినది. స్వరూప లక్షణములు "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" "నిత్యం విజ్ఞాన మానందం బ్రహ్మ"

అని రెండు రీతులుగా శ్రుతులు పల్కినవి. సత్యమూ నిత్యమూ అగునదే సత్తు, జ్ఞాన విజ్ఞానము లు గలదే చిత్తు, అనంతమగునదే ఆనందము. సచ్చిదానందములు స్వరూప లక్షణమని రెండు శ్రుత్యాభిప్రాయములను ఏకీకృత మొనర్చి చెప్పబడుచున్నది. సృష్టి కారణమగు యీ బ్రహ్మమునకు సచ్చిదానందములు స్వరూపలక్షణమని చెప్పినప్పుడు కార్యరూపమగు సృష్టి యందంతటా గూడా సచ్చిదానందములు ఏ అల్ప పరిమాణములోనో ఏదో రూపంగా వుండ వలసినదే. కనుకనే చరాచర రూపమగు సమస్త విశ్వమూనందూ, సచ్చిదానంద లక్షణములు ప్రకటమగుచునే యున్నవి. ఉదాహరణకు ఒక చిళ్ళ పెంకుయందు కూడా ఉనికి కల్గి యుండుటచే సలక్షనము, అందలి అణు సముదాయము పరస్పరము కరచిపెట్టుకొని యుండుటకు కారణమైన శక్తి రూపంగా చిల్లక్షణమును ఏ స్వల్ప ప్రయోజనమునకో, అవసరమై యుండుటచే ఆనంద లక్షణమును ఆచిళ్ల పెంకు యందు ద్యోతక మగుచున్నది. యీ విధముగా సచ్చిదానందములు సర్వే సర్వత్ర గోచరించుచుండుట చేతకూడా "ఆబ్రహ్మ స్తంభ పర్యంతం పరమాత్మ స్వరూపకం" అని అభివర్ణింప బడినది. మరిన్ని "ఆత్మనోన్యంనకించన" "బ్రహ్మణోన్యం నకించన" అని ఆత్మకానిది బ్రహ్మము కానిది కించిత్తూ లేదని చెప్పబడినది.

2) వ్యాపినే : బ్రహ్మము సర్వవస్తువుల బాహ్యాభ్యంతరములయందు నిండియున్నది. యీ వ్యాపకతా ధర్మముకూడా సచ్చిదానంద లక్షణమువలె స్వరూప లక్షణమే యగుచున్నది. ఆకాశమునకును వ్యాపకతా ధర్మమున్నను శబ్దగుణమువల్ల ఆకాశము వేరుపరచదగియున్నది. పరమాణువుయొక్క భాహ్యాభ్యంతరములయందు కూడా యీ బ్రహ్మము వ్యాపకమయ్యే వున్నందున వున్నదంతయు బ్రహ్మమే. భౌతికవస్తువుగాని దాని నామరూపములుగాని మిథ్యయని బ్రహ్మమే సత్యమని చెప్పబడినది. కనుకనే "సర్వం ఖల్విదం బ్రహ్మయని శ్రుతి చెప్పుచున్నది. యీ వ్యాపకతా ధర్మమునే పరిపూర్ణ భావజ్ఞులు ఆవరణ లక్షణముగా చెప్పినారు. ఏట్లనగా యీ బ్రహ్మము విశ్వగతం గా అనగా వ్యాపకత్వలక్షణము గలిగియు విశ్వాతీతము గా కూడా యున్నది. కనుక "విశ్వంవ్యాపిన మాదిదేవ మమలం" అనియు "విశ్వాతీతం గగనసదృశం" అనియు రెండు విధములు వర్ణింపబడినది.

3) పరమాత్మ : "తత్వమసి" మహావాక్యమునందలి తత్ పదమునకు లక్ష్యార్థమై, సృష్టికి పూర్వం తాను తానుగానున్న స్థితియందున్న బ్రహ్మ పదార్థమే పరమాత్మ. పరమ అనగా ఉత్కృష్టమైనది పరమాత్మ యనగా శ్రేష్ఠమైన ఆత్మ, యీ పరమాత్మ ఉపాధిగతమై విలక్షణముగా అంతఃకరణకు వుపహితమై యున్నప్పుడు ప్రత్యగాత్మ యనియు అంతఃకరణ విశిష్టమై యున్నపుడు జీవాత్మ యనియు నామ రూపాత్మకమగు జీవేశ్వర జగత్తుగా పరిణమించి అందు అను ప్రవేశంగావించి యున్నపుడు విశ్వాత్మయనియు పేర్లు పెట్టబడినవి. యివన్నియు బాధా సమానాధికరణ సంబంధముచే పరమాత్మయే అయి యున్నవి. ఉపాధి సంబంధము వదలినచో యిది పరమాత్మ కంటె భిన్నం కాదన్నమాట. సృష్టికి పూర్వమున్న స్వయం ప్రకాశమైన బ్రహ్మమే ఉత్కృష్టమగు ఆత్మ లేక పరమాత్మ. అది "స్వేమహిమ్మి ప్రతిష్ఠితః" అది తనయొక్క మహిమాచేతనే, స్వయంభువై తనయొక్క మహిమయందే సుప్రతిష్టితమై యున్నది. అది

పరమాత్మయని కొని యాడ బడుచున్నది. యిది గురుమూర్తి యొక్క స్వస్వరూపము. నిర్గుణ రూపము.

4) ప్రకాశానంద మూర్తయే : ప్రకాశము ఆనందము అనునవి మూర్తీభవించిన ఆకారము గలవాడు. గురుమూర్తి ప్రకాశ మనగా జ్ఞానముగాని, వెలుగుకాదు. అఖండ జ్ఞాన సంపన్నుడు. అతడు ప్రకాశమూర్తి. నిత్యసంతుష్టుడు. ఆప్తకాముడు. ఆనందమూర్తి యిది గురుమూర్తి యొక్క సగుణ రూపం, నిర్గుణ సగుణ స్వరూపములలో చెలువొందు గురుమూర్తికి నమస్కారము అని శ్లోకార్థము గురుమూర్తి యొక్క సగుణ నిర్గుణ రూపములు రెండూ లేనిదే పరిపూర్ణ పరబ్రహ్మము. పరిపూర్ణ భావము నారూఢపరచుకొని, అశరీర పద్ధతితో స్థిత ప్రజ్ఞుడై యున్న గురుమూర్తిని అచల పరిపూర్ణుడనీ, అశరీరుడనీ, శిష్యులు వ్యవహరించుటకద్దు. అంతమాత్రమున గురువే పరిపూర్ణ పరబ్రహ్మమని చెప్పుట సరికాదని తెలియవలెను.

2వ వ్యాఖ్యానశ్లోక విశేష వివరణము : 1) సత్యానందములు అనగా గురుపరమాత్మ సత్యస్వరూపుడనీ ఆనంద రూపుడనీ చెప్పనగును. ఏలననగా నిత్యమూ సత్యమూ అయినదే సత్ పదార్థము, గురుపరమాత్మయే సత్యానంద స్వరూపుడు లేక సచ్చిదానంద స్వరూపుడనీ చెప్పబడుచున్నాడు. సత్యాసత్యములు నిత్యానిత్యములు యిత్యాదులన్ని ద్వంద్వకోటిలో చేరినవి. సత్యమునకు, అసత్యము (లేక అనృతము) నిత్యమునకు అనిత్యము ( నశ్వరము) ప్రతియోగి శబ్దములు. "ఏక మనేకం భవతి" ముందుగా ఒకటి రెండై ఆ పిదప అనేకమైనది. పరమాత్మ స్వరూపము ద్వంద్వరూప యేకవస్తువు. ఒకటి అనే శబ్దము రెండును కాని అనేకమును గాని ఆపేక్షించు సాపేక్షిక శబ్దమై యున్నది. ఒకటిగా నుండి నిస్సంకల్ప స్థితిలో అచలమై, సత్యమై, నిత్యమై వున్నప్పుడు దానికి బ్రహ్మమని పేరు. సంకల్ప రూపమైన చలనము కల్గినపుడు అదే ఆత్మయై, "తస్మాద్వాయేతస్మాదాత్మన ఆకాశ స్సంభూతః ఆకాశాద్వాయుః వాయో రగ్నిః ఆగ్నేరాపః అద్భ్యః పృధివీ, పృధివ్యా ఓషధయః ఓషధీభ్యోన్నం, అన్నాత్పురుషః" యిత్యాదిగా అనేకమైనపుడు అదియే అనృతజడ దుఃఖాత్మమగు విశ్వమైనది. యీ రెండు రూపములు ఆ ఒక్క బ్రహ్మమునే అయివున్నది.

2) బోధైక సుఖకారిణే : పరిపూర్ణ బోధచే భ్రాంతి రహిత మగుటయే గురుమేల్కొ యిదియే నిజబోధ. యిట్టి పరిపూర్ణ బోధ ఒక్క దానిచేతప్ప నిజమగు శాంతి అంతఃకరణయందు నెలకొన జాలదు. యిట్టి శాంతి సుఖములు ప్రసాదించుట గురుకృపపై నాధారపడియున్నది. కనుక గురుమూర్తియే సుఖకారణుడై యున్నాడని చెప్పబడినది.

3) వేదాంతవేద్యాయ = ఉపనిషత్తులు వేదముల చివరి భాగము లగుటచే వేదశికలని వేదాంతము అని చెప్పబడినవి. ఉపనిషత్తులలో చెప్పబడినది. ఆగమ ప్రమాణము లేక శబ్ద ప్రమాణము అనబడును. ఉపనిషత్తులలో సృష్టి కారణమైన బ్రహ్మ పదార్థము చెప్పబడినది. కనుక సృష్టి కారణమైన బ్రహ్మము జ్ఞానమయ మగుటచే యెరుక అని పరిపూర్ణ భావజ్ఞులు దానికి పేరిడినారు. శబ్ద ప్రమాణమునకు లోబడినది బ్రహ్మము (యెరుక) "న చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనః" మనియు "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసో సహ" మనియు,

చెప్పబడినది పరిపూర్ణ బ్రహ్మము. లక్ష్య లక్ష్యార్థ ముచే పరిపూర్ణ పరబ్రహ్మమును చెప్పిన శ్రుతులను కారణ బ్రహ్మమునకే మట్టగించి యెరుకయే మనోవాక్కుల కందని పరిపూర్ణ బ్రహ్మమని యితరులు పడు అభిప్రాయం సరిగాదు. "మనసై వానుద్రష్టవ్యం, మనసై వాను శ్రోతవ్యం" అనిన్నీ, "ఆత్మావారే ద్రష్టవ్యం................" అనిన్ని చెప్పిన శ్రుతులున్ను, అవాఙ్మానస గోచరమగు పరిపూర్ణ పరబ్రహ్మ మున్ను ఒకటే ననుట యెట్లు? కారణ బ్రహ్మమగు యెరుకయు పరిపూర్ణ బ్రహ్మము యెన్నడున్ను ఒకటికాదని శివరామదీక్షితులవారు "యిది అదికాదు" అది, యిది కాదు" అని తమ బృహద్వాశిష్ట గ్రంథములలో ఉద్ఘాటించి యున్నారు. అద్వైతులు చెప్పే బ్రహ్మమున్ను పరిపూర్ణులు చెప్పే పరిపూర్ణ బ్రహ్మమున్ను ఒకటేనని యితరులేగాక, మేమున్ను దీక్షితియ సాంప్రదాయకులమేఅని పేరు చెప్పకొనే మరికొందరు కూడా చెప్పట కడుంగడు శోచనీయము. కనుక గురువు వేదాంత వేద్యుడు అనగా అఖండ యెరుక స్వరూపుడే గాని పరిపూర్ణ పరబ్రహ్మము కాదు. గురు స్వరూపమే అఖండ యెరుక. గురుస్వరూపమే వేదాంత వేద్యము అని అభివర్ణింపబడిన దనియు తెలియవలెను.

4) బుద్ధి సాక్షిణే : మనోబుద్ధి చిత్తాహంకారములుగా వ్యవహరించునది అంతకరణము. పరమాత్మ వ్యష్టియందు ప్రత్యగాత్మ రూపంగా సకలయింద్రియ వ్యవహారములకు సత్తా యిచ్చుచు విలక్షణంగా యున్నది. యీ పరమాత్మయే సమిష్టియందు సమిష్టి అంతఃకరణకున్ను ప్రకాశమిచ్చు చున్నది. యీ విధంగా వ్యష్టి సమష్టుల యందు బుద్ధి వృత్తులకు సాక్షి రూపంగా నున్నది. తెలియ చేయునది. పరమాత్మ లేక ప్రత్యగాత్మ. తెలుసుకొనునది అంతఃకరణోపహిత పరమాత్మ ప్రకాశము. యీ విధంగా బుద్ధి వృత్తులకు సాక్షిగానున్నా బుద్ధితోగూడి సర్వమునకు కర్తగాయున్నా ఆ బ్రహ్మమేగాని వేరొకటి లేదు అని గుర్తించవలెను.

ఈ విధంగా నిర్గుణ రూపములో సర్వమూ తానే అయి సర్వమూ నడిపించుటకు కర్తృత్వ కారయిత్వములు రెండున్నూ గల్గి విశ్వవ్యవహారము జరుపుచూ అన్నిటికి తాను వేరై యున్నాని అనుకొంటూ బంధ మోక్ష స్వరూపములు రెండూ తానేయై తన నిజ స్వరూప స్వభావములను గుర్తించిన గురు పుత్రులకు మాత్రం సర్వభ్రాంతి రహితము కల్గించుచూ విరాజిల్లు గురుస్వరూపమునకివే మా ప్రణతులు.

శ్లో॥ శ్రీగురుం పరమానందం వందే యానంద విగ్రహం
యస్య సన్నిధి మాత్రేణ చిదానందాయతే నమః॥

తాత్పర్యము : ఎవడు, ఆనందమే స్వరూప లక్షణముగా గలవాడో, ఎవడు ఆనందము చిందుచు శుభ లక్షణ శోభితుడై మంగళ ప్రదమైన జ్ఞాన ప్రకాశముచే నొప్పవాడో ఎవని సాన్నిధ్యమాత్రము చేతనే మనస్సునకు ప్రశాంతతయు జ్ఞానానందమును లభించుచుండునో అట్టి గురుదేవునికి నమస్కరించుచున్నాను.

విశేష వివరణము : 1) శ్రీగురువు 2) పరమానందం 3) ఆనంద విగ్రహం 4) సన్నిధి మాత్రేణ 5) చిదానందాయతే నమః అను విషయములను గూర్చి వివరించి తెలుసుకొనవలసియున్నది.

1) శ్రీగురువు : శ్రీకారము, సర్వమంగళ ప్రదము, శుభప్రదము, సర్వసంపత్కరము

అయిన రూప విశేషమును సూచించును. "సర్వశుద్ధః పవిత్రో సౌ" అని చెప్పబడి శుద్ధ స్ఫటిక సన్నిభమై, నిర్మలమైన వుత్తమ పురుష స్వరూపమే శ్రీ గురువు అని చెప్పబడినది.

2) పరమానందము అనగా శ్రేష్ఠతమైన బ్రహ్మానందమే. "రసోవైసః రసోహ్యేవాయం లబ్ధ్వానందీభవతి" అనిన్ని "ఆనందం బ్రహ్మణోవిద్వాన్ అభిభేతి కుతుశ్చన" అనిన్ని తైత్తిరీయ శ్రుతులు చెప్పుచున్నవి. ఆనందమెన్ని విధములో కూడా యీ యుపనిషత్తే వర్ణించినది. 1) మానుషానందం 2) మనుష్యగంధర్వానందం 3) దేవగంధర్వానందం 4) పితృదేవతానందం 5) చిరలోక లోకానందం 6) అజానజానదేవతానందం 7) కర్మదేవతానందం 8) దేవానందం, 9) యింద్రానందం 10) బృహస్పత్యానందం 11) ప్రజాపత్యానందం 12) బ్రహ్మానందం ఇందు మొదటిదగు మానుషానందముగా సమస్త భోగభాగ్యములతో కీర్తి ప్రతిష్టలతో ధనదాన్య వస్తు వాహనములతో, పుత్రపౌత్రాది సంపత్తితో తులతూగు మానవునికుండే ఆనందము. యిదే విషయానందము. యీ పన్నెండు ఆనందములు ఒకదానికంటె నొకటి వుత్తరోత్తరా శతాధికములు. అనగా బ్రహ్మానందం మనుష్యానందము కంటె నూరుచేత పదకొండుసార్లు ఎచ్చువేయగా ఏ సంఖ్యవచ్చునో అన్ని సార్లు అనగా ఒకటి వేసి 22 సున్నలు తగిలిస్తే ఎంతో అంత సంఖ్య అన్న మాట. పైన పేర్కొన్న ఒకటి లగాయితు 11 వరకు గల ఆనందములన్నిటియందు దుఃఖమేదో ప్రమాణంలో (బహులేశ ప్రమాణములోనైనా) కలదు. 12వ దగు బ్రహ్మానందమందు ఆ దుఃఖ లేశము గూడా కానరాదు. ఐననూ మర్రి విత్తనమందు మహా వృక్షము బీజరూపంలో నున్నట్లు సూక్ష్మాతి సూక్ష్మ రూపంగా నుండినను, అంతకంటె గొప్పదగు ఆనందమనేది వేరే లేకపోవుటచే అది పరమానందం అనీ బ్రహ్మానందమనీ పేర్కొనబడినది. 1 నుండి 11 వరకు గల ఆనందము లలో న్యూనాధిక నిష్పత్తిలో సుఖ దుఃఖములు రెండూ వున్నవి. ఐననూ పరమానందము కేవలానందము (సుఖ దుఃఖ ద్వంద్వాతీతము) కాదు. ఏలననగా దానినుండియే అనృత జడ దుఃఖాత్మకమైన జగత్తున్ను సుఖ దుఃఖాది సకల ద్వంద్వమున్ను కార్యరూపంగా వుత్పత్తి అగు చున్నవి. కేవలానందమేనేది లేనేలేదు. అత్యుత్తమము. శ్రేష్టము అగుటచే పరమానందమన్నారు. ఇదే శ్రీగురువుయొక్క నిర్గుణ రూపము.

3) ఆనంద విగ్రహం : బంగారము కరిగించి పోతపోసి నపుడు తయారైన విగ్రహములో ఎక్కడ చూచినా బంగారముతప్ప మరొక టేమియుగానరాదు. అట్లే ఆనందము పోతపోసినచో నందితరమేమియు గానరాదు. విగ్రహము అన్నప్పుడు సాకారము సగుణము సావయవము అని వేరే చెప్పనక్కరలేదు. యిది శ్రీగురువు యొక్క సగుణరూపము. భక్త సౌలభ్యం కొరకు నిర్గుణమైన ఆ పరమానందమే సగుణమై ఆనందవిగ్రహంగా రూపొందినది. ఈ విధంగా నిర్గుణ సగుణ రూపములలో ఆనందమే రూపముగాగల్గి శ్రీగురుమూర్తి యొప్పుచున్నాడు.

4) సన్నిధి మాత్రేణ : గురుమూర్తి యొక్క సమక్షంలో యున్నంత మాత్రము చేతనేయని అర్థము. ఇది సాలోక్య సామీప్య సారూప్య సాయుజ్య ముక్తులు అని చెప్పబడిన వానిలో సామీప్యముక్తి వంటిది. నిర్గుణమగు శ్రీగురుసన్నిధానములో నుండుట యనగానేమి.

సామీప్యముక్తి విషయంలో అయితే వైకుంఠ లోకమునందు శ్రీమహావిష్ణువు లక్ష్మీసమేతుడై దేవత లందరిచే సేవలు పొందుచూ నిండు పేరోలగమున కొలువుదీర్చి కూర్చొన్నపుడు భక్తుడు ఆ శ్రీ మహావిష్ణువు యొక్క వైభవశ్రీలను కనులార చూచుచు ఆనందించు చుండుట సామీప్య ముక్తి. మరి నిర్గుణమైన శ్రీగురువుయొక్క స్వరూపమే లోకమున భక్తునికి యెంతదూరములో నున్నది? భక్తుడా స్థానమునకేగి అందు ప్రవేశముగనుటెట్లు? అను శంకలకు తావులేదు. ఏలననగా సృష్టికి పూర్వము సర్వవ్యాపకమైయున్న పరమాత్మ స్వరూపమే ఆ శ్రీగురుని నిర్గుణ రూపము. దానికొరకు భక్తుడెక్కడకును పోనక్కరలేదు. మనస్సు యింద్రియ విషయములనుండి మరల్చి ఆ స్వరూపమునందు ఏకాగ్రమొనర్చుటె ఏతత్సన్నిధినుండుట, ఇదియే సామీప్యముక్తి. ఇదియే సాన్నిధ్య సౌఖ్యము. ఇదియే స్థాన శుశ్రూష యొక్క లక్ష్యార్థము. ఇదియే ఉపవాస శబ్దమునకు నిజమైన అర్థము. ఉప అనగా సమీపమందు, వాసము అనగా నివసించుటయే వుపవాసము గాని లఘ్వాహారము తినియో, ఏమియు తినక జలమైన త్రాగక పొట్ట మాడ్చు కొనుట యుపవాసముకాదు. జ్ఞానేంద్రియములగు శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణములకు శబ్దస్పర్శరూప రసగంధములనే విషయములే ఆహారము. మనస్సును జ్ఞానేంద్రి యములతో చేర్చనియెడల జ్ఞానేంద్రియముల కాహారమీయక మాడ్చినట్లే కాగలదు. కాని యిదిన్ని వుపవాసము కాజాలదు. మనస్సునకు దాని ధర్మములగు సంకల్ప వికల్పములే ఆహారము. యోగ పద్ధతులచేగాని జ్ఞానపద్ధతులచేగాని మనస్సు యొక్క వ్యవహారములను అరికట్టవచ్చును. అపుడు మనోమయ కోశమును, ఆకలి దప్పులే ధర్మములుగా గల ప్రాణమయ కోశమును అరికట్టబడి ఆకలిదప్పులే స్ఫురించకుండా పోవచ్చును జ్ఞానేంద్రియములు విషయములను గుర్తింపకపోవచ్చును. స్థూల శరీరమున్ను యింద్రియములున్ను ఆహారము లేక శుష్కింప వచ్చును. అందువల్ల విషయ గ్రహణ సామర్థ్యము వానికి సన్నగిల్లవచ్చునేగాని, విషయవాంఛలేక విషయవాసన మాత్రము యెంతమాత్రము క్షీణింపదు. ఈ సందర్భములో యీ క్రింద నుదహరించిన భగవద్గీతాశ్లోకము చక్కగా విమర్శించనగును.

శ్లో॥ విషయా వినివర్తంతే నిరాహారస్యదేహినః
రసవర్జం రసోఽ ప్యస్య పరందృష్ట్వా నివర్తతే॥

తాత్పర్యము : శబ్దాది విషయములను మానినంత మాత్రమున విషయగ్రహణము నివర్తించునే గాని విషయవాంఛ నివర్తించదు. పరమాత్మ సందర్శన మొక్కదానిచే మాత్రమే విషయవాంఛ (వాసన) సహితం నశించుచున్నది అని తాత్పర్యము. విషయవాసనలకు మూల కారణమైన రాగము నశించినచో వాంఛపోదు. మరల మరల విషయ సుఖాభిలాష నుత్పత్తి చేయుచునే వుండును. రాగము నశించుట కుపాయము ఆత్మ సాక్షాత్కారమే గాని అన్యోపాయములేదు. రాగము బంధమునకు మూలకారణము. అది గీతలో రసశబ్దముచే వర్ణింపబడెను. ఆత్మ సాక్షాత్కా రము కలిగిన పిదప రాగము అత్యంత నివృత్తిపొందుటతో, అట్టి జ్ఞాని విషయముల ననుభవించి నను అట్టి విషయానుభవము బంధహేతువు కానేరదు. వుపవాసమనగా ఆహార పానీయముల

విసర్జించుట కాదు. జ్ఞానేంద్రియముల యొక్కయు, మనస్సు యొక్కయు విషయముల నరికట్టుటయు కాదు. ఆత్మ స్వరూప సాన్నిధ్యమందు మనసు నిల్పుటయే వుపవాసము. యిట్టి ఉపవాస దీక్షయున్నవాడే సదోపవాసి, సదా బ్రహ్మచారి, స్థితప్రజ్ఞుడు అని కీర్తింపబడు చున్నాడు.

ఇక సగుణరూపుడగు గురుమూర్తిపట్ల "సన్నిధిమాత్రేణ" అనే విషయము విమర్శించ నగును. తాను తరించి తన శిష్యుని తరింపచేయుటకై మంత్రోపదేశముచేసి ఆచరణ మార్గమందు శిష్యుని నిష్ఠాతుని గావించి స్వస్వరూప జ్ఞానము కల్గించు గురుమూర్తి రూపుదాల్చిన ఆనిర్గుణ గురుస్వరూపమేగాని అన్యము గాదు.అతడు పోతపోసిన ఆనంద విగ్రహుడు. అతడెంత మహారణ్య ములోనున్నా, సంకీర్ణ జనావాసములలోనున్నా, అతడున్నచోటు తాను నివసించుటకు యెంత అనర్హప్రదేశమని యితరులెంచినా గురుస్థానమునం దంతే వాసియై శుశ్రూష చేసుకొనుటే స్థాన శుశ్రూష సర్వాభిమానములను దానికి మూలమగు అహంకారమును త్యజించి గురుసేవ చేయు చుండుటయే శిష్యధర్మము, గురుమూర్తి ప్రబోధచేసినా చేయకున్నా అతని కనుగ్రహము కలుగు వరకు వేచియుండవలెను. "అతనికి దయవస్తే అరనిముసముననే బోధస్థితి నీకు కుదిరించు సిగ్గువిడచి కొల్వుమా నీతివంతా" అని కృష్ణ దేశికేంద్రులవారి ఆజ్ఞ. నిర్వహించవలసిన గురు కార్యములు లేనియెడల గురుమూర్తి సన్నిధానమందే వినయ విధేయతలుగల్గి ఆసీనుడైయుండి గురువువెంట ఛాయవలె అనుసరించు చుండుటయే సన్నిధినుండు ఉపవాస దీక్ష. ఆయన ఆనంద విగ్రహమును కనులార గాంచుచుండు నదృష్టము పట్టిన చాలును.

5) చిదానందాయతేమనః : అనగా మనస్సు జ్ఞానానందములు పొందునని యర్థము. పరుసవేది సాన్నిధ్యములో యినుము బంగారమగును. అగ్ని సాన్నిధ్యములో వస్తువులు వేడెక్కు ను. మంచిగంధపుచెట్ల సమీపములోనున్న యితర వృక్షములు సుగంధపూరితములగును పరమాత్మ సన్నిధిలో జడప్రకృతి చేతనవంతమగును. అట్లే ఆనంద విగ్రహుడగు గురుమూర్తి సాన్నిధ్యములో ఆయన శరీరం చుట్టూ చిందుచూనుండు జ్ఞానానందములు ఆయనను పరివేష్టించియున్న భక్తుల అంతఃకరణములను ఆనంద రసప్లావితములచేయును. అందుకే "సాధూనాం దర్శనం పుణ్యం" అన్నారు. గురుసన్నిధిలో నుండుట మాత్రంచేతనే కొంతకాలము నకు భక్తునికి జ్ఞానోదయమున్ను కాగలదు. ఆవిధంగా నిర్గుణ సగుణరూపములలో ఆనందమ యుడగు గురుమూర్తి యొక్క దివ్య శ్రీచరణ సన్నిధి భక్తులమగు మనకందరికి లభించునుగాక!

శ్లో॥ నానాయక్త్యోపదేశేన తారితా శిష్యసంతతిః
తత్కృపాసార వేదేన గురుచిత్పద మచ్యుతం

తాత్పర్యము : అనేక విధములగు యుపాయములచే శిష్య పరంపరా సమూహమును గురు దేవుడు ద్ధరించుచున్నాడు. శాశ్వతమును జ్ఞానఘనమును అగు గురుస్థానము అట్టి గురుకృపా సంసిద్ధికి పరాకాష్ట గానుండి శిష్యునికి లభ్యమగుచున్నది.

విశేష వివరణము : 1) నానాయుక్తులు 2) ఉపదేశము 3) తారితా శిష్య సంతతిః 4) కృపాసారవేదేన 5) గురుచిత్పదము 6) అచ్యుతం.

1) యుక్తి అను పదమునకు నానార్థములు గలవు. సామాన్యార్థములో హేతువాదము ననుసరించి సమర్థించు వాక్యములు యుక్తులనబడును. కాని యిచ్చట "యుక్త" అను శబ్దమునకు యోగము, ఉపాయము, సాధనము అను అర్థమును గ్రహించవలసియున్నది. యుక్త్యోపదేశమూ కాదు. యుక్తోపదేశము అని గ్రహించవలెను. యుక్త అనుపదమునకు ధ్యానము, లేనిది, లభించుట, చిత్తవృద్ధి నిరోధము, చిత్త శుద్ధి, సమత్వము, కర్మకుశలత్వము, దుఃఖవియోగము. ఆత్మానుభవ ఆరూఢస్థితి యీ మొదలగు యోగశబ్దార్థ విశేషములు మాత్రమే గ్రహించనగును ఇట్టి మార్గములు లేక వుపాయములుపదేశించి సద్గురువు తన శిష్య ప్రశిష్యులను జనన మరణ భ్రాంతి రూపమగు సంసారమును తరింపచేయుచున్నాడని భావము.

2) ఉపదేశము = ఉప + దేశము = సమీపస్థానము. నీటి యందు ముంచిన పూర్ణ కుంభమునకు బాహ్యాభ్యంతరముల యందు ఏ విధముగా నీరు నిండుకొనియున్నదో, దేహము యొక్క చర్మమును ఏ విధముగా అవకాశ రూపమగు ఆకాశము కప్పియున్నదో అట్లే ఏ పరమాత్మ వస్తువు తన్ను బాహ్యాభ్యంతరములయందు అంటియే యున్నదో ఆ వస్తువే ఉపదేశము ఆ వస్తువు యొక్క స్థాన స్వరూప స్వభావములను వస్తు నిశ్చయ రూపంగా ఆరూఢ పరచుటే వుపదేశ మిచ్చుట యందలి నిజాభిప్రాయము. అక్షర సముదాయముతో గూడినదేదో మంత్రమును చెవిలో చెప్పుట మాత్రమేకాదు. చెవిలో చెప్పిన యా మంత్రజపము మాత్రముచేతనే ఆ పరమాత్మ వస్తుసాక్షాత్కారము కాజాలదు. "తజ్జపస్తదర్థభావనం" అని చెప్పబడినది. అనగా మంత్రార్థము అనగా మంత్రముచే నిర్దేశితమగు వస్తువుయొక్క భావన చేతనే మంత్రసిద్ధి కాగలదు. ఆ వస్తువు యొక్క సాక్షాత్కార మగుటకే గురుమూర్తి శిష్యుని యొక్క అధికార తారతమ్యమును బట్టి మొదటి పేరాలో చెప్పిన అన్నీ గాని, కొన్నిగాని, యోగ మార్గములయందు శిష్యునికి ప్రవేశము గల్గించుట రీత్యా వస్తువు యొక్క అపరోక్ష జ్ఞానము కల్గించగలడు.

3) తారితాశిష్య సంతతిః శిష్య సంతతి అనగా శిష్య ప్రశిష్యులందరు అని అర్థము. అనగా శిష్యులు, శిష్యుల శిష్యులు, శిష్యుల, యొక్క శిష్యులు అని అర్థము. సంతతి అను శబ్దమునకు పుత్రపౌత్ర, ప్రపౌత్రులెట్లు అన్వయమో అట్లే మూడు తరముల శిష్యప్రశిష్యులు శిష్య సంతతి అను శబ్దమునకు అన్వయింపనగును. అదే విధముగా గురుశబ్దమునకు స్వగురు పరమగురు, పరమేష్ఠి గురుఅను వర్గత్రయమును అర్థముగా గ్రహింపవలెను. "ఆత్మావై పుత్రానామాసి" అన్నపుడు ఒక గురుసత్తాయే అవిచ్ఛిన్న ధారావాహికముగ గురుశిష్యుల యందు ప్రసారమగుచుండును. కనుకనే గురువు తన శిష్య సంతతికి (శిష్య ప్రశిష్యులకందర్కి) ప్రబోధ గావించి భ్రాంతిరహిత స్థితిని చేకూర్చుట ధర్మము. శిష్యులున్ను తమ స్వగురువునే గాక పరమగురు పరమేష్ఠి గురువులను సేవించి సంశయ విచ్ఛిత్తి గావించుకొనవలెను.

4) కృపాసారవేదేన = అనగా గురుకృప యొక్క వుత్తమోత్తమ ఫలమేదో అదియే గురుకృపాసారము. అదియేదనగా గురుస్వరూపమే తానై, తనకు ఆ గురుస్వరూపమునకు

అభేదరూపమైన (అనగా వేరుగాని) స్థిత్యానుభపమే. వేదేన అనగా తెలియుటచేతనని అర్థము. అయితే తెలియుట అనగా వినుట మాత్రముకాదు. అనగా అస్తిత్యానుభవమును గూర్చి గురువు బోధించగా విని అర్థముచేసుకొనుట మాత్రముకాదు. "తత్వమసి" మహావాక్యమును శ్రవణము చేయుట మనన, నిధి ధ్యాసలు చేయుటయు కాదు, నేను మిగతా జీవోపాధులవంటి వాడను కాను. నేను మానవుడను నాకు పరమాత్మ సృష్టిలో నొక ప్రత్యేక లక్షణము కలదు అని విని నమ్మి వూరుకొనుట మాత్రము చేతనే మానవత్వము పొందినట్లుకాదు. మానవతా ధర్మము తనయందు మూర్తీభవించి తన మనోవాక్చరీరముల ప్రవర్తనయందు ద్యోతకమై యున్నపుడే నేను మానవుడననే మాట సార్థకము. అట్లే " అహం బ్రహ్మాస్మి" అని వూరక చెప్పుకొనుట కూడ బ్రహ్మత్వసిద్ధికాదు. "తత్కృపాసార వేదేన" అనగా త్రికరణములచే చేయబడు సమస్త వ్యవహారములయందు మూర్తీభవించిన పరమాత్మయే యితడు అనురీతిగా వర్తన సహజమై పోయిననాడే, అతడు గురుకృపా సారమును యెరిగినవాడగును. "పరిపూర్ణ మెరిగి యెరుక నెరిగి, యెరుకను మాను" మని మూడు ముక్కలలో "యెరిగి" అను మాటకు యీ అర్థమునే గ్రహించవలెను.

5) గురుచిత్పదము : గురు+చిత్+ పదము = అనగా గురువుయొక్క అఖండ జ్ఞానస్వరూపమైన స్థితియే. పదము అను మాటకు పదవియని స్థానమని మాత్రమేగాక పాదము అని అర్థమున్ను వున్నది. అవిద్యాపాదము, విద్యాపాదము, ఆనందపాదము తురీయ పాదము అను నాల్గు పాదములు చెప్పబడినవి. అపుడు చిత్ పదము అనునది విద్యాపాదము అనునదియగును. మానవాకృతిలోనున్న సగుణ రూపమగు గురుమూర్తికి పాదయుగ్మము అనగా రెండేపాదములు. ఆ దృష్ట్యా నిర్గుణరూపంలో గురుపరమాత్మకు

శ్లో॥ వందేగురుపద ద్వంద్వం వాంఙ్మనోతీత గోచరం
శ్వేతరక్త ప్రభాభిన్నం శివశక్త్యాత్మకం పరం॥

గురుగీత గూడ రెండు పాదములుగా నిర్ణయించి శివశక్తులే (అనగా పురుష ప్రకృతులే) ఆ రెండు పాదములుగా అభివర్ణింపబడినవి. శివస్వరూపము, చిత్ లేక అఖండజ్ఞానము (యెరుక రూపము) నుకున్ను, శక్తిరూపము మరపునకున్ను (ప్రకృతి, మాయ, అజ్ఞాన రూపమగు మరుపు) సూచకములు. అందు "తీర్థాన్ని దక్షిణేపాదే వేదాస్తన్ముఖా మాశ్రితాః" అని గురుగీతలోనే చెప్పబడినది. సగుణ రూపంలో గురుదేవుల దక్షిణపాదమే చిత్పదము. అర్ధనారీశ్వరునిగా యూహించినపుడు దక్షిణ భాగము శివుడు, వామభాగము పార్వతి లేక శక్తి నిర్గుణ రూపంలో అఖండ జ్ఞానమే గురుమూర్తి యొక్క చిత్పదము. గురుకృపా పాత్రులకు యీ చిత్పదము ప్రాప్తించుచున్నది. యీ చిత్పదము తెలిసికొన్నవారికిక తెలియదగినదిలేదు. "ఏకవిజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి" యీ చిత్పదమే ఆ ఏకవస్తువు.

శ్లో॥ జ్ఞానంతే ఽహం సవిజ్ఞాన మిదం వక్ష్యామ్యవేషతః
యత్ జ్ఞాత్వా నేహభూయో ఽన్యత్ జ్ఞాతవ్యమవశిష్యతే॥

అని భగవద్గీత ఆ చిత్పదము తెలిసికొన్న పిమ్మట యిక తెలియదగిన దేదియు నుండదని వక్కాణించుచున్నది. కనుక నదియే జ్ఞేయ బ్రహ్మము.

6) అచ్యుతం=అనగా చ్యుతిలేనిది. దిగజారనిది అని అర్థము. అనగా పురుష ప్రకృతి రూపమై, జ్ఞానాజ్ఞానలక్షణములు రెండున్ను కలదైనను, ఆ చిత్పదము తెలిసిన ధీరుడు ప్రకృతి తాదాత్మ్యము చెంది స్వరూప విస్మృతి చెందడు అని మాత్రమే అర్థము. ఆ పరమాత్మవలెనే తానున్ను అఖండ జ్ఞాన స్వరూపుడయ్యే యుండును. ఆ పరమాత్మయే తానగును. కాని ఆ పరమాత్మతోపాటు జీవేశ్వర జగద్రూపముగా అవతరణము చెందక మానదని పూర్ణబోధ సిద్ధాంతము తెలియచేయు చున్నది. చ్యుతి వుండుట, మరి ప్రళయానంతరము అచ్యుతమగు స్థితిలోనుండుట యీ రెండున్నూ పరమాత్మకు సహజ ధర్మములే. స్వాభావికములే, సర్వధర్మ విలక్షణమైన కేవల పరిపూర్ణ పరబ్రహ్మము మాత్రము కాదని గ్రహింపవలెను.

యీ విధముగా అచ్యుతమైన ఆ చిత్పదమును నానావిధములగు యుపాయముల ద్వారా చెందిపచేసి పిమ్మట సర్వద్వంద్వ విరహిత మగు పరిపూర్ణబోధచే జనన మరణ భ్రాంతి రహిత స్థితిని చేకూర్చు గురుపరమాత్మ కివే మా అనంత సహస్ర నమోవాకములు.

శ్లో॥ అచ్యుతాయ నమస్తుభ్యం గురవే పరమాత్మనే
న్వారా మోక్తపదేచ్ఛూనాం దత్తం యేనాచ్యుతం పదమ్॥

తాత్పర్యము : ఉత్తమాధికారులకు, నాశనరహితమగు పరిపూర్ణ పరబ్రహ్మ జ్ఞానము, స్వస్వరూప జ్ఞాన మందు నోలలాడు ఏ మహాత్ములచే, ప్రసాదింపబడుచున్నదో, అట్టి పరమాత్మ స్వరూపుడగు గురుమూర్తికి నమస్కారము.

విశేష వివరణము : 1) అచ్యుతాయ 2) స్వారామోత్తపదేచ్ఛూనాం 3) అచ్యుతం పదం.

1) అచ్యుతుడు = అనగా చ్యుతి లేక వున్నవాడు అచ్యుతుడు. చ్యుతి అనగా జారిపోవుట, మార్పుచెందుట, గతి, విడివడుట అని అర్థము.

జన్మవున్నచో నాశనము తప్పదు. కనుక పుట్టుచావులు లేని వాడు అని గురుపరమాత్మను అభివర్ణించినారు. పుట్టుచావులులేనిచో అతడే కేవల పరిపూర్ణ బ్రహ్మమగునాఏమి? అను శంక సహజముగా కలుగును. కేవల పరిపూర్ణమగు బ్రహ్మము వాచాతీతము మనోతీతము. పుట్టుచావులు లేనిది అనికూడా దానిని సాపేక్షికంగా వర్ణించుటకు వీలులేనిది. ఏలననగా అట్లనుటలో పుట్టుచావులు గల వస్తువుయొక్క అస్తిక్యతను అంగీకరించవలసివస్తుంది. పరిపూర్ణము స్వత సిద్ధమైనది. అది తప్ప రెండోది ఏమీ లేనేలేదని పరిపూర్ణ భావజ్ఞుల సిద్ధాంతము గదా! పుట్టుచావులు గలది ఒకటైనా వుంటేనేతప్ప, పుట్టుచావులు లేనిది అని వర్ణించుట జరుగదు గదా! కనుక యీ శ్లోకములో పుట్టుచావులు గల వస్తువుయొక్క సాపేక్షిక అచలస్థితి మాత్రమే వర్ణింపబడినదని భావించవలసియున్నది. అట్లే యీ శ్లోకములో స్తుతింపబడిన వస్తువు గురు స్వరూపమనీ, పరమాత్మ స్వరూపమనీ సాపేక్షిక శబ్దములచేతనే అతడు వర్ణింపబడినాడనీ యెరుగవలెను. గురువు అనగా గొప్పది. గొప్పది అని చెప్పినపుడు కొద్దిది అనేది స్ఫురణలోకి వచ్చును.

అట్లే పరమాత్మ అని చెప్పినపుడు ప్రత్యగాత్మ, జీవాత్మలు సాపేక్షికంగా స్ఫురణలోకి వచ్చు చున్నవి. యిట్టి సాపేక్షిక పదములు పలికినపుడు నిరపేక్షమగు వస్తువు యెట్లు తెలియబడును? శబ్దము విన్నతోడనే మరొక వస్తువు స్ఫురణలోకి రాని శబ్దమంటూలేదు. పరిపూర్ణమనిన నోట పలుకుట కగునా?" అని పెద్దలు ప్రశ్నించుచున్నారు. యీ శ్లోకములోని "గురవే" పరమాత్మనే" అను శబ్దములు కూడా సాపేక్షికపదములే. వానిచే చెప్పబడిన వస్తువు పరిపూర్ణ బ్రహ్మముకాదు. సాపేక్షిక జగత్తున కంతటికి మూలకారణమైన వస్తువు పరమాత్మ. అదే గురుస్వరూపము. సర్వసృష్టికి కారణమైనది సాపేక్షిక జగత్తునకంతటికి అత్యంత మూలకారణమగునది కూడా సాపేక్షికమే అయివుందనక తప్పదు. అది కార్యరూపం వహించక పూర్వము అది అచలస్థితిలో నున్నది. అపుడు దానికి సృష్టి సంకల్ప మింకనూ కలుగలేదన్నమాట. ఆ స్థితిలోనున్నప్పుడు మాత్రమే అది అచలము. ఆ వస్తువులకు సృష్టి సంకల్పము కలుగుటయే చ్యుతి లేక గతి. సృష్టి సంకల్పము కలుగని స్థితిలో దానినే అచ్యుతు డన్నారు. అట్టి గురు స్వరూపమునకు నమస్కారమని శ్లోకభావము, గురుస్వరూపము. ఈ అచ్యుత స్వరూపమే గాని పరిపూర్ణము కాదని తెలియవలెను. పరిపూర్ణము గురువూకాదు, లఘువుకాదు. ఏదీకాదు.

2) స్వారామోక్తపదేచ్ఛూనాం : స్వ + ఆరామ+ ఉక్త + పద + ఇచ్ఛూనాం = స్వారామోక్తపదే చ్ఛూనాం అనగా తన స్వస్వరూపస్థితి యందుండి ఆనందించు మహాత్ములచే చెప్పబడి వుత్కృష్ట పదమును, తెలుసుకొనే యిచ్ఛగలవారికి అని అర్థము. తన నిజస్వరూపమును యెరిగి ఆ స్థానమందు వునికి గల్గి అట్టి స్వస్వరూపమున కన్యమైన పరిపూర్ణ బ్రహ్మమును ఆరూఢపరచుకొని, అట్టి ఆరూఢ స్థితిని సచ్ఛిష్యులకు ప్రసాదింపగలవారే సద్గురువులు. అట్టి పూర్ణ గురువుల నాశ్రయించిసేవించి ఆరూఢత గాంచగోరు సచ్ఛిష్యులకు పరిపూర్ణబోధనను గ్రహించి జన్మరాహిత్య స్థితిని గలుగజేయు గురుసార్వభౌమునికి నమస్కరించుచున్నానని యీ శ్లోకాభిప్రాయము.

అచ్యుత పదము : యీ శబ్దము పరిపూర్ణ పరబ్రహ్మమును లక్ష్యార్థముచే మాత్రమే సూచించును. ఏలననగా వాక్కుకందని పరిపూర్ణ పరబ్రహ్మము వాచ్యార్థముచే గోచరించేదికాదు. అచ్యుతమనగా నాశనరహితమని అర్థమనీ, భవనాశములనే రెండు పదములు సాపేక్షిక పదములనీ, గ్రహించితిమి. సర్వద్వంద్వ రహితమగు పరిపూర్ణ పరబ్రహ్మమును ఆ ద్వంద్వ పదములలో ఏపేరుచేతను పిలువరాదని సిద్ధాంతము. కాని వ్యవహారార్థము దానిని కేటాయించి తెలుసుకొనుటకు ఏదో పేరు పెట్టుకొని వాడుట తటస్థించినది. ఏ పదము (శబ్దము) చే దానిని పిలచినను అది కేవలత్వము గాదు. కేవల అనే విశేషణమును సహాయపదముగా జత చేర్చి, 'కేవలాత్మ' 'కేవలాచలము' యిత్యాదిగా వ్యవహరించుట ఉత్తమము. లేనిచో, ఎరుక, పరిపూర్ణములలో ఏది గ్రహించవలెనో తికమకపడుట తటస్థించగలదు. వాక్కుల కందని పరిపూర్ణమును ఏరీతిగా గురువెరిగించ గలడు? అయితే వాక్కుచేతనే శిష్యునికి గురుడు దానిని అవగతమగు నని 'గురోర్ముఖేన జ్ఞాతవ్యం' అని చెప్పబడుతోంది గదా! మాటమాయేయగు గాక! కాని శ్రీకృష్ణ దేశికేంద్రులు శెలవిచ్చినట్లు మాటను మాట్లాడి వాచ్యార్థముతో గాక

లక్ష్యార్థంచేత తెలుసుకొని గురుకృపచే వస్తుసాక్షాత్కారముగాంచవలెను. వస్తుసాక్షాత్కారమైన వారికే వస్తు మద్రహితమైన పరిపూర్ణము తెలియబడును. "నిన్ను విడచిచూడుము. అంతా కుంఠితంగాని వైకుంఠమే. కల్పనారహితమైన కైలాసమే" అని గురుడు శాసించును. గురువాజ్ఞపాటించి శిష్యుడట్లేయొనరించి కృతకృత్యుడగును. ఈ భావమునే శ్రీకృష్ణదేశికేంద్రులు తమ కందార్థములలో "గురు డచల చలములను తన కెరగించిన శిష్యుడెరిగి యెరుకై యుండన్, ఎరుకను నిల్పకు మనినను, ఏరుకను విడనాడి శిష్యుడెట్లుండునంటే, అట్లనే నేనింకెట్లుండు నంటే," అంటూ స్థితి లక్షణము నుద్ఘాటించి నారు. ఆత్మయందు రమించేవారికే పూర్ణబోధ యని యీ గురుగీతా శ్లోకమున్ను చెప్పుచున్నది. గురుగీతలోనే అన్యత్రా మరొక శ్లోకంలో "స్వయం బ్రహ్మమయోభూత్వా తత్పరంచ అవలోక యేత్" అని శాసింపబడినది. అంటే తాను అచ్యుతుడై, కేవలాచ్యుతమగు పరిపూర్ణమును తెలియవలెను.

చ్యుతి అనగా వీడుట, వదలుట అని కూడా అర్థములున్నవి. సృష్టికి పూర్వము సృష్టికారణమగు బ్రహ్మము అచలస్థితిలో నుండి సృష్టిసంకల్పము కలుగుటతోడనే, సృష్టిగతిలో పడినది. యీ స్థితి గతులు రెండూ పరమాత్మకు సహజము. ఏకమగు ఆ పరమాత్మయే క్రమంగా "ఏకం అనేకం భవతి" అనే శ్రుతిలో చెప్పబడినట్లు అనేక మాయెను. ఈ నానాత్వముతో గూడిన సమస్తము ఆ పరమాత్మనుండి విడివడి వేరైనట్లుగా మనకు తోచుచున్నది. కాని ఈ అనేకత్వము నందు తోచబడే నామరూపాదులు మిథ్య, నిజముగా పరమాత్మనుండి వేరై సృష్టి జరుగలేదు. పరమాత్మయే అనేక నామరూపములు పొందుట మాత్రమే జరిగినది. ఇట్టి దుర్గతి పాలగుటయే చ్యుతి, తన స్థాన స్వరూపములను తెలుసుకొని స్వరూపస్థితిని పొందుటయే సద్గతి. ఇట్టి దుర్గతి, సద్గతి అనునవి పరమాత్మనైన నాకేగాని, నేనుగాని పరిపూర్ణ బ్రహ్మకు స్థితి గాని, చ్యుతి గాని, గతిగాని ఎన్నడూ లేనేలేవు. అది కేవలాచ్యుతపదము.

ఈ విధముగా కేవలస్థితి లక్షణములో శాశ్వతముగా నుండే పరిపూర్ణ పరబ్రహ్మమును, స్థితి చ్యుతి గతిగల యెరుకను వస్తునిశ్చయ పూర్వకముగా తెలియజేసి శిష్యులకు జనన మరణ భ్రాంతి రహితస్థితిని ప్రసాదించు శ్రీసద్గురుదేవుల చరణారవిందములను సదా స్మరించు చున్నాను.

శ్లో॥ గురునామ సమం దైవం న పితా నచ బాంధవా॥
గురునామ సమస్వామీ నేదృశం పరమంపదం॥

తాత్పర్యము : దైవము, తండ్రి, బంధువులు, యజమాని, పరమపదము, ఇవి ఏమియు గురువు తో సమానమైనవి కావు.

శ్లో॥ శ్రీగురో స్సదృశం, దైవం శ్రీగురో స్సదృశఃపితా।
గురుర్థ్యాన సమం కర్మ నాస్తి నాస్తి మహీతలే॥

తాత్పర్యము : దైవముగాని, తండ్రిగాని, గురువుతో సమానులు కారు. గురుధ్యానముతో సమాన మైన సత్కర్మయున్ను ఈ భూమండలమందు లేదు.

ఇందు మొదటి శ్లోకంలో దైవము, తండ్రి. బంధువులు, ప్రభువు లేక ఈశ్వరుడు చివరకు పరమపదము కూడా గురునియొక్క నామముతో సమానములుకావు అనుటలో గురునామమునకు ఉత్కృష్టత చెప్పబడినది. అందు గురునామమనగా తనకు మంత్రోపదేశము చేసిన గురువుగారియొక్క పేరా? లేక గు + రు = గురు అను శబ్దమా? ఏది గ్రహించవలెను? గురు శబ్దము యొక్క అర్థమును గురుగీత అన్యత్రా అభివర్ణించియున్నది. అందు నిరాకారమగు గురుతత్త్వమే నిర్దేశింపబడినది. కాని సాకారుడైన గురువు యొక్క నామము సూచింపబడలేదు.

రెండవ శ్లోకంలో "గురు" అను శబ్దమే ప్రయోగింపబడినది. ఐతే ఈ శబ్దము నామము ను సూచించునా? లేక స్వరూపమును సూచించునా? నామము కేవలము శబ్దరూపము మాత్రమే! వాచాడంబరమే స్వరూపము అట్లుకాదు. కేవలము అపరోక్ష సాక్షాత్కారమును కల్గించునదై యున్నది. మొదటి శ్లోకంలో గురువు యొక్క నామమునకును. రెండవ శ్లోకంలో గురువు యొక్క స్వరూపమునకున్ను ప్రాధాన్యత ఇవ్వబడినట్లు గ్రహించనగును.
పోతే, ఈ నామ రూపముల రెండింటిలో ఏది మొదటిది? దేనిని గ్రహించుట సాధకునికి ఉత్తమ ప్రయోజనకరము? అని ఇంచుక విచారించవలసియున్నది. నామము మంత్రములన్నిటి వలె శబ్ద సంబంధము. అన్ని శబ్దములును అక్షర సముదాయముతో ఏర్పడినవి. అన్ని అక్షరములకు ఆది, ప్రణవాక్షరము అని చెప్పబడుచున్నది. సృష్టి పరిణామములో చెప్పబడిన శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధ అను పంచతన్మాత్రలలో రూపము మూడవదిగానున్నది. శబ్దరూప మైన నామమే మొదటిది, రూపము తరువాత ఏర్పడినది అని స్థూల దృష్టికి తోచుచున్నది. కాని రూప మనగా వర్ణములు (రంగులు) ఆకారములతో కూడిన నేత్ర గోచరమగునది అను కొంటేనే ఈ భావము సరిపోవును. కాని భాషావిషయముగా చూచినచో మొదట వస్తువు గోచరమై తేనే, వ్యవహారార్థము దానికి ఒక పేరు పెట్టుట జరుగుచున్నది కనుక రూపమే మొదటిది. దాని తరువాతనే దానికి ఒక పేరు పెట్టుట జరిగినది అని చెప్పుట సమంజసముగా నుండును. అంతేకాదు. సృష్టికి పూర్వము సృష్టి కారణమైన వస్తువు ఒకటి వుండి తీరవలెను కదా! దానికి అప్పుడు ఏ నామము లేదు కదా! అయినను దానికి స్వరూప లక్షణమంటూ ఒకటి ఉండి తీరవలెను కదా! "రూపము" అనుటలో మనస్సుకు మాత్రమే గోచరమగు స్వరూపమును గ్రహించుటయే ఉత్తమం కాని చర్మచక్షువునకు గోచరమగు వర్ణాత్మకమగు (రంగులతో కూడిన) రూపమును అర్థముగా గ్రహించుట ఉత్తమముకాదు. ఇప్పుడు "నామము" అను శబ్దముచే సర్వనామములకు మూలమైనట్టియు, సర్వబీజములకు, అక్షర సముదాయమునకు మరిన్ని వేదశాస్త్రాది వాఙ్మయమునకు అంతటికి మూలమైనట్టియు ప్రణవాక్షరము (పరావాక్కు) కలిగినట్టియు పరమాత్మ స్థానమునే గ్రహించవలెను. కనుక ఇందలి రెండవ శ్లోకమునకు మొదటి శ్లోకమునకు పాఠాంతరము అని చెప్పవచ్చును.
(ప్రథమశ్లోక వివరణము)

ఇందు 1) దైవము 2) పితా 3) భాందవాః 4) స్వామీ 5) పరమపదం అను శబ్దార్థము

లను వివరించి అవి గురునామముతో ఎట్లు సమానము కాజాలవో విచారించవలసి యున్నది.

2) దైవము : దైవము అను శబ్దము దివ్ అను ధాతువు నుండి ఉత్పత్తి, దివ్ అనగా ప్రకాశించుట అని అర్థము, ప్రకాశమనగా వెలుగు. దైవమను శబ్దమునకు, సృష్టికి పూర్వమే ఉండి సృష్టి, స్థితి, లయ, విస్తీర్ణ, ఆకర్షణలకు కారణ కర్తృత్వముగల పరమాత్మనే గ్రహించుట ముఖ్యార్థమైయున్నది. అపుడు అది ప్రకాశ స్వరూపము అయివున్నది అని చెపితే అది వెలుగు రూపమైఉన్నదని గ్రహించుట సమంజసము కాదు. ఏలననగా వేడి వెలుగు అగ్ని భూత లక్షణములు. నేత్ర గోచరమగు అగ్ని, విద్యుత్ ప్రకాశము వంటి వెలుగు ఆ అగ్ని, విద్యుత్ మొదలగునవి సృష్టియే కానప్పుడు ఉండే పరమాత్మకు చెప్పుట అసంభవముకదా! కోటి సూర్య ప్రకాశవంతమైనది. విద్యుల్లేఖాభాసమైనది. వెలుగు లన్నింటికీ వెలుగిచ్చు వెలుగు ఇత్యాదివర్ణన లన్నియు కేవలము అలంకారికముగా వర్ణింపబడినవే అని చెప్పక తప్పదు. అది ఒక అపూర్వ మగు అలౌకిక ప్రకాశము అని చెప్పినా, నిజార్థము తెలియబడుటలేదు. ప్రకాశము అనగా 'జ్ఞానము' అను అర్థమునే గ్రహించవలెను. అపుడు ఆ పరమాత్మ స్వరూపము జ్ఞానమని, లేక ప్రజ్ఞానఘనమని లేక చిద్ఘనమని చెప్పవలెను. స్వర్గాది ఊర్ధ్వ లోకములలోనున్న స్త్రీ పుం రూపములగు దేవతలందరూ దైవ రూపముగా మానవులచే వుపాసింపబడుచున్నారు, వారికి వెలుగు రూపమగు తేజస్సు చెప్పినను చెప్పవచ్చును. వారందరి ఉత్పత్తికి కూడా పూర్వమే ఉండి, వారి ఉత్పత్తికే కారణభూతుడై చిద్ఘనమైయున్న పరమాత్మ వెలుగు ఎక్కడిది? లోకములో పూజింపబడి దేవతలెవ్వరునూ "గురు" శబ్దముచే సూచింపబడిన గురుతత్వముతో సమానులు కారు. గురునామము అనుటలో "గురు" అను శబ్దమే నామము కాని సాకారుడు అగు గురువు యొక్క నామము గ్రహించలేదు. అని తెలియవలెను. అందుకే "ఏకేవ పరోమంత్రోగురురిత్యక్షర ద్వయం" అని గురుగీత అన్యత్రా చెప్పుచున్నది.

2) పితా : అనగా తండ్రి మరియు పితృ దేవతలకున్ను ఈ శబ్దము అన్వయించును. తండ్రి కంటెను లేక పితరులకంటెను గురుపరమాత్మ గొప్పవాడని స్పష్టమే. కాని ప్రత్యేకముగా చెప్పుటకు కారణమేమి? అంటే తండ్రి తన స్థూల దేహమునకును బీజరూపుడై యుండుటయే గాక బాల్యమునందు తనకు విద్యాబుద్ధులు గరపి తన శీల సంపత్తికి నిర్మాత అగుటయేగాక ఉపనయన కాలమున తనకు జ్ఞానోపదేశము చేసి, తన పారమార్థిక శ్రేయస్సునకు కూడా పునాది వేసిన వాడగుటచే తండ్రికంటె దైవము లేడని ఎంచవలసియున్నది. అయితే గురు పరమాత్మ, తనకేగాక తనవంటి మానవులందరియొక్క స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ దేహములన్నిటికి అత్యంత మూలకారణ స్వరూపుడై యుండి, సర్వప్రకాశములకు ప్రకాశము నిచ్చు స్వయం ప్రకాశ స్వరూపుడై యుండుటచే గురు పరమాత్మ కన్న తండ్రి కంటెను గొప్పవాడు తండ్రిని దేవుడని భావించవలసివస్తే గురువును దేవాది దేవుడని భావించవలసియున్నది.

3) బాంధవాః : బంధువులనగా రక్తసంబంధీకులు మాత్రమే అయివున్నారు. కాని ఆత్మ సంబంధీకులు ఎంతమాత్రము కారు. ఆపత్ కాలములలో బంధువులు ఏకించిత్‌గానో మనకు సహాయపడగలరు కాని "సర్వాపదధ్వంసకం" అని గురుపరమాత్మ కీర్తింపబడుచున్నాడు.

అయితే తన దుష్కృత కర్మయే తన దుఃఖములకు కారణమైనపుడు తన ఆపదలను పరమాత్మ ఎట్లు ధ్వంసము చేయగలడు? అంటే, నాకు దుఃఖము కలిగినది అను పరితాపము తనకు కలగకుండా సహనబుద్ధిని ప్రసాదించుటచే దుఃఖములు కలిగిననూ, కలగనివే అగు చున్నవి.

4) స్వామీ : స్వామి అనగా యజమాని. ప్రభువు, అధిపతి, ఈశ్వరుడు, ప్రభుని ఆజ్ఞ ధిక్కరిస్తే ప్రభువునకు కోపము కలిగి తనను శిక్షించగలడు. ప్రభుని కోపము ఒకానొకప్పుడు సమంజసము కాకపోవచ్చును. ఎంతటి ధర్మ ప్రభువైననూ అతని అంతఃకరణ సంబంధమగు కామక్రోధాదికములకు బానిస అగుచున్నాడు. కాని గురు పరమాత్మ అట్టి కామక్రోధాదికములకు బద్ధుడు కాడు. కేవలము నిమిత్తమాత్రుడు మన దుష్కర్మలకు మనకు శిక్షారూపముగా ప్రాప్తించు ధుఃఖములకు, మనమే బాధ్యులమై యున్నాము. మనకు ఒకప్పుడు ప్రభువువలన కలుగు అన్యాయ రూపమగు శిక్ష ఎన్నడును పరమాత్మ వలన మనకు విధింపబడనేరదు. ప్రభువుకంటె గురుపరమాత్మ ఎంతో మిన్నై ఉన్నాడు. దుష్ట శిక్షణ శిష్ట రక్షణ ఇరువురకు సమానమే అని స్థూల దృష్టి చేత మాత్రమే నిర్ణయించబడినది. "కర్మమే జనులకు దైవము, కర్మము సుఖ దుఃఖములకు కారణ మధిపా" అని చెప్పబడినది.

5) పరమ పదం : అనగా శ్రేష్టమైన మోక్షస్థానము. అనగా ఆత్మస్థానమే అయివున్నది. అదియే నా స్వస్థానము నాస్థానము. నా కంటే పూజనీయము ఎన్నడునూ కాదు కదా! అట్లే పరమాత్మ యొక్క ఆవరణము పరమాత్మకంటే శ్రేష్ఠము కాదు. దేవునికంటె దేవాలయము శ్రేష్టమగునా!

రెండవ శ్లోకమునందు విశేష వివరణము : 1) శ్రీగురుః 2) గురుర్ధ్యానం సమం కర్మా

1) శ్రీగురు : శ్రీగురు అనుశబ్దమునందు, శ్రీకారము శుభ ప్రదములగు మంగళ ప్రదములగు, శోభస్కరములగు సమస్త శృంగారములను తెలియజేసి ఆనందపరచగల ఆత్మప్రకాశము అనగా అఖండ జ్ఞానావరణమని చెప్పబడినది. అట్టి శ్రీగురు స్వరూపముతో మొదటి శ్లోకములో చెప్పబడినవేమియు సాటిరావు. అట్టి గురుధ్యానముతో సదృశమైన ఉత్తమ కర్మ మరియొకటి లేదని ఈ శ్లోకములో ఉద్ఘాటింపబడుచున్నది. అంటే సముద్రముతో సమాన మైనది సముద్రమే. ఆకాశముతో సమానమైనది ఆకాశమే, కాని మరియొకటి కానరానట్లే పరమాత్మ స్వరూపముతో సమానమై "సత్యం, శివం, సుందరం" అని కీర్తింపదగిన వస్తువు మరియొకటి లేదు. అందుకే శ్వేతాశ్వతర ఉపనిషత్తులో " నతస్సమశ్చాభ్యధికశ్చదృశ్యతే" అని అభివర్ణింపబడినది. అనగా దానితో సమానమైనదిగాని, అధికమైనదిగాని కానరాదని అర్థము.

2) గురుధ్యానం సమం కర్మా : ధ్యానము కూడా ఒక కర్మ యేనా? అని ఇంచుక సందేహము కలుగవచ్చును. ధ్యానము అనగా చింతనచేయుట. ఇతర చింతనలుకు తావివ్వ కుండా ఎడతెగని సజాతీయ వృత్తుల ప్రవాహమే ధ్యానమని చెప్పబడును. అనగా ధ్యేయ వస్తువు నందు ఎడతెగని చింతనమే ధ్యానము. కర్మ అనగా పని. మనస్సు, వాక్కు శరీరము అను మూడున్ను పనిచేయుటకు ముఖ్య ఉపకరణములు లేక పనిముట్లు, ధ్యానము కేవలము మనోవ్యాపారమై ఉన్నది. ధ్యానము కూడా ఒక కర్మయే. ఇది మానసిక కర్మ. వాక్కుచేతను,

శరీరము చేతను చేయు కర్మలకంటె బలీయమై, శక్తివంతమైఉన్నది. "యాదృశీ భావనాయత్ర తాదృశీభవతి నిశ్చయం" అనగా మానవుడు ఎట్లు భావించునో అట్లే అగును. నరుడు తలచినచో ఆ తలంపుమాత్రముచేతనే నల్లరాయి కూడా బ్రద్ధలగును. మరియును మనస్సు లక్క వంటిదని అది మెత్తబడినచో ఏ ఆకృతినైననూ వహించుననియు చెప్పబడినది. ధ్యానము పటిష్టముగా నున్నచో మనస్సు ఆర్ధ్రమై (మెత్తబడి) ఏ వస్తువును ధ్యానించునో ఆ వస్తువు యొక్కతాదాత్మ్యము చెందును. అప్పుడు ధ్యానము చేయు మనస్సు ధ్యేయ రూపమై నిలుచును. అపుడిక మనస్సు లేదు. ఇదియే ధ్యానమునకు పరాకాష్ఠ. ఇట్టి ఉత్కృష్టమగు ధ్యానముచేత, ధ్యేయ వస్తువగు పరమాత్మ స్వరూపుడే కాగలడు. ధ్యానము వంటి ఉత్తమకర్మ మరియొకటి లేదని ఈ శ్లోకములో చెప్పబడినది.

"మాతృదేవోభవ" అని తండ్రికంటెను తల్లి పూజనీయురాలుగా చెప్పబడియున్నది. కర్మదేహము ఉత్పత్తి అగుటలో తల్లితండ్రులు ఇరువురునూ బాధ్యులై ఉన్నారు. ఈ శ్లోకములో తండ్రిని గూర్చి చెప్పినప్పుడు తల్లిని గూర్చి కూడా చెప్పినట్లే అని భావించవలెను. తల్లిదండ్రులు ఉత్పత్తికి క్షేత్ర బీజములవంటివారు. క్షేత్రం ప్రధానమా? బీజము ప్రధానమా? అను చర్చ అప్రస్తుతము. అయిననూ క్షేత్ర బీజములలో బీజమునకే ప్రాధాన్యత ఇచ్చి ఈ శ్లోకములో తండ్రి మాత్రమే చెప్పబడినాడు. ఏలననగా! స్థూల దేహ నిర్మాణమునకు తల్లి కారణమనియు, తెలివికి తండ్రికారణమనియు, కొందరందురు. మానవ నిర్మాణ శాస్త్రములో ఈ వాదము నిలచినా నిలవక పోయినా ఈ వాదములో దేహముకంటె తెలివికి ప్రాధాన్యత ఇచ్చి నట్లు స్పష్టము.

ఈ విధముగా తల్లి, తండ్రి, బంధువులు, ప్రభువు, దైవము, పరమపదము సర్వము తానే అయివుండుటచే ఇందు ఏ ఒక్క దాని కంటెనుకూడా పూజనీయుడై ప్రేమపాత్రుడై సగుణ నిర్గుణ రూపములలో మనలనందరను అనుగ్రహించుచున్న గురుపరమాత్మను అహరహము భజింతుముగాక!

శ్లో॥ నిరస్తః సర్వ సందేహ, ఏకీకృత్య సుదర్శనం
రహస్యం యో దర్శయతి భజామి గురు మీశ్వరం॥

తాత్పర్యము : సర్వసందేహ రాహిత్యం పొందినవాడై ఏ గురువు తన శిష్యుని ఏకత్వమును పొందించి, పరమ రహస్యమైన పరిపూర్ణ బ్రహ్మమును దర్శింపచేయుచున్నాడో, ఈశ్వర స్వరూపుడైన అట్టి సద్గురు స్వామిని నేను భజించుచున్నాను.

విశేష వివరణము : ఈ శ్లోకములో సద్గురు లక్షణములు తెలుపబడినవి. సర్వసందేహములు, అజ్ఞానావృతమైన అంతఃకరణ గల సామాన్య మానవుని పీడించుచుండును. "సంశయాత్మా వినశ్యతి" అని చెప్పబడినట్లు అట్టివాడు కడతేరుట కడుంగడు కష్టము. గురువు కూడా అట్టి సామాన్య మానవుడై యుంటే, ఒక గ్రుడ్డివాడు మరియొక గ్రుడ్డివానికి దారిచూపించ బూనుకొన్నట్లే యగును. 'స్వయం తీర్ణః పరాంస్తారయతి' అను న్యాయముగా తాను తరించిన వాడైతే తప్ప యితరుల నెట్లు తరింపచేయగలడు?

అనధికారులగు అట్టి అల్పగురువుల నుద్దేశించియే వేమనగారు.

"తన్ను తా నెరుగడు. తా నెవ్వరికీ జెప్పు
పాలుమాలినయట్టి పశువు కొడుకు?"

అని అధిక్షేపించినారు. జీవేశ్వర జగత్సృష్టి కంతటికీ అత్యంత మూలకారణమైన బ్రహ్మతత్వమును తెలుసుకొన్నవానికిగాని అంతఃకరణయందలి అజ్ఞాననాశముగాదు. ఏలననగా ఆ బ్రహ్మతత్వము అఖండ జ్ఞానస్వరూపమైనది. దానిని తెలియుట అనగా ఆస్వరూపుడే తానగుట. అపుడుగాని మూలాజ్ఞానము తొలగి సర్వసందేహ రాహిత్యము గాదు. "ఏకవిజ్ఞానేన సర్వవిజ్ఞానం భవతి" "యద్జ్ఞాతానేహభ్యూన్యఅత్ జ్ఞాతవ్యమవ శిష్యతే" అనీ శ్రుతి స్మృతులు ఏ ఆత్మను గూర్చి చెప్పుచున్నవో అట్టి ఆత్మ స్వరూపమును యెరిగినవాడు. పంచదారను యెరిగి యున్నవాడు పంచదారతో చేయబడిన సకల వస్తువులను యెరుగ గల్గిన విధంగా "సర్వం ఖల్విదం బ్రహ్మ" "బ్రహ్మణోన్యం నకించన" అను అనుభవజ్ఞానముజెంది సర్వసందేహ రాహిత్యం పొందగలడు.

"అనేక జన్మార్జిత పుణ్యపాకోద్గరోస్తుతత్వం లభతే మనుష్యః" అనేక జన్మలయందు చేయబడిన పుణ్యవిశేషంచేతగాని గురుతత్వం లభింపదు. గురుతత్వమును ఆరూఢంచేసుకొన్న గురువు మహా పుణ్య పురుషుడనుట నిస్సంశయం. "సాధునాం దర్శనం పుణ్యం, స్పర్శనం పాపనాశనం" అనగా అట్టి సాధు సత్పురుషుల సందర్శనంచేతనే పుణ్యము ప్రాప్తించును. పాదస్పర్శాది మహాభాగ్యమే కల్గినచో పాప పంకిల మంతయు పటాపంచలగుననుటలో యెట్టి సందియము లేదు. "గురోన్ముఖేన జ్ఞాతవ్యం నాన్యథా గ్రంథకోటిభిః" అట్టి గురుముకతః శ్రవణము చేసినపుడే ఆ గురుతత్వ మపరోక్షం కాగలదు. తన గురువు వల్ల గురుతత్వమును గుర్తించినవాడే తిరిగి యితరుల కుపదేశించుటకు సమర్థుడు కాగలడు. సర్వసందేహములకు, సర్వభ్రాంతులకు మూలమైన యెరుక కూకుడు వేరును, గురుకృపకు పాత్రుడైనవాడే ఛేదింప గల్గును. అవిధంగా ఎరుక రహితమునందు నిశ్చయత్వము పొందినట్టి సర్వసమర్థుడగు గురువే శిష్యుల నుద్ధరించగలడు.

రహస్య రూపముగానున్న పరిపూర్ణ పరబ్రహ్మమును అట్టి సర్వసమర్థుడగు గురువైనను యెట్లు దర్శింపచేయగలడు? అనే విషయం గూడా యీ శ్లోకములో చెప్పబడినది. ఎట్లనగా మున్ముందుగా "ఏకీకృత్య సుదర్శనం" = అనగా ఆత్మను ఏకత్వము చెందింపవలెను. ఆ ఏకత్వ రూపమగు "సత్యం, శివం, సుందరం" చెప్పబడుతోంది. ఆ ఆత్మస్వరూపమే మంగళ స్వరూపమును దర్శింపదగిన.సు + దర్శనం = ఉత్తమోత్తమమగు మంచి దర్శనము (లేక దృశ్యము) ను అయివున్నది. శృంగారమంతయు ఒకచోట చేర్చిన సౌందర్యరాశియై సర్వ శృంగారదృశ్యములను ప్రకాశింపచేయు కారణస్వరూపమై శ్రీకార వాచ్యమైయున్నది. అది సృష్టియనంతరం "ఏకం అనేకం భవతి" అనే న్యాయంగా అనేకాత్మకమైనది ఏకీకృత్య అనగా అట్టి అనేకత్వమునకు "సూత్రే మణిగణాయివ' అనగా హారంలోని మణులకు దార మెట్లో అట్లే ఆధారంగానూ అధిష్ఠానం గానూ వున్న ఆ తొలి వస్తురూపమును శిష్యునికి మానసిక

ప్రత్యక్షం గావించుటే గురుమూర్తి యొక్క ప్రథమ కర్తవ్యము.

"రహస్యం యో దర్శయతి' ఆ పిమ్మట గురువు తన శిష్యునికి రహస్యముగా నున్నదానిని దర్శింపచేయును. ఆత్మస్వరూపమే రహస్యము గానున్నది. కాని దానికంటెను "గుహ్యాతి గుహ్యాతరం" గా నున్నది. 'అతి రహస్యం బట్టబయలు' అని చెప్పబడుచున్నది. అనగా బహు తేటతెల్లంగానున్నది. ఐతే యెవరికి తేటతెల్లంగానున్నది? గురుకృపాపాత్రులకేగాని ఏతద్విహీనులకు "అంధః స్సూర్యోదయం యధా" అనగా మహోజ్వలంగా సూర్యోదయమగు చున్ననూ గ్రుడ్డివారికి కానరానట్లే తెలియరాక ( అనగా మహ రహస్యంగానే) యున్నది. గురుకృప యనగా సుదర్శనము యొక్క దర్శనము సిద్ధించు, అనగా ఆత్మ స్వరూప సాక్షాత్కారము పొందినవాడు. అట్టివానికి గురుసూచన మాత్రంగానే ఆ "పరమ గోప్యము" అపరోక్షముకాగలదు. అందుకే కృష్ణదేశికేంద్రుల వారు తమ కందార్థములో "అపరోక్షమౌను మనుజులకు, పరోక్షంబైన బయలు గురుకృపలుగా, కీలిదె లేని ఎరుక తా తొలుగా" అని సెలవిచ్చినారు. గురుకృప కల్గినవానికి గురువు చేయు సూచన ఏమి? అదియును శ్రీకృష్ణదేశికేంద్రులవారే సెలవిచ్చి యున్నారు.

ఎట్లనగా : "గురుడచలచలములను తనకెరిగించిన,శిష్యుడెరిగి ఎరుకై వుండన్ ఎరుకను నిల్పకుమనినను............." అన్నారు. ఎరుకను నిల్పకు అనుటయే ఆస్థితిలో గురు సూచన, శాశనము. "గురువాక్యం యధా తధా" అనే న్యాయంగా గురుకృపా ప్రసాదసిద్ధిపొందిన యా సచ్ఛిష్యుడు "యెరుకను విడనాడి" పరిపూర్ణత దనరుటయే ఫలితార్థము. ఇదియే అచలపరిపూర్ణ దర్శనము. ఆ విధంగా దర్శింపచేసిన గురువు, నరుడా హరుడా లేక పరుడా! నరుడు కాడనుట నిశ్చయమే. సగుణ రూపంలో హరుడు లేక ఈశ్వరుడు. నిర్గుణ రూపంలో అతడు పరుడే అనగా గురుతత్వమైన పరతత్వమే అని తెలియవలెను. ఈశ్వర స్వరూపుడగు ఆ గురుమూర్తిని భజించుచున్నాని ఈ శ్లోకములో యీశ్వరుడే పార్వతికి చెప్పుచున్నాడు. మరి ఈశ్వరుడు అనగా నేమి? షడ్గుణైశ్వర్యములు గలవాడు. ఆ ఐశ్వర్యములను ప్రసాదించుట వలన సుఖము కలిగించగలడు. ఈశ్వరుడు అనీ, శం = సుఖమును, కరుడు = కలిగించువాడూ, కనుక శంకరుడని పేరు పొందినవాడు. అతనికే సర్వమును లయము చేయువాడు హరుడు అనికూడ నామధేయము కలదు. ఈశ్వరుడు శంకరుడు మాత్రమే గాక హరుడు కూడ నైయున్నాడన్న మాట. అనగా సాక్షాత్కారమును కలిగించువాడూ దానిని రహితపరచి (హరించి) రహస్యమును దర్శింపచేయువాడు కూడా నాతడే. ఎరుక స్వరూపస్థితిని ప్రసాదించుటకు, దానిని రహితపరచుటకు కూడా గురుడే సమర్థుడు. అట్టి ఈశ్వరుని అనగా గురువును భజించుచున్నానని ఈశ్వరుడే చెప్పుకొనియున్నాడు.

ఈ శ్లోకమందలి "రహస్యం" అనునది ఆత్మస్వరూపమునకే అన్వయముచేసి యితరులు టీకాతాత్పర్యము చెప్పగలరు. కాని యీ గురుగీతా శ్లోకార్థమును అట్లు మట్టగించి తమ తమ సిద్ధాంతం మేరకే సరిపుచ్చుకొనుట న్యాయం కాదు. 'త్వం' పదార్థము 'తత్' పదార్థము 'అసి' పదార్థములను దర్శింపచేయు గురుమూర్తి కొరకు నమస్కారమని అభివర్ణించిన '

చిన్మయం వ్యాపితం' అనుశ్లోకము "స్థావరజంగమం వ్యాప్తం" అను శ్లోకమునందును "అఖండ మండలా కారం" అను శ్లోకమునందును గురుమూర్తి అఖండాత్మను గూడా దర్శింపచేయువాడని యిదివరకే వర్ణింపబడి యున్నప్పుడు తిరిగి ఆ ఆత్మ స్వరూపమును దర్శింపచేయువాడని చర్వితచర్వణంగా పునరుక్తి దోషమును గూడా యుల్లఘించి యీ శ్లోకము చెప్పబడినదనుట న్యాయం కాదు.

"రహస్యం యోదర్శయతి" అంటే పరిపూర్ణమును దర్శింపచేయునా? అది ద్రష్టోదృక్ దృశ్యములను త్రిపుటి కతీతముకదా అనే సందేహము కలుగవచ్చును. గాని దానికిని కందార్థము లలో చక్కగా జవాబు చెప్పియున్నాడు. "లేదనకు యున్న దదుగోనే దెలిసితి ననకు దాన్ని నీ వెరిగేవా? కాదది నీచే తెలియను. యేదిర తన్మాత్రసమిత ఈ బట్టబైటా దీనికి సాటిదేదీ యెచ్చోటా వాదేల లేనెరుకతో దీన్ని కనిపెట్టి పొదొట్టు మెరుక నింకేదిబట్టదుచాలు" నని శెలవిచ్చియున్నారు.

జన్మరహితం చేకూరవలెనన్న అట్టి గురుసేవ వినా గత్యంతరం లేదు. " ఎరుక తనకు తావీడిపోదు ఎరుకను విడిపించలేరు. యెవ్వరు ధాత్రి గురుడొకడు తప్ప" కనుక అట్టి నరరూపం లో నుద్ధరించవచ్చిన హరుడు. పరుడు అను సగుణ నిర్గుణ రూపములలో నున్న సద్గురునికివే మా ప్రణతులు.

శ్లో॥ నమస్తే నాథ భగవన్ శివాయ గురురూపిణే
విద్యావతార సంసిద్ధ్యైస్వీకృతా నేక విగ్రహః॥

తాత్పర్యము : పరమ రహస్యముగానున్న పరబ్రహ్మ విద్యను మానవుల నుద్ధరించుటకై లోకము నందు వెలయించుటకుగాను అనేక రూపములదాల్చి షడ్గుణైశ్వర్యములతో గూడి సమస్త కళ్యాణ గుణములతో మంగళ స్వరూపుడై గురురూపమున ప్రపంచమున ఆవిర్భావము చెందు ప్రభుడైన నీకు నమస్కరించుచున్నాను.

విశేష వివరణము:

1) భగవాన్ 2) శివాయ 3) విద్యావతార సంసిద్ధ్యై 4) అనేక విగ్రహః

1) భగవాన్ = అనగా భగవంతుడు.

శ్లో॥ ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశనశ్శ్రియః।
జ్ఞాన వైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీరితః॥

అనగా 1) ఐశ్వర్యం = యీశత్వము 2) వీర్యము = బలము, 3) యశస్సు = సత్కీర్తి 4) శ్రీ = సర్వసంపదలు 5) జ్ఞానము 6) వైరాగ్యము. యీ ఆరు గుణములు భగము అనబడును. ఈ ఆరు గుణములు కల్గియున్నవాడే భగవంతుడు. మరిన్ని

శ్లో॥ ఉత్పత్తిం ప్రళయంచైవ భూతానా మాగతిం గతిం
వేత్తి విద్యా మవిద్యాంచ సవాచ్యో, భగవానితిః॥

సర్వభూతముల (జీవుల) యొక్క వుత్పత్తి స్థితి నాశనములు, గమనా గమనములు

జ్ఞానాజ్ఞానములు తెలిసియున్నవాడే భగవంతుడు అనగా భూతములు (ప్రాణులు) సృష్టికి పూర్వాపరములయందు తన యందే వుండియుండుటచే వాని స్థితి గతులన్నియు అయనకు తెలియనివి కావు. భగవంతుడనగా సగుణ బ్రహ్మముగా అభివర్ణింపబడుచున్నాడు. సమస్త కళ్యాణ గుణ విశిష్టుడైన ఇట్టి అదర్శ పురుషుడుగా అయనను అభివర్ణించుకొంటేనే తప్ప అయనయెడ పూజ్యభావమే అంకురింపదు. అయన తొలి రూపము నిర్గుణము. అదిలో నిర్గుణ రూపము కానిదీ,దాని యందు సూక్ష్మంగ లేనిదీ మఱొండు వస్తువే లేదు అయనయందు సుగుణములతో పాటు బీజరూపముగా దుర్గుణములున్ను వుండియుండక పోతే అవి ప్రపంచమున యెట్లు వచ్చినవి? సత్వగుణముతో రజస్త మోగుణములున్ను బీజరూపముగా బ్రహ్మమునందున్నవే. కారణమునందు లేనివి కార్యమునందు రాజాలవు. "గుణ దోషమయం సర్వస్రష్టా సృజన కౌతుకీ" అని చెప్పబడినట్లు గుణదోషములు రెండున్నూ సృష్టియందునూ, సృష్టికారణ వస్తువునందునూ కూడ నండుక తప్పదు. సత్వగుణ ప్రధానముగాగల వ్యక్తులయందు మంచి యెక్కువగా ప్రకాశించును. అట్లే రజోగుణ ప్రధానులలో మంచి చెడ్డలు కొంచె మించుమించు సమపాళ్ళలోనూ, తమోగుణ ప్రధానుల యందు చెడ్డ యెక్కువ గాను ప్రకాశించును. పరమాత్మ నుపాసించువాడు యీ పూజనీయుని శుభసంపత్తిని తాను సొంది తన యందలి అశుభవాసనలను పోగొట్టుకొన గోరి అతనిని సమస్త కళ్యాణ గుణశోభితు నిగా మాత్రమే నారాధించుట సహజము. అవసరము గూఢనై యున్నది.

2)శివాయ : శుభస్వరూపుడనీ మంగళ స్వరూపుడని అర్థము. "సత్యం శివం సుందరం" అని పరమాత్మ అభివర్ణింపబడుచున్నాడు. అది సత్యమైనదేగాక మహా సౌందర్యవంతమైన దైనపుడు గాని సహజముగా దానిచే నెవరున్ను ఆకర్షింపబడరుగదా! నిర్గుణ నిరాకార స్వరూపమైన పరమాత్మకు కళ్యాణ గుణములున్నవనిగాని, సుందరమగు మంగళ స్వరూపము కలదని గాని అభివర్ణించుట పొసగదు. సగుణము సాకారమూ అయినదానికే అట్టి కళ్యాణ గుణములు గాని, మనోహరమగు సౌందర్యముగాని వుండగలవు. నిర్గుణమగు దానినుంచే దాని యందు నిగూఢంగావున్న కళ్యాణ గుణములు, సౌందర్యము ప్రకటమై ప్రకాశించెననక తప్పదు. అయాత్మ ప్రకాశము వల్లనే సర్వము ప్రకాశించుచున్నది. "సత్యం శివం సుందరం" అని నిర్గుణ పరమాత్మ యే వుపలక్షింపబడి అభివర్ణింపబడుచున్నది. దీని నింకనూ పొడిగించి, అది కోటి సూర్య ప్రకాశవంతమనీ శుద్ధస్ఫటిక సన్నిభమనీ, పాటల వర్ణమనీ, బహుచిత్ర వర్ణమనీ, ప్రణవనాదమనీ, పల్కుచున్నారు. అయినా అది నాద బిందు కళాతీతమని పేర్కొంటూనే ఉపాసకానాం హితార్థా య బ్రహ్మణోరూప కల్పనా" అని చెప్పబడినట్లు అనేక నామరూపములచే ఉపాసకులకు పెద్దలు సౌలభ్యం చేకూర్చుచున్నారు.

మనోజ్ఞమగు రూపములచే మానవునికే అయా వస్తువులయందు ప్రేమ పెంపొంద గలదు. కవులు, చిత్రకారులు, శిల్పులు సుందరమగు దేవతా మూర్తులను, చిత్రించి రూపకల్పనచేసి వానియందు ప్రేమభావమును కల్పించి "ఉపాసకులయందు భక్తి విశేషమును సృష్టించుచున్నారు. ఈ కళానైపుణ్యమును అవగాహన చేసుకొనజాలని పామర వర్ణములవారికి

భయంకర రూపముతో గ్రామదేవతలను కల్పించి వానియందు భయమును సృష్టించి తద్వారా భక్తిని పెంపొందించు చున్నారు. ప్రజ్ఞాదురంధరులు మాత్రమే నిర్గున పరబ్రహ్మమును తమ సునిశిత బుద్ధిచే అందుకొనగలరు. వారుత్తమాధికారులు. మందమధ్య మాధికారుల కొరకై ఆ పరమాత్మ అనేక రూపనామములతో తన్ను తాను ప్రకటపరచుకొనుచున్నాడు. అందుకే శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో

శ్లో॥ యే యథా మాం ప్రపద్యంతే
తాం స్తథైవ భజా మ్యహం॥

అనగా ఎవరు నన్నే రూపమున ఉపాసింతురో అరూపమున నేను వారి ననుగ్రహించుచున్నాను. విగ్రహములు,అర్చావతారములు మాత్రమే.

3) విద్యావతార సంసిద్ధ్యై : విద్యావతారము అనగా, ఉత్తమాధికారులకు జ్ఞానమార్గముద్వారా తరుణోపాయము కల్గించు అవతార మూర్తులు శ్రీ దక్షిణామూర్తి, వ్యాసుడు, దత్తాత్రేయులు, శ్రీకృష్ణుడు, బుద్ధుడు, ఆదిశంకరులు, శ్రీ శివరామ దీక్షితులవారు, రామకృష్ణ పరమహంస, రమణ మహర్షి శ్రీ దయానంద రాజయోగి మున్నగు వారు. విద్య అనగా జ్ఞానము, జ్ఞానబోధ గావించు మహనీయులు మాత్రమే విద్యావతారములు, దుష్టశిక్షణ శిష్ట రక్షణ గావించు టకై వెలసిన అవతారములు విద్యావతారములుగావు. కేవలం ధర్మ సంస్థాపనార్థం అనగా బ్రహ్మవిద్య లోకమున సుప్రతిష్ఠిత మొనర్చుటకు ప్రభవించినవారే విద్యావతారములు. బ్రహ్మవిద్య శిష్యపరంపర మూలముగానే సుప్రతిష్ఠితనుగును.జిజ్ఞాసువులకు గురువు లెంత అవసరమో గురువులకు శిష్యులు గూడ అంతే అవసరము. వారి ప్రబోధ ప్రచారములవల్లనే విద్యావతార సంసిద్ధి అనగా అవతార సాఫల్యము కాగలదు. శివకేశవుల అవతారము లనేకములుగాని అందు విద్యావతారములు 2,3 మాత్రమే. విద్యావతారములు మానవాకృతి లోనే వుండి మానవులకు జనన మరణ రూప సంసారము నుండి విముక్తి గల్గించుటకై వుద్దేశింప బడినవి మాత్రమే.

4) స్వీకృతానేక విగ్రహ : విగ్రహము అనగా శరీర రూపము అశరీరమైన పరమాత్మ అనేక శరీర రూపములు వహించి సృష్టిలో ప్రకటమయ్యెను. అందు తన్ను తాను ప్రకటపరచు కొనుటకై బ్రహ్మవిద్యను వెలయింపచేసి దాని ప్రబోధ ప్రచారములకై మానవాకారమగు గురు రూపమున పరమాత్మ ఆవిర్భవించుచునే వుండును. అందుకే శివుడు గురురూపమున వచ్చి చెప్పకున్న ఆ బ్రహ్మమును గురించి యెవరికి తెలియగలదు అని కవి వర్ణించినాడు.

ఈ శ్లోకమున చెప్పబడిన భగవంతుడు సృష్టికారణమగు బ్రహ్మమే గాని పరిపూర్ణ పరబ్రహ్మముగాదు. పరిపూర్ణ బ్రహ్మము సృష్టికారణముగాదు. అది కార్యకారణములు కాదు. అది యెన్నడున్ను యెట్టి మార్పున్ను యెరుగదు. సర్వప్రాణికోటిగానూ తానే అయి వాని యందు జీవరూపంగా ప్రవేశించిన సచ్చిదానంద వస్తువే సర్వరూప నామ క్రియలు వహించినది. అనేక సాంప్రదాయక గురువులుగా విద్యావతారములు దాల్చినది. అన్నిటికన్న గొప్ప స్వరూపము (గురు స్వరూపము) పరిపూర్ణ పరబ్రహ్మము గొప్పదీకాదు. కొద్దిదీ కాదు గురువులుగా

నవతరించినది సృష్టికారణమైన పరబ్రహ్మమే. యీ పరబ్రహ్మమే ప్రభువు (నాధుడు) యితడే శుభస్వరూపుడు. యితడే భగవానుడు, యితడే అనేక విద్యావతారము లెత్తినవాడు.

కాని విద్యావతార సంసిద్ధి ఎపుడు కల్గును? అంటే శిష్యులకు జనన మరణ భ్రాంతి రహితము గావించినపుడేగదా! సర్వ భ్రాంతి రహితము గావించగలవారు పరిపూర్ణ బోధ గురువులే. కనుక లక్ష్యార్థముచే పరిపూర్ణ బోధ గురువలే యీ శ్లోకమునందు చెప్పబడినారనుట సమంజసము. ఆ విధముగా శిష్యుల జనన మరణ భ్రాంతి రహితము గావించి అవతార సాఫల్యము పొందుచున్న గురుదేవులకివే మా అనంతకోటి ప్రణామములు.

శ్లో॥ నమోస్తు గురవె తుభ్యం సహజానంద రూపిణే
యస్య వాగమృతం హంతి విషం సంసార సంజ్ఞికం॥

తాత్పర్యము : ఎవనియొక్క వాక్యామృతం సంసారమనే విషమును నాశనం చేయుచున్నదో అట్టి గురుమూర్తికి నమస్కారము.

విశేష వివరణం : 1) సహజానంద రూపిణే 2) వాగమృతం 3) విషం సంసార సంజ్ఞికం.

**1) సహజానందరూపిణే: గురువు ఆనంద స్వరూపుడు అని అభివర్ణింపబడుచున్నాడు. ఆనంద మనగా నేమి? సుఖము, హాయి, సంతోషములతో గూడిన అంతఃకరణస్థితి అని సామాన్యార్థము. మరి, సగుణరూపుడై, మానవోపాధియందున్న గురుమూర్తికి అందరివలెనే అంతఃకరణ యుండును. అంతఃకరణకు శోక మోహములు, సుఖ దుఃఖములు ఇత్యాది ద్వంద్వ లక్షణము లుండగా, అతడానందరూపుడనుట యెట్లు పొసగునో యించుక విమర్శించనగును. అంతఃకరణ యున్నంత వరకు దాని ధర్మములగు సుఖ దుఃఖ ద్వంద్వములు లేకుండ పోవుట యెట్లు? సర్వద్వంద్వాతీతుడైన వాడే నిజమగు జ్ఞానియని సర్వ శాస్త్రములు ఘోషించుచున్నవి. ఏలననగా సుఖము దుఃఖమును, దుఃఖము సుఖమును అపేక్షించి ఒకదానివెనుక నొకటి వచ్చుచుండును. సుఖదుఃఖములలో నేదియుండినా అతడు ద్వంద్వాతీతుడు అనరాదు. సుఖ దుఃఖములు రెండూ లేకుండుటే ఆనందమనవలెనుగాని సుఖమే ఆనందముకాదు. సుఖదుఃఖములకు** తావిచ్చునువానికి స్థానమైయున్న అంతఃకరణము లేకున్నపుడేగాని ఆనందం కలుగనేరదు. కనుకనే అంతఃకరణ వృత్తులేమియులేని, సుఖదుఃఖములు లేని గాఢసుషుప్తియందే ఆనందమయకోశము నిర్ణయింపబడినది అట్టి సుషుప్తి యందుగాని అట్టిదేయగు సమాధియందు గాని ఎవరును శాశ్వతముగా నుండజాలరు గదా! అంతఃకరణ యుండగానే లేనిస్థితిగల్గినవాడు గాని ద్వంద్వాతీతుడు కాజాలడు. ఇట్టి స్థితి ఎట్లు లభ్యమగును? వ్యష్టి సమిష్టి రూపమగు అంతఃకరణమేలేని దొక్క పరిపూర్ణ పరబ్రహ్మమేకదా! అట్టి పరిపూర్ణ పరబ్రహ్మ విజ్ఞాన మారూఢ పరచుకొని అంతఃకరణమునందు నింపుకొన్నవాడే అశరీరి. నీరు గానవచ్చుచున్నా అవి యెండ మావులే. అందు జలము లేనేలేదని స్థిరపరచుకొనియున్నవానికే దాహోపశమన భ్రాంతి కలుగ జాలనియట్లు, అశరీరపద్ధతిలోనున్న వానికే శబ్దాది విషయ పంచకము భ్రాంతి జనకము కాజాలదు. తజ్జన్యమగు సుఖదుఃఖాదులున్ను వుండవు. అట్టి మహాత్మున కంతఃకరణ ముండియు

లేనట్లే ఈ శ్లోకములో అశరీరయగు పరిపూర్ణగురువే లక్షింపబడినాడు. అష్ట విధనామములతో పేర్కొనబడిన ఇతర గురువులు లక్షింపబడలేదు. యిట్టి ఆనందము కృత్రిమము. తాత్కాలికము. కృతకము తెచ్చి పెట్టుకొన్నదీ గాక గురుమూర్తియందు సహజముగా నుండుట చేతనే అతడు సహజానంద రూపుడనీ అభివర్ణింపబడినాడు. సుషుప్తి, మూర్ఛ, సమాధుల యందు యీ ఆనందము, కృతకము, తాత్కాలికము, పరిపూర్ణ యోగమునందు మాత్రమే ఆనందము సహజము, శాశ్వతము అయివుండును దాని కెట్టి ప్రయత్నమూ సాధన యున్నూ అవసరము లేదు. పరిపూర్ణ భావ మారూఢమైనపుడే. ఆయారూఢతతోపాటే యీ సహజానంద ముద్భవించును. సహ +జ = సహజ ( ఆయారూఢతతో పాటు కల్గినది అని అర్థము) సుఖదుఃఖము లకు తావిచ్చు మనస్సు సహజముగా లేకుండ పోవుటచేతనే పరిపూర్ణ రాజయోగమునకు సహజా మనస్క రాజయోగమని పేరువచ్చినది. మానవాకృతిలో సాకారరూపు డగు పరిపూర్ణగురువు సహజానంద రూపుడని పేరొందినాడు.

నిరాకార నిర్గుణ రూపమగు పరమాత్మయే గురుస్వరూపం. స్వరూపమనగా స్వరూప లక్షణము మాత్రమేగాని దృగ్గోచరమగు రూపము గాదు. పరమాత్మకు సత్, చిత్, ఆనందములు స్వరూపలక్షణము. కాని సృష్టికి పూర్వమునందున్న కారణ బ్రహ్మమే. సచ్చిదానంద లక్షణములచే వర్ణింపబడుచున్నది. ఆ బ్రహ్మమే తన్ను నామ రూపాత్మకమగు విశ్వముగ ప్రకటన పరచుకొనెను. జీవుల పూర్వపూర్వ కర్మలచే మలినమైన వారివారి అంతఃకరణలేర్పడెను. అవి సుఖదుఃఖములకు అలవాలమగుచున్నవి. "లీలాదేవతు కైవల్యం" అను సూత్రానుసారముగ కారణ బ్రహ్మము తాను వేరని జీవులు వేరని యెంచుచూ జీవుల సుఖదుఃఖములను చూచి వినోదించుచున్నపుడు అది వికారము చెందుటలేదా! నిర్వికారముగనుంటూ తన ఆనంద లక్షణమును గోల్పోయిటయే లేదు అని కొందరి అభిప్రాయము. కాని సర్వము సర్వఅంతఃకరణలూ కూడా తానే అయినపుడు తానే నిర్వికారముగ నున్నాడు. మరియు తానే వికారములు చెందుచునూ యున్నాడు. అని చెప్పితీర వలసినదే. ఇట్టి చరాచర ద్వంద్వలక్షణములులేని పూర్ణస్థితి, కేవల పరిపూర్ణ బ్రహ్మమునందు మాత్రమే సాధ్యము. అశరీర లక్షనముతో నున్న పూర్ణగురు వొక్కడే సహజానంద రూపుడు అని చెప్పవలసియున్నది. లేదా, సృష్టికారణమైన పరబ్రహ్మము సృష్టికిపూర్వము మాత్రమే స్వరూప లక్షణముచే ఆనందరూపమైయున్నది. దానికంటె గొప్పవస్తువులేదు. అదే గురుస్వరూపము, సాకార నిరాకారములలో గురువే సహజానందస్వరూపుడై యున్నాడు.

2) వాగమృతం అనగా వాక్సుద, వాక్కనే అమృతం, అమృతము అనగా చావులేకుండా చేయునది. వాక్కు అనగా వైఖరీ స్వరూపమగు గురువాక్యమే. అనగా తిరిగి పుట్టుకకు తెచ్చెడి లింగశరీరము (భంగము కాకుండా) స్థూలదేహమును విడచుటయే చావు అని లేక మరణమని చెప్పబడును. జీవితములోనే లింగ శరీరము భంగమైతే అట్టివాని స్థూల శరీర పతనమును మరణమని యనరాదు. ఏలననగా పుట్టుట గిట్టుట కొరకే అనుట యెంత పరమసత్యమో, గిట్టుట పుట్టు కొరకే అనుటయు అంత సత్యమే. మరల పుట్టకుండా పోవలెనన్న బీజనాశనము,

లేక, లింగశరీర భంగము కావలసినదే. లింగశరీర మెట్లు భంగమగును? అంటే, దాని మూల నాశనము కానిదే అది భంగముకాదు. ఆమూలమే యెరుక కూకుడువేరు. దాని నెరిగి త్రవ్వు మన్నారు శ్రీకృష్ణదేశికేంద్రులవారు. దాని నెరిగించువాడు గురుమూర్తి. మరియు దానిని త్రవ్వివేయు పనిముట్టును ప్రసాదించువాడున్ను గురుమూర్తియే. గురుమంత్రమే ఆ పనిముట్టు. గురుమంత్రము వాక్యరూపముగా నున్నది. గురువాక్యమును (గురుమంత్రము) అమృతమని, అనగా చావులేకుండా, అనగా (చావులేకుంటే పుట్టుకలేదు కనుక) పుట్టుచావులు రెండున్నూ లేకుండాచేయుననీ చెప్పబడినది.

3) విషం సంసార సంజ్ఞకం : సంసారమను సౌజ్ఞగం విషము. అనగా సంసారమనే పేరుచేత చెప్పబడిన విషము. విషము ఏమిచేయును? దానిని మ్రింగిన వానిని చంపును. చచ్చినవాడు పుట్టక తప్పదు. కావున చావుపుట్టుకలు ( మరణ జననములు) ఒకదాని ననుసరించి ఒకటి కల్గుచునే యుండును. ఇదే సంసారము అనుమాటకు నిజమైన అర్థము. అంతేకాని ఆస్తిపాస్తులతోను, భార్యాపుత్రాదులతోను, కూడిన సంసారముకాదు. మరిన్ని వ్యష్టి అంతఃకరణ మున్నూ కాదు. సంసార మనగా శరీర పరిగ్రమణమని, కర్మవాసనయని, పుట్టుకకు మూలకారణ మని అర్థములున్ను కలవు. శరీరమును పరిత్యజించునదే శరీరమును పరిగ్రహించును. పుట్టుచావుల కత్యంత మూలకారణమైనదే సంసారము. అసంఖ్యాకములగు జన్మపరంపరలలోని కీడ్చుకొనిపోయి సర్వదుఃఖములకు మూలకారణమగుచున్నది.కనుక యింతకంటె ఘోరమగు విషములేనేలేదు. యిట్టి ఘోరమగు విషమును హాలాహలసదృశముగా చెప్పి, "సంసారహాలాహల మోహశాంత్యై" అని గురుగీత గురుమూర్తిని వర్ణించియున్నది. హాలహలమున్నూ అమృతమున్ను రెండున్ను క్షీరసముద్రమునందే పొడమినవిధంగా సంసార హాలాహలమున్ను గురువాక్యామృత మున్నూ కూడా అఖండ జ్ఞానసాగరముననే ( అఖండ యెరుకయందే) పొడచూపినవి. సంసారమునకున్ను, సర్వశబ్దములకున్ను వాక్యములకున్ను, ఆ అఖండ యెరుకయే పుట్టినిల్లై వున్నది. విషరూపమైన సంసారము అమృతోపమగు గురువాక్యము ఏకస్థానీయములే అగుటచేతనే "మాటలన్నియు మాయే" అనిన్నీ "విడరామంత్రముల" నిన్నీ శ్రీకృష్ణ దేశికేంద్రులు వుద్ఘోదించు చున్నారు. ఒక ముల్లుచేతనే మరియొక ముల్లును పెకలించి రెండున్ను పరిత్యజించినట్లు గురువాక్యముచే సంసారమూలరహితమై, సంసార నాశనముతో పాటు, గురువు గురుమంత్ర మున్ను కూడా పోవునన్నీ, కేవలం పరిపూర్ణ పరబ్రహ్మమే స్వతస్సిద్ధమై యుండుననీ తెలియవలెను. సర్పదష్టునికి మంత్రముచే విషము దిగిపోయిన పిదప మంత్రముతోనూ, మంత్రగానితోనూ నిమిత్తం లేనట్లేనని తెలియవలెను. సంసారమను హాలాహలమును, గురువాక్యామృత మెట్లు హరించును? అని సంకోచింప నవసరములేదు. పాపముయొక్క విషము. మంత్రముచే హరిం చుటలేదా? అట్లే సంసార విషము గురుమంత్రముచే హరింపబడుచున్నది అని తెలియవలెను.

గురుబోధ వినిన పిదప గురువును గురుమంత్రమును విడనాడవలెనని కొందరు దురభిప్రాయపడుచున్నారు. కాని యిట్లనుట చాల ఘోరము ఇల్లలుకుటతోనే పండుగయగునా!

బోధ వినినంతమాత్రమున ఏమగును? ఎంతవరకు, తనకు ప్రపంచముతోచునో, ఎంత వరకు తానున్నానని తెలుసుకొనుచున్నాడో అంతవరకు గురువు, గురుమంత్రము, సమస్త సంసారమూ వుంటూనేయున్నది. తానున్నాననే గుర్తువున్నంత వరకు గురువున్నూ గురుమంత్రమును ఎంత మాత్రము విడరాదు. నీవున్నంతవరకు గురువు వుండును. సమస్తము నీతో పాటు వుండనే వుండును. ఈ భావార్థమును సూచించుటకే

కం॥ నీవున్న చోటనుండును
నీవివిధ విచిత్ర జగము నీతో గూడన్
నీవు లేనట్టిచోటను నీ
వివిధ విచిత్ర జగము నిలువదుకుర్రా॥

అని అన్నారు కృష్ణ దేశికేంద్రులు. నేను లేనట్టి దానిని నాకు ఆరూఢ పరచి నా సంసార హాలా హలమును నశింపచేయు సద్గురుమూర్తిని సేవించు శక్తి యుక్తులను ఆ సద్గురుదేవుడే నాకు ప్రసాదించవలెనని కోరి అహరహము తదంఘ్రి కమలములను సేవించుచున్నాను.

శ్లో॥ అఖండైకరసం బ్రహ్మ నిత్యముక్తం నిరామయం
స్వస్మిన్ సందర్శితం యేన భవే దస్య దేశికః॥

తాత్పర్యము : పరిచ్ఛిన్నము అనగా ఖండాఖండములుగాక, అఖండ రసముగా నుండునదియు, యెల్లపుడ్డు బంధరహితంగా నున్నదియు, ఎట్టి అవయములు అనగా వ్యాధులు లేనిదియు అగు బ్రహ్మవస్తువును శిష్యుని అంతఃకరణమునందు దర్శింపచేసెడివాడగు సద్గురువే దేశికవర్యుడగుచున్నాడు.

విశేష వివరణము : 1) అఖండై కరసం 2) నిత్యముక్తం 3) నిరామయం 4) స్వస్మిన్ 5) దేశికః

1) అఖండై కరసం : రస మనగా సారభూతమగు వస్తువు తెలివిచే తెలియబడును. సమస్తములోను సారభూతమగు వస్తువు బ్రహ్మపదార్థమే. రసమనగా బ్రహ్మమని పారమార్థికముగ రూఢ్యర్థమై యున్నది. శ్రుతి కూడా "రసోవై సః" బ్రహ్మమే. రసస్వరూపము అయివున్నాడు అన్నది. ఇట బ్రహ్మమనగా సృష్టి కారణమగు బ్రహ్మమేగాని పరిపూర్ణ బ్రహ్మము మాత్రముకాదు. పరిపూర్ణ పరబ్రహ్మము రసమూ (సారభూతమైనదీ) కాదు. అసారమైనదియూ గాదు. అది సర్వద్వంద్వ రహితము. కేవల నిరపేక్షకము అగుటచే ఏసాపేక్షిక శబ్దముచేతనూ చెప్పబడుటకు వీలులేదు. సృష్టి కారణమైన బ్రహ్మము తానే సర్వసృష్టిగా పరిణమించినది. ఈ పరిణామము దివ్యము. స్థూల సూక్ష్మములుగా అన్నియు తానే అయినది అటుల మార్పుచెందిన ప్రతి వస్తువునందును సూక్ష్మరూపం లో (బెల్లమునందు తీపివలె) తానే వ్యాపకత్వము చెందియున్నది. ప్రతివస్తువునందును రసస్వరూపమై శ్రేష్టమగు ఈ కారణ బ్రహ్మము నిండుకొనియే యున్నది. కనుకనే "రసమనదగనిదే" పరిపూర్ణమని శ్రీకృష్ణదేశికులున్ను శెలవిచ్చియున్నారు.

" ఏకం అనేకం భవతి" కారణరూపమగు బ్రహ్మము ఏకమై యున్ననూ అనేక నామ రూపములు వహించినది. కాని అన్నిటి యందును తాను రసస్వరూపముగా వుండి

యున్నది. సృష్టియందు సమస్తము నానాత్వమే వైవిధ్యము కలిగి వేరువేరుగా ఖండరూపములుగా గానవచ్చుచున్ననూ, ఆ అన్ని ఖండములయందును నిగూఢంగాయున్న రసస్వరూపము మాత్రము వస్తువులతోపాటు ఖండఖండములు అగుటలేదు. పరిచ్ఛిన్నముగాక అఖండముగానే యున్నది. వస్తు దృష్టిచే ఆ రసస్వరూపం గూడ ఖండఖండములై పోయినట్లుగా గాన వచ్చు చున్నదేగాని నిజముగా ఖండఖండములు కాలేదు. దానిని అఖండైక రసం అని యీ శ్లోకంలో చెప్పబడినది. ఆ రసస్వరూపము దేనియందు చూచినా ఏకమైయుండి అనగా ఒక్కటి మాత్రమే యై యెట్టి వైవిధ్యము లేకనే యున్నది. మరిన్ని ఖండఖండములు గాకుండా (అనగా వస్తువులచే విభాగింపబడకుండా) నున్నది. ' అణోరణీయాన్ మహతో మహియాన్'' అనగా అణువుకంటె చిన్నదై, మహత్తుకంటె పెద్దదై యున్నది అని చెప్పబడినదంటే అర్థము అణువుకు కూడా లోపలా, మహత్తుకు బయట కూడా అదియున్నది అని అర్థమే గ్రహించవలెను. ఖండఖండములుగా బాహ్యదృష్టికి గోచరించినా అది మాత్రము ఏకమై అఖండముగానే యున్నది. ఐతే కృష్ణదేశిక ప్రభువులు కందార్థములలో అంతట నింతట కనుపడునంతటిదేగాని యెరుక అంతట గలదా? అని ప్రశ్నిస్తున్నారు. అంటే నీవ్యష్టి దృష్టిచే అనగా నీ పరిమిత దృష్టిచే ఏక కాలమునందు నీవు ఏదో ఒక వస్తువునందు మాత్రమే గాని అన్ని ఆవరణములందు దానిని గుర్తించటలేదు. పరిపూర్ణ పరబ్రహ్మమందు ఎట్టి ఆవరణమూ లేదు. ఆవరణము, ఆకాశము, దేశము అనునవి పర్యాయ పదములు . పరిపూర్ణము దేశ కాల వస్తువులకు మీరినది. కారణబ్రహ్మము (యెరుక) దాని యావరణ యందే మితమై యుండును. ఖండఖండ రూపమైన ఆవరణములు ఏమీ సృష్టికి పూర్వ ముండజాలవుగాని, అపుడు అఖండ రూపమగు మహాకాశమే అఖండ ఎరుక యొక్క యావరణమై యుండునని గ్రహింపవలెను.

నిత్యముక్తం = అనగా ఎల్లప్పుడును బంధము లేకనే యున్నది అని అర్థము. ఐతే సృష్టికి పూర్వాపరములయందు మాత్రమే బంధరహితమై యుండును గాని సృష్టిగా మారి సృష్టితో తగులబడియుండి నపుడు కూడా బంధరహితమై యున్నదా? నిత్యముక్తమని యెట్లు చెప్ప నగును? అని సందేహము కలుగుట సహజమే. "పాదోస్య విశ్వాభూతాని త్రిపాద్యస్యామృతం దివి'' అని శ్రుతి చెప్పుచున్నది. కారణ బ్రహ్మమునందు ఒక పాదమే (నాల్గవ వంతు మాత్రమే విశ్వరూపం వహించినది కాని మిగతా మూడు భాగములు అమృత స్వరూపము గానే యున్నదని తాత్పర్యము) సృష్టియున్నపుడు గూడ ఆ అమృత భాగము సృష్టితో సంబంధము లేకనే యున్నది. ఆ కారణ బ్రహ్మము నిత్యముక్తము అని సమర్థించవచ్చును. అంటే ఏక కాలమందే అది బంధ మోక్ష స్వరూపములు రెండూ కల్గి ద్వంద్వ స్వరూపముగా నున్నది. మరిన్ని ఖండాఖండ ములై యున్నది. కనుకనే గీతలో "అమృతం చైవ మృత్యుశ్చ సదస చ్చాహ మర్జున'' అంటున్నాడు భగవానుడు. బంధమోక్షములు, అమృత మృత్యువులు, సదసత్తులు, వేయేల సమస్త ద్వంద్వ ములు, త్రిపుటలు అన్నియు దానియందే యున్నవి. ఆ కారణ బ్రహ్మము నిత్యముక్త మని చెప్పినా, నిత్యబద్ధమై యున్నదని చెప్పినా ప్రత్యవాయము లేదు.

3) నిరామయం : ఆమయ అనగా వ్యాధి. ఆ కారణ బ్రహ్మమునందు వ్యాధులేమియు లేవుగాని పరిణామరూపమగు విశ్వమంతయు జన్మ మృత్యు జరా వ్యాధులకు లోబడి యున్నది. బీజ రూపంగానైనా కార్యప్రపంచమందున్న యీ జన్మ మృత్యు జరావ్యాధులు కారణబ్రహ్మము నందుంటేగాని కార్యప్రపంచమునందెట్లు రాగలవు? జీవుల సర్వసంస్కారములు ప్రళయము నందు బీజరూపంగా కారణబ్రహ్మమందు నిగూఢంగా నిక్షిప్తమై యుండి పునఃసృష్టియందు జీవులా సంస్కారములతో పునః పునః ఆవిర్భవించుచుండును. ఐతే కారణబ్రహ్మమందు దానిని బాధించు జీవులకుండే వ్యాధులు లేనిమాట సత్యమేగాని ఆ కారణ బ్రహ్మమును బాధించు ఒక గొప్ప వ్యాధి మాత్రం సహజమై, స్వభావమై దానియందు వుండియే ఉన్నది. అదియే భవరోగం. అంటే ఘోర సంసారబాధ. సృష్టి స్థితి ప్రళయ రూపములుగా ఆవిర్భావ తిరోభావములు చెందుచూ నుండుటయే యీ ఘోర సంసార వ్యాధి దీని కత్యంత నివృతి యొక్క పరిపూర్ణ బోధచే మాత్రమే కాగలదు. అని నిరామయం ఈ శ్లోకంలో యేల చెప్పబడినది. అంటే జీవుల కుండే ఆధ్యాత్మిక, ఆదిభౌతిక అధిదైవిక రూపములగు తాపత్రయముగాని, వాత పిత్త శ్లేష్మ సంబంధములగు వ్యాధులుగాని లేవని మాత్రమే గ్రహించవలెను.

5) స్వస్మిన్ అనగా తనయందు అంటే శిష్యుని అంతఃకరణము నందే యీ స్వరూప దర్శనము దేశిక వర్యుల కృపచేత కాగలదు. ఈ దివ్య సందర్శనము కొరకు తానేదేశము పోనక్కర లేదు. తన అంతఃకరణము ఆ దివ్యక్షేత్రము, ఉపదేశ మనగా సమీపమగు స్థానము. ఎవని అంతఃకరణ కన్నా వానికి సమీప దేశము లేదు కారణబ్రహ్మము ప్రతి అంతఃకరణ యందు నిజ రూపములో అనగా చిన్మాత్రముగా ప్రకాశించు చుండును. దానినే "ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి" అని భగవద్గీత చెప్పుచున్నది. దానిని అజ్ఞానము ఆవరించి యున్నట్లు "అజ్ఞానే నావృతం జ్ఞానం తేనముహ్యంతి జంతవః" అని భగవద్గీత ప్రశ్నించుచున్నది. ఆ అజ్ఞానావరణ తొలగి జ్ఞానము కలిగి జీవుడు యెట్లు తరించును? అని ప్రశ్న. సద్గురువే యిందుకు సమర్థుడు ఎట్లు? అంటే చిద్ఘనమగు తన నిజరూపమును గురువు శిష్యుని మనస్సుకు తోపింపచేసి వస్తు ప్రత్యక్షము గావించుటతో మనసునకు (అంతఃకరణకు) ఆవరించిన మాలిన్యము (అజ్ఞానము) తొలగి ఆ అంతఃకరణయందే స్వస్వరూప సాక్షాత్కారము కాగలదు, అపుడు అంతఃకరణము ఆత్మస్వరూపమై ప్రకాశించును.

6) దేశికః : యీ సందర్భంలో 1) దర్శకః 2) దేశికః అను శబ్దములకును దేశిక శబ్దము నకు కూడా శబ్దార్థములను గ్రహించవలెను. దేశకః అనగా శ్రీగురువు, దర్శకః అనగా చూపించువాడు. దేశకః అనగా వుపదేశించువాడు. అనగా మంత్రోపదేశము చేయువాడు. శ్రీగురువు మంత్రోపదేశకుడు మాత్రమే గాక, దర్శింపచేయువాడుకూడనై యున్నాడు. అతడు కేవలము శాస్త్రములను వివరించి చెప్పువాడే కాక వస్తువులను సాక్షాత్తుగా చూపగలడు. తత్, త్వం, అసి పదార్థములను దర్శింపచేయు నది. భవారణ్యము నుండి బయటపడు మార్గమును చూపునని గురుగీత వర్ణించుచున్నది. ఉపదేశ మనగా ఆత్మ వస్తువును అంతఃకరణములోనికి తీసికొని రావలెను. లేదా ఆత్మవస్తువుకడకు నీ అంతఃకరణమును చేర్చవలెను. అపుడే అది

ఉపదేశము కాగలదు. అట్టి దేశికుని (శ్రీగురువుయొక్క) నామమును మంత్రమును కీర్తించుట, చింతించుటలు పరమాత్మనామమును మంత్రమును కీర్తించుట, చింతించుటయు నగునని.

శ్లో॥ స్వదేశిక స్త్యైవచనామ చింతనమ్
భవేదనంతస్య శివస్య చింతనమ్
స్వదేశికస్త్యైవచ నామ కీర్తనం
భవేదనంతస్య శివస్య కీర్తనం

అని గురుగీత యుద్ఘాటించినది. అట్టి దేశికుడే యుపాస్య దైవము. 'సర్వశరీరస్థ చైతన్య ప్రాపకో గురు రుపాస్యః' అంటోంది. నిరాలంబోపనిషత్తు "దేశికుని చరణ తీర్థము, కాశీగంగయని గురుని కనుగొన్నను విశ్వేశుడని యతడు తన కుపదేశించినదే తారకమని....." శ్రీకృష్ణదేశికేంద్రులు యుద్ఘాటించుచున్నారు.

అట్టి దేశికస్వామిని కర్మణా, మనసా, వాచా అహరహము గురుపుత్రులమగు మన మందరము యావజ్జీవమూ వుపాసించెదముగాక!

శ్లో॥ స్వశరీరం శవం పశ్యన్ తథా స్వాత్మాన మద్వయం।
యస్త్రీ కనక మోహఘ్నః సంభవే త్పరమో గురుః॥

తాత్పర్యము : ఎవడు తన స్థూలదేహమును శవంవలె చూచుచు కామినీ కాంచనములయందలి మోహమును నాశనము గావించి అద్వితీయమగు తన స్వరూపమునే చూచుకొనుచుండునో అతడే గురువు లందరిలో శ్రేష్ఠుడై యొప్పి పరమగురువని కొనియాడబడుచున్నాడు.

విశేష వివరణము : 1) స్వశరీరం శవం పశ్యన్ 2) స్వాత్మాన మద్వయం 3) స్త్రీ కనకములు 4) పరమగురువు.

1) స్వశరీరం శవం పశ్యన్ : తన శరీరమును శవమురీతి చూచుచు అని అర్థము. శవం అనగా ప్రాణ ప్రజ్ఞలు లేక ప్రాణ మనస్సులు బయటకుపోయిన అమంగళరూపమైన స్థూలదేహము. ప్రాణప్రజ్ఞ లెంతవరకు శరీరమునందుండునో అంతవరకు దేహము ప్రకాశవంతమై మంగళ ప్రదముగా నుండును. అవి బైటికి పోతేనే మరణము కలుగుచున్నది. మరణదేహము అనగా వట్టి కళేబరము, కదలక మెదలక కట్టెవలె బిగిసిపోయివుండును. శీఘ్రముగా శిథిలమై క్రుళ్ళి క్రిమికీటాదుల కాలవాలమైపోవును. అయినను దానియందు క్రిములు పుట్టుచుండగా కదలనంత మాత్రమున దానిని కేవలం జడమనుట యెట్లు? సృష్టియందు సర్వమూ జడాజడ ద్వంద్వ స్వరూపముగా వున్నది. ప్రతి వస్తువునందూ చేతనం సూక్ష్మముగాను దాని యావరణము జడరూప ముగాను వుంటూనే వున్నవి మహత్ ప్రమాణము. మధ్యప్రమాణము, అణుప్రమాణము అని ఆవరణము త్రివిధముగా చెప్పబడుచున్నది. చిన్న పెద్ద తారతమ్యమే గాని ఆవరణములేని వస్తువే లేదు. తుదకు సృష్టి కారణమైన బ్రహ్మము కూడా ఆవరణ కలిగియుండుటచేతనే "అణోరణీయాన్ మహతో మహీయాన్" అని అభివర్ణింపబడుచున్నది. ఐతే మరణ దేహముతో పాటు సర్వమునూ జడ చేతనాత్మకముగా నున్నపుడు తన శరీరమును శవమువలె చూడమని

యీ శ్లోకమునందు చెప్పబడుటలో స్వారస్య మేమి? కొంచెము విచారించవలెను.

శవమునకు గుర్తించే తెలివిలేదు. సప్తధాతువులతో గూడి యున్నది. బ్రతికియున్నపుడు గుర్తెరిగే జ్ఞానముండును అనగా శవము మరుపురూపంలోను, సజీవుడైన వ్యక్తి జాగ్రత్స్వప్నావస్థలలో యెరుక రూపములోను వుందురు. ఎరుక మరుపులు రెండూ యెరుకే. ఎరుగుట మరచుట రెండూ దానిపనులే. ఇందొకదాని అధిక్యత ఏమి? జ్ఞానము దొడ్డదీ, అజ్ఞానము చెడ్డదీనా? సర్వమూ ఆత్మే. "ఆత్మనోన్యం నకించన" అని శ్రుతి పలుకుచున్నది. ఒక విధంగా చూస్తే జ్ఞానమే చెడ్డది శబ్దాది విషయములను జ్ఞానం జ్ఞానేంద్రియముల ద్వారా గుర్తించినపుడే అంతఃకరణమందు సుఖదుఃఖములు కలుగుచున్నవి. సుషుప్తి, సమాధి, మూర్ఛ మరణసమయములందు మరపులోనుండి జ్ఞానమునకు శబ్దాది విషయగ్రహణ లేకుండుటవలన యెట్టి సుఖదుఃఖములు లేనేలేవు.

ఇక శవమువలె తన శరీరమును చూచుకొనుటలో గల విశేషమేమి? ఒక వ్యక్తి సజీవమై యున్నంతవరకు ఆవ్యక్తి శరీరమును అందరు ప్రేమింతురు. లేక ద్వేషింతురు. మరణ దేహమునందు యెవరికి యెట్టి రాగద్వేషములుండవు. ఏలననగా ఆ దేహము వల్ల యెవరికి యెట్టి సుఖదుఃఖములు యిక లభింపజాలవు. అ మంగళ రూపములో వున్న అశరీరమును ఎంతత్వరగా తొలగించి దూరస్థలమునకు గొంపోయి దహన ఖననాదులు చేయవలెనని మాత్రమే ఆత్మబంధువులు సహితము ఆలోచించుచుందురు. ప్రాపంచికములో, దేహాభిమానముతో దేహమును పోషించి రక్షించవలెనని, ఆకర్షణీయముగ అలంకరించి సుందరముగ నుంచవలె నని, జరావ్యాధులచే శుష్కించకుండ బలముగా నుంచవలెనని, లోకులు తన శరీరమును చూచి మెచ్చవలెనని, ప్రాకులాడుచుందురు. ఇదియే దేహవాసన లేక దేహాభిమానము. అంతేగాక తనరక్తసంబంధీకులగు వారి యందుగూడ నిట్టి యభిమానము వ్యాప్తిచెందును. అట్లుగాక దేహాభిమానము, దేహసంబంధీకుల యందుండు అభిమానము లేకుండా పోవలెనన్న,తన దేహమునందు శవమునందలి నిరభిమానదృష్టి పూనగలిగినవాడే పరమగురువు అని యీ శ్లోకము లో చెప్పబడినది.

శ్లో॥ క్రిమికోటిభి రావిష్టం, దుర్గంధ మలమూత్రం
శ్లేష్మరక్తకఫైర్మాంసై ర్బద్ధం చైతద్వరాననే॥

అని గురుగీతగూడా దేహాభిమానమును నిరసించినది.

2) స్త్రీ కనకములు : కామినీ కాంచనములు, కాంతాకనకములు సమానార్థములు. ఇవి మానవునికి శరీరసుఖమును గలిగించు ముఖ్య సాధనములు. గుహ్యేంద్రియ, జిహ్వేం ద్రియముల ద్వారా వీని యందలి సుఖమును గ్రహించి అంతఃకరణము ఆనందించుచున్నది. ఈ సుఖము కొరకై మానవుడు కామినీ కాంచనములను వాంఛించుచున్నాడు. ఇట్టి సుఖము మరల మరల ఆశించుచు వాని సంపాదనయందు అమూల్యమగు మానవజీవితమును వ్యర్థము గావించుకొను చున్నాడు. జన్మరాహిత్యరూపమగు మోక్షము సాధించుట కేర్పడిన మానవజన్మ

అనిత్యము దుఃఖాంతమునగు యీ తుచ్ఛ సుఖసంపాదనకై మాత్రమే వినియోగించుట అవివేకము. కామినీ కాంచనముల ద్వారా లభించు సుఖమునందు వ్యామోహము చెందుట తగదు కాని వస్తుతః కామినీ కాంచనముల యందే దోషములేదు. వానిని కోరునది యేవస్తువో దానిని త్యజించవలెనేగాని కామినీ కాంచనములను వదలుట నిజమగు త్యాగము కాదు. సుఖము అనుభవించునది వానిని ఆశించునదీ మన అంతఃకరణమే. అంతఃకరణము జడమనీ లేక అజ్ఞానావరనమనీ తెలియవలెను. అంతఃకరణమనగా లోపలిపనిముట్టు. ఈ పరికరముతో పనిచేయు కర్త యెవడో అతడే నిజమగు దోషి. ఎట్లనగా ఒకడు ఒక కత్తితో మరియొకని చంపును. చంపినవ్యక్తియే దోషిగాని చంపినట్టి పరికరమగు కత్తి దోషికాదుకదా! యిపుడు విడువదగినవస్తువేది? అంతఃకరణయా? లేక అంతఃకరణముచే సుఖము ననుభవించుచూ కాంతా కనకముల యందు వ్యామోహమును పెంచుకొన్న కర్తయా? ఇంతకూ దేనిని విడవవలెననీ యీ శ్లోకము చెప్పుటలేదు. మోహమును నాశనము చేయమని చెప్పుచున్నది. ఐతే మోహించువాడే లేనపుడేగాని మోహము మొదలంట నాశనము కాజాలదు. కనుక కర్తృత్వ త్యాగమే మోహనాశనమునకు మార్గమని గుర్తించవలెను.

ప్రపంచమంతయు జీవుల అనుభవమునకై సృష్టింపబడినది. అందు 'శ్రీ అనగా ధనము లేక వస్తుసంపద, చతుర్విధపురుషార్థములు అనగా ధర్మార్థ కామమోక్షములు సాధించుటకు ముఖ్యావసరము స్త్రీ' సత్సంతానము పొంది వంశాభివృద్ధికిని, 'సోఽ కామయత బహు స్యాం ప్రజాయేయేతి'' అనగా నేననేక మగుదునుగాక అను భగవత్సంకల్పమున కనుగుణ్యముగా సృష్టికార్యమును కొనసాగించుటకును అవసరము. స్త్రీని, శ్రీని త్యజించి, సన్యసించినవాడు పరమాత్మ నిర్మితవిధానమును వ్యతిరేకించినవాడు అగుచున్నాడు. శాస్త్రోక్తముగా సన్యసించి, స్త్రీని, శ్రీని, విసర్జించి మరల వాని భ్రాంతికి లోనయ్యేనేని అది మహాపాపముగా పరిగణించబడినది కనుకనే కలియుగమందు సన్యాసం నిషేధింపబడినది.

"శ్రియం (లేక స్త్రీయం) త్యక్త్వా జగంత్యక్త్వా జగత్యక్తం సుఖీభవేత్" అనగా శ్రీని, స్త్రీని, పరిత్యజించినవాడు జగత్తును త్యజించినవాడగుచున్నాడు. జగత్తును త్యజించినవాడు సుఖియగునని అర్థం. అనగా కామినీ కాంచనములు (స్త్రీ, శ్రీ) ఈ రెండూ లేకుంటే జగత్తులేనట్లే. ఏలనంటే, శబ్దాది విషయములన్నియు కామినీ కాంచనములున్నవానికే పుష్కలంగా లభించగలవు. పంచత న్మాత్రల నుండి ప్రభవించిన విశ్వము పంచవిషయ సుఖములతో గూడియుండి మానవునికి భోజ్యమై యున్నది. ఆ విషయానందమును విసర్జించి వానికి "పృథివ్యాం కిం ప్రయోజనం" జగత్తుతోనేమీ పనిలేదు. అట్లే జగత్తునకున్ను అతనితో పనిలేదు. కాని అట్టివాడు నిజంగా సుఖియా అన్నది మాత్రం సత్యముకాదు. ఏలననగా, వర్తమాన శరీరసుఖములేదు. పైగా భుక్తి క్రియకు యతరులపై నాధారపడుటవలన ఒక్కొక్క యెడ ఆకలి దుఃఖమును అనుభవించు తనయందు సర్వమూ, సర్వము నందు తాను అనే అఖండ జ్ఞాన సంపత్తితో ప్రపంచమునంతనూ చూడగల ఆత్మదృష్టిలేనిచో అతని త్యాగము నిరర్థకమే. వెనుక ఈ జన్మ యందు క్రొత్తసంస్కారము లేర్పడజాలవని యెంచి నప్పటికి పూర్వ జన్మ సంస్కారము లాతని

బంధించి కర్మప్రవృత్తి గలిగించు చుండును. పునః పునఃకర్మలాచరించి ఆగామీకర్మఫలముల నార్జించి జన్మపరంపరలలో చిక్కిపోవును.

ఈ శ్లోకమునందు" స్త్రీ కనక మోహఘ్నః" అనగా కామినీ కాంచనములందు మోహ నాశనము మాత్రమే చెప్పబడినదిగాన, మోహము పెంపుచేసుకొనకుండా వుంటే చాలునన్నమాట. అనగా వున్నదానితో తృప్తిపడవలెను. గాని లభించని వానికై కోరిక పెంచుకొనరాదని (వ్యామోహ ము చెందరాదని) మాత్రమే చెప్పబడినది. లేనిచో కాంతాకనకములను వదలివేసిన సన్యాసి మాత్రం పరమగురువుకాని గృహస్తు యెన్నటికి పరమగురువు కాజాలడనేది ప్రతిపత్తి సంభవిం చును. ఏలననగా గృహస్థులగు యాజ్ఞవల్క్య, జనకుడు సాందీపుడు, శ్రీకృష్ణుడు, వశిష్ఠుడు. శ్రీరామచంద్రుడు మొదలగువారెవ్వరూ పరమగురువు లనబడజాలరు అని చెప్పవలసి యుండును.

3) స్వాత్మాన మద్వయం: అద్వయమైన ఆత్మను అని అర్థము అన్ని ప్రాణులయందు, ప్రాణములేని వాని యందుకూడ యున్న దొక్క ఆత్మయే, కాని ఏ వుపాధి కాయుపాధి దేనికది వేరుగా తోచబడుచూ వస్తు భేదమున్ను వస్తువులయందెక్కడి కక్కడే వేరువేరుగా ఆత్మ వున్నట్లున్ను తోచబడుచున్నది. వస్తువునకు లోపల బైటా వస్తువు యందూ వున్న దొక్క యాత్మ యనుటయే అద్వైతము. అంతయూ ఆత్మయే. ఆత్మకు భిన్నమైనదేది ( ఒక్క పరిపూర్ణ బ్రహ్మముతప్ప) లేదు. తనయందు నిఖిలభూతములయందు ఆ యాత్మను యెల్లప్పుడూ చూచుండుటయే ఆత్మదృష్టి యిదే అమృతదృష్టి. మృతదృష్టి రెండు విధములు. 1) నామరూపాలు చూచి వేరువేరు వస్తువులను తెలిసికొనుట వస్తుదృష్టి 2) నామరూపములచే భేదము గుర్తించక, గుణముచేత ఏకత్వమును చూచుట గుణదృష్టి, ఉదాహరణకు ఆభరణము లనేక నామరూపాలు గల్గి యున్నను అన్నియు బంగారపు వస్తువులే అని బంగారం దృష్టితో వుండుట గుణదృష్టి. ఈ రెండు మృతదృష్టులే ఏలననగా గుణదృష్టిలో కూడ. యిది ఇత్తడి యిది పుత్తడియనీ భేదము వుంటూనే వున్నది. భేదదృష్టి పోలేదు. అమృత రూపమైన ఆత్మదృష్టి ఎల్లప్పుడు నుండువాడే పరమగురువని శ్లోకం చెప్పుచున్నది.

3) పరమగురువు అనగా శేష్ఠుడగు గురువు, గురువులను ఎన్ని తరగతులుగా విభజించినా, యీ శ్లోకమునందు చెప్పబడిన విధము దేహవాసన లేకుండా తన శరీరమును శవప్రాయంగా చూడగల్గినవాడును, కామినీ కాంచనములయందు మోహమును నశింప చేసు కొనువాడున్ను ఎల్లప్పుడు ఆత్మదృష్టి కల్గి యుండువాడే పరమగురువు అని చెప్పబడినాడు. అట్టి గురుమూర్తికివే మా అనంతకోటి నమస్కారములు.

శ్లో॥ గురురేకోహి జానాతి, స్వరూపం దైవమవ్యయం
తజ్ఞానం యత్ప్రసాదేన నాన్యథా శాస్త్రకోటిభిః॥

తాత్పర్యము : గురుదేవుడొక్కడు మాత్రమే, అవ్యయమై నట్టియు దివ్యమైనట్టియు, స్వస్వరూప జ్ఞాన మెరిగినవాడు. ఆయన అనుగ్రహము వల్లనే ఆ జ్ఞానము గలుగగలదుగాని, మరే విధము

గాను అనగా కోటి గ్రంధములచేతనైనను కలుగజాలదు.

విశేష వివరణము : 1) స్వరూపము 2) దైవము 3) అవ్యయం 4) ప్రసాదము అనువానిని కొంచెం విచారించి తెలియవలసియున్నది.

1) స్వరూపం : రూపము అనగా నేత్రగోచరమగునది వర్ణములు (అనగా రంగులు) గాని ఆకారములుగాని వుంటేనే అది రూపమనదగును. కాని స్వరూపమనగా తనయొక్క రూపము అని శబ్దార్థము. తనరూపమేది? పిండాండమందు ప్రత్యగాత్మయు, బ్రహ్మాండమందు పరమాత్మయు, పిండాండబ్రహ్మాండముల సృష్టికి పూర్వము అధిష్ఠాన చేతన బ్రహ్మమున్ను తన రూపములు అయివున్నవి. ఈ మూడున్ను ఏకరూపములే. మరియు భిన్న భిన్నములుగాక అఖండము గానే యున్నవి. ఈ స్వరూపము నిరాకారము. సూర్యకాంతియందున్న సప్తవర్ణము లలో నేదియూ యీ స్వరూపమునకులేవు. కనుక స్వరూపమనగా స్వభావ లక్షణము అని మాత్రమే అర్థము గ్రహించ వలెను.

వేదాంత శాస్త్రమునందు ఆత్మకు త్రివిధలక్షణములు చెప్పబడినవి 1) తటస్థ లక్షణము 2) స్వరూప లక్షణము 3) అతద్వ్యా వృత్తి లక్షణము.

1) తటస్థ లక్షణము = ఒక కాలమునందుండి మరొక కాలమందు లేనిది. ఉదాహరణ కు, దేవదత్తుని గృహమేది? అని ఒకడడిగితే, ఆ కాకి వాలియున్నదే దేవదత్తుని గృహము అని చూపించినట్లు యీ దృష్టాంతమునందు, కాకియెగిరి పోకుండా వున్నంతవరకే అయింటిని గుర్తు పట్టవచ్చును. సృష్టికారణము బ్రహ్మము లేక ఆత్మ, ఆత్మయేది? అనుప్రశ్నకు సృష్టికారణ మైనదే ఆత్మ యని చెప్పుటయే తటస్థ లక్షణము. సృష్టికి పూర్వము లేక సృష్టియనంతరము యీ లక్షణము. ఆత్మకులేదు. గనుక తటస్థ లక్షణముచే ఆత్మను గుర్తించుట కుదరదు.

2) తటస్థలక్షణములో వలెగాక ఆత్మను యెల్లపుడు వీడివుండని స్వభావమే స్వరూపలక్షణ మని చెప్పబడును. నిశీధిసమయమున నక్షత్రములు నవగ్రహములు చంద్రుడు ప్రకాశించుచుండగా, చంద్రుడెవరు, అని ప్రశ్నించినచో యిందు వుత్కృష్ట ప్రకాశముగలవాడే చంద్రుడని చెప్పుట స్వరూప లక్షణము. ఏలననగా, నవగ్రహ నక్షత్రములన్నింటి కంటెను, చంద్రుడే వుత్కృష్ట ప్రకాశముగలవాడు. యీ వుత్కృష్ట ప్రకాశము చంద్రునియందెల్లపుడును వుండును. అట్లే ఆత్మను వీడియుండని లక్షణములు సచ్చిదానందములు కనుక ఆత్మకు సత్, చిత్, ఆనందములు స్వరూపలక్షణమని చెప్పబడును.

3) అతద్వ్యావృత్తి లక్షణము : "యిదికాదు, యిదికాదు" అంటూ యింద్రియగోచర మగు సమస్తమును నిషేధించుచూ పోగా మిగిలినదే బ్రహ్మమని చెప్పుట అతద్వ్యావృత్తి లక్షణము.

యీ మూడు లక్షణములు వాచా ఆత్మనిర్ణయమును చేయుటకు మాత్రమే వుపయోగ పడును. సర్వలక్షణ విలక్షణమగు పరిపూర్ణ బ్రహ్మమును నిర్దేశించుటపట్ల కీలక్షణములు మూడున్ను నిరర్థకములే. ఏలననగా యింద్రియములకు గోచరముగాకున్నను, ఆత్మమనోగోచ రమై యున్నది. ఆత్మనుగూడా దృశ్య కోటిలోచేర్చి దానిని గూడ నిషేధించినపుడే పరిపూర్ణము

స్వతస్సిధము. నిషేధించువాడూ నిషేధింపబడునదీ గూడా లేనపుడు వున్నదే పరిపూర్ణ పర బ్రహ్మము, ఐననూ శిష్యప్రబోధార్థము అతద్వ్యావృత్తి లక్షణమును పరిపూర్ణ పరబాహ్యమును వుండ చూపుటకు మాత్ర ముపయోగించవచ్చును.

సృష్టికారణమైన బ్రహ్మమును యీ త్రివిధలక్షణములచేతనూ తెలియవచ్చును. గాని యిదంతయూ వాగ్రూపముగా తెలియుటయే యగును. వస్తునిర్ణయముగా ఆత్మ తెలియబడదు. అది గురుని అనుగ్రహమాత్రముచేతనే తెలియబడును. ఏలననగా, తన గురుకృపకు పాత్రుడై తాను స్వయముగా ఆత్మ (బ్రహ్మము) ను వస్తునిశ్చయపూర్వకముగా గుర్తెరిగి ఆ నిశ్చయము నందు ఆరూఢతసాధించి అనుభవము పొందియున్నాడు. గనుక తాను తన శిష్యులకు అదేరీతిగా వస్తు నిశ్చయం గావింపగలడు. అట్టి ఆరూఢత సాధించిన గురుమూర్తి యొక్క అనుగ్రహ విశేషమున గాక, అన్యధా కోటి గ్రంధములను చదివిననూ వస్తునిశ్చయము లేక అవరోక్షజ్ఞానము కలుగనేరదని యీ శ్లోక ముటంకించుచున్నది. ఈ భావమే "గురోన్ముఖేన జ్ఞాతవ్యం, నాన్యధా గ్రంధకోటిభిః" అనుదానిలో వుద్ఘాటింపబడినది. గురువు శిష్యుని మనస్సుకు ఆత్మవస్తువు యొక్క స్వరూపము చూపించగలుగును. ఇదియే ఆత్మ, సందేహములేదు అని శిష్యునికి దృఢమున్ను కావచ్చును. యిది బుద్ధి నిశ్చయమేగాని ఆత్మనిశ్చయము (లేక అపపరోక్షము) కాదు. గురుడు విధించిన అనుష్ఠానము ఆచరణ. ధ్యానాధికము గావించినగాని ఆత్మాపరోక్ష జ్ఞానము ఆరూఢతగాదు.

దైవము : అప్రాకృతమైన ప్రకాశ స్వరూపుడు ఆ ప్రకాశము వెలుగురూపంకాదు. అఖండజ్ఞానరూపము అతి ప్రకాశము దాని ప్రకాశ(జ్ఞాన) సత్తాచేతనే యీ విశ్వమందలి సమస్తము జ్ఞానవంతమగుచున్నది.

శ్లో॥ యదాదిత్యగతం తేజో జగద్భాసయతే ఖిలం
యచ్చంద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధిమామకం॥

సూర్యచంద్రాగ్నుల యందున్న యే తేజస్సు సమస్తమైన జగత్తును ప్రకాశింపచేయు చున్నదో అది నా ఆత్మ సత్తారూపమైన తేజస్సు అయివున్నదని భగవానుడే గీతయందు చెప్పినాడు. సూర్య చంద్ర నవగ్రహ నక్షత్రాదులు విద్యుత్ మొదలగు తేజస్సులన్నీ భూత జ్యోతిస్సులు. ఆత్మ వ్యష్టియందు ఆపో జ్యోతియమనియు పరమాత్మ స్థానమున పరంజ్యోతియనియు కీర్తింప బడుచున్నది. ప్రకాశమనినా, జ్యోతియనినా జ్ఞానప్రకాశమనియే అర్థము. ఆత్మయే సర్వమును. సర్వ జ్యోతిస్సులను, ప్రకాశింపచేయుచున్నది. యీ భూత జ్యోతిస్సు లేమియును దానిని ప్రకాశింపచేయ లేవు. కనుకనే అది జ్యోతిషాం, జ్యోతిః అని కీర్తింపబడుచున్నది.

పరమాత్మకు ప్రకాశమే (జ్ఞానమే) స్వరూపలక్షణమై యున్నదని గ్రహించినాము. అది దివ్యము జ్ఞానవంతము అగుటచే దానిని దైవమనుట శబ్దాత్తు స్ఫారకమైయున్నది. పరమాత్మ జ్ఞానము అన్నిటిని తెలియచేయునేగాని, అది స్వయంగా తెలుసుకొనదు. దానిని సామాన్య జ్ఞానమని అన్నారు. ప్రాణుల యందు విశేషంగా అది యింద్రియముల ద్వారా పనిచేయుచు

శబ్దాది విషయగ్రహణ చేయుచు కర్మచేసి తత్ఫలములను అనుభవించుచున్నది. "గురుస్సాక్షాత్ పరబ్రహ్మ" అని గురువు అభివర్ణింపబడుచున్నాడు. కారణమేమనగా బ్రహ్మవస్తువుయొక్క అపరోక్షసాక్షాత్కారము పొంది యున్నాడు. తాను బ్రహ్మతాదాత్మ్యమును పొందుటయే అపరోక్ష సాక్షాత్కారము. కనుకనే "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" అని చెప్పబడినది. అట్టి బ్రహ్మణ్యుడైన గురుమూర్తి తన నిజరూపమైన బ్రహ్మమును శిష్యునికి దర్శింపజేసి తన రూపమును శిష్యుని కనుగ్రహించి బ్రహ్మస్వరూపుని చేయును. యిట్టి అఖండజ్ఞానము గురుమూర్తి యందు మాత్రమే కలదు. యిది సామాన్య విశేష జ్ఞానముల కతీతమై అప్రాకృతమై దివ్యమైయున్నది. కనుక గురుమూర్తియే నిజమగు దైవము.

అవ్యయం = అనగా క్షీణించనిది యగు బ్రహ్మపదార్థమనే యిట నన్వయము చేసు కొనవలెను. యేలననగా బ్రహ్మమే జీవేశ్వర జగద్రూపంగా పరిణమించినను అది తరుగుటలేదు. కాని యే యితర కారణ వస్తువైనను కార్యరూపం వహించినపుడు మూలపదార్థ పరిమాణము నందు తరుగుదల కనిపిస్తున్నది. బ్రహ్మమట్లు క్షీణించదు. "పాదోస్య విశ్వాభూతాని, త్రిపాద స్యా మృతం దివి" బ్రహ్మమునందొక నాల్గవ భాగమే విశ్వరూపం చెంది మిగతా మూడు భాగములు అమృత రూపంగానూ తొలిరూపంలోనూ వున్నవని చెప్పబడినది గదా! విశ్వరూపం వహించిన మేరకు తరిగిపోలేదా అని శంకింపరాదు. ఏలననగా బ్రహ్మము ఉపాదాన కారణమని పరిణామ కారణమని అన్నపుడే అట్లు తరిగిందని చెప్పవచ్చును. బ్రహ్మము అభిన్ననిమిత్తోపాదాన కారణము అయివున్నది. అనగా నిమిత్తకారణము తానే, ఉపాదానకారణము తానే అయివున్నది. పరిణామవాదములో మూలవస్తువు చెడి అన్యవస్తువగును. బ్రహ్మమట్లుకాదు. తాను చెడిపోకుం డానే అన్యవస్తువు యొక్క నామ రూపములను చెంది వేరు వస్తుప్రతీతి అగుచున్నది. దీనినే అవికృత పరిణామమందురు. తన తొలిరూపంలో అమృత రూపంగానూ దివ్యముగానూ వున్నది. విశ్వముగా కానవచ్చినది తానే, జీవరూపంగా వుపాధులయందు ప్రవేశించినదీ తానే. అమృతము, లేక మర్త్యరూపంగా కానవచ్చునదీ తానే. ఆయావుపాదులయందు ఖండరూపములుగా గానవచ్చినను ఆకాశమువలె అది అఖండ రూపంగానే యున్నది. కనుకనే గీతలో "అమృతం చైవ, మృత్యుశ్చ సదసచ్ఛాహ మర్జున" అని భగవానుడే చెప్పినాడు. "బ్రహ్మై వేదం విశ్వమిదం వరిష్ఠం" అని శ్రుతియు చెప్పినది. బ్రహ్మమందు విశ్వాకారము, విశ్వాకారమునందు బ్రహ్మము ఓతప్రోతములై యున్నవి. బ్రహ్మము తప్ప అన్యం కొంచమైనా లేదని "బ్రహ్మణోన్యం నకించన" అని శ్రుతియున్నూ యుద్ఘాటించుచున్నది. గురుస్వరూపమగు బ్రహ్మమే అట్టి అవ్యయ రూపమైయున్నది. అవ్యయ శబ్దమును.

శ్లో॥ ఉత్తమపురుష స్త్వన్యః పరమాత్మే త్యుదాహృతః
యోలోకత్రయామావిశ్య భిభర్త్యవ్యయ ఈశ్వరః॥

అంటూ క్షరాక్షర పురుషులకంటె విలక్షణుడై, లోకత్రయమును అవరించి భరించుచూ పరమాత్మ యనీ, ఈశ్వరునీ పిలువబడుచు ఏ పురుషోత్తమ స్వరూపమున్నదో ఆ తత్వమే అవ్యయమని

నిర్ణయించినది. అవ్యయుడనగా = నాశరహితుడని శాశ్వతుడని మరొక అర్థము. కాని సృష్టికి పూర్వము తాను తానుగానున్నపుడది శాశ్వతీయముగా అనగా ఏ మార్పు లేనిదిగా తోచు చుండుటచే శాశ్వతముగా చెప్పబడినది. అదే జీవేశ్వర జగత్తుగా మారినపుడు ఆ మార్పులన్నియు అశాశ్వతములని చెప్పబడుచున్నది. ఒకప్పుడు శాశ్వతముగానూ, ఒకప్పుడు అశాశ్వతముగానూ ఇట్లు ద్వంద్వ రూపముగాదోచు నీపురుషోత్తముని యందునూ కేవలశాశ్వతములేదు. మార్పులు చెందునపుడు, పూర్వరూపముపోయి క్రొత్త రూపముపొందుచుండును. పూర్వ పూర్వములు అశాశ్వతములే యగుచున్నవి. తానే సర్వరూపములుగా మార్పుచెందుచున్న ఈ పురుషోత్తమ రూపముకూడా అశాశ్వత మనియే చెప్పదగును. ఏ మార్పు ఎన్నడూ యెరుగని యొక్క కేవల పరిపూర్ణ బ్రహ్మమే శాశ్వతమన దగును. తదన్యమైన సర్వమూ ఉత్తమపురుషుడుతో సహా అశాశ్వతం అయివున్నవి. జీవేశ్వర జగత్తు దృష్ట్యా మాత్రమే అతడు శాశ్వతుడని చెప్పబడినాడు. ఇది సాపేక్షిక శాశ్వతత్వము మాత్రమే.

4) ప్రసాదము = అనుగ్రహము. కృపయని అర్థము. గురుకృప చేతనే లేక గురుమూర్తి అనుగ్రహమువల్లనే శిష్యునికి స్వరూప సాక్షాత్కారము కలుగుచున్నది. ఎట్లనగా శిష్యునికి స్వరూప నిశ్చము గురుని ప్రబోధము వినినంత మాత్రమున, గురుడు అయమాత్మా బ్రహ్మయని చూపినంత మాత్రమున, శిష్యునికి అపరోక్షసాక్షాత్కారము కలుగటలేదు గురుని అనుగ్రహముండి తీరవలెను. యిట్టి గురుకృప, అనుష్ఠాన బలము, అంతఃకరణశుద్ధియు గల్గి చతుర్విధశుశ్రూషలు చేయు శిష్యునిపైననే ప్రసరించును. ఊరక "నీ కృపాలోకనము నా మీదా ప్రసరింపరాదా నేను నీవాడనేగదా" అని పాడుకొంటే చాలదు. సర్వార్పణ బుద్ధితో శరణాగతి చేయవలెను. అపుడే గురుపరమాత్మ ప్రసన్నుడగును. శిష్యునికి సాధన ఫలప్రదమగును.

ఇట్టి అనుగ్రహవిశేష మావిర్భవించుటకై, లేక గురుకృపా ప్రసాదసిద్ధికై, అహరహము గురుభక్తి, గురుసేవ, గురునిష్ఠలయందుండి కృతార్థుల మయ్యెదముగాక!

శ్లో॥ గురు రేకోహి జానాతి స్వరూపం దైవ మవ్యయం
తజ్ఞానం యత్ప్రసాదేన నాన్యథా శాస్త్రకోటిభిః॥

తాత్పర్యము : అవ్యయమైనదియు అఖండజ్ఞానముచే ప్రకాశించుచున్నదియునగు పరమాత్మ స్వరూపమును సద్గురుమూర్తి యొక్కడే తెలుసుకున్నాడు. తెలుసుకొన్నవాడు గనుకనే గురుమూర్తి యనదగియున్నాడు. అట్టి గురుకృపచేతనే స్వరూపజ్ఞానము ప్రాప్తించునుగాని కోటి శాస్త్రములను చదివినవారికి గూడా మరొక విధంగా లభించజాలదు.

విశేష వివరణము : 1) స్వరూపం 2) దైవమవ్యయం 3) ప్రసాదం 4) గురురేకోహి జానాతి

1) స్వరూపము అనగా జ్ఞానేంద్రియ గోచరమగు రంగులు, ఆకారములు, కొలతలుగల యే వస్తువుగాదు. కాని మనస్సుచే మాత్రమే తెలియబడు యొక కొన్ని లక్షణములు గలది. జగత్తు నామ రూపక్రియా నటనాధికములుగల్గి జ్ఞానేంద్రియగోచరమై యున్నది. కాని జగత్కారణ మగు పరమాత్మ మాత్రము అట్లు జ్ఞానేంద్రియ గోచరముగాదు. కాని సృష్టియందలి సమస్తమును

తనయందు బీజరూపంగా ధరించియు అరూపమై, నిరాకారమై, నిర్గుణమై యున్నది. సత్, చిత్ ఆనందములు దానికి లక్షణములు. ఈ లక్షణములు యెట్లు గుర్తించ గలము? శబ్దాది విషయ పంచకములను జ్ఞానేంద్రియముల ద్వారా గుర్తెరుగునది మనస్సే లేక అంతఃకరణమే. అంతఃకరణము జడము కనుక స్వయంగా దేనినీ గుర్తించలేదు. ఆత్మ ప్రకాశంతో గూడియే అది దేనినైనా గుర్తించగలదు. నిజంగా అన్నిటినీ గుర్తించేది ఆత్మప్రకాశమే లేక జ్ఞానమే సర్వమునూ గుర్తెరిగేది అని చెప్పక తప్పదు. తన్నుతాను గుర్తెరిగినా ఈ ఆత్మజ్ఞానమేకాని మరొకటి యేదీ లేదు. అచ్చ తెలుగు పరిభాషలో దీనినే యెరుక అన్నారు. సర్వోపాధుల యందునున్న ఈ జ్ఞానమే సృష్టికి పూర్వము సమిష్టిలో అఖండ యెరుక అని చెప్పబడుచున్నది. యిదియే దాని స్వరూప లక్షణములలో ముఖ్యమైనది. ఏలననగా ఇది జ్ఞాన ఘనము లేక చిద్ఘనము ఇదే చిల్లక్షణము అని వర్ణింపబడియున్నది. సృష్టికి పూర్వాపరములయందు సృష్టియున్నపుడు వుండుట సలక్షణము. దుఃఖలేశము లేని అత్యంతిక సుఖమే ఆనంద లక్షణము. ఈ సచ్చిదానందములుగల వస్తువే స్వరూపము అని యెరుగుట స్వరూప జ్ఞానముకాదు . యిది పరోక్ష జ్ఞానము మాత్రమే యగును. "బ్రహ్మవిద్ బ్రహ్మైవభవతి" సర్వనిషేధావది రూపంగా తానుతానే నిలచినపుడే అపరోక్ష సాక్షాత్కారము కల్గినట్లు చెప్పవలెను. అట్టివాడే బ్రహ్మవిద్య అనగా బ్రహ్మమును యెరిగినవాడు. అట్లెరిగినవాడే గురుమూర్తి. అట్టి గురుమూర్తి అనుగ్రమ విశేషం చేతనే పరమాత్మ స్వరూపము అపరోక్షం కాగలదు.

స్వరూపం = స్వ + రూపం = తన రూపము అనగా నిరుపాధికమగు నిజ స్వరూపం తొలి రూపము అంటే కేవలం సృష్టికి పూర్వమున్న పరమాత్మ స్వరూపము. నామ రూపాత్మకమగు సర్వమునకు అదియే తొలి రూపము. గురుకృపా విశేషముచే గాక అది అపరోక్షము కాదు. గురుకృప యెట్లు కలుగునో గతంలో పలుసార్లు తెలుపబడినది. గురూపదిష్ట మార్గమందు త్రికరణశుద్ధిగా పయనించిన వారికే అది సాధ్యము.

2) దైవమవ్యయమ్ = తరిగిపోని, దివ్య స్వరూపం సృష్టికి పూర్వమున్న కారణ బ్రహ్మము విశ్వరూపంలో వికాసము చెందును. అట్లు మారుటలో తొలిరూపము తరిగిపోవలెను. లేక మారు రూపములో వుండి తొలి రూపము పూర్తిగా లేకుండాపోవలెను. పాలు పెరుగైపోయినపుడు పెరుగే కాని ఆ పాల రూపమిక లేదు. నాలుగు శేర్లలో మూడు శేర్లుతోడుపెట్టి పెరుగుగా మారిస్తే యిక శేరు మాత్రమే పాల రూపంలో నుండును. మరియు పెరుగుగా మారిన తర్వాత ఆ పెరుగు మరల పాలరూపం వహించదు. పరిణామవాదమనగా నిదియే.

ఈ పరిణామవాద మంగీకరించబడలేదు. సృష్టికారణ వస్తువు నందు యెట్టి మార్పు జరగనేలేదు. జరిగినట్లు తోచుట అన్యవస్తు ప్రతీతియగుట ఇది అంతయు నీ భ్రాంతియే గాని సత్యముగా దనుట వివర్తవాదము. ఉదాహరణంగా "తాడెప్పుడు పాముగా మారలేదు. త్రాటి యందు పాముతోచుట నీ భ్రాంతి మాత్రమే యందురు." మహా సముద్రము నందు పేన (నురుగు) నుద్భుద (బుడగ) తరంగములు (కెరటములు) రూపుదాల్చుచున్నవి. సముద్రము కంటె భిన్నములు కావు. అంతయు మహాసముద్రమే. ఏలననగా, ఆరూపములను గోల్పోయి

తిరిగి మహాసముద్రము లోనే చేరుచున్నవి. ఇది అవికృత పరిణామవాదమనవచ్చును. బ్రహ్మము కుమ్మరివంటివాడు. మాయమట్టి వంటిది. మట్టితో కుమ్మరి కుండలు వగైరా చేసినటుల మాయతో బ్రహ్మము విశ్వరచన గావించినాడనుట నిమిత్త కారణము. తాను బ్రహ్మము. తన అద్భుత శక్తియే మాయ. రెండు ఒకటియే. ఊర్ధ్వనాభి (సాలెపురుగు,పట్టుపురుగు) వలె తనలోని జిగురు పదార్థమును చొంగగా కారుస్తూ గూడల్లినట్లు విశ్వసృష్టి గావించి ఆ సృష్టియంతయు తానే అయి, తానే అందుచిక్కుకొని ఒకప్పుడు బద్ధుడుగానూ మరొకప్పుడు ముక్తుడుగానూ యెంచుట అభిన్ననిమిత్తోపాదాన మనబడును. ఈ మాయా బ్రహ్మము (యెరుక) ఆ ఘటన ఘటనా పటీయసీ అనియు మహద్భుతా నిర్వచనీయ రూపాయనియు చెప్పబడుచున్నది. అందుకే "అన్నియు తానై తనకవి పన్నుగ వేరనుచు నోట బల్కుచు మరి తానన్నిటినెరిగే యెరుకై యున్నాని యెరుకకెరుకే ఊహించుచుండూ, తనలోతానే మోహింపుచుండూ, యెన్నో విచిత్రాలీ యెరుక చేతలు వింటే వున్నది లేదు. లేకున్నదీ కల దాని యూహింపుచుండూ, తనలో తానే మోహింపుచుండూ" అనిశ్రీకృష్ణ దేశికేంద్రులు కందార్థము వ్రాసినారు. ఖండాఖండ ములుగాక నిమిత్తోపాదానములుగా, వృద్ధి క్షయములు గలిగినట్లుగా తేజోతిమిరములుగా తానే తన్ను ప్రకటించుకొను చున్నది. వ్యయమగుచున్నట్లున్ను, అవ్యయముగా నున్నట్లున్ను అనగా తరుగుట పెరుగుట కలిగియున్నట్లున్నుగూడ తోచుచున్నది. దివ్యము గానూ, భౌతికము గానుకూడా వున్నది. సర్వద్వంద్వములుగాను వున్నది. ఏ ద్వంద్వములు లేనిది ఏక రూపంగా నున్నదీ ఒక్క పరిపూర్ణ బ్రహ్మమే. కనుకనే ఏమనీ యనరాక యేకమైయున్నది. ఏ ఒక్క లక్షణం చెప్పినా దాని సాపేక్షిక పదముకూడ యెరుకకే వర్తించును.

3) ప్రసాదం అనగా పవిత్రమైన అన్నాదికములుగాదు. కృప, అనుగ్రహము అను అర్థమును యిట గ్రహించవలెను. ప్రసాదించుట అనగా అట్టి దయానుగ్రహములతో యిచ్చుట అని అర్థము.

4) "గురు రేకోహి జానాతి" అంటే గురువు ఒక్కడు మాత్రమే దానిని తెలుసుకొను చున్నాడు. తెలుసుకొన్నవాడే గురువు. అతడు శ్రోత్రియ బ్రహ్మ నిష్ఠుడు అనగా శ్రుత్యుక్తమైన బ్రహ్మమునందు సదా నివేశము గలవాడు. బ్రహ్మ అపరోక్ష జ్ఞానము కలవాడు కనుకనే సాక్షాత్పర బ్రహ్మయని కీర్తింపబడుచున్నాడు. ఏలనన బ్రహ్మమును తెలుసుకొన్నవాడు బ్రహ్మమేగాని యన్యముగాదు. తెలుసుకొన్నవాడనగా బ్రహ్మము గూర్చి విన్నవాడూ, చెప్పగలిగినవాడు మాత్రము గాడు. తానూ విశ్వమూ సమస్తమూ బ్రహ్మమేనని ఆరూఢ జ్ఞానముగల వాడు మాత్రమే. బ్రహ్మవిదో అనగా బ్రహ్మమును తెలుసుకొన్నవాడు. కనుకనే "బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" అని చెప్పడినది. బ్రహ్మమునా విధంగా తెలుసుకొని సాక్షాత్పరబ్రహ్మ స్వరూపుడు. గురుమూర్తి ఒక్కడు మాత్రమే అయియున్నాడు. దానిని ఎరుగనివాడు యితరుల కెట్లు యెరిగింపగలడు? అట్టి గురుమూర్తి కృపాప్రసాదము చేతనే ఆ గురుస్వరూపమును తెలియవలసి యున్నది.

బ్రహ్మమే సద్గురు స్వరూపంలో తన్నుతాను ప్రకటించుకొను చున్నదన్నమాట, ఇంకొక విధంగా స్వస్వరూపజ్ఞానం కలుగనేరదు. కోటి శాస్త్రములు చదివినను ఆ జ్ఞానము కలిగించుటలో సమర్థవంతములు కాదని ఈ శ్లోకముద్ఘాటించుచున్నది.

శ్లో॥ స్వరూప జ్ఞాన శూన్యే, కృతమవకృతం భవేత్
తపో జపాదికం ధ్యానం, సకలం బాలజల్పవత్॥

తాత్పర్యము : స్వరూపమును వస్తునిశ్చయ రూపంగా యెరుగని నాడు చేసిన జప తప ధ్యానాదులన్నియు చేయబడనివే యగుచున్నవి. అనగా నిష్ఫలములే యగుచున్నవి. అతని వాక్యములన్నియు పసిబాలుని తొక్కుడు పల్కులవలె నిరర్థకవాదములే అగుచున్నవి.

విశేష వివరణములు : 1) కృతమప్యకృతంభవేత్ 2) తపోజపాదికం 3) జల్పవత్

1) కృతమప్యకృతం = కృతం + అపి + అకృతం = చేయబడిన దైనప్పటికి చేయబడనిదే అయిపోవుట అనగా చేసి చెయ్యని దానితో సమమగుట.

2) తపోజపాదులు = తపము, జపము మొదలైనవి. తపము అనగా ఆలోచనా పూర్వకమగు ఇష్టదైవ ధ్యానము. కాయిక వాచిక మానసికము లన్నింటిని తపింపచేయుట తపస్సు అనేకాగ్రమైన శారీర వాఙ్మనస్సులను ఏకాగ్రమొనర్చి ఏక వస్తు లక్ష్యమును సాధింప బూనుటలో పొందెడి కష్టమే తపస్సు. త్రికరణముల సంయమనమే త్రివిధ తపస్సులు భగవద్గీతయందు వివరణ చూడవచ్చును. కృచ్ఛ్రచాంద్రాయణాదులచే శరీరమును శుష్కింప చేయుటయు, శీతోష్ణాదులు, ఆకిలి దప్పులు మొదలగు ద్వంద్వములను సహించుట, నియమములు యివన్నియు తపశ్చర్యలు.

జపము = మంత్ర పురశ్చరణ, పారాయణము, మనస్సులో పల్కుట, జపము వాచిక, వుపాంశు, మానసికములను మూడు విధములు. పైకి వుచ్చరించుట వాచికము, ఎవరికి వినబడకుండా చేయుట వుపాంశువు. మనస్సులోనే పలుకుట మానసికము. ఈ మూటిలో మానసికమే శ్రేష్ఠము తపోజపాదికములు అనుటలో యితరములగు సాధనలు అన్నియు చేరియున్నవి. ధ్యేయ వస్తువును, వస్తు నిర్ణయంగా తెలియక చేయు సాధనలు వ్యర్థములు. అనగా ఆశించిన ఫలప్రాప్తి కలుగనేరదు. "తజ్జపద భావనం" అని యోగసూత్రము. అనగా మంత్రముయొక్క శబ్దార్థమును స్మరించుట కాదు. మంత్రములో చెప్పబడిన ఇష్టదైవము లేక వస్తువుయొక్క స్వరూపమును మనస్సుచే అవలోకనము చేయుచుండుటయే నిజమగు జపము స్వరూప జ్ఞానము లేనిచో సాధనలేవ్వియు ఫలవంతములుగావు. కనుక అట్టి నిరర్థక సాధనలు చేసిననూ చేయబడని వానితో సమానము.

బాలజల్పవత్ = బాలుని భాషితములు అని అర్థము. తర్క శాస్త్ర దృష్ట్యా వాదము మూడు విధములు. ఇందు స్వమతముయొక్క వుత్కృష్టత నుపన్యసించుట వాదము. ప్రత్యర్థిమత మును నిరసించుచూ స్వమతమును ప్రాచుర్య మొనర్చుట జల్పము, పరమతములోని లోపము లను మాత్రమే చూపుచూ దూషించి నిరసన గావించుట వితండమనబడును. పసిబాలుడు వచ్చియురాని మాటలతో జల్పము (స్వమత ప్రాచుర్యము

పరమత ఖండనము) చేయబూని నట్లు. వస్తునిశ్చయముగా స్వస్వరూపము నెరుగని పండితవాదము హాస్యాస్పదము కాగలదు అని భావము. తాన్నశ్రయించిన సాధకులకు స్వస్వరూప జ్ఞాన మారుఢము గావించి పిదప పూర్ణబోధచే జనన మరణ భ్రాంతి రహితం గావించు సద్గురుదేవుని దివ్యశ్రీ చరణములను అహరహము స్మరించుచూ కృతకృత్యుల మగుదుముగాక.

శ్లో॥ జలానాం సాగరో రాజా, యధాభవతి పార్వతి
గురూణాం తత్ర సర్వేషాం రాజోయం పరమోగురుః॥

తాత్పర్యము : వాపీ, కూప, తటాక, నదీ నద రూపములగు జలాశ్రయముల కన్నిటికి సముద్రము. రాజు, అట్లే పారమార్థికులగు గురువులందరికంటె మిన్నయై గురువులందరికి గురువగుచు (గూరూణాం గురుః) పరిపూర్ణ బోధ గురువే పరమగురువనదగియున్నాడు.

విశేష వివరణము : జలరాశులన్నిటికి, సముద్రము రాజని చెప్పబడుటకు కారణమేమి? ఎట్లు రాజు ప్రజల వద్ద నుంచి పన్నుల రూపంగా ధనము సేకరించి, ఆ ధనమును మరల ప్రజోప యుక్తములగు కార్యములకు వినియోగించి ప్రజాక్షేమమునకు తోడ్పడుచున్నాడో అట్లే, జల ప్రవాహములన్నిటిని తనలోనికి సముద్రము చేర్చుకొను చున్నది. పిదప ఆవిరిరూపంగా మేఘ మండలమునకు చేర్చి వర్షరూపంలో పరిశుద్ధ జలములచే తటాక నదీనదములను నింపు చున్నది. ఆవిధముగ సముద్రము జలాశయములకు రాజై యున్నది.

అదే విధముగా, పరమగురువు. జన్మరాహిత్యమాశించిన సుజనులకు

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః

అంటూ అభయ ప్రధానము చేయుచున్నాడు. పిమ్మట శిష్యులు తమ శరీరేంద్రియ వాఙ్మనః ప్రాణములను గురువున కర్పింతురు. ఆచరణపరులైన శిష్యులను "శుద్ధిచిత్తోభవ" అని ఆశీర్వదించుచూ వారర్పించిన వారివారి తను మన ధనములను పరిశుద్ధమొనర్చి వారికే మరల ప్రసాదించి పునీతుల గావించును. కనుక పరమగురువే గురూణాం గురుఃఅయివున్నాడు.

శ్లో॥ మోహాది రహితశ్శాంతో నిత్యతృప్తో నిరాశ్రయః
తృణీకృత బ్రహ్మ విష్ణు వైభవః పరమోగురుః॥

తాత్పర్యము : కామక్రోధ శోక మోహాదులులేని శుద్ధాంతఃకరణముతో పరశాంత స్వరూపుడై యున్నవాడును. యెల్లపుడు పరమతృప్తితో యదృచ్ఛాలాభ సంతుష్టి కలిగియుండువాడును. యితరాశ్రయము ఏమియులేనివాడును, భోగప్రియులగు బ్రహ్మవిష్ణ్వాదుల యొక్క వైభవము లకు సహితం కించిన్మాత్రమైనను ఆశ పడని వాడున్ను అగువాడే పరమగురువని చెప్పదగి యున్నాడు.

విశేషవివరణము : 1) నిత్యతృప్తి = ఎల్లప్పుడూ తృప్తి కలిగి యుండుట. తాను చేసిన కృషి ఫలితముగా ఎంత తక్కువ లభించినా బాధపడకుండా వుండడమే తృప్తి ప్రాప్తంబగు లేశమైన

అదియే పదివేలు అనుకొని సంతసించుటయే తృప్తి లేక సంతుష్టి, ఎంత ప్రాప్తించినా యింకా ఎక్కువ రాలేదేయని బాధపడుట అసంతృప్తి. అసంతుష్టి లేక ఆశ "ఆశానా పరమం దుఃఖం. నిరాశా పరమం సుఖం" అని చెప్పబడినది. ఆశయే తృష్ణ (అనగా దాహము) పోల్చబడినది. ఆశయే సర్వదుఃఖముల మూలము. ఫలాపేక్షతో కర్మలొనర్చిన వానికి ఆశించిన ఫలితము రాకున్నచో దుఃఖము కలుగు చున్నది. కనుక నిష్కామకర్మ విధింపడినది. కర్మ (అనగా పని) గుర్తెరుగకుండా ఎవరున్ను ఏకర్మయున్ను చేయరు. గుర్తెరుగుట యన్నపుడు 1) నేను చేస్తున్నాను అను కర్తృభావము 2) ఫలానా కర్మ చేయుచున్నాను. 3) ఫలానా ప్రయోజనం నిమిత్తం చేస్తున్నాను అను భావము లన్నియు గుర్తుయందు అంతర్నిహితములై యుండును. ఏ ప్రయోజన మున్ను కోరకుండానే ఎవరైన చేయుట దురూహ్యము. ఏకర్మయైనను సుఖదుఃఖములు, పుణ్య పాపములు వుత్పత్తి చేయకుండా వుండవలెనన్నచో పై మూడింటిలో యేమి విడువవలెను? కర్మయు, కర్మ ప్రయోజనము వుండక తప్పదు. కర్తృభావము (నేను చేయుచున్నాను) వుంటే సుఖదుఃఖములు తప్పవు. ఎట్లనగా నేను కాబట్టి యీ ఘన కార్యము సాధించినానని సంతోషమో లేక నేను చేసిన కార్యము విజయవంతము కాలేదని దుఃఖమో కలుగుచున్నది అట్టి కర్తృత్వా భిమాభినములేనిచో ఆ సుఖదుఃఖములు కలుగవు. అట్లే పుణ్యపాప సంస్కారములున్ను ఏర్పడవు. కర్తృత్వము మా ఆశను, అసంతుష్టిని, పెంపుచేయును. కర్తృత్వ త్యాగశీలుడే నిత్యతృప్తుడు కాగలడు. "యోగః కర్మసు కౌశలమ్" కర్మ చేయుటయందు నేర్పరితనమే యోగము, కర్తృత్వ త్యాగపూర్వక కర్మాచరణమే యా నేర్పరితనము, పరిపూర్ణ బోధ గురువులచే కర్తయెవరో దెలిసి యట్టి కర్తకు పరిపూర్ణ పరబాహ్యమునందు స్థానముగాని మూలంగాని లేదని ఆరూఢత గాంచినవాడే నిత్యతృప్తుడు కాగలడు. అట్టి తృప్తియేముక్తి.

2) నిరాశ్రయుడు అనగా ఆశ్రయము లేనివాడు అని అర్థము. ఆశ్రయము కానివాడు అని అర్థము చెప్పరాదు. ఏలననగా పరమాత్మ అణువుకంటె చిన్నవాడై, సర్వమునందు తానూ తన యందు సర్వమూ గలిగియున్నవాడని చెప్పబడుచున్నాడు. ఈ దృష్టితో సర్వమునకూ తానాశ్రయభూతుడై యున్నాడని చెప్పి తీరవలసినదే. జగన్మిథ్యావాదముచే జగత్తు మిధ్యయని పరమాత్మయే సత్యమని అనేవారు సత్యమైన పరమాత్మయందు మిధ్యా జగత్తు లేదు కనుక పరమాత్మ దేనికీ ఆశ్రయుడు కాడని చెప్పవచ్చును. కాని మిధ్యయైన రజ్జు సర్పమునకు రజ్జువు ఆదారమూ అధిష్టానము అయివున్నట్లు మిద్యా జగత్తుకు పరమాత్మ యే ఆధారము, అధిష్ఠానము అయివున్నట్లు ఒప్పుకొంటూనే యున్నారు. పరమాత్మ నిరాశ్రయుడు అనగా ఆశ్రయము కానివాడు అని చెప్పనొప్పదు. పరమాత్మకే ఆశ్రయములేదు. నిలువనీడలేదు. దానికి పరిపూర్ణ పరబాహ్యము నందు స్థానమూలేదు కనుక పరమాత్మయే నిరాశ్రయుడు అని చెప్పకతప్పదు. సృష్టి కారణ బ్రహ్మమున కన్యంగా మరేమి లేనేలేదనే పక్షంలో కూడా దాని కాశ్రయము మరొకటండ జాలదు. గనుక ఏ పక్షంలోనూ పరమాత్మ నిరాశ్రయుడే. అతడే గురుస్వరూపము కనుక గురుమూర్తి నిరాశ్రయుడని చెప్పబడినది.

3) తృణీకృత బ్రహ్మవిష్ణు వైభవః= అనగా గురుమూర్తికి యెట్టి మహా వైభవములు

భోగభాగ్యములందును వ్యామోహములేదు. త్రిమూర్తులలోనూ పరమశివుడు విరాగి. బ్రహ్మ, విష్ణువులును ఇతర దేవతానీకమును భోగప్రియులు. వైరాగ్యమన్నదెరుగరు. ఆత్మకానిది అన్యమైన వస్తుజాతమేమీ లేనేలేదని వారెరుగరు. సర్వమూ తానేసర్వమునందు లోపలాబైటా తానే అను అఖండ జ్ఞానసంపత్తిగల గురుదేవులకు ఏ భోగభాగ్య వైభవములందు ఆదరణ యుండును? ఐనను అతడు రాజయోగికనుక దేనియందును రాగద్వేషములుండవు. వ్యామోహముండదు సర్వమునందు తృణీకారభావమేయుండును.

శ్లో॥ ద్వైతా ద్వైత వినిర్ముక్తః స్వానుభూతి ప్రకాశవాన్
అజ్ఞానాంధరతమశ్ఛేత్తా సర్వజ్ఞః పరమోగురుః॥

తాత్పర్యము : ద్వైతా ద్వైతమను భేదములచే విడిచిపెట్టబడిన వాడును స్వరూప సాక్షాత్కారము వలన సంపూర్ణానుభవముతో ప్రకాశించువాడను, దట్టమగు అజ్ఞానాంధకారముచే మిక్కిలి గ్రుడ్డివారైన శిష్యుల యజ్ఞానమును పటాపంచలు చేయువాడును. సర్వము తెలిసిన వాడును పరమగురువని చెప్పబడుచున్నాడు.

విశేష వివరణము : 1) ద్వైతాద్వైత వినిర్ముక్తా : ద్వైతము, అద్వైతము మొదలగు మతముల యందలి దురభిమానము నుండి విడువబడినవాడు. మా మతము దొడ్డది, యితర మతము లన్నియు చెడ్డవి అనే భావము ముదిరినచో అది అన్యమత ద్వేషమునకు, మత కలహములకు దారితీయును. నిజమునకు ఏ మతమును చెడ్డదికాదు. వేర్వేరు మతవాదములన్నియు వేరువేరు దృక్పధములు అన్నియు పూర్ణసత్యమునకు గొంపోవు సోపానములే. అందేమత వాదమును నిరసించుటయు న్యాయముకాదు. గురుమూర్తి పూర్ణసత్యమును తెలిసికొన్నవాడు, ఆయన దృష్టిలో దిగువసోపానము లలో నేదైనను అసత్యమగునా? మేడపై అంతస్తులో నున్నవాడు క్రింది అంతస్తులను తృణీ కరించునా? పై అంతస్థు నిర్మాణమునకు దిగువ అంతస్థుల నిర్మాణము ఆధారమగుట లేదా? గురుమూర్తికి మతద్వేషముండజాలదు. అతనికి మతదురభి మానమెన్నడును యుండదు. సర్వాభిమానములకు మూలకారణమగు యెరుకయేలేని పరిపూర్ణ పరబాహ్యమును తన గురుమూర్తి కృపచే తెలిసిన మహాత్ముడతడు. అతని ప్రయత్నమేమియు లేకుండగనే సర్వాభిమానములు తమంతట తామే అతని అంతఃకరణమునుండి పారిపోయినవి.

2) స్వానుభూతి ప్రకాశవాన్ అనగా అతడు అనుభవ జ్ఞానముచే పరిపూర్ణత చెందినవాడు గాని శాస్త్రజ్ఞానమొక్కటియే కలవాడు గాడు "అవిజ్ఞాత్వే పరేతత్వే శాస్త్రాధీతిస్తు నిష్ఫలా" అనగా పరతత్వమును తెలియని శాస్త్రజ్ఞాన మెంతయున్నా అదియంతా "ఖరశ్చందన భారవాహి" అనగా, గాడిద మోయు మంచి గంధపుకట్టెలవంటిదే యగును.

3) అజ్ఞానాంధతమశ్ఛేత్తా : అజ్ఞానాంధకారముచే పూర్తిగా గ్రుడ్డియైపోయిన శిష్యుల అజ్ఞానమును పటాపంచలు చేయువాడు. ఈ అంధత్వము మధ్యలో వచ్చినదికాదు. పుట్టుకతోనే గలిగినది. అజ్ఞానములోనే పుట్టి పెరిగి నశించు జీవుల యుత్పత్తికే యిది మూలకారణమైనది. ఈ అజ్ఞానము పోవునదికాదు. దీనినే మూలాజ్ఞానము అందురు. ఇట్టి అజ్ఞానమునకు

స్థానస్వరూప స్వభావములేమి? సృష్టికి పూర్వమే వుండి సృష్టికి కారణమైయున్న పరమాత్మయే యీ అజ్ఞానమునకు మూలస్థానము. ఆ పరమాత్మకు జ్ఞానమే స్వరూప లక్షణమన్నారు. జ్ఞానాజ్ఞాన లక్షణములు రెండూ ఆజ్ఞానానివే అయివుండి నాణెమునకు బొమ్మ బొరుసుల వలెనున్నవి. జ్ఞానము లేకుండ సృష్టి యెట్లు జరుగును? కనుక కేవలం అజ్ఞానమే సృష్టి కారణమగుట పనికిరాదు. జ్ఞానాజ్ఞానములు రెండున్నుకలసియే సృష్టికారణమై యున్నవనుటయే సమంజసము. అజ్ఞానము పోవలెనన్న దానితోపాటు జ్ఞానమున్ను పోవలసియుండును. జ్ఞానా జ్ఞానములు (యెరుక మరుపులు) రహిత మొనర్చు నొక్క పరిపూర్ణ బోధచే యీ అజ్ఞాన నాశనము గావించువాడే పరమగురువన జెల్లును.

4) సర్వజ్ఞః = సమస్తమును తెలుసుకొనగలవాడు పరమాత్మయే. తనతో సహా సర్వమును తెలుసుకొనగల అఖండ జ్ఞాన స్వరూపుడు గురుస్వరూపమే. అట్టి పరమాత్మ సర్వస్వ రూపుడై తనను తనకన్యముగా నున్న పరిపూర్ణ బ్రహ్మమును తెలియగలవాడే పరమగురువు అని చెప్పబడియున్నాడు.

గురూణాంగురుః (గురువలకు గురువు) అయియున్న గురుసార్వభౌముడు పరిపూర్ణ గురువు. అతడే పరమగురువు. అట్టి గురుపరమాత్మను అహరహము భజించెదముగాక!

శ్లో॥ అలంవికల్పై రహమేవ కేవలం
మయిస్థితం విశ్వమిదం చరాచరం
ఇదం రహస్యం మమ యేన దర్శితం
స వందనీయో గురు రేవ కేవలం॥

తాత్పర్యము : నానావిధ నిర్ణయములు మత సిద్ధాంతాలూ యికచాలును. ఇక అవన్నియు నిపుడు నిరర్థకములు అయిపోయినవి. "ఒక్కడనైన నేనే సత్యము. నాయందే యీ చరాచర విశ్వమంతయు నిలచియున్నది" అనియీ రహస్యమును యెవరు తెలిసి నాకు ప్రత్యక్షముగా వస్తువునుచూపి ఆరూఢత కలిగించినారో, అట్టి నా గురుమూర్తి ఒక్కడే వందనీయుడు, పూజ నీయుడునై యున్నాడు అని భావార్థము.

విశేష వివరణము :1) వికల్పై 2) అలం 3) కేవలం 4) గురురేవ కేవలం.

1) వికల్పైః = వికల్పములు, మానవుని మేధ వికాసము చెందినకొలది వారు దైవమును గూర్చి చేసెడి నిర్ణయములు వుత్తరోత్తరాభివృద్ధి బొందుచూ క్రమశః పూర్ణ సత్యమునకు చేరువగు చువచ్చెను. అంటే పూర్వపూర్వాసిద్ధాంతములను నాశమొనర్పకనే వానిని పునాదులుగా నుంచు కొని వానిపైన మరియొక అంతస్థును లేవదీయుచూ ఆ విజ్ఞాన భవనమును పైపైకి నిర్మాణ మొనర్చుచూ పోయిరని చెప్పదగును. ఆ విజ్ఞాన సౌధమునకు అద్వైత సిద్ధాంతము అత్యున్నత మగు అంతస్థు దానికంటెనూ వున్నతమైనది పరిపూర్ణ బోధ సిద్ధాంతము. కాని అది యొక అంతస్తేకాదు. అది విజ్ఞానసౌధమునే అతిక్రమించి అతీతమై, అవిజ్ఞేయమై, అగోచరమై అలరారు చున్నది. అది శుద్ధనిరపేక్షక కేవలత్వముగలదై యిట్టి దట్టిదని వూహించుటకైననూ యెరుకలేనిదై జ్ఞానాతీతమై అలరారుచు పరిపూర్ణమై యొప్పుచున్నది. "పూర్ణమదం: పూర్ణమిదం పూర్ణాత్పూర్ణము

దచ్యతే'' ప్రత్యక్షపూర్ణమైన అద్వైత నిర్మిత బ్రహ్మమును "వుదచ్యతే" అనగా అతిక్రమించి అది పరోక్షపూర్ణముగా నున్నది. యీ శ్లోకమునందు నిర్ణయించబడిన "అహమేవ కేవలం" అనగా "నేనైన బ్రహ్మము'' ప్రత్యక్షపూర్ణమును చెప్పుచున్నదేగాని, పరిపూర్ణ బ్రహ్మమును గూర్చి అనువధించి చెప్పుటలేదు. ఆ పరిపూర్ణ బ్రహ్మము ప్రత్యక్ష అనుమానాది సకల ప్రమాణములకు అగోచరమై అందరానిదై వున్నది ఐతే అది కేవలం వూహామాత్రమై అనుమాన ప్రమాణముచే మాత్రమే తెలియబడుచూ వున్నదని చెప్పదగియున్నాదా? అంటే ఆ పరిపూర్ణమునందు ప్రమాతయే లేదు. అనుమానించేదేలేదు ప్రమాత ప్రమాణము ప్రమేయము అనే త్రిపుటి లేని ది పరిపూర్ణ పరబ్రహ్మము.

వికల్పములనగా, పరమాత్మ నిర్ణయమునకై చేయబడుతూ వచ్చిన వూహలు ఆలోచనలు ప్రతిపాదనలు మున్నగునవి. బ్రహ్మవస్తుసాక్షాత్కారమైన పిదప ఆ నిర్ణయము లన్నియు, పరాస్తములై పోవుచున్నవి. యదార్థవస్తువు, వున్నదున్నట్లుగా గోచరించెను. అదే నేనే నన్ను నేనే గుర్తించుకొన్నాను. గాని దానికి వేరై, వేరుగా నుండి దానిని తెలుసుకొనలేదు. నా నిజరూపమగు ఆ బ్రహ్మమునందు యీ చరాచర విశ్వమంతయు నిల్చియున్నది అని "మయిస్థితం విశ్వమిదం చరాచరం'' అని యీ శ్లోకంలో చెప్పబడినది. నేనే యీ విశ్వమునకు, ఆధారమును, అధిష్ఠానముగూడనై యున్నాను. సర్వమూ నేనే నాయందే సర్వము అనే అఖండ జ్ఞానం ఏ గురుకృపచే నా కారూఢమైనదో ఆ గురుమూర్తియే పూజనీయుడు. ఈ విషయమే నిరాలంబోపనిషత్తులో ఏది వుపాస్యము అనే ప్రశ్నకు జవాబుగా "సర్వశరీరస్థ చైతన్య ప్రాపకో గురురుపాస్యః'' అని చెప్పినది. గతములో వ్యాఖ్యానించిన " యస్య ప్రసాద్యాదహమేవ సర్వం'' అనే శ్లోకం కూడా యీ విషయమునే వుద్ఘాటించుచున్నది. ఆ వికల్పములు యెట్టివో యించుక విచారింతము. 'దేవుడనేవాడు'' లేక వస్తువు యేదో ఒకటున్నదనే భావము తొలి మానవులయందే పొడచూపెను. తమలో కొందరు సరియగు కారణమైనను లేకనే మృతిచెందుట. జరావ్యాధి మరణములను తామెంత ప్రయత్నించినా ప్రతిఘటించలేక పోవుట,ఆధ్యాత్మిక అధిభౌతిక, అధిదైవిక తాపములు కల్గించువాడు. సృష్టి స్థితిలయములను గావించువాడు తమకంటె భిన్నముగా నొకడుండి విశ్వమును పాలించు దైవమొకడున్నాడని వారూహింపగల్గిరి. కాని అతని స్థాన స్వరూప స్వభావములను వారు నిర్ణయించలేక, పంచేంద్రియము లకు గోచరించు దృశ్యకోటిలోనే అతనిని వెతుకజొచ్చిరి మూలికా ప్రభావముగల తులసి, నింబ అశ్వత్థ మొదలగు వృక్షములను క్షణములో ప్రాణములను తీయగల నాగుపాములను వానినే భక్షించు గరుడ పక్షులను పాడిపంటలు సమకూర్చు గోవృషభములను, వారు దైవములుగా నిర్ణయించి వుపాసించు చుండిరి. తరువాత వారు అగ్నిని విరజిమ్ము పర్వతములను, గ్రామములను ముంచివేయు నదులను సర్వమును భస్మీపటలముచేయు అగ్నిని వనములను గూల్చివేయు జంఝామారుతమును దైవములని వుపాసించిరి. విజ్ఞానవికాసము కల్గిన కొలది, పై వన్నియు నశించుట గమనించి, దృశ్య మానమగునదేదీ దైవము కాదనే నిర్ణయమునకు వచ్చి, వేడి నిచ్చుచూ సర్వప్రాణులను పోషించు సూర్యుడూ (అగ్ని) వర్షము గురించి సస్యములను పోషించు

వరుణుడు లేక యింద్రుడు, ప్రాణమునేనిల్పు వాయువూ అదృశ్య రూపులై విశ్వమును సంరక్షించు చున్నారు కనుక వారే దైవముల నుపాసింపసాగిరి. ఇంకనూ విజ్ఞాన దృష్టికలవారు దైవమొక్కడే వుండవలెనని నిశ్చయించి కొందరు సర్వమును సంరక్షించు విష్ణువే దైవమని, కొందరు సర్వమును నాశనముచేయు రుద్రుడే (శివుడే) దైవమని నిర్ణయించి ఆ దైవముల రూపములు, స్థానములు, స్వభావములు నిర్ణయించిరి. ఇవన్ని సగుణోపాసనలో వివిధ దశలలో చేయబడిన వికల్పములు.

ఆ తరువాత కాలములో జన్మించిన బుద్ధిమంతులు దైవము నిర్గుణుడని. నిరాకారుడని నిర్ణయము చేయుట ప్రారంభించిరి. కొందరా దైవము సగుణ నిర్గున రూపంలో, బ్రహ్మమని చెప్పబడిన తత్వమే సగుణరూపంలో, విష్ణువని, కొందరున్నూ శివుడని కొందరున్నూ నిర్ణయములు గావించిరి. ఆ విష్ణువే పరమ దైవమని విష్ణుభక్తులున్నూ శివుడే పరమ దైవమని శివభక్తులూ తలంచిరి. యీ విధంగా తత్వ విచారణపునాది యేర్పడినది.

విష్ణువే బ్రహ్మము. సగుణరూపంలో ఈశ్వరుడు జీవజగత్తు లాయనకు శరీరము. అంతర్యామిగా నా విష్ణువే సర్వభూతములందు వున్నాడు. చిత్స్వరూపుడు జీవుడు, అచిత్ స్వరూపము జగత్తు చిదచిదీశ్వర తత్వములు మూడు నిర్ణయించి త్రైతవాదము సమర్థించిరి. శివాద్వైతమున్ను ఇట్టి విశిష్టాద్వైతమునే నిర్ణయించెను. ద్వైత వాదమునందు జీవేశ్వరులు వుభయులూ అత్యంత విభిన్నులు. అద్వైత వాదమునందు జగత్తుమిధ్య. జీవుడు బ్రహ్మమేగాని వేరుగానేకాడు. యివియే త్రిమతములు, మిగతా మతములు కొన్ని యున్నవి. కాని అవి అన్నియు స్వల్పభేదములతో వీనియందే అంతర్భూతములగుచున్నవి. ఈ మతము లన్నియు విజ్ఞానదృష్టితో యేర్పడిన వికల్పములే.

కైవల్యోపనిషత్తు "మయ్యేవ సకలం జాతం, మయి సర్వం ప్రతిష్ఠితం. మయి సర్వం లయం యాతి తద్బ్రహ్మాద్వయ మస్మ్య హం" అని సర్వమతసారమగు అఖండజ్ఞానమును సిద్ధాంతముచేసినది. యెరుకయందే సర్వము సృష్టి స్థితి లయములు పొందుచున్నది. పరిపూర్ణమున కెట్టి సంబంధములేదు అని పరిపూర్ణభావజ్ఞులును చెప్పుదురు. ఈ పరమ రహస్యము గురుమూర్తి కృపాప్రసాదముచేతనే సచ్ఛిష్యుల కారూఢమగుచున్నది. శ్రీమద్ధయానంద రాజయోగీంద్రుల తమ నిజప్రబోధవిధానమందు జ్ఞానము అను శబ్దమునకు "సర్వమునందు తాను తనయందు సర్వమూ" అని తెలియుటయే జ్ఞానమన్నారు.

2) అలంవికల్పైః : యీ వికల్పములు అనగా పూర్వ పూర్వ నిర్ణయములన్నిటితో యిక నిమిత్తము లేదు. నేనే సర్వమూ, సర్వము నందు నేనే అనుభావము గురుకృపచే నారూఢమైనవానికి పూర్వపుటాలోచనలన్నియు చరిత్రాత్మక వినోదము మాత్రమే కల్గించగలవు అవి అన్నియు యిక నిరర్థక వాచావిజ్ఞాపనలు మాత్రమే అయివున్నవి.

3) అహమేవకేవలం = కేవలం అనుశబ్దమునకు ఒక్కటైన అని అర్థము. "ఏకమేవ అద్వితీయం బ్రహ్మ" అని కొనియాడబడు ఒక్కటైన బ్రహ్మము. నేనే అయివున్నాను. "నేహనానాస్తికించన" నానాత్వముగాదోచు నానాత్వము కొంచమైననూ లేదు. అనగా అనానాత్వ

మంతయు నేనే అయి వున్నాను. వాని నామరూపాలన్నీ మిధ్య. వస్తుతః చూస్తే అవి అన్నీ నేనేను. కేవలం అనేశబ్దమునకు ఒక్కటి అనే అర్థమున్నది గదా! ఒక్కటిగా కనుపడునది మాత్రమేగాని దాని యందనేకత్వమంతయు బీజరూపంగా అణగిమణగియున్నది. కనుకనే సృష్టికాలమందా నానాత్వమంతయు ప్రకటమగుచున్నది. నిజముగా చెప్పాలంటే అది యేకానేకములుగా అందేవున్నది. పరిపూర్ణము ఏకమూకాదు అనేకమూకాదు.ఒకటి అనిన్నీ చెప్పటకు వీలులేదు. ఒకటి అనేది రెండు అనే సంఖ్యను ఆపేక్షించును, గనుక ఒకటి అనేది సాపేక్షిక శబ్దం అని తెలియవలెను. దానిచే పరిపూర్ణమును అభివర్ణింపరాదు. పరిపూర్ణమును కేవలశబ్దంచే వాడుటకలదు. అయితే అపుడు మరేమీ లేనేలేదనే అర్థంలోనే దానిని గ్రహించాలి. అహమేవ కేవలం అన్నపుడు "ఎంతనా నాత్వంగా తోచబడుచున్నా నానాత్వ మొక్కటే. అన్నీ నేనే" అనే అర్థమును గ్రహించాలి.

4) గురురేవకేవలం = అంతా గురుస్వరూపం మాత్రమే అని అర్థం. గురుఅనగా పెద్దదని అర్థం, పృధివ్యాది పంచభూతములు. ఉత్తరోత్తరా పెద్దవై యున్నవి. ఆకాశం అన్నిటికంటె పెద్దది అని నిర్ణయము. ఆకాశం కంటె దాని మాతృస్థానమైన ఆత్మకంటె పెద్దది లేదు. "అణోరణీయాన్ మహతోమహీయాన్" అని శ్రుతి వచనం. ఆత్మమహత్తుకంటె పెద్దది. అణువు కంటె చిన్నది అని అర్థం. అణువుకంటె అనగా పరమాణువుకంటెనూ చిన్నదని యెందుకన్నారంటే పరమాణువునందు కూడా వున్నది గనుక అని తెలియవలెను. అంతేగాని అణువుకంటె చిన్నదని అన్నారుగదా. అన నివ్వరిముల్ల కొన అంతటి చిన్నదని అనరాదు. కొద్దిగొప్పలై వుండుట దాని స్వభావం. ప్రత్యగాత్మ అని పరమాత్మ అనీ వుపాదులను బట్టి వచ్చిన పేర్లేగాని అవి వేరుగావు. సమిష్టిలో వ్యష్టి అంతర్భూతమేగాని వేరుగాదు. యివన్నియు శబ్దభేదములే.

శ్లో॥ సద్ధర్మ శాసకోనిత్యం సదాచారనియోజకః
సంప్రదాయీ కృపాపూర్ణః విరాగీ గురురుచ్యతే॥

తాత్పర్యము : మంచిధర్మములు పాలించవలెనని శిష్యులను శాసించెడివాడును. యెల్లప్పుడు మంచినడవడిని నియమించెడివాడును. తన సత్సంప్రదాయమును విడువక అనుసరించెడి వాడును, శిష్యుల ఘోరసంసార బాదగుర్తించి వారియెడల సంపూర్ణమైన కృపకలవాడును వైరాగ్య సంపన్నుడును అగు మహనీయుడే గురువనబడును.

విశేష వివరణము : 1) సద్ధర్మశాసకో : ధర్మములు, సామాన్య నైతిక ధర్మములు, వ్యవహారిక ధర్మములు, సాంఘిక ధర్మములు, పరమార్థిక ధర్మములు, ఆపద్ధర్మములు అని పలువిధములు. సర్వులకు వర్తించు ధర్మములు సామాన్య ధర్మములు. ఇవి సకల దేశములకు, సకలకాలములకు, సర్వులకు అనుసరణీయములు. ఇవి జాతి. మత, కుల సాంప్రదాయములను బట్టి మార్పులు చెందవు. ప్రపంచములో జీవయాత్ర సాగించుటకు అవసరమగు నిత్య వ్యవహార ధర్మములు. మానవ లొండొరులయెడ పాటించవలసిన ధర్మములు సాంఘిక ధర్మములు. ఆముష్మిక సుఖశాంతు లాసించువారు పాటించవలసిన ధర్మములు పారమార్థిక ధర్మములు. ధన మాన ప్రాణరక్షణకై తాత్కాలికముగా పాటించక తప్పనిసరియగు ధర్మములు ఆపద్ధర్మము

లనబడును. ఇందు ముముక్షువులు పాటించవలసిన ధర్మములే పారమార్థిక ధర్మములనీ సద్ధర్మములనీ చెప్పబడును. ధర్మశబ్దమునకు "ధార్యతే యితి ధర్మః" అనగా ఏది సమస్తమును ధరించునో అదియే ధర్మము. ఆత్మయే సర్వ విశ్వమును ధరించి యున్నది కనుక ఆత్మను ధర్మమని అనదగును. అనగా సమస్త సృష్టియు ధర్మముపైననే ఆధారపడి యున్నది. ఒక నిర్ణీత ధర్మమునకు లోబడియే సృష్టికార్యము జరుగుచున్నది. సృష్టిలో సర్వమును కొన్ని నియమము లనుసరించియే ప్రవర్తిల్లిచున్నది. ధర్మము అనగా ఒక శాసనము శాసనములు పాలకులకు, పాలితులకు కూడా వర్తించును. న్యాయాధికారి గూడ ఏన్యాయము ననుసరించి న్యాయాన్యాయనిర్ణయములు చేయునో ఆ న్యాయమును తానుకూడా తప్పక పాటించవలసి యుండును. ఒకరియెడల నొకన్యాయము, మరొకరి యెడల మరియొకన్యాయము వుండ జాలదు. సృష్టి విషయక్తమగు కర్త, కర్మ, క్రియలు అన్నియు అనుల్లంఘనీయములగు కొన్ని సూత్రముల ననుసరించియే ప్రవర్తించును. అవన్నియు ధర్మశబ్దముయొక్క నిర్వచనములోనికే చేరును. ఆ ధర్మమే విశ్వపాలన మొనర్చుచున్నది అని చెప్పనగును. కనుక ధర్మమే దైవమన్నారు.

"ధర్మోరక్షతిరక్షితః" యని ఆర్యోక్తి. ధర్మమును రక్షించి ఆచరించిన వారిని ధర్మము రక్షించ గలదని అర్థము. అధర్మాచరణపరులను వారి అధర్మమే శిక్షించునని వేరే చెప్పపనిలేదు. తన్నాశ్రయించి సుజనులకు ధర్మోపదేశముగావించి ధర్మాచరణ పరాయణుల గావించుట గురుమూర్తి కర్తవ్యము. కనుకనే శ్రీకృష్ణదేశికేంద్రులు తమకందపద్యములలో "దిచ్చుతనపు శిష్యుని మదినొచ్చిన ధనమీయడనుచు యూహించి మదిన్, యిచ్చకము లాడబోకను చెచ్చెరఝూడించు వాన్ని సద్గురుడైతే" అన్నారు.

ధర్మమునకు, సత్యము, శౌచము, దయ, దానము, అనునవి పాదములు, వినుటకు ప్రియమై, సమిష్టి శ్రేయోదాయకమైన సూనృతవాక్కే సత్యము. అంతఃకరణశుద్ధత్వమే శౌచము, అహింస, భూతదయకలిగి పరుల కష్టములయెడ జాలి కలిగిన ప్రవృత్తియే దయ. పాత్రాపాత్ర విచక్షణకల్గి, ప్రతిగ్రహీత మేలుకోరి యిచ్చుటయే దానం. పారమర్థికులకు యిట్టి ధర్మాచరణ ఆవశ్య కర్తవ్యము. శిష్యులను తగురీతి శాసించి ధర్మపరులను గావించువాడే సద్గురువని యీ శ్లోకముటంకించుచున్నది.

2) సదాచార నియోజకః : ఆచారము అనగా నడవడి లేక ప్రవర్తన. పదే పదే స్నానము లు చేయుట, మడిమైలలను విపరీతంగా పాటించుట, తడిబట్టలతో వుండుట యితరులను తాకకుండుట మొదలగు ఛాదస్తపు చర్యలే సదాచారము కాదు. మంచినడవడిక, త్రివిధ తపస్సులు, త్రికరణ శుద్ధి ప్రవర్తన అంతఃకరణ పరిశుద్ధి గలిగి యుండుటయే సదాచార సంపత్తి . సకల జాతులయందు సర్వమతముల లోను సచ్ఛీలతా సదాచారము విధింపబడియున్నది. దుర్నడత సర్వే సర్వత్ర నిషేధింపబడియున్నది. ముఖ్యముగా జన్మరాహిత్యమాసించి కృషిచేయు వారికి సదాచారము యెంతైన అవసరమైయున్నది. ఏలననగా ప్రతియొక్క క్రియకు ప్రతిక్రియవుండును. ఈ ప్రతిక్రియనే కర్మఫలము అనవచ్చును. ఇది దృష్టము. అదృష్టము అని రెండు విధములు. దృష్టఫల మీ జీవితమందే ప్రాప్తించును. అదృష్టఫలము సంస్కార

రూపంగా (శుభాశుభవాసనరీతిగా) అంతఃకరణమందు బీజరూపంలో నిక్షిప్తమై యుండి కాలచక్ర కర్మచక్రానుసారముగా భావి జన్మలయందు ఫలప్రాప్తి చెందుచుండును. సచ్ఛీలముగలవారి యందు శుభసంస్కారము లేర్పడి సుఖసంతోషములను కల్గించును. వుత్తమ జన్మలాసించువారు సహితం సత్కర్మానుష్ఠానం గల్గియుండవలెను. సత్కర్మాచరణవలన అంతరంగశుద్ధికాగలదు. అంతఃకరణశుద్ధి లేక నిజమైన గురుభక్తియే కుదురుకొనదు. గురుభక్తి లేక గురుకృపావిర్భావము గాదు గురుకృప లేక యెరుక పరిపూర్ణములు యెరుగబడవు. పరిపూర్ణ భావముచే గాక జనన మరణ భ్రాంతి తొలగదు. జన్మరాహిత్య మాసించువారికిన్ని సదాచారసంపత్తి యత్యంతముఖ్యా వసరమై యున్నది. "గురూ పదిష్ట మార్గేణ మనశ్శుద్ధింతు కారయేత్" అని గురుగీత విధించు చున్నది. సద్గురు వెప్పుడును శిష్యులను శాసించి సదాచార ప్రవిష్టులను చేయునుగాని వుపేక్షించి వూరుకొనడు.

3) సంప్రదాయీ : సంప్రదాయ మనగా పరంపరగా ఆచరింపబడుచూ వచ్చునది, గురుపరంపరా మహా పురుషులలో అవిచ్ఛినంగా పాలింపబడు ధర్మాచరణము, గురువెప్పుడును తన పూర్వగురువులు పాటించిన ధర్మములను తానును పాలించి ముందుతరములవారికి మార్గదర్శి యగునేగాని సంప్రదాయము భంగపరచి విచ్ఛినము చేయడు. అట్టి గురువే సంప్రదాయీ అని కీర్తింపబడుచున్నాడు.

4) కృపాపూర్ణః : జనన మరణ రూప ఘోర సంసారము నందు బాధపడలేక దుఃఖించు చూ తద్విముక్తికై తన్ను శరణాగతిపొందిన భక్తులను గాంచి తన అంతఃకరణము వారియెడల జాలిచే కరుణారసప్లావితము కాగా కరుణామృత వృష్టి వారిపై గురిపించి గురువు వారి నుద్ధరించు చున్నాడు. ఆయన హృదయము నవనీత కోమలము. కఠిన హృదయుడెన్నడు సద్గురువు కాజాలడు.

శ్లో॥ వీక్షణ ధ్యాన సంస్పర్శాత్ మత్స్యఃకూర్మవిహంగమాః
పోషయంతి స్వకాన్ పుత్రాన్ తద్వత్సందిత వృత్తయః॥

అనగా చేపలు దృష్టిచేతను, తాబేళ్ల తలంపు మాత్రముచేతను పక్షులు స్పర్శ (పొదుగుట) చేతను తమ సంతానమును పోషించిన రీతిగా సద్గురువు కరుణామృత దృష్టిచేతను, తన శుభసంకల్పముచేతను హస్తమస్తక స్పర్శ గావించి పాద స్పర్శనొసంగుటచేతను తన శిష్యుల నుద్ధరించుచున్నాడు కనుకనే గురుగీత యాతనిని "కృపాపీయూషసింధవే" (కరుణామృత సముద్రుడా) అని అభివర్ణించియున్నది.

విరాగీ : వైరాగ్యముగలవాడు విరాగీ తన సుఖము నాశించి సుఖసాధనములను కోరుట వానిని ప్రేమించుట, రాగమనబడును. "సుఖానుశయీ రాగః" ఐహిక సుఖములు గాని ఆముష్మిక సుఖములు గానిశాశ్వతములుగావు. అంత్యమునందు దుఃఖ కారణములే అగుచున్నవి. ఇట్టి అశాశ్వతసుఖములకై ప్రాకులాడుచు మానవుడు చేయరాని పనులను చేసి బడరాని యిడుముల బడుచు అమూల్యమగు మానవ జీవితమును వృధా చేసుకుని జన్మపరంపరయందు పొర్లాడు చున్నాడు. యిహాముత్రార్థఫలభోగ విరాగము అధికార లక్షణము

లలో నొకటిగా చెప్పబడినది. అనుభవించే భోగతృష్ణ నశించదు. అధికారిక సుఖప్రాప్తి కొరకు ఆరాటపడుచునేయుండును. నేయి హోమముచేసి అగ్నిని చల్లార్చ బూనుట యెటు వంటిదో అనుభవముచే భోగతృష్ణ శాంతింపచేయ బూనుటయు నట్టిదే.

సుఖసాధనములయందు ప్రేమవిడనాడి వైరాగ్యము పూనమనీ భార్యబిడ్డలయందు ధన, కనక, వస్తు, వాహనాదులయందు స్రక్చందన వనితాది భోగములయందు సుఖముగాన వచ్చుచున్నందున వానిని విడనాడి సన్యసించుటయే యుత్తమమని కొందరంటారు. కాని వానిని విడనాడినా, అంతఃకరణయందు వానియందలి కోర్కె చావదు. అంతరంగసన్యాసము కావలెనేగాని బాహ్యసన్యాస మువలన ప్రయోజనములేదు. అంతరంగ సన్యాస మెట్లుచే కూరును? ముందుగా సుఖాభిలాష కల్గుటకు మూలకారణమేమో తెలుసుకొనవలసియున్నది. "ఆత్మవస్తుకామాయ సర్వం ప్రియం భవతి" అనగా తనయందు తనకు ప్రేమ వుండ బట్టియే తన ఆనందముకొరకు మానవుడు భార్యాబిడ్డలను ధన, కనకాది వస్త్వాధికమును ప్రేమించు చున్నాడు. తనయందు ప్రేమవున్నంత కాలము వస్త్వాధికమునందు ప్రేమపోదు. అంతయు స్వార్థమే. అనగా తన కొరకే తానున్నానను కొన్నంతవరకు సుఖాభిలాష నశించదు. ఇప్పుడు నిజమగు విరాగియెవ్వడో తేటతెల్లముగా తెలియబడు చున్నది. పరిపూర్ణ పరబ్రహ్మమునందు తనకు మూలముగాని స్థానముగాని లేనేలేదు. తానందు పుట్టనేలేదు పరిపూర్ణ మొక్కటే పరమసత్యము. తానూ తన వల్లనైన ప్రపంచము అందలి సుఖములు అసత్యము అని తెలిపే పరిపూర్ణ బోధచేగాని నిజమగు వైరాగ్యము సిద్ధించదు. పరిపూర్ణ భావజ్ఞుడైన గురుమూర్తి విరాగి అని యీ శ్లోకమునందు కొనియాడబడినాడు. పరిపూర్ణ కృపతో శిష్యుల ధర్మనిష్ఠాతుల నొనర్చి సదాచార సంపన్నులగావించి సాంప్రదాయిక పరిపూర్ణ బోధచే శిష్యులను కృతార్థులను గావించు సద్గురుమూర్తి కివే మా అనంతకోటి నమస్కారములు.

శ్లో॥ ఆత్మానాత్మ వినాశహేతు మనిశం సర్వాతిరిక్తం శుభం
పూర్ణాత్పూర్ణ మనామయం సుఖతరం సర్వాపదధ్వంసకం॥
సర్వాజ్ఞాన వినాశకం గురుపరం సర్వాత్మక నిర్మలం
సర్వభ్రాంతి వివర్జితం గుణపరం సంపూర్ణబోధం నమః

తాత్పర్యము :ఆత్మానాత్మలు అనే ద్వంద్వరూప ఏకత్వమై వుండి సృష్టికారణమును నశింప చేయునదియును. దృశ్యాదృశ్య రూపమగు సమస్తమునకు విలక్షణ మైనదియు, పూర్ణవస్తువు కంటె పూర్ణ మైనదియును, ఎట్టి వ్యాధులు ఎన్నడూ ఎరుగనిధియును, ఎక్కువ సుఖకరమైనది యును, అన్ని ఆపదలను నశింప చేయునదియును, సర్వమును తెలియచేయు నట్టియు జ్ఞానమునుకూడా నశింపచేయునదియును, గురుస్వరూపమునకు వేరైనదియును, సకల దేశములందు నున్నదియు శుద్ధమైనట్టియు, అన్ని భ్రాంతులచేతను విడువబడినదియును పరిపూర్ణమును తెలియ చేయునదియునగు పూర్ణబోధకు నమస్కరించుచున్నాను.

విశేష వివరణము : 1) ఆత్మానాత్మలు 2) సర్వాతిరిక్తము 3) పూర్ణాత్పూర్ణము 4) సర్వజ్ఞాన వినాశకం 5) గురుపరం 6) సర్వభ్రాంతి వివర్జితం 7) గుణహరం.

1) ఆత్మానాత్మలు సృష్టికి పూర్వము నిర్వికారమైయున్న ఆత్మ (పరమాత్మ) అనియు, మిగత అంతయు అనాత్మ అనియు పిలువబడు చుండును. కార్యరూపమగు జగత్తునకు కారణము మాయయనియు, మాయకు విలక్షణముగా బ్రహ్మము (పరమాత్మ) కలదనియు అది కారణకర్తృత్వ ములు లేనిదనియు, అపోహచెందుటయే. ఇది ఎంత మాత్రము సరికాదు. సర్వశ్రుతి, శృతీతి, పారమార్థిక గ్రంధములున్ను బ్రహ్మమే జగత్కారణమనిన్ని స్పష్టముగా తెలియచేయుచున్నవి. కారణవస్తువగు పరమాత్మయే సృష్టికామనకలిగి, సృష్టిగా పరిణమించెనని చెప్పకతప్పదు. అట్టి ఆ కారణవస్తువునకు ఆత్మయనియు, కార్యరూప జగత్తును అనాత్మ అనియుపిలుచుట ఎంత మాత్రము సరికాదు. రెండును ఆత్మఅయినా కావలెను లేక అనాత్మ అయినా కావలెను. తనలోనుండు సృష్టి బీజములను పురస్కరించుకొని, సృష్టికామనచే చలనం కలిగి బ్రహ్మమే (ఆత్మ) నామరూపములు ప్రకటించి, స్థూలమగు జగద్రూపము వహించెన నుటయే సిద్ధాంతము. సర్వం ఖల్విదం బ్రహ్మ" "బ్రహ్మైవేదం విశ్వమిదం వరిష్టం" ఇత్యాదిగా గల శ్రుతులన్నియూ ఈ భావమునే సమర్థించుచున్నవి. సూక్ష్మాతి సూక్ష్మ రూపములో వానిని ఆత్మయని, బ్రహ్మమని చెప్పి అదియే స్థూలాకారముచెంది విశ్వాకారమైనపుడు అనాత్మ అనుట తగునా? ఆత్మానాత్మలు రెంటికి భేదమే మియు లేదు. రెండుగావున్నట్లు తోచుట మాత్రమే. విశ్వాతీతమైన బ్రహ్మమే. విశ్వగతమై ప్రతి వస్తువునందును వుండియున్నది. ఇది ద్వంద్వ రూప ఏకైక వస్తువు. దీని రహితమునందుగాని సృష్టి అనేది శాశ్వతముగా నశించదు. ఏ వ్యక్తికిన్ని జన్మరాహిత్యముకాదు. జన్మ రాహిత్యము ఆశించు ముముక్షువులు, ఈ ఆత్మానాత్మల వినాశము నకు తోడ్పడు పరిపూర్ణ బోధను ఆశ్రయించవలసి యున్నది. ఏలననగా పరిపూర్ణ పరబాహ్యము నందు ఇతరమేమియులేదు. అంటే ఆత్మగాని, మాయగాని, అనాత్మగాని లేవు. వానికి మూలము గాని, స్థానముగాని లేవు. ఇట్టి పరిపూర్ణ విషయ ప్రబోధ యందే ఆత్మానాత్మలు లేనివగుచున్నవి. పరిపూర్ణ బోధ ఆత్మ నాత్మల వినాశ హేతువని ఈ శ్లోకము వర్ణించుచున్నది.

2) సర్వాతిరిక్తం : నామరూపాత్మకమగు విశ్వమందలి ఏ పదార్థమును పరిపూర్ణ బ్రహ్మమందులేదు. పరిపూర్ణ పరబ్రహ్మము ఏవస్తువు గాను మార్పు చెందదు. అట్లే ఏ వస్తువునూ పరిపూర్ణముగా మార్పుచెందదు. పరిపూర్ణ పరబ్రహ్మమొక్కటియే, ఇతర ఏవస్తువుల తోను ఎట్టి సంబంధము లేక అత్యంత భిన్న మైయున్నది. మనకు కంటికిగాని, మనస్సునకుగాని గోచరమగు చున్న భావాభావపదార్థము లన్నింటికంటే పరిపూర్ణ పరబ్రహ్మము అత్యంత విలక్షణమై యున్నది.

3) పూర్ణాత్పూర్ణము : అనగా మనకు తెలియబడు విశ్వాకారమగు పరబ్రహ్మము. విశ్వగతమును, విశ్వాతీతమును అయి పూర్ణముగా వస్తువుయొక్క వెలుపల, లోపల ఆకాశము వలె సర్వవ్యాపకమై నిండుకుని యున్నదని ఇతరులందురు. దీనిని ప్రత్యక్ష పూర్ణమని చెప్పవచ్చును. ఏలననగా ఇది అంతటా నిండుకొనియున్నట్లు గానవచ్చుచూ ఎండమావులందు నీరువలె ప్రత్యక్షముగా గానవచ్చిననూ ఎండమావులందు నీరు ఎట్లులేదో పూర్ణముగా గానవచ్చి

ననూ ఎరుక (అత్మ) సకల దేశములందు నిండియున్నట్లుగా తోచుచూ, నిజముగా నిం..
లేదు. ప్రత్యక్షముగా సూర్యనక్షత్రములు భూమికంటే ఎన్నో రెట్లు చిన్నవిగా కానవచ్చు చున్నవి. కాని యదార్థముగా ఎన్నో రెట్లు పెద్దవై యున్నవి. శాస్త్రజ్ఞులు ప్రత్యక్ష ప్రమాణమును అంగీకరించ లేదు. అట్లే ప్రత్యక్ష పూర్ణము అంతటా నిండియున్నట్లుగా కానవచ్చినా ఏకదేశీయమై యున్నది. వాక్కుకు, కంటికి, మనస్సుకు ఎంతమాత్రము గోచరించని పరిపూర్ణ పరబ్రహ్మమే సకల దేశములందు నిజముగా నిండిపూర్ణమైయున్నది. ప్రత్యక్ష పూర్ణవస్తువైన ఎరుకకంటె పరోక్షమై యున్న ( కానరాని) పరిపూర్ణ పరబ్రహ్మమే పరిపూర్ణమైయున్నది.

4) సర్వాజ్ఞాన వినాశకం : పరిపూర్ణ పరబ్రహ్మమునందు జ్ఞానాజ్ఞానరూపమైన తెలివి లేదు. స్థూలసూక్ష్మకారణ మహాకారణ శరీరములు గాని, అఖండ జ్ఞాన స్వరూపమగు పరబ్రహ్మ వస్తువుగాని, మరి ఏ ఇతరం గాని లేనేలేవు.

సృష్టి కారణమైచిద్ఘనమైయున్న ఆత్మవస్తువే సృష్టికి పూర్వాపరములందు అజ్ఞాన రూపముగా, లేక మరుపురూపముగా వుండియున్నది. ఈ ఎరుక మరుపులు లేక జ్ఞానా జ్ఞానములు రెండును ఒక్క జ్ఞానానివే కాని వేరుకావు. అటువంటి జ్ఞానరూపమైన ఎరుకను పరిపూర్ణ బోధ నాశనముచేయును. అని శ్లోకములో చెప్పబడినది. అయితే పరిపూర్ణము తన శక్తిని ఉపయోగించి, ఎరుకను నాశనమొనర్చుచున్నదా? లేదు. పరిపూర్ణము "నిశ్శక్తి, నిర్మలం, పూర్ణం" అని కొనియాడబడినది. అయిననూ పరిపూర్ణ బోధవలన ఎరుక రహితమగు చున్నది. ఎరుకను రహిత పరచవలెనని పరిపూర్ణమునకు సంకల్పమే లేదు. చీకటిని పారద్రోలవలెనని సూర్యుడు సంకల్పించ లేదు. సూర్యుని పొడగాంచినంతనే చీకటి తనంతతానే మటుమాయమగు చున్నదని భావము.

5) గురుపరం : అనగా గురువునకు పరమైనది. గురువు అనగా పెద్ద స్వరూపము లేక భూమాపదార్థము అట్టి మహత్త్వదానమగు గురుస్వరూపమునకు పరమై పరిపూర్ణమున్నదని భావము.

గురువు లేక లఘువు, మహత్ అణువు అను ద్వంద్వపదార్థములు పరస్పరము (విభువు) సాపేక్షికపదములై వుండి మనచే తెలుసుకొనబడుచున్నవి. సాపేక్షికముకాని పదార్థము మనము చెప్పలేము. ఊహించనూలేము. సాపేక్షికములైన పదములచే వర్ణింపనలవికానిది పరిపూర్ణము. అట్టివి రెండే పరిపూర్ణములే నెరుక. పరిపూర్ణము నిరపేక్షికమైనది. అది సాపేక్షికమై నది మరుపుకానిది ఎరుక అని మనము సాపేక్షికమని ఎరుకను చిత్రించుచున్నాము. ఇట్లు పరిపూర్ణమును గుర్తించుటకు వీలులేదు. అయిననూ గురుస్వరూపముకానిది. గురుస్వరూపము లేనిది. గురుశిష్యోభయ రహితమైనది. పరిపూర్ణము అని నిషేధముఖముగా పరిపూర్ణ పరబ్రహ్మ మును అవగాహన చేసికొనవలసియున్నది. గురుస్వరూపము అనగా జీవేశ్వర జగత్సృష్టి. స్థితిలయములకు కారణమై యున్న బ్రహ్మమే. అట్టి బ్రహ్మమునకు విలక్షణమైన పరిపూర్ణ పరబ్రహ్మము ఈ గురుపరం అని అభివర్ణింపబడినది.

ననూ ఎరుక (ఆత్మ) సకల దేశములందు నిండియున్నట్లుగా తోచుచూ, నిజముగా నిం.
లేదు. ప్రత్యక్షముగా సూర్యనక్షత్రములు భూమికంటే ఎన్నో రెట్లు చిన్నవిగా కానవచ్చు చున్నవి. కాని యదార్థముగా ఎన్నో రెట్లు పెద్దవై యున్నవి. శాస్త్రజ్ఞులు ప్రత్యక్ష ప్రమాణమును అంగీకరించ లేదు. అట్లే ప్రత్యక్ష పూర్ణము అంతటా నిండియున్నట్లుగా కానవచ్చినా ఏకదేశీయమై యున్నది. వాక్కుకు, కంటికి, మనస్సుకు ఎంతమాత్రము గోచరించని పరిపూర్ణ పరబ్రహ్మమే సకల దేశములందు నిజముగా నిండిపూర్ణమైయున్నది. ప్రత్యక్ష పూర్ణవస్తువైన ఎరుకకంటె పరోక్షమై యున్న ( కానరాని) పరిపూర్ణ పరబ్రహ్మమే పరిపూర్ణమైయున్నది.

4) సర్వాజ్ఞాన వినాశకం : పరిపూర్ణ పరబ్రహ్మమునందు జ్ఞానాజ్ఞానరూపమైన తెలివి లేదు. స్థూలసూక్ష్మకారణ మహాకారణ శరీరములు గాని, అఖండ జ్ఞాన స్వరూపమగు పరబ్రహ్మ వస్తువుగాని, మరి ఏ ఇతరం గాని లేనేలేవు.

సృష్టి కారణమైచిద్ఘనమైయున్న ఆత్మవస్తువే సృష్టికి పూర్వాపరములందు అజ్ఞాన రూపముగా, లేక మరుపురూపముగా వుండియున్నది. ఈ ఎరుక మరుపులు లేక జ్ఞానా జ్ఞానములు రెండును ఒక్క జ్ఞానానివే కాని వేరుకావు. అటువంటి జ్ఞానరూపమైన ఎరుకను పరిపూర్ణ బోధ నాశనముచేయును. అని శ్లోకములో చెప్పబడినది. అయితే పరిపూర్ణము తన శక్తిని ఉపయోగించి, ఎరుకను నాశనమొనర్చుచున్నదా? లేదు. పరిపూర్ణము "నిశ్శక్తి, నిర్మలం, పూర్ణం" అని కొనియాడబడినది. అయిననూ పరిపూర్ణ బోధవలన ఎరుక రహితమగు చున్నది. ఎరుకను రహిత పరచవలెనని పరిపూర్ణమునకు సంకల్పమే లేదు. చీకటిని పారద్రోలవలెనని సూర్యుడు సంకల్పించ లేదు. సూర్యుని పొడగాంచినంతనే చీకటి తనంతతానే మటుమాయమగు చున్నదని భావము.

5) గురుపరం : అనగా గురువునకు పరమైనది. గురువు అనగా పెద్ద స్వరూపము లేక భూమాపదార్థము అట్టి మహత్త్వదానమగు గురుస్వరూపమునకు పరమై పరిపూర్ణమున్నదని భావము.

గురువు లేక లఘువు. మహత్ అణువు అను ద్వంద్వపదార్థములు పరస్పరము (విభువు) సాపేక్షికపదములై వుండి మనచే తెలుసుకొనబడుచున్నవి. సాపేక్షికముకాని పదార్థము మనము చెప్పలేము. ఊహించనూలేము. సాపేక్షికములైన పదములచే వర్ణింపనలవికానిది పరిపూర్ణము. అట్టివి రెండే పరిపూర్ణములే నెరుక. పరిపూర్ణము నిరపేక్షికమైనది. అది సాపేక్షికమై నది మరుపుకానిది ఎరుక అని మనము సాపేక్షికమని ఎరుకను చిత్రించుచున్నాము. ఇట్లు పరిపూర్ణమును గుర్తించుటకు వీలులేదు. అయిననూ గురుస్వరూపముకానిది. గురుస్వరూపము లేనిది. గురుశిష్యోభయ రహితమైనది. పరిపూర్ణము అని నిషేధముఖముగా పరిపూర్ణ పరబ్రహ్మ మును అవగాహన చేసికొనవలసియున్నది. గురుస్వరూపము అనగా జీవేశ్వర జగత్సృష్టి. స్థితిలయములకు కారణమై యున్న బ్రహ్మమే. అట్టి బ్రహ్మమునకు విలక్షణమైన పరిపూర్ణ పరబ్రహ్మము ఈ గురుపరం అని అభివర్ణింపబడినది.

6) సర్వభ్రాంతి వివర్జితం : ఏ భ్రాంతికైననూ భ్రాంతి చెందువాషు. భ్రాంతిచెందింప చేయు పదార్థము. భ్రాంతి రూపముగా తోచబడు పదార్థము అను త్రిపుటి వుండి తీరవలెను. పరిపూర్ణ పరబ్రహ్మమందు ఈ త్రిపుటికాని, మరేత్రిపుటికాని లేనేలేవు. పరిపూర్ణబోధచేత, పరిపూర్ణ పరబ్రహ్మము అవగాహనమై, సకల భ్రాంతులు నశించుచున్నది. ఏలననగా సకల భ్రాంతులకు మూలమైన మూలంలేని ఈ గుర్తెరిగే శరీరమే, పరిపూర్ణ బోధవలన లేకుండాపోవుచున్నది. కనుక పరిపూర్ణ బోధ సర్వభ్రాంతి వివరితం అని కొనియాడబడినది.

7) గుణహరం : సద్గుణంబులు, దుర్గాణంబులని గుణములు ముఖ్యముగా రెండు రకములు. ఈ రెండురకముల గుణములకు మూల కారణము సత్వరజస్తమోగుణములే. ఈ త్రిగుణములు సృష్టికి పూర్వం సృష్టికారణమైన పరబ్రహ్మమందు బీజరూపంగానున్నవి. సృష్టికామన కలిగిన పిదప ఈ త్రిగుణములు విజృంభించి సత్వగుణ విజృంభన వలన దేవతా సృష్టి, రజోగుణవిజృంభనవలన జీవసృష్టి, తమోగుణ విజృంభణ వలన భూత సృష్టి ఏర్పడు చున్నవి. సృష్టితో సహ సర్వమునకూ మూలకారణమగు ఈ త్రిగుణములు వున్నంతవరకూ సృష్టి స్థితి లయములు జరుగుచునే ఉండును. "సాధకునకు గుణము చావవలె" అని అందురు. ఈ త్రిగుణములు వున్నంతవరకు ఏగుణమును చావనేచావదు. చచ్చినట్లు కనబడినా, వాసనారూపంలో అణగిమణిగియుండి తగిన సమయమునకై వేచియుండును. అట్టి సమయము తటస్థిన వెంటనే ఆయాగుణములు విజృభించి మానవుని లోబరుచుకొని పతితుని చేయును. గుణాతీతస్థితి సాధకునకు లభించవలసియున్నది. అట్టి గుణాతీత స్థితి ఒక్క పరిపూర్ణ బోధవలన గాని లభించబోదు. ఏలననగా, త్రిగుణములకు ఆదిలో ఆశ్రయస్థానమైయున్న కారణబ్రహ్మము వున్నంతవరకు యీ గుణములు నశింపజాలవు. ఇట్టిస్థితి ఒక్క పరిపూర్ణ బోధవలననే అభించును. కనుక పరిపూర్ణబోధ గుణహారం అని వర్ణింపబడినవి.

అట్టి పరిపూర్ణబోధకు తమ్ము ఆశ్రయించిన శిష్యులను, అధికారులునొనర్చి, పిమ్మట పరిపూర్ణబోధను అనుగ్రహించుచున్న మా గురుదేవులకు అనేక శత సహస్ర నమోవాకములు.

ఓం

శ్రీ గురుభ్యోనమః

## "పరిపూర్ణ దర్శనాచార్య సదానంద"
## శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారి
## రచన గ్రంధముల వివరములు

| | |
|---|---|
| పరిపూర్ణ దర్శనం | రూ. 40-00 |
| పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత<br>పరంపరా గురువుల జీవిత చరిత్ర | రూ. 15-00 |
| పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత<br>వ్యాస మంజరి (4వ భాగము) | రూ. 18-00 |
| పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము<br>వేదాంత కథలు | రూ. 15-00 |
| భ్రాంతి రహిత శ్లోకములు - సవ్యాఖ్యానము | రూ. 12-00 |
| నిఖిల వేదాంతార్థ నివహము | రూ 12-00 |
| పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము<br>జాబులు - జవాబులు | రూ. 20-00 |
| శ్రీ శివరామదీక్షితీయ సూక్తిముక్తావళి | రూజ 20-00 |

ఈ గ్రంధములు వలయువారు :

**శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిరము**

డో. నెం. : 10-204/ఏ, యర్రబాలెం - 522 503,
మంగళగిరి మండలము, గుంటూరు జిల్లా

సూచన : అడ్వాన్సు పంపిన వారికి వి.పి.పి. చేయబడును.